అంతర భారతీయ పుస్తకమాల

# సమకాలీన
# కొంకణీ కథానికలు

సంపాదకులు

పుండలీక్ నారాయణ్ నాయక్

అనువాదం

శిష్టా జగన్నాథరావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ముఖచిత్రం : 'ఇమేజెస్ ఆఫ్ గోవా'
చిత్రకారుడు : లక్ష్మణ్ పాయ్ హాంచ్య బరేపణాన్

ISBN 81-237-3595-2

---

ప్రథమ ప్రచురణ 2001 (శక 1923)



*Original Title in Konkani* : Samkaleen Konkani Laghukatha
edited by Pundalik Narayan Nayak

*Telugu translation* : Samakaleena Konkani Kathanikalu

రూ. **95.00**

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్,
న్యూఢిల్లీ-110 016 ద్వారా ప్రచురింపబడినది.

---

# విషయసూచిక

# ప్రస్తావన

ఈరోజు మనదేశంలో నలభై నుండి యాభై లక్షల వరకూ కొంకణీ భాష మాట్లాడే వాళ్ళున్నారు. పూర్తి గోవారాష్ట్రం, కర్నాటక రాష్ట్రం ఉత్తర ప్రాంతం, మహారాష్ట్రంలో దక్షిణ పశ్చిమ ప్రాంతం, ఉత్తర కేరళ, అరేబియా సముద్రతీర ప్రాంతాలలో కొంకణీ భాష మాట్లాడేవాళ్ళు వుంటున్నారు. భారతీయ భాషల సహపంక్తిలో కూర్చునే సమాన గౌరవం కొంకణీ భాషకి 1975వ సంవత్సరంలో లభించింది. కేంద్ర సాహిత్య ఎకాడమీ కొంకణీభాషని సృజనాత్మక భాషగా గుర్తించి గౌరవించింది. ఆ తరువాత 1987లో గోవా రాజ్యానికి రాజభాష అయింది. 1992వ సంవత్సరం భారత రాజ్యాంగంలోని ఎనిమిదవ సూచికలో కొంకణీ భాష కూడా చేర్చబడింది. గత ఇరవై సంవత్సరాలుగా దేశభాషలతో సమాన వేదికను అధిష్ఠించిన కొంకణీభాష చరిత్ర పూర్వాశ్రమంలో చాలా దుఃఖపూరితమైనా,తమ భాషని కాపాడుకోడానికి నిష్ఠతో, నిర్విరామకృషితో వారు చేసిన పోరాటం ఒక గొప్ప ఉదాహరణ.

కొంకణీభాష పదవ శతాబ్దంలో జన్మించిందని చాలామంది విద్వాంసులు అంటారు. అయితే సుమారు ఐదువందల సంవత్సరాలకి పూర్వం కొంకణీ ప్రజలలోకి పాకిందని చెప్పవచ్చు. కారణం అంతకుముందు కాలంలో ఈ భాషకి లిఖిత పరంపర వున్న సూచనలు లేవు. కేవలం పన్నెండవ శతాబ్దంలో శ్రవణ బెళ్‌గొళ దగ్గర వున్న గోమటేశ్వరుడి విగ్రహం పాదాల దగ్గర రాతిలో చెక్కిన కొంకణీ పదాలను ఈ భాషలోని మొదటి నమూనాగా భావిస్తారు. భక్తనాందేవ్ పదమూడో లేదా పధ్నాలుగవ శతాబ్దంలో వ్రాసిన "గల్వణ్" భక్తిగీతాల్లో కొంకణీ భాషకి ప్రతిరూపాలన్న పంక్తులు వున్నాయి. కృష్ణదాస్ శర్మ (కొంకణీలో) వ్రాసిన మహాభారత కథలు పదిహేనవ శతాబ్దంకి చెందినవి. దేశంలో ఆధునిక భాషలలో యిది మొదటి గ్రంథం.

1510వ సంవత్సరంలో పోర్చుగీసువాళ్ళు గోవాకి వచ్చారు. 1540వ సంవత్సరం ప్రాంతంలో విదేశీ మిషనరీలు స్థానిక ప్రజలని క్రైస్తవ మతంలోకి

మార్పించడం మొదలుపెట్టారు. క్రీస్తు బోధనలు స్థానిక ప్రజలకి సులభంగా వివరించడానికి వీలుగా, క్రైస్తవ మిషనరీలు కొంకణీ భాషని నేర్చుకుని ఆ భాషలో వ్యాకరణం, డిక్షనరీ, ధార్మిక సాహిత్యం (బైబిల్ వగైరా) రచించారు.

క్రీ॥శ॥ 1556వ సంవత్సరంలో గోవాకి ముద్రణ యంత్రం వచ్చింది. ఫాదర్ థామస్ స్టీవన్స్ వ్రాసిన ''దౌత్రీన్ క్రిస్తా'' అనే కొంకణీ పుస్తకం 1622లో ముద్రించబడింది. మన దేశభాషల్లో యిది మొదటి ముద్రిత గ్రంథం. ఆ తరువాత 1640లో ఆ రచయితే వ్రాసిన కొంకణీ వ్యాకరణ పుస్తకం ప్రచురించబడింది. దేశభాషల్లో యిది మొదటి ముద్రిత వ్యాకరణ పుస్తకం. కొంకణీ సాహిత్యంలో ఆ భాష అభ్యసించేవారికి యిది గొప్ప పునాదిగా ఏర్పడింది. కానీ యిది కేవలం కొద్దికాలం మాత్రం సాగింది. కారణం 1560న గోవాలో 'యింక్వ్యజేషన్' మొదలయింది. ధర్మం (మతం) మార్పిడి అయిన ప్రజలు మళ్ళీ పాతమతం వైపు మళ్ళకుండా చూడాలని ప్రభుత్వం తీసుకున్న చర్యయిది. ఈ చట్టంలో కొంకణీభాష మాట్లాడడమే నిషిద్ధమయింది. సుమారు రెండు శతాబ్దాలుగా వస్తున్న కొంకణీ లిఖిత పరంపరకి విఘాతం కలిగింది. ఈ కాలంలోనే పోర్చుగీసు అధికారి ఒకరు పోర్చుగీసు భాషలో ''కొంకణీ భాష యితిహాసం'' అనే పుస్తకం, 'సెబాస్తియావ్ దాల్‌గాద్' అనే మతాధికారి 'పోర్చుగీసు-కొంకణీ', కొంకణీ-పోర్చుగీసు' శబ్దకోశాలు ప్రచురించాడు. అయినా కొంకణీ అధోగతి మారలేదు.

కొంకణీభాష వెనకబడడానికి, కొంకణీ సమాజపు ఇతిహాసమే కారణం. పదిహేనవ శతాబ్దం వరకూ 'గోవా'ని బయట నుంచి వచ్చిన రాజులే పరిపాలించారు. ఆరాజులు వారివారి రాజ్యభాషల్లోనే వ్యవహరించారు. కొంకణీకి రాజాశ్రయం లభించలేదు. అందువల్ల కొంకణీ సమాజం చెల్లాచెదురయి, కొంకణీ భాష నిర్లక్ష్యానికి గురి అయిపోయింది.

1294సం॥ అల్లావుద్దీన్ ఖిల్జీ గోవాని జయించినప్పుడు, కొన్ని హిందూ కుటుంబాలు గోవా విడిచిపెట్టి 'కొచ్చిన్'కి వలసపోయాయి. కొందరు మహారాష్ట్ర, కర్ణాటక పోయారు. మతం మార్పిడి, కరువు, 'ఇన్‌క్వ్యజేషన్' యిత్యాది కారణాలవల్ల జనం 'గోవా' వదిలి యితర ప్రదేశాలలో స్థిరపడ్డారు. ఆయా ప్రాంతాలపు భాషలని నేర్చుకొని, ఆ భాషల్లోనే తమ మాతృభాష కొంకణీని వ్రాస్తూ తమ భాషను సంరక్షించుకున్నారు. అయితే మొదట్లో ఆ పనికి వ్యవధి లేకపోయింది. ఆ తరువాత

వేర్వేరు లిపుల కారణంగా యితర రాజ్యాలలోవున్న తమ భాషీయులతో సంపర్కం కూడా తెగిపోయింది. ఈ పరిణామాల మధ్య కొంకణీ భాష ఎలాగో జీవించినా, యితర దేశభాషలతో పోల్చితే బాగా వెనకబడింది.

పదహారవ శతాబ్దంలో కొంకణీ భాష అభ్యాసం, ధర్మప్రచారం కోసం ఆ భాషలో రచనా వ్యాసాంగం సాగినా, ఆ పనిలో సరైన ప్రేరణ, చిత్తుశుద్ధి లోపించింది. క్రైస్తవ ధర్మప్రచార సాధనంగానే కొంకణీ ఉపయోగపడింది. కొంకణీ భాష వికాసం పద్దెనిమిదవ శతాబ్దం చివర్లో సరైన రీతిలో ఆరంభమయింది.

1877లో 'షెణై గోయంబాబ్' పురఫ్ 'వామన్ రఘునాద్ షణై వర్దే వలవలీకర్' జన్మించాడు. అతనే కొంకణీ భాష వికాసానికి ఉద్యమం ఆరంభించాడు. ఈ ఉద్యమం క్రమేణా కొంకణీ భాషీయులందరి దాకా ప్రాకింది. ఇరవైయవ శతాబ్దం ఆరంభంలో 'షెణై గోయంబాబ్' కొంకణీలో వ్యాకరణం, చరిత్ర, లలిత సాహిత్యం (కథలు, నాటికలు, వ్యాసాలు) వ్రాశాడు. కొంకణీభాష శక్తిని నిరూపించాడు.

1930 ప్రాంతంలో ఐరోపా ఖండంలో ఆవిర్భవించిన లఘు కథ, భారతదేశంలోని కాల్పనిక సాహిత్యంలో ఒక ముఖ్యమైన భాగమైంది. ఇతర భారతీయ భాషలకి ఆంగ్లభాషా సంపర్కంవల్ల లాభం కలిగితే, కొంకణీ భాష ఫ్రెంచ్, పోర్చుగీసు, ఇంగ్లీషు భాషల సంపర్కంతో లాభం పొందింది.

'నవేగోయ్' అనే కొంకణీ పత్రికలో సుమారు డెబ్బై సంవత్సరాల క్రితం అచ్చయిన 'షణై గోయంబాబ్' లఘుకథ ''మా అమ్మ ఎక్కడికి పోయింది?'' (మ్హజీ బా ఖయ్‌గెలి') ఈ భాషలో మొట్టమొదటి కథ. అయితే ఆ కాలం దృష్ట్యా దానిని ఆధునిక కథ అనలేము. ఇదే స్వరూపంలో 'షణై గోయంబాబ్' కొన్ని కథలు వ్రాశారు. అవి కొంకణీ కథలకి ప్రేరణలు.

1935లో 'ఆవ్‌ళా' (ఒక పువ్వు పేరు) అనే పధ్నాలుగు చిన్న కథల సంపుటి, వివిధ రచయితలు (గోవా, కార్వార్, మంగళూర్ ప్రాంతీయులు) వ్రాసిన పుస్తకం అచ్చయింది. దీని సంపాదకుడు శ్రీ జయ్‌వంత్ కుల్‌కర్ణీ. ఇదేకాలంలో హిందీభాషలో 'ప్రేమ్‌చంద్' కథా రచనలో పరాకాష్ఠని అందుకున్నాడు. అప్పుడే హిందీలో ఐదుగురు రచయితల సంకలనం ''అంగారే'' వెలువడింది. కొంకణీ కథ యితర భాషలతో సమంగా పురోగమించిందని అనిపిస్తుంది.

1950 సం॥ శ్రీ చంద్రకాంత్ కేణీ సంపాదకత్వంలో - ''భూయిచాఫీ'' (అగవి

సంపెగ) అనే పేరిట ఒక చిన్న కథా సంగ్రహం వెలువడింది. శిల్పదృష్ట్యా ఈ కథలు పశ్చిమదేశాల ప్రభావంతో వ్రాసినట్లు తెలుస్తుంది. 1935 నుంచి 1961 వరకు అంటే గోవా విమోచనం వరకూ "నవేగో(యె", 'సాద్', 'ప్రజోచే ఆవాజ్', మీర్, "సాళీక్", 'విద్యా' అనే వివిధ కొంకణీ పత్రికలు కొంకణీ కథకి గొప్ప ప్రోత్సాహం యిచ్చాయి. సుమారు వందకి పైగా కథలు ఈ కాలంలో ప్రచురించబడ్డాయి. ఆ కాలంలో ఎడతెగకుండా వ్రాసిన రచయితలు శ్రీయుతులు 'చంద్రకాంత్ కేణీ', 'అ.న. మ్హాంబ్రె', గురునాథ్ కేళేకార్, 'ముకుంద్ కేళేకార్', ఫెలిస్యూకార్దోజ్ 'ఎవాగ్రియో జార్జ్' మొదలగువారు. గోవా విమోచనానంతరం కూడా కథా వ్యాసాంగం కొనసాగించిన వారిలో శ్రీ చంద్రకాంత్ కేణీ, శ్రీ అ.న.మాంబ్రె ముఖ్యులు. 1961 డిసెంబరులో గోవాకు స్వాతంత్ర్యం వచ్చింది. రచయితలకు భావ స్వాతంత్ర్యపు తలుపులు తెఱచుకున్నాయి. కొంకణీ సాహిత్యం నలుదిశలా, నవశక్తులతో, ఉత్సాహంతో పెరగసాగింది. ప్రగతి అన్నిశాఖలకీ విస్తరించింది. పూర్వపు కథారచయితల అడుగుల్లో కొత్తతరం రచయితలు నడవసాగారు. 1964లో శ్రీ చంద్రకాంత్ కేణీ కథాగుచ్ఛం "ధర్మరీ అజూన్ జియేతాలీ" (భూదేవి యింకా బ్రతికే వుంది) వెలువడింది. దానితో కొంకణీకథ ఆధునిక స్థాయికి వచ్చిందని ఋజువు అయింది. ఆకాలంలో 'రాష్ట్రమత్', 'నవేగో(యె', 'పరిమళ్', 'పునవ్'అనే సాహిత్య పత్రికలు ఆధునిక కథల గురించి పరిచయం, సంవేదన జాగ్రత్తగా భద్రపరిచాయి.

గోవా స్వాతంత్ర్యానంతరం మొదటి పది సంవత్సరాలైన 1970-80 కాలంలో కొంకణీ కథకి వైభవ దశాబ్దం అని చెప్పాలి. ఈ కాలంలో కొత్త విషయాలతో, కొత్త సంవేదనతో యువ రచయితలు బయలుదేరారు. వారు 'దామోదర్ మౌజో', 'మీనా కాకోడ్కర్' మరియూ 'శీలానాయక్' ఈ మూడుపేర్లూ ముఖ్యంగా పేర్కొవాలి. ఈ దశాబ్దంలో పుండలిక్ నారాయణ్ నాయక్ కథా రచన ఆరంభించారు. ఒక్క కొంకణీ కథా ప్రక్రియలోనే గాక సాహిత్యపు అన్ని రంగాలలో పురోగమనం జరిగింది.

గోవా స్వాతంత్ర్యానంతరం కొన్ని ముఖ్యమైన కథా సంగ్రహాలు వెలువడ్డాయి. అ.నా. మ్హాంబ్రె సంపాదకత్వాన "ప్రసాద్ ఫూల్" అనే కథల సంగ్రహంలో పన్నెండు రచయితల కథలు 1971లో ప్రచురించారు. ఆయనే మరో 37 కథలతో 'స్వతంత్ర గోయాల్లి కొంకణీకథ' అనే పేరుతో అచ్చువేశారు. చంద్రకాంత్ కేణీ కేంద్ర సాహిత్య ఎకాడమీ కోసం సంకలనంచేసి ప్రచురించిన పాతిక కథల సంపుటిపేరు "కొంకణీ

**కథ 1985**". ఇందులో 25 రచయితల కథలు అచ్చయ్యాయి. ఇదిగాక ఇతర భాషలలో అనువదించిన కొంకణీ కథా సంకలనాలు ముఖ్యంగా రెండు వున్నాయి. "**భారతీయ శిఖర్ కథాకోష్**" అనే ప్రణాళిక క్రింద హిందీలో 27 కొంకణీ రచయితల కథలు "**కొంకణీ కహా(నియా 1992**" అనే పేరుతో ప్రచురించబడ్డాయి. ఆ సంకలనం ప్రముఖ హిందీ రచయిత శ్రీ కమలేశ్వర్ సంపాదకత్వాన వెలువడింది. అలాగే మరో కొంకణీ కథాగుచ్ఛం మళయాళ భాషలో 'కొంకణీ కథాకళ్-1993' అనే పేరుతో వచ్చింది. అందులో 14 కథలు వున్నాయి. సంపాదకుడు 'పయ్యన్నూర్ రమేష్‌పై'. ఈ రెండూగాక కర్నాటక రాజ్యంలోని కన్నడ భాషలోనూ, మళయాల భాషలోనూ ప్రచురించడం జరిగింది.

ఈ సంకలనాలు చదివితే కొంకణీ కథా ప్రపంచపు సమగ్ర దృశ్యం గోచరిస్తుంది. కొంకణీ కథ కేవలం సంఖ్యలోనే గాక సత్తాలోకూడా పెరిగింది. ఇతివృత్తంలోనూ. ఆశయంలోనూ సమృద్ధి పొందింది. దాని ప్రత్యేకత, ప్రాదేశికత, విషయంలో వివిధత ఈ మిశ్రమాలతో ఆవిర్భవించిన విశిష్టత. 'కొంకణి', 'జాగ్', 'కొంకణీ టయిమ్స్', 'వాంగ్డి', 'కొంకణీచేకుళార్', 'చిత్రాంగీ', 'కుళాగర్', 'రాష్ట్రమత్', 'సొంగడీ', 'కొంకణ్ భారతి', 'జైత్', 'కొంకణీ జనతా', 'రాఖణో', 'పంచ్‌కదాయి', 'దివ్‌టీ' యిత్యాది పత్రికలు కొంకణీ కథని ప్రచురించి ప్రోత్సహించాయి. ఇవి కొంకణీ కథల యశస్సుకి కారణ భూతులయ్యాయి.

ఈ కథా సరిత్సాగరంలోని కథలు ఒక పాతిక మాత్రం ఈ పుస్తకంలో జతపర్చాము. చంద్రకాంత్ కేణీ రచించిన 'చాకలి బండక్రింత అంకురం' ('ఫాత్రా పొండ్ప్ ఆ(క్రీ') గోవాకు స్వాతంత్ర్యం లభించిన తరువాత జీవితంలో స్వాతంత్ర్య సైనికులు ఎదుర్కొంటున్న నిరాశ, అవహేళన ప్రతిబింబించాయి. అయితే కథ చివరలో సందేశంగా అందించిన ఆశాకిరణం అమూల్యం. నవ 'గోవా'నవోదయానికి అంకురం. అసంఖ్యాకమైన అద్భుత రచనలు చేసిన 'చంద్రకాంత్ కేణీ'ని ఆధునిక కొంకణీ కథకి మూలపురుషుడని అనవచ్చు. చిన్న విషయాలతో, సాధారణ పాత్రలతో విశ్లేషణలు చేస్తూ కథని ఒక లక్ష్యంవైపు, ఒక గమ్యంవైపు నడిపించారు. గత నలభై సంవత్సరాలుగా ఆయన వందలాది పరిపూర్ణ, ఆదర్శప్రాయమైన కథలు కొంకణీ భారతికి అర్పించారు.

అ.న. మ్హాంబ్రె కథ 'వీరూ తాళం పోయింది' ఒక రకం ప్రత్యేకత కలది.

ఈ కథలాంటిదే 'గవేత్ వుక్తే జాయనా' (సారుగు తెరుచుకోదం లేదు) కూడా. ప్రతీకథలోనూ క్రొత్త ప్రయోగాలు చేసే ప్రయోగశీల కథా రచయిత. అనితరసాధ్యమనిపించే మార్గం చేపట్టి వ్రాసిన 'మ్హాంబ్రే' కథలు కొందరికి అసంగతంగా తోచవచ్చు. మార్మికమైన భాషా శైలి అతని మరోగుణం.

'అచ్యుత్ తోటేకార్' వ్రాసిన "ప్రేమ నగరంలో అతిథి" గోవాలోని దేవదాసీ పద్ధతికి సంబంధించింది. ఈ ఆచారం ఆదికాలం నుంచీ వస్తోంది. సామాజిక చైతన్యం వలన ఈ వ్యవస్థ వెలుగులోకి వచ్చింది. ఈ ఆచారంలోని ఒక నాజూకు భావబంధం ఈ కథలో గొప్పగా చిత్రించబడింది. అశ్లీలం అనిపించకుండా రచయిత అద్భుత పంథాలో కలం నడిపించారు. కొంకణీ కథల్లో ప్రాదేశికత, ప్రాంతీయత, సరితూగే భావ సమైక్యతా కలిసి వెలసిన వైశిష్ట్యం 'అచ్యుత్ తోటేకార్' కథతోనే ఆరంభమయిందని అనవచ్చు. కొంకణీ సాహిత్యంలో 'గోవా'లోని 'పోండా' తాలూకాకి చెందిన రచయితలు మహత్తరమైన సేవ చేశారు. వారి సాహిత్య కృషివల్ల 'పోండా'కి కొంకణీ భాష సాహిత్య చరిత్రలో అత్యున్నత స్థానం లభించింది. అక్కడి ప్రజా జీవనానికి 'తోటేకార్' రచనలు దర్పణం.

శాంతారాం హెదో వయస్సు ప్రకారం కొంకణీ కథానికా క్షేత్రంలో ఆలస్యంగా రంగప్రవేశం చేశారు. అయినా ఆయన పరిమిత రచనలు ఒక ప్రత్యేకమైన వైశిష్టతను చూపించాయి. "ఘర్‌పురుష్" (ఇంటి పెద్ద) అనే ఈ సంపుటిలోని కథలో ఆనాటి విదేశీ బుడతగీచుల పాలనలోని సాంఘిక జీవితానికి అద్దంపట్టారు. పోర్చుగీసు పాలనకి విరుద్ధంగా క్షత్రియ వంశీయుడైన రాణె కత్తిగట్టి, అడవులలో పొంచి 'గెరిల్లా' యుద్ధం చేశాడు. అతని పోరాటానికి వానరులకోసం ధనికులని, వర్తకులని యిబ్బంది పెట్టాడు. (ఈ విధమైన అనధికార ప్రభుత్వాలు అనాదిగా వున్నట్టు చరిత్రలో ఎన్నో దృష్టాంతాలు) 'శాంతారాం హెదో' రచనాశైలిమీద 'షెణయ్‌గోయంబాబ్' ప్రభావం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది.

'దామోదర్ మాల్‌జో' కథ 'అంగ్‌వణ్' (మొక్కుబడి) ఒక ప్రసిద్ధి పొందిన రచన. ఈ కథ ఆధారంగా ఒక టెలీఫిల్మ్ నిర్మించి దూరదర్శన్‌లో (హిందీ భాషలో) ప్రసారం చేశారు. 'గోవా' ప్రాక్పశ్చిమ సంస్కృతుల మిశ్రమం. ఈ ప్రాంతంలో యూరొప్ నుంచి ప్రభావితమైన 'లాటిన్ కల్చర్' ప్రజల్లో, ముఖ్యంగా క్రైస్తవులలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ మిశ్రమ సంస్కృతిలో ఒక గొప్ప విశిష్టత వుంది. ఇది

సమాజ జీవితంలో, వ్యక్తుల జీవనశైలిలో జీర్ణించుకుపోయింది. ఈ వాస్తవాన్ని చాలా రచయితలు సాహిత్యంలో చిత్రంచారు. అయితే 'దామోదర్ మవ్‌జో' వారిలో అగ్రతాంబూలం యివ్వతగ్గ కథారచయిత. ఆయన యితర ప్రముఖకథలు 'తెరెజాలో ఘోవ్' ('తెరెజా మొగుడు') 'మరణ్ ఏనామ్హ్వాణ్' (మరణం రాదు కాబట్టి) వగైరాలు.

''కార్మెలిన్'' పేరుతో వెలువడిన అతని నవల ఎంతో సంచలనాన్ని కలిగించింది. కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం కూడా లభించింది. ఆయన పెద్దకథలు, నవలికలూ కూడా వ్రాశారు. అయినా చిన్నకథలు వ్రాయడం తగ్గించలేదు. సాంఘిక చైతన్యాన్ని కళాత్మకంగా, పరిణామాత్మకంగా చిత్రిస్తారు. కొంకణీ కథకి కొత్త పరిమాణాలు 'మవ్ జో' రచనలు.

కొంకణీలో కవిత్వం, నాటకం మొదలయిన ప్రక్రియలలో స్త్రీ రచయితలు బహు తక్కువ. అయితే ఈ లోటు కథా ప్రక్రియలో లేదు. 'మీనా కాకోడ్కర్', 'షీలా కోళంబెకర్' స్వతంత్ర గోవా మొదటి దశాబ్దంలోనే పెద్దపేరు గడించి స్థిరపడ్డారు.

'షీలా కోళంబకర్' కథ 'ఇల్లెషీ( ఇల్లి గర్మీ' (కొంచెం చలి, కొంచెం వేడి) ఆమె కథాశైలికి వుదాహరణ. కళాత్మకరీతిలో మానవనైజం, అంతరంగం సోధించే చాతుర్యం ఆమెది. లోతైన భావాలు, తేటైన శైలిలో చెప్పగల చాతుర్యం ఆమె పుణికి పుచ్చుకున్నారు.

'మీనా కాకోడ్కర్' వ్రాసిన 'దేవ్‌త( వోషీ', (దేవతావంశి) కథ ఒక అపురూప రచన. బాల్యంలోని జ్ఞాపకాలను సూక్ష్మ దృష్టితో పరిశీలించి, పదాలలో బంధించి భావతరంగాలుగా ఎగరేశారు. ఆమె వ్రాసిన 'డోంగర్ చవల్లా' (కొండ రమ్మంది) 'సుక్‌ణ్యా పిలారె' (పిట్టల్లారా రండి) పాఠకుల అభిరుచికి అనుగుణంగా వుండే కథలు., గోవా మధ్యతరగతి ప్రజల జీవనాన్ని ప్రతిఫలించే కథలు, నవ్వించి నవ్వించి హఠాత్తుగా ఏడిపించే కథలు. స్వాప్నిక దృష్టి, భావ ప్రాధాన్యత ఈ రచయిత ప్రత్యేకతలు.

'దత్తా నాయక్' వ్రాసిన 'పున్‌వే రాత్రీచీ ఖూణ్' (పున్నమి రాత్రి భావాలు) అతని కథా చాతుర్యానికి చక్కని వుదాహరణ. సంఘటనలు, వ్యక్తులు అతని ముడిసరుకులు. మనిషి స్వభావంలోని లోటుపాట్లను మార్మికశైలితో ఉల్లేఖిస్తారు. ఆయన కథల్లో పాత్రలు చిరస్మరణీయంగా వుంటాయి.

ఆయన కథల్లో ప్రసిద్ధి పొందినవి 'ఏక్ జాణ్‌ట్యేలో - ఏక్ నెణ్‌ట్యేలో'

(పెద్దా - చిన్నా) 'ఏక్‌ఆసిల్లో సోసో' (ఒక కుందేలు కథ) గణ్‌పత్ 'పీటర్ వోటూల్' 'జాలా' (గణపతి పీటర్ వోటూల్ అయ్యాడు).

కవిగా చలామణీ అయే 'ఒలివిన్యూ గోమ్స్' వ్రాసిన 'వ్హకల్' (పెళ్ళికూతురు) కథ ఒక అపురూప సృష్టి. అతని కథలలో చాలా ముఖ్యమైనది. 'వ్హకల్' కథలోని నాయికపాత్ర చిత్రణ, ఆమె భావాల వర్ణన సూక్ష్మరీతిలో వ్యక్తీకరించారు. 'గోవా' క్రైస్తవుల జీవితానికి అద్దంపట్టే 'గోమ్' కలం సమాజంలో త్వరత్వరగా వస్తున్న మార్పులు, చేర్పులు ప్రతిబింబిస్తుంది.

'పుండలిక్ నాయక్' కథ 'ప్రేమ్ జాగర్' (ప్రేమజాతర) ఒక ప్రాదేశిక యితివృత్తంతో వ్రాసినది. అయినా సంవేదనతో, విశ్వజనీనత గోచరించే రచన. ప్రపంచ ప్రజలు యుగయుగాలుగా అనుభవించిన సుఖ, దుఃఖాలు, బాధలు, వ్యథలూ ఈయన కథల యితివృత్తాలు. కొంకణీ సాహిత్య క్షేత్రంలో 'ప్రాదేశికత'కి శ్రీకారం చుట్టారు. ఈయన కంఠం 1970 దశాబ్దం తరువాత కొంకణీ కథా ప్రక్రియలోనేగాక యితర ప్రక్రియల్లో (కవిత, నాటిక, నవల వగైరా) కలం ఝళిపించి ప్రముఖస్వరంగా గుర్తించబడింది. ముఖ్యంగా నాటక రచయితగా పేరు గడించిన 'పుండలిక్ నాయక్' కథా రచనలోనూ యోగ్యత ప్రదర్శించారు. ఆయన యొక్క ఉత్తమకథల జాబితాలో 'కాసయ్' (తాబేలు), 'మోగాచీధూవ్' (మోగాకూతురు) 'జైత్' (విజయం), 'పారజ్' (పాదరసం) వుంటాయి.

ప్రాదేశిక 'కొంకణీ' కథా క్షేత్రంలో మరో ధ్రువతార ఎన్. శివదాస్. అతని 'గళ్‌సరి' (బంగారు గొలుసు) 'పాస్‌కో' (దత్తత) కథలు మంచి వుదాహరణలు. ఈ సంకలనంలో చేర్చిన అతని కథ 'బ్యూటిఫుల్ లేడీ' (అందమైన ఆడది) అతని ప్రతిభకి తార్కాణం. జీవితంలోని వాస్తవ్యాలని సూక్ష్మంగా పరిశీలించి, కళాత్మక రీతిలో కథలు వ్రాశారు. సత్ప్రవర్తనకి, సౌశీల్యానికి భంగం రాకుండా అంధశ్రద్ధ, మూఢ విశ్వాసాలు వగైరా విషయాలమీద వుద్వేగంతో సామాజిక మార్పు కోసం విశిష్ట రచనలు చేశారు.

'జయ్‌మాలా దణాయత్' రచన 'అంగోస్తర్' (అంగవస్త్రం) ఆమె మామూలుగా వ్రాసే ధోరణికి భిన్నమైనది. సమాజానికి ఏమాత్రం భయపడకుండా, ఒక పేరూ, ప్రతిష్ఠ వున్న పురుషుడు వుంచుకున్న వుంపుడుకత్తెని 'పత్ని'గా, సహధర్మచారిణిగా పరిగణించి గౌరవించిన విచిత్ర ప్రవర్తన అందులోని వృత్తాంతం.

'గోవా'లోనూ, 'గోవా' బయటా స్థిరపడ్డ గోవన్ల జీవితాల్లోని చిన్న, పెద్ద సమస్యలు, సంఘటనలు ఆమె కథల్లోని యితివృత్తాలు. అవి మనిషికి మానవత్వాన్ని, విలువలని ప్రసాదించే సందేశాత్మక కథలు.

ఆమెలాగే వ్రాసే రచయిత్రులు 'సుమిత్రా తాంబా', 'సుశీల భట్', 'విజయా ధుంఘట్', 'చిత్రాకుడ్‌చడ్‌కర్', 'రజనీ భెంబ్రె', 'శాంతా ఖండే పార్కర్' 'హర్షల్ దల్వీ', 'గీతా నాగర్‌శేఖర్', 'మాయా ఖరంగటే' మొదలగువారు.

హేమానాయక్ వ్రాసిన కథ 'కుకమా ఆదార్'', ఈ కథ ఆమె వ్రాసిన కథలలో విశిష్టమైనది. పురుషుల ఆధిక్యతగల సమాజంలో స్త్రీల మీద జరిగే అత్యాచారాలు, దౌర్జన్యాలు (శారీరక, మానసిక) యితర అన్యాయాలు వీటికి విరుగుడుగా వస్తున్న చైతన్యపు వర్ణనలు ఆమె కథలలో ప్రతిబింబిస్తాయి. కథా ప్రక్రియతో స్త్రీ స్వాతంత్ర్యం ప్రాముఖ్యాన్ని, కొంకణీ సాహిత్యంలో ఆ విషయానికి పెద్దపీట వేయడంలో ఆమె అమూల్య సేవ చేశారు.

కొంకణీ భాషలో ప్రముఖ నవలా రచయితగా పేరు గడించిన 'ఎడ్విన్ డిసౌజా' వ్రాసిన ''దిర్వే'' (భాగ్యం) ఆయన శైలికి మంచి వుదాహరణ. క్రైస్తవ మతంలోని చర్చి ప్రార్థనల ప్రక్రియని పవిత్రత చెడకుండా, తన కథలో అతి చాకచక్యంగా వాడుకున్నాడు. ఆయన సులభశైలి, చకచకా సాగిపోయే కథాగమనం, కథలో సన్నివేశాలు, వ్యాఖ్యలు పాఠకులని వుత్కంఠలో ముంచుతాయి. 'ఎడ్విన్ డిసౌజా' ప్రసిద్ధ రచనలు 'కాగ్‌దాచీ స్త్రీ' (కాగితపు స్త్రీ), 'కంబెరళ్ళీ' (పేరు) అనే కథలు.

'గజానన్ జోగ్' కొంకణీ ప్రాంతీయ కథల్లో ఆశయాలకి అందే రచనలు చేసిన కథకుడు. ఈ సంగ్రహంలోని ఆయన కథ 'ఖోల్ ఖోల్ తళీఁ' (లోతైన మడుగు) గ్రామీణ జీవితానికి అద్దం పట్టింది. కథలో ఒక విచిత్ర వ్యక్తి చిత్రం, ఒక భయానక దృశ్యం కళాత్మకత చెడకుండా చిత్రించారు. ఆయన వ్రాసిన 'రుద్ర' (శంకరుడు) 'మాన్ షే భావ్' (అత్తకొడుకు), 'బావీస్ ఎకె బావీస్ (ఇరవై నాలుగొకట్ల ఇరవైనాలుగు) కొంకణీ భాషలో వుల్లేఖ నీయమైనవి. స్వతహాగా అబ్బిన భాషా సామర్థ్యం వలన ఆయన ప్రతిభతో తన ఆశయాలకి అక్షరరూపం యిచ్చి కథల్లోని వ్యక్తులకి ఒక భయానకమే అయినా కళాత్మక అనుభూతిని కలిగిస్తారు. ఆయన కథలు 'రుద్ర' (పేరు) 'మాఁవ్‌షేభావ్' (అత్త కొడుకు) విశిష్ట స్థానం గలవి.

కె.ఆర్. వసంతమణి కేరళకి చెందిన 'కొచ్చిన్'లోని కొంకణీ భాషీయుల జీవితాన్ని చిత్రించే రచయిత. 'మోడెఁమతోఁ' (శవాల మిత్రుడు) ఈ కథ ఒక అపురూప వ్యక్తికి రూపకల్పన. ఒక చిన్న, సాధారణ మనిషిద్వారా మానవత్వపు మహోన్నత శిఖరాలు దర్శింపజేశారు. సమాజంలోని గుణదోషాలను వీక్షించడంలో 'వసంతమణి'ది ఒక ప్రత్యేక దృష్టి కోణం. ఆయన దగ్గర అనుభవాల ఖజానం వుంది. అనుభూతికి రూపాన్ని ప్రసాదించే కళ వుంది. తనదనే ఒక విశిష్టశైలి వుంది. అందువల్ల అతని కథ ఆకర్షిస్తుంది.

'తోమజిన్యూ కార్డోస్' కొంకణీ నాటక రంగంలో రచయితగా పేరు గడించారు. అయితే అలాగే సాహిత్యంలోని వివిధ ప్రక్రియలలో కలం నడిపారు. గోవాలోని క్రైస్తవ మతస్థుల జీవితాన్ని వర్ణించారు. కథలు, కవితలు వ్రాశారు. ఆయన కథ 'అనీతా' కుటుంబంలోని సభ్యులలో సంఘర్షణమీద కాంతి ప్రసరించి, ఒక అపురూప వ్యక్తిత్వాన్ని - 'అనీతా' అనే వుత్తమ స్త్రీ స్వభావాన్ని వెలుగులోకి తెస్తుంది.

పురోగమన దృక్పథంతో నడిచే అతని కథలు సమాజంలోని విషమతలు, భ్రష్టాచారాలు బట్టబయలు చేసి, కరుణ, మానవత్వం ప్రేరేపిస్తాయి. సంపూర్ణ ఆశయ చిత్రణ, తన నాటకాలలో లాగే తాజావ్యక్తి వర్ణనలూ ఆయన వైశిష్ట్యాలు.

కేరళ రాష్ట్రంలో స్థిరపడిన కొంకణీ ప్రజల జీవిత చిత్రణ చేసే 'గోకుల్‌దాస్ ప్రభు' వ్రాసిన "అరాట్ట్' (తెప్ప వుత్సవం) కథ, కొంకణీ కథలో వైవిధ్యానికి గొప్ప వుదాహరణ.

ఆయన కథలు కళాకారుడి సంవేదన, మనిషి మనస్సులో ఆత్మీత కలిపి మనో విశ్లేషణ చేస్తూ, అడుగులు వేస్తూ పురోగమించడానికి ప్రయత్నిస్తాయి. ఆయన వ్రాసిన 'లాఁషేఁ' (పోని మచ్చ) 'ఎక్లెపణాచీ సాంజ్' (ఒంటరి సాయంకాలం) ఆదర్శనీయమైనవి.

'జెస్ ఫర్నాండజ్' కథ 'మూఠ్‌భార్ మాతీ' (గుప్పెడు మట్టి) గోవాలో స్వాతంత్ర్యానంతరం జరిగిన గొప్పమార్పుని స్పర్శిస్తుంది. తను కష్టంతో కట్టిన ఇల్లు, సమకూర్చుకొన్న పొలాలూ, తోటలూ చట్టం మార్పుల వలన ఎలా పరాయివాళ్లు కబళిస్తారో, తనే తన యింట్లో పరాయివాడు ఎలా అయిపోతాడో రచయిత చిత్రిస్తారు. కళ్ళులేని చట్టం దురుపయోగాన్ని గర్హిస్తాడు.

'మహాబలేశ్వర్ శైల్' కొంకణీ కథలోని ప్రాదేశికతని మరింత సమృద్ధి చేశారు. 'కార్వార్' 'మాజాళీ' ప్రాంతాలలోని గ్రామీణ ప్రజల జీవితాన్ని కథా సాహిత్యంలోకి ప్రవేశపెట్టారు. కొంకణి భాషలో ప్రముఖ కథా రచయితలలో ఒకరైన ఈయన రచనలు అనుభవ సమృద్ధికి, సంవేదనకీ పేరు గడించాయి. ఈ సంగ్రహంలోని కథ 'వితరాగ్' (వైరాగ్యం)లో నాయిక పాత్ర అపురూపమైనది. చివరన కొసమెరుపు మానవత్వపు విలువలకి పరాకాష్ఠ.

ఆయనే వ్రాసిన 'పర్దేకసోఆయ్‌లో' (మళ్ళీ ఎలా వచ్చాడు?) అనే కథ గొప్ప ప్రభావం కలిగించే కథల శ్రేణిలోనిది.

'శశాంక్ సీతారం' వ్రాసిన 'దేవా తూపావ్' (దేవుడా రక్షించు) ఆయన ముఖ్య రచనలలో ఒక్కటి. ఆయన కథలు నాజూకు రీతిలో, సృజనాత్మక శిల్పంతో, పొంగిపొర్లే అనుభూతితో ఆశయపు 'ఖజానా' చూపిస్తాయి. అయితే ఈ ధోరణిలో కళాత్మక విలువలు ఎక్కువ-తక్కువ కాకుండా జాగ్రత్తపడతారు.

కథా ప్రక్రియలో మహిళా స్వాతంత్ర్యం గురించి ఉద్ఘోషించే మహిళా రచయితలలో ముఖ్యురాలు 'జయంతీ నాయక్'. సమాజంలోని బడుగువర్గాల ఆక్రోషలకి అక్షరరూపం ఇచ్చే పని ఆమె కథలు చేస్తాయి. మహిళలపై జరిగే అత్యాచారాలు స్వాభావికంగా, కళాత్మకంగా చిత్రిస్తారు. 'సింద్రెల్లాచీకాణీ' (సింద్రెల్లా కథ) ఆమె ప్రముఖ రచన. 'గార్లే' (విన్నపం) 'నిమణెఁబండ్' (అంతిమ పోరాటం) యితర ముఖ్యమైన కథలు.

'తుకారం శేఠ్' కథలు సంఖ్యలో స్వల్పమే అయినా, సాహిత్యంలో ఆయన స్థానం అనల్పమయింది. ఐహిక సుఖాలకోసం మనిషి ఎలా వికాసాన్ని వినాశం చేశాడో, ఆంతరంగికంగా మనిషి ఎలా వ్రుద్వష్టుడయ్యాడో 'కావ్ళ్యాచో శ్రాప్' (కాకుల శాపం) కథ అతని ధోరణికి వుదాహరణ. 'టూరిస్ట్' (సంచారి) అనే మరో కథ ఇతివృత్తంలో వైవిధ్యం, సామాజిక జాగృతికీ మంచి దాఖలా.

'వశంత్ భగవంత్ సావంత్' కొంకణీ కథా రచయితలలో నవతరానికి ప్రతినిధి. 'కల్సావ్' (నిక్కరు) పాఠకులకి పసందైన కథ. అందులో చింకీ చెడ్డీతో తిరిగే కుర్రవాడు, కొత్తలాగు (ప్యాంటు) కోసం పడే శ్రమ, తపన వర్ణించబడింది. పిల్లల అమాయకత్వాన్ని, ఉత్సాహాన్ని పెద్దలు ఎలా తమ స్వార్థానికి వాడుకుంటారో తెలుపుతుంది. ఆయన వ్రాసిన 'నాగపంచమ్' మరో ఉల్లేఖయనీయమైన కథ.

ఇతివృత్తానికి అనుగుణంగా వాతావరణం సమకూర్చడంలో ఆయన నేర్పరి. సమాజంలోని తాడిత, పీడిత ప్రజల వ్యధలు, బాధలూ ఫలప్రదంగా సాహిత్యానికి అందించారు.

'వశంత్ సావంత్' లాగే మరెంతో మంది క్రొత్త రచయితలు సామాజిక స్పృహతో కలం నడిపారు. వాళ్లలో 'సురేష్ పిళర్నకార్', 'రాంనాథ్ గావ్ డె', మధుసూదన్ జోషీ', 'శశికాంత్ పునాజీ', 'విఠల్ అవ్‌డీయేకార్' ముఖ్యులు. వీరు కొంకణీ కథ వికాసానికి విలువైన కృషి చేశారు.

'జ్యోతీ కుఁకళ్‌కార్' కథా రచయిత్రులలో ఒక కొత్త మార్గాన్ని త్రొక్కి, అనుభవంతో, అభివ్యక్తితో ఆకర్షించారు. మఱచిపోయిన మధ్యతరగతి జీవితాల అనుభవాలకి కథారూపాన్ని తనదైన విశిష్ట బాణీలో యిచ్చి ఆకట్టుకొంటారు. కథలలో ప్రాదేశికత వైశిష్ట్యాన్ని విస్మరించినా, పాత్ర చిత్రణలోనూ, మానవ సంవేదన వర్ణనలోనూ సిద్ధహస్తులు. చెప్పుకోదగిన ఆమెకథల్లో 'సావ్ళీ' (నీడ) కథ మంచి ఉదాహరణ.

కథ చదువుతూన్న పాఠకుడు అలా తోడునీడలా వుండే సహచరుడెవరా అని అబ్బుర పడతాడు. ఒక సాధారణ యితివృత్తాన్ని సుందర కథానికగా రచయిత్రి మలిచారు. "ప్రతిమా భంగ్" (ప్రతిమా భంగము) 'రోమాఁ' (పేరు) ఆమె యితర వుల్లేఖనీయ కథలు.

కొంకణీ కథానికను సమృద్ధం చేయడానికి ఎందరో రచయితలు తోడ్పడ్డారు. ఒక సంగ్రహంలో అందరినీ చేర్చడం సాధ్యం కాని పని. అయితే కొందరు రచయితల పేర్లు మాత్రం పేర్కొనక తప్పదు. వారు 'గోవింద్ ముద్రస్', 'నారాయణ్ బోర్కర్', 'అవధూత్ హెగ్డే దేశాయ్', 'అరుణ్ సింగ్బాల్', 'గురుదాస్ బాంబోల్కర్', ప్రేమానంద్ మ్హాంబ్రే' అలాగే 'జె.ఎల్.గోమ్స్', అశోక్ భోస్లే, వామన్ టాకేకార్, అభయకుమార్ వెలింగ్కార్, వింసీకార్డోస్, సురేఖా తోటేకార్, ఆల్బర్ మినెజీస్, ఈ కథాకారులందరూ కథా రచనల్లో రక్తించే ప్రయత్నం చేశారు. కేరళ రాష్ట్రంలోని కొంకణీ రచయిత 'కె. నారాయణ్ నాయక్' వుల్లేఖనీయమైన కథలు వ్రాశారు.

'కర్ణాటక రాష్ట్రం'లో కొంకణీకథలు చదివే పాఠకులు అసంఖ్యాకం. వీరి తృష్ణని తృప్తి పరచడానికి రచయితలు సతతం కథా వ్యాసంగం చేస్తారు. వాళ్లలో ముఖ్యులు, వందకిపైగా కథలు వ్రాసిన 'జె.సి.ప్పియేగాళ్ 'సిరివజ్'కి అగ్రతాంబూలం

యివ్వాలి. ఆయన కథలు భావనా ప్రధానాలు. 'స్టైన్ అగియార్' లోకప్రియ నవలా రచయిత. అయితే ఆయన కథలు కూడా పాఠకులకి బహు ఇష్టం. 'జెమా పడిల్', జెమీ బొరొకస్, హెమాచార్య, హెరోల్ పియస్ యిత్యాది రచయితలు విలువైన కథలు వ్రాశారు.

ఒకానొకప్పుడు వున్నతమైన భావాలతో, చక్కటి శైలితో ఆకట్టుకొనే కథలు వ్రాసి ఏ కారణం వల్లనో ఈ ప్రక్రియని నిర్లక్ష్యం చేసిన కొందరు కవులు, రచయితలు జ్ఞాపకం వస్తున్నారు. 'అనీల్ బోర్కర్', 'ఉదయ్ బెంబ్రె', 'సురేష్ కా కోడ్కార్', 'పురుషోత్తం సింగ్‌బాల్' యిత్యాది లేఖకులు.

కొందరు కొంకణీ కవులు మార్పుకోసం లేదా ప్రయోగం కోసం చాలా చక్కటి కథలు వ్రాశారు. ఆ కవులు 'బాకిబాబ్ బోర్కర్', ''డా॥ మనోహర్‌రాయ్ సర్దేశాయి', 'పాండురంగ్ భంగీ', 'నాగేష్ కర్మలీ', 'జె.బి. మొరాయిస్ మరియు 'రమేష్ వెళుస్కర్', యిత్యాదులు. మరాఠీ భాషలో గోవన్ రచయిత లక్ష్మణరావు సర్దేశాయ్ కథలు వ్రాశారు. తరువాత ఆలస్యంగా కొంకణీభాషలో వ్రాసినా, ఆ కథలు అందర్నీ యిట్టె ఆకట్టుకొని వేదవాక్కుల్లా నిలిచిపోయాయి. ఈ కథలలో ఆయన స్వంత అనుభవాలని ఆబాల గోపాలం చదివి ఆనందించేలా వ్రాశారు.

కొంకణీ కథ ఈరోజు భారతీయ కథలలో స్థానం సంపాదించింది. పెద్ద భాషల పంక్తిలో సమాన గౌరవంతో కూర్చుంది. అప్పుడప్పుడు అంతర్జాతీయ స్థాయిలోకూడా సన్మానాలు అందుకొంది.

కొంకణీకథకి 'కొంకణీకథ' అనే ప్రత్యేకత వుంది. అయితే అదే దాని ఏకైక లక్ష్యంకాదు. తన వైవిధ్యాన్ని, విలక్షణతని కాపాడుకుంటూ ప్రగతిశీల దృక్పథంతో పురోగమించడమే దాని ధ్యేయం.

**- పుండలిక్ నారాయణ్ నాయక్**

వళ్వయ్-పొండె
గోవా

1

# చాకలిబండ క్రింద అంకురం

**- చంద్రకాంత్ కేణి**

రేషన్ దుకాణం ముందు ఒక పెద్ద క్యూ. ఎండనెత్తిన పడకుండా, అడ్డంగా సంచీ పట్టుకొని అరగంటనించీ అతను నిలబడి వున్నాడు. అతని నంబరు మొదటి యాభై మందిలో లేదు. కానీ వరస వదిలేస్తే ఈ వేళకూడా ఉపవాసం తప్పదని అతని భయం.

అతని వెనక నిలుచున్న వ్యక్తి హఠాత్తుగా భుజంమీద చెయ్యి వేసి పలకరించాడు. అతను వెనక్కితిరిగి చూశాడు. ఎవరో అపరిచితుడు. వయస్సులో పెద్ద. తనలాగే సంచీ పట్టుకు నిలబడ్డాడు.

"నేను మిమ్మల్ని గుర్తు పట్టలేదు."

సగం చిరునవ్వు ముఖంమీద తెచ్చుకు అన్నాడు.

"నాకు మీరు తెలుసు. మీ పేరు శ్రీనివాస్ కదూ?"

"అవును. మీ పేరు?" నా పరిచయం వదిలేయ్. నేనొక మామూలు వ్యాపారిని. ప్రస్తుతం దుకాణంలో వ్యాపారంలేదు. అందుకే చూడు యిలా ఎండలో ఆ కిలో పుచ్చిన రేషన్ బియ్యం కోసం నిలబడ్డాను. మీ సంగతి వేరు. మీరొక స్వాతంత్ర్య సైనికులు."

"అయితే నేం? నేనూ బియ్యం కోసం లైనులో నిలబడ్డాను."

"నాకు తెలుసు. అందుకే నాకు జాలేసింది. స్వాతంత్ర్యం వచ్చిం తరువాత మేము వీధిన ఎలాగూ పడ్డాం. కానీ మీలాంటి స్వాతంత్ర్య యోధులకీ యిదే గతా?"

"అలా తేడా ఎలా వీలవుతుంది?"

"ఎందుకు వీలవదు? మీకు గతంలో తామ్రపత్రం యివ్వలేదా?

ఎంతోమందికి పెన్షన్ దొరకడం లేదూ."

అతను మౌనంగా వూరుకొన్నాడు.

"ఇప్పుడు మౌనం ఎందుకు? మీకు స్వాతంత్ర్యం కావాలి కదూ? మమ్మల్ని నిరుద్యోగులు చేసి, బయటనుంచి జనాన్ని తెచ్చి మా నెత్తిమీద రుద్దడానికి"

ఈ మనిషి బారినుంచి బయటపడితే చాలుననిపించింది శ్రీనివాస్‌కి. కాని ఏం చేయగలడు తను. లైను విడిచేస్తే, రేషన్ దొరకదు. రేషన్ వదిలేస్తే ఈ వేళ వంటింట్లో అన్నం గిన్నె పొయ్యి మీదకి ఎక్కదు.

అతను మౌనంగా నిలబడ్డాడు.

కానీ అతనికి ఎక్కువసేపు అలా నిలబడనవసరం లేకపోయింది. ఐదు నిమిషాలలోగా జనం క్యూ విడిచి వెళ్లిపోసాగారు.

"ఏం జరిగింది?" శ్రీనివాస్ ఒక అతన్ని అడిగాడు.

"రేషన్ బియ్యం అయిపోయాయి" అన్నాడతను.

"ఇందుకోసమే కదూ మీకు కావాలన్నారు స్వాతంత్ర్యం?" ఇందాకటి పెద్దమనిషి హేళనగా అన్నాడు.

"బియ్యం వెనకదారి నుంచి చేరవలసిన చోటుకే చేరివుంటుంది"

మరో వ్యక్తి అన్నాడు.

"అడిగే నాధుడు లేడా?" మూడో వ్యక్తి వ్యాఖ్య.

"మినిష్టర్‌ని అడగండి."

"పేపర్‌కి ఉత్తరం వ్రాయండి."

"ఏం లాభంలేదు."

ఇందాకటి వ్యక్తి మళ్లీ అన్నాడు.

"వాడి చర్మం మొసలి చర్మంలా దళసరి."

శ్రీనివాస్‌కి అక్కడ నిలబడి వుండే ఓపిక లేకపోయింది. అతను వెంటనే లేచి యింటిముఖం పట్టాడు. ఇంటిదారి పట్టిన తరువాత ఆలోచిస్తూ, లోకులు ప్రతీ అవకతవకలకీ తనని దోషిగా చూస్తున్నారనిపించింది. తరువాత ఎవరైనా తనని చూసినట్లు అనిపిస్తే వాళ్లు ఏవైనా ప్రశ్నలడుగుతారేమోనని భయం వేసింది.

ఎవరైనా తనని చూసి నవ్వితే, తన చేతిలో ఖాళీసంచి చూసి హేళన చేస్తున్నారనిపించింది.

అతనికి తెలుసు. స్వాతంత్ర్యం అంటే సమృద్ధికాదు. సమృద్ధి లభించడానికి వొక సాధనం మాత్రమే. తిండి, బట్ట యిత్యాదితో స్వాతంత్ర్యం విలువని తూచకూడదు. కానీ ఇది ఈ లోకులకి ఎలా నచ్చ చెప్పడం? అయినా ఇందులో వాళ్ల తప్పేమిటి?

గుమ్మం దగ్గర నిలబడి వున్న అతని భార్య అతని చేతిలో ఖాళీసంచి చూసి, మౌనంగా యింట్లోకి వెళ్లిపోయింది. అతనికి కోపం వచ్చింది. ఆమె కూడా తనని హేళన చేస్తోందని అనిపించింది.

అతను యింట్లోకి వెళ్లి చాప పరుచుకు విశ్రమించాడు. లోపల్నించి బయటకి వచ్చి, భార్య విచారించింది...

"ఒంట్లో బాగులేదా?"

"విసిగెత్తి పోయింది."

"ఈ మండుటెండలో యిలాగే అనిపిస్తుంది. కాస్త షర్బత్ చెయ్యనా?"

"వద్దు."

"ఈవేళ కూడా బియ్యం దొరకలేదా?"

"లేదు, అయిపోయాయి."

"ఏం పరవాలేదు. పెసలతో జావ చేస్తాను."

"రవి స్కూలు నుంచి వచ్చాడా?"

"ఇంకా రాలేదు. వస్తూ వుంటాడు."

"వాడు అన్నం అడుగుతాడేమో!"

"అడగడు, వాడు అర్థం చేసుకోగలడు."

శ్రీనివాస్ కంట్లో నీళ్లు తిరిగాయి. అతను ఆపుకున్నాడు. భార్య లోపలికి వెళ్ళింది. టేబిల్‌మీద అతని తామ్రపత్రం వుంది. ఎవరో తన తామ్రపత్రం తాకట్టు పెట్టిన విషయం గతంలో తాను ఏదో పత్రికలో చదివాడు. క్షణంసేపు అతనికి అనిపించింది. తనూ అందరిలాంటివాడే. కానీ ఈ తామ్రపత్రం తనని యితరుల నుండి వేరు చేస్తోంది. దానిని బయట పారెయ్యాలి. ఆలోచన రాగానే అతను లేచాడు.

కానీ క్షణంలో అతను మనస్సు మార్చుకొన్నాడు. మళ్లీ వెళ్లి చాపమీద పడుకొన్నాడు.

అతని కళ్లు నిద్రలో మునిగిపోయాయి. అతనికి తెలివి వచ్చేసరికి అతని చిన్న కూతురు ఏడుస్తోంది. ఆ చంటి పిల్లకి భార్య పాలిస్తోంది.

"జీలకఱ్ఱ నీళ్ళు తాగనంటోంది ఇది" ఆమె అంది.

"పాలడబ్బా దొరకడంలేదు. గేదెపాలు అలవాటు చేయాలి."

"ఇచ్చి చూశాను. దానికి పడలేదు."

శ్రీనివాస్ లేచాడు. వెనక ద్వారం నుంచి వెళ్లి కాళ్లూ, చేతులూ కడుక్కొని, వంటింట్లోకి పోయి పీటమీద కూర్చున్నాడు. పెళ్ళాం కంచంలో వడ్డించిన 'వుసళీ' (ఒక విధమన వుప్మా) నోట్లో వేసుకుని చెంబుడు నీళ్లు గటాగటా త్రాగి లేచాడు.

మళ్లీ వచ్చి నిద్రపోయాడు. లోపల పనులు పూర్తిచేసుకొని భార్య బయటకి వచ్చింది.

"శిల నిద్రపోయిందా?" అతనడిగాడు.

"అవును."

"దానికి ఎలాగైనా పాలపొడి డబ్బా తీసుకురావాలి. బజారులో బ్లాక్‌లో దొరుకుతుందట" అతను వులిక్కిపడ్డాడు.

"రవి ఎక్కడికెళ్ళాడు?"

"బయట ఆడుకొంటూ వుంటాడు."

"వాసంతీ ఇలా దగ్గరకి రా, చెబుతాను."

వాసంతి తలుపుమూసి చాప పక్క దగ్గరకి వచ్చి అతని కాళ్ల దగ్గర కూర్చుంది.

"ఇలారా" అతను ఆమెని దగ్గరకి పిలిచి, ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొన్నాడు. "నా గుండెమీద చెయ్యివేసి చూడు లోపల ఎన్ని మంటలు భగభగ మండుతున్నాయో."

"నాకు తెలియదనా?"

"నేను నీ జీవితాన్ని నాశనం చేశానని నీ కనిపించడం లేదూ?"

వాసంతి అతని నోటికడ్డంగా తన చెయ్యి పెట్టింది.

మళ్లీ శ్రీనివాస్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కానీ ఈసారి అశ్రువులని అతను దాచలేదు. వాసంతి తన చీర చెరుగుతో వాటిని తుడిచింది.

శ్రీనివాస్ కళ్లు బొట బొటా నీళ్ళు కార్చాయి.

అతను తన రెండు చేతులూ ఆమె భుజంమీద వేసి, తన తల ఆమె

ఛాతీమీద అన్ని, వుద్వేగంతో అన్నాడు. "నీకు గొప్ప అన్యాయం చేశాను వాసంతీ. రాజుగారికి రాణీ అవవలసిన అందం నీది. ఈవేళ ఈ దరిద్రుడి జీర్ణవస్త్రాలకి చిరుగులు కుట్టే దుర్గతి పట్టింది నీకు."

"మీ రూపంలో నాకు విశ్వమంత ధనం దొరికింది. మీరు వూరికే బాధ పడుతున్నారు."

"కాదు వాసంతీ, నువ్వు అలా అనడం నీలోని గొప్పమనసు వల్లనే. కానీ నాలాంటి మనిషి ఆశయాల కోసం - వృత్తి వ్యాపారాలు - బ్రతుకు తెరువు వదిలిపెట్టడం పొరబాటు."

"మీకు నిజంగానే స్వాతంత్ర్య వుద్యమంలో పాల్గొన్నందుకు పశ్చాత్తాపం కలుగుతోందా?"

"నిజం చెప్పనా వాసంతీ? అలా పశ్చాత్తాపం నాకు ఎప్పుడూ కలగలేదు. ఈవేళ కూడా కలగడంలేదు. మరోలా చెప్పాలంటే నా కర్తవ్యం నేను గుర్తించి ప్రవర్తించానని నా అనుభవం వల్ల తెలిసింది. కానీ ఎందుకో లోకుల మాటలు విని మనస్సు ఏదో పాపం చేసినట్లు అనిపిస్తుంది. లోకులు మాత్రం ఏం తప్పు చేశారని? బజారులో ఏమీ దొరకదు. అందుకే అనిపిస్తుంది. ముందునుంచీ నేను స్వాతంత్ర్య ఉద్యమంలో జేరే బదులు వ్యాపారంలో దిగివుంటే ఈరోజు నా చేతుల్లో నాలుగుపైసలు వుండేవి."

"కానీ డబ్బే మీకు సర్వస్వమా?"

"కాదు. కానీ నీవంటి భార్య, రవి వంటి మంచికొడుకు, చిన్ని శీలా - మీ అందరినీ పోషించే శక్తి నాకు లేదనే బాధ."

"ఈ గడ్డు రోజులు పోతాయి. ఇప్పుడు మీకు కనీసం పింఛను వస్తోంది. ఇంతకుముందు మనం ఎన్ని కష్టాలు పడ్డాం?"

"రెండు వందల రూపాయల పెన్షన్ వెనకనున్నది నాకు జన్మనిచ్చి పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు నేర్పిన తల్లిదండ్రుల త్యాగం. వాళ్లకి నేను వొక్కణ్ణే పుత్రుడిని. వాళ్ల ఆశలని వమ్ముచేసి, వాళ్ళని వృద్ధావస్థలో వొంటరిగా వదిలేసి, స్వాతంత్ర్య ఉద్యమంలో పడినప్పుడు నా మనస్సు యిసుమంతైనా చివుక్కు మనలేదు. కానీ యిప్పుడు నీ స్థితీ, పిల్లల పరిస్థితీ నేను చూడలేకపోతున్నాను. లోకుల ముందు తలెత్తలేక పోతున్నాను."

"లోకులని మీరు మోసగించారా?"

"లేదు. కానీ వాళ్లు ఏం జరుగుతోందో చూస్తున్నారు. ఈ మందేధరలూ, కరువు పరిస్థితులూ" ఇవన్నీ స్వాతంత్ర్యం వల్లనే అని అంటున్నారు. పాపం స్వాతంత్ర్యానికి ముందు వాళ్ళకి ఈ అనుభవంలేదు.

"అందుకని స్వాతంత్ర్యం చెడ్డదా?"

"ఇది నీకు తెలుసు. కానీ జనంకి తెలియదు. ఈ స్వాతంత్ర్యం తెచ్చింది స్వాతంత్ర్య సైనికులని - అందువల్ల వాళ్ళని హేళన చేస్తున్నారు."

"మీకొక విషయం చెప్పనా? మీరు లోకాన్ని మరచిపొండి. పెళ్ళికి ముందు మీరు నా కళ్ళల్లో, నా కళ్ళతో ప్రపంచాన్ని చూసేవారు. అలాగే మళ్లీ చూడండి."

"ప్రేమానురాగాల రోజులు పోయాయి. ఇపుడు లౌకిక ప్రపంచంలో మన బ్రతుకులు డబ్బుతో ముడిపడి వున్నాయి."

"మీకిక్కడ సుఖం లేదంటే మనం 'గోవా' విడిచి వెళ్లిపోదాం. బయట ఎక్కడికైనా వెళ్లి వుందాం. అక్కడ మనని ఎవరూ గుర్తు పట్టరు."

శ్రీనివాస్‌కి ఈ ఆలోచన నచ్చింది. అతను కొంత ఆనందించాడు. తన రెండు చేతులు వాసంతి చుట్టూవేసి మెల్లిగా ఆమె కేశాలు ముద్దుపెట్టుకున్నాడు.

"నాకు ఏమనిపిస్తోందో తెలుసా? మధ్యనే వాసంతి అడిగింది. కలలో మాట్లాడినట్లు వున్న ఆ మాటలు విని శ్రీనివాస్ తన దుఃఖం పూర్తిగా మరచిపోయాడు.

"ఏమిటి?"

"ప్రపంచం అంతమయే వరకూ మనం యిలాగే వుందాం"

శ్రీనివాస్ నవ్వాడు. బయట్నించి రవి గొంతుక వినబడింది. ఆమె తృళ్ళిబడింది. అతని పట్టు విదిలించుకోవడానికి ఆమె ప్రయత్నించింది.

"అప్పుడే వచ్చేసిందా ప్రపంచం అంతం" అంటూ శ్రీనివాస్ కౌగిలింత సడలించి అడిగాడు. అలాగే వాసంతి బుగ్గమీద ఒక ముద్దు పెట్టుకున్నాడు. వాసంతి బుగ్గ సిగ్గుతో ఎఱ్ఱబడింది. శ్రీనివాస్ తన వ్యథ మరచిపోయి నవ్వాడు. ఆరోజు శ్రీనివాస్ పనికి వెళ్ళలేదు. మధ్యాహ్నం కాసేపు నిద్రపోయి లేచి వాసంతితో అన్నాడు.

"ఈవేళ సాయంత్రం మనం షికారుకి పోదాం. బయటే భోజనం చేద్దాం."

సాయంత్రం తోట దగ్గర బావిలో నీళ్ల కోసం వెళ్లినప్పుడు శ్రీనివాస్‌కి ఆలోచన

వచ్చింది. ఈ బావి, ఈ తోట, ఈ మునగచెట్టు, ఈ మారేడు చెట్టు, జీడిమామిడి వగైరా వృక్షాలూ, 'వాసంతి' కోసం ప్రత్యేకంగా నాటిన చామంతి చెట్టూ - యివన్నీ తను వదిలిపెట్టి పోవాలి. మందార పువ్వుల చెట్టు, 'రాత్‌రాణీ' వృక్ష సౌరభం, యివి బహుశా భవిష్యత్తులో దొరకక పోవచ్చు. అదే సమయంలో అతని దృష్టి బావి దగ్గరనున్న చాకలి బండమీద కెళ్ళింది. ఆ బండపక్కన - ఎప్పుడో దేవుడికే తెలియాలి - ఒక చింతపిక్క పడింది. రోజూ పడే నీళ్ల తడితో అది చిగురించి బండప్రక్కనే సూర్యకిరణాలని ఆస్వాదించి, నీరెండతో ఆడుకొంటున్నట్లు దాని చిగుళ్లు పైకిలేస్తున్నాయి. ఇన్ని కష్టాలలోనూ ఆశ విడవక బ్రతకడానికి, ఆ చింతమొక్క పెరగడానికి చేస్తున్న ఆరాట పోరాటాలు అతన్ని ఆశ్చర్యపరిచాయి. అతనికి అనిపించింది - ఆ చెట్టుని పెకిలించి వేరే మంచి చోటున పాతాలని. ఎంతసేపు అలా ఆ చిన్నారి చింతచెట్టును అతను చూస్తూ నించున్నాడో, దేవుడికే తెలుసు. వాసంతి దగ్గరకి వచ్చినప్పుడు, అతను తెలివి తెచ్చుకున్నాడు.

"మీకేమయిందండీ?" వాసంతి అడిగింది. శ్రీనివాస్ వాసంతికి ఆ మొక్కని చూపించాడు.

"ఆ మొక్క జీవించడానికి చేస్తున్న ఆరాట, పోరాటం, విశ్వ ప్రయత్నం చూస్తూ వుంటే నాకు సిగ్గు వేస్తోంది. ఆ మొక్కకి బ్రతుకు మీదున్న ఆసక్తి చూడు."

"లేవండి, కవిలాగ ఆలోచనలు పెంచుకుపోతే మీకు పిచ్చెక్కుతుంది"

"వాసంతీ, ఆ లేత మొక్కని పెకిలించి మరో ఖాళీ స్థలంలో పాతుదాం."

"వద్దు... దాని వేళ్లు విరిగితే, అది మరోచోటు వేళ్లు పాతుకుని మళ్లీ బ్రతకలేదు" వాసంతి జవాబిచ్చింది.

ఆమె జవాబు పొంతం వినకముందే అతను ఆశ్చర్య చకితుడయ్యాడు.

ఒక గొప్ప జీవిత సత్యం అతనికి గోచరించింది. అతనేం అనలేదు. వాసంతి యింట్లోకి వెళ్లింది.

ఆరోజు శ్రీనివాస్ ఉత్సాహం చూసి వాసంతికి ఆశ్చర్యం కలిగింది. ప్రేమలో పడ్డ నవయువకుడు అల్లరి చిల్లరగా ప్రవర్తించినట్లు వుంది అతని వైఖరి. హఠాత్తుగా వాసంతిని పట్టుకుని, చెట్టా పట్టాలేసుకు తిరిగాడు. ఆమె చేతుల్లో తన చేతులు కలిపి నడుస్తూ మధ్యలో కాస్త ఏకాంత ప్రదేశం దొరికితే తన చెయ్యి ఆమె భుజం మీదవేసి మెల్లిగా కౌగిలించుకున్నాడు. వాళ్లకి పెళ్ళి అయి పది సంవత్సరాలు

గడిచింది. కానీ పెళ్లయినప్పట్నించీ యిప్పటివరకూ, శ్రీనివాస్ యింత చొరవతో, నిష్కపటంగా వ్యవహరించడం వాసంతికి అనుభవం కలగలేదు. బయట హోటల్లో భోజనంచేసి, మళ్లీ యింటికి తిరిగి వచ్చేసరికి, చాలా ఆలశ్యమయింది. శ్రీనివాస్ బయటే అరుగుమీద కూర్చున్నాడు. వాసంతి యింట్లోకి వెళ్లి పిల్లల్ని నిద్రపుచ్చింది.

ఆకాశంమీద సప్తర్షి మండలంలోని నక్షత్రాలని తదేకంగా చూస్తూ, శ్రీనివాస్ ఆలోచిస్తున్నాడు. నిన్నటి తన జీవనం, రేపటి జీవనం, పైన గుడ్లగూబ ఏడుస్తోంది. కానీ దానికేక అతనికి అపశకునంగా అనిపించలేదు. రాత్‌రాణీ వృక్షం నిద్రలేచి సౌరభాలు గుప్పిస్తోంది. గగనంలో క్రొత్తక్రొత్త తారలు వెలుస్తున్నాయి. కానీ ఈ వేళ చంద్రుడులేడు. అమావాస్య కాబోలు.

"మీరు లోపలికి రారా? చీకటి పడింది" అంది వాసంతి.

"ఒద్దు, నువ్వు బయటికిరా, చూపిస్తాను."

"మళ్లీ మీలో కవిత్వం ఆవేశించిందా ఏమిటి?"

"నువ్వు ఏమన్నా అను. నా మనస్సు తేలికబడింది. స్వాతంత్ర్య సైనికులని హేళన చేసే లోకులతో నాకేం పనిలేదు. అలాగే వెంటనే శ్రీమంతుడని అవాలనే ఉబలాటం కూడాలేదు."

"గోవా విడిచి పోవాలని నిశ్చయించినప్పుడు మీకు పంజరం విడిచి ఎగిరి పోదామనుకున్న పిట్టలా అనిపించలేదూ?"

"కాదు వాసంతీ ... నేను గోవా విడిచి పోకూడదని నిశ్చయించాను."

"ఇంత త్వరగా మీ నిర్ణయం మార్చుకున్నారా?"

"అవును. ఆ నిర్ణయం యిందాకనే మార్చుకొన్నాను. ఆ చింతగింజ నుంచి లేచిన మొక్కలాగ నా వేళ్లు, చిగుళ్లు ఈ భూమి మీదే పెరుగుతాయి. వాటిని పెకిలిస్తే, మరోచోట అవి వేళ్లు పాతుకోలేవు. అందుకే ఈ సమాజంలోని ఆర్థిక రంగంలో, ఈ సమాజంలోని అన్ని క్షేత్రాలలో వ్యవహరించి ఎలాగో మార్గం సుగమం చేసుకుంటాను."

వాసంతి వింతగా, అతనిని తదేకంగా చూసింది. అతనికి ఏం చెప్పాలా అని ఆలోచిస్తోంది. కానీ శ్రీనివాస్ ఆమెని ఆలోచించేలోగా పట్టుకుని, తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు.



## 2

# విరూ తాళంచెవి పోయింది

**- ఆనా మహాంబ్రె**

బందోడ్కర్ అన్నగారు గోవా ముఖ్యమంత్రి అయ్యారు చూడు, అప్పుడు విరూ అన్నాడు, ఇదిమాత్రం మంచికి అవలేదు కదూ? విరూ (ముఖ్యమంత్రి సంగతికాదు) తన తాళాల గురించి అన్నాడు. అదే సమయంలో అతని తాళం పోయింది. విరూ దగ్గర అన్నీ కలిపి పధ్నాలుగు తాళాలు వుండేవి. వాటి వివరాలు యివి.

1 - ముందు తలుపుది

1 - బయట గదిది

3 - లోపలి గదులవి

2 - కబోర్డు (అల్మరా) సొరుగువి

2 - మేజాబల్ల సొరుగువి

1 - పెట్టిది

1 - అల్మరాది

2 - ట్రంకు పెట్టెలవి

1 - భోషాణంది.

ప్రైవాటిలో వాడి అల్మరా తాళం తరుచు పోతూవుండేది. బయట గదిది, మేజాబల్ల సొరుగువి, ట్రంకుపెట్టెలవి వారం, పక్షం రోజుల కొకసారి, కబోర్డు (అల్మరా) సొరుగు తాళాలు మూడునెలలకి రెండుసార్లు (కనీసం) పోతూ వుండేవి. ఎప్పుడూ పోనిది భోషాణంది. ఈ సారి అదే పోయింది.

నిజానికి విరూని వెర్రిబాగుల వాడంటారు. కొద్దిగా మందమతి, చాదస్తం కూడా వుంది. ఏ వస్తువైనా ఎక్కడ పెట్టాడో ఎప్పుడూ జ్ఞాపకం వుండదు.

అందులో ఈ తాళం ఎంతదని?

చిటికిన వేలంత. అదిపోతే ఎలా దొరుకుతుంది? తాళం పోయిందని తెలిశాక

విఠూ ఇల్లంతా వెతికాడు. ముందు బయట గదిలో వెతికాడు. గదిలో మేజాబల్ల, మేజా సొరుగు వెతికాడు. కుర్చీలమీద వెతికాడు. గోడమీద మేకులు, గోడమూలల్లో వున్న చిన్న షెల్ఫ్‌లు వెతికాడు. వసారా వెతికాడు. వసారాలో బల్లమీద వెతికాడు.

తరువాత లోపలి మూడుగదులూ వెతికాడు. మూలమూలల్లోని అల్మారాల సొరుగులు వెతికాడు. అల్మారాలో బట్టలు వెతికాడు. ప్యాంటు, లాగు చొక్కాల జేబులు వెతికాడు. వంటగది వెతికాడు. గిన్నెలు, తపేలాలు, ఇత్తడి సామాను, వాటీలు, కంచాలు, చెంచాలు, గరిటలూ, గంగాళాలూ అన్నీ క్షుణ్ణంగా వెతికాడు. వంటగదిలోని షెల్ఫ్‌కూడా వెతికాడు. మేడమెట్లు వెతికాడు. మెట్లలో అమర్చిన సొరుగులు వెతికాడు. పడకగది (బెడ్‌రూం) వెతికాడు. గదిలో దిండ్లు, దిండు కవర్లూ, గలేబులూ, దుప్పట్లూ అన్నీ వెతికాడు.

అన్నీ వెతికిం తరువాత పెళ్లాంకి చెప్పాడు. తాళం పోయిందని, పెళ్లానికి బాధ అనిపించింది. విఠూ వెతికిన ప్రతిచోటా తను మళ్లీ వెతికింది. విఠూ ఆ తరువాత తల్లితో చెప్పాడు. తాళం పోయిందని. ఆవిడ - విఠూ, విఠూపెళ్ళాం వెతికిన, ప్రతీచోటులోనూ మళ్లీ వెతికింది.

విఠూకి తల్లిమీద జాలేసింది. తల్లికి విఠూమీద జాలేసింది. విఠూ భార్యకి విఠూ మీద, విఠూ తల్లిమీదా ఇద్దరిమీదా జాలేసింది. విఠూకి యిద్దరు పిల్లులు. పాటూ, టీటూ. తాళంపోయిన సమయంలో పాటూ పాటలు పాడుతున్నాడు. టీటూ గెంతు లేస్తున్నాడు. విఠూ పాటూతో అన్నాడు. "ఏం దరిద్రపుజాతిరా మీది."

పాటూ అడిగాడు "ఏం జరిగింది?"

"తాళం పోయింది."

నేనేం చేయను?

"ఏడువ్."

"ఏడిస్తే దొరుకుతుందా?"

"అవును."

ఇది టీటూ విన్నాడు. ఇద్దరూ ఏడుస్తూ కూర్చున్నారు. విఠూ హఠాత్తుగా లేచాడు.

"అరే! పాట పాడుతున్నార్రా" అని ఆత్రుతగా అడిగాడు. పాటూ, టీటూ ఏడుస్తుంటే పాట పాడుతున్నారా అనిపిస్తుంది. విఠూ కోపంతో లేవడంతో వాళ్ల

పాపం నోరు మూసుకున్నారు.

తాళంపోయిన విషయం విఠూగాడి పెళ్ళాం పక్కింటావిడకి చెప్పింది. ఆవిడ మరొకరికి చెప్పింది. ఆవిడ మూడో మనిషికి చెప్పింది. ఆవిడ నాల్గవ మనిషికి, ఆవిడ ఐదవ వ్యక్తికి చెప్పింది. ఆ తరువాత ఈ కబురు 'షెవ్‌తూ' (ఒక స్త్రీ పేరు) తల్లి షెవ్‌తూ తండ్రికి చెప్పింది. షెవ్‌తూ తండ్రి, శాంతి తండ్రికి, శాంతి తండ్రి, తల్లికి చెప్పాడు. పాటూ, తీటూ ఈ కబురు తబ్లూ, గిబ్లూలకి (తమ ప్రియమిత్రులు) చెప్పారు. ఆ తరువాత వీళ్ళు, వాళ్ళకి, వాళ్ళు వీళ్ళకి, వాళ్ళు మరొకరికీ, మరొకరు మరొకరికి చెప్పారు. క్రమేణా ఈ కబురు అందరికీ తెలిసింది.

ఆ తరువాత శీను, కాటూ, దుల్గో, కృష్ణె, తర్విణ్, భాగీ, అంథోని, కుస్టా, కాయ్‌తాన్‌మారీ, దామ్‌యాన్, ఫిల్పూ, రమాకాంత్, దుర్గె, షెవంతూ, ఆబోలె, సౌజ్, ఫెర్నాండ్, నాయక్, కురాడో, మష్ణే, ఫొండో, వీళ్ళందరూ విఠూని విచారించడానికి వచ్చారు. వీళ్ళుగాక తిర్విణ్, భాగీ, మారీ, అబోలే విఠూగాడి పెళ్ళాన్ని పరామర్శించడానికి వచ్చారు. ఆమెకి ఈ మధ్యనే నెల తప్పింది, గర్భవతి. ఎవరు తాళం విషయం కూపీ తీయడానికి వచ్చారో వాళ్ళు తాళం ఎలాపోయిందిరా అని విఠూని అడిగారు. అప్పుడు విఠూ అది ఈ విధంగా పోయిందని వాళ్ళకి చిలవలు పలవలుగా కథలల్లి చెప్పేడు. అందరికీ చెప్పేవాడు. "నిన్న నేను ప్రొద్దున్న లేచాను సరే, టీ తాగాను సరే, భోజనం చేశాను సరే, స్నాన పానాలు పూర్తిచేశాను సరే, బయటికి వెళ్లాను సరే, ఇంటికి తిరిగివచ్చాను సరే, భోంచేసి నిద్రపోయాను సరే, ఈవేళ పగలు నిద్రలేచాను సరే, టీ తాగాను సరే, స్నానం చేసాను సరే, రేడియోలో యిండోద్కర్ ముఖ్యమంత్రి అయినట్లు విన్నాను సరేనా... అప్పుడు అకస్మాత్తుగా చూసినప్పుడు...

విఠూగాడి బావ తన పెళ్ళాంతో అంటే విఠూ చెల్లెలితో విఠూ యింటికి వచ్చాడు చూడు, అప్పుడు విఠూ పెళ్ళాం ఏడుస్తోంది. కడుపులో మండుతుందని. బావగారు అతని పెళ్ళాం వివరాలు అడుగుతున్నారు. విఠూగాడి పెళ్ళాం ఏడుస్తూనే వుంది. విఠూ తల్లి చెబుతోంది "నేను విఠూకి చెప్పాను. దాని ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమని. కానీ ఈ పాపిష్టివాడు నా మాట వినలేదు. ఊరికే పనికిరాని హడావిడి చేయడం వీడికి అలవాటు.

"ఆమెకి ఇంత త్వరగా పిల్లలు కలగటం యిష్టంలేదా ఏమిటి? "బావగారు

అనుమానం వ్యక్తం చేశారు.

"కానీ ఈవిడకి యిలా బాధ కలగడం ఎప్పట్నుంచి ప్రారంభమయింది?" విఠూగాడి చెల్లెలు తల్లిని అడిగింది.

అయ్యో! ఏమని చెప్పను నీకు. నిన్న ప్రొద్దున్న యిద్దరం లేచాం సరేనా, అన్నం తిన్నాం సరేనా, స్నానాదులు పూర్తి చేశాం సరేనా, పడుకొన్నాం సరేనా, ఈవేళ పగలు లేచాం సరేనా, రేడియో వేశాం సరేనా, బందోడ్కర్ ముఖ్యమంత్రి అయ్యాడనే వార్త విన్నాం సరె, అప్పుడే విఠూ బయటకి వచ్చి నాతో అన్నాడు "అమ్మా ఘోరం జరిగింది." "నా గుండెల్లో రాయి పడింది. నేను ఆశ్చర్యంతో బిత్తరపోయాను. దీనికి యిప్పుడిప్పుడే నెల తప్పింది కదూ? అరే పాపాత్ముడా ఏం జరిగిందిరా? విఠూ చెప్పాడు తాళం పోయిందని. సరిగ్గా అప్పుడే దీని ఈ (రోద)...

బావగారూ, భార్య ఈ విషయం అలాగే వదిలేసి తిరిగి వెళ్ళిపోయాడు. రోజంతా జనం వస్తున్నారు. మొగాళ్ళు వచ్చినప్పుడు అదే విషయం, అదే పద్ధతిలో విఠూ వాళ్ళకి చెప్పాడు. ఆడవాళ్లు వచ్చినప్పుడు అదే విషయం, అలాగే అతని తల్లి చెప్పింది. వచ్చిన వాళ్లందరికీ విఠూ భార్య తన కడుపునొప్పి గురించి చెప్పి ఏడుస్తూ కూర్చునేది. మూడురోజులు గడిచాయి. విఠూ దేవుడి గుడికి వెళ్లాడు. అక్కడ కీర్తన జరుగుతోంది. హరిదాసు వచ్చీరాని మరాఠీ భాషలో చెప్తున్నాడు. ఏం చెప్పను దేవుడా! ఈ ప్రపంచమంతా పెద్ద పద్మవ్యూహం - క్లిష్ట సమస్య. ఏరోజు ఎవరికి ఏం జరుగుతుందో చెప్పలేం. ఈరోజు ఎవరిదో తాళం పోతుంది. రేపు వాడి పెళ్ళాం పోతుంది. ఎల్లుండి వాడి పిల్ల పోతుంది. ఆ తరువాత వాడే పోతాడు... అందుకనే భక్తతుకారాం అన్నాడు "నే నేకెక్కడికి వెడితే అక్కడకి నువ్వు నీడలా వస్తావు." విఠూకి బెంగ పట్టుకుంది. ఈవేళ కేవలం తాళం పోయింది. రేపు నేనే పోతే? ఎల్లుండి నాభార్య పోతే? విఠూలేచి దేవుడికి నమస్కారం చేశాడు. పూజారి తన సమస్య, మొక్కుబడి ఏమిటని అడిగాడు. నైవేద్యంకి కొబ్బరికాయ ధర హెచ్చింది గనక చక్కెర ఇవ్వనా?

విఠూ చక్కెర చాలన్నాడు.

ఆ తరువాత పూజారి దేవుణ్ణి వుద్దేసించి "భగవంతుడా! ఈవేళ ఈ విఠూ ప్రత్యేకంగా నీ దర్శనానికి నీ శరణుకోరుతూ వచ్చాడు. వాడికి ఆ పోయిన తాళం త్వరగా దొరికేలా చూడు. ఆ తరువాత అతను నీకు పంచదారతో తులాభారం

చేస్తాడు." విరూ మనఃపూర్వకంగా మొక్కుబడి యిస్తానని ప్రార్థించాడు. పూజారి విరూకి చెప్పాడు. దేవుడు నీ పని చేస్తాడు. దేవుడు చేయకపోతే ఆ పని నా సోదరుడు చేస్తాడు.

పూజారి తమ్ముడు జ్యోతిష్కుడు. విరూ అతడితో చెప్పాడు. అన్నీ విన్నాక అతడు 'విరూ'ని అడిగాడు.

నక్షత్రం ఏమిటో తెచ్చావా?

"ఎవరిది?"

"తాళం చెవిది."

"లేదు. దాని నక్షత్రం నేను చేయించలేదు."

"ఐతే అది ఎక్కడికి చేరిందో ఎలా చెప్పను?"

విరూ నోరెత్తలేదు.

"తాళం ఎప్పుడు చేశావు?"

"ఐదేళ్లు గడిచాయి."

"నెల?"

"మార్గశిర మాసంలో."

"తిథి?"

"ఏకాదశి."

"రోజు?"

"సోమవారం."

"సమయం?"

"తాళాలు చేసేవాడు ఆ తాళం నాకు పగలు పది గంటలకి యిచ్చాడు."

తాళం సమగ్ర ఆకారం, రంగు రూపాలూ వగైరా వివరాలు విరూ దగ్గర సవిస్తరంగా అతను అడిగాడు. ఆ తరువాత ఆ తాళంచెవి నక్షత్రం ప్రకారం లెక్కలు వేశాడు. కళ్లు చిన్నవి చేసి, తదేక దృష్టితో సూక్ష్మంగా ఆలోచించాడు. వేళ్లతో ఏదో లెక్కలు వేశాడు. ఆ తరువాత అంతరాళంలోకి దృష్టి కేంద్రీకరించాడు. (ఆకాశంలో నక్షత్రాలు చూస్తున్నట్టు).

అప్పుడన్నాడు.

"నీ తాళం చెవి దక్షిణ దిక్కుగా పోతోంది."

కానీ దానికి కాళ్లులేవు. అది ఎలా నడుస్తుంది? విఠూ ఆత్రుతగా అతన్ని అడిగాడు.

"చొప్పదంటు ప్రశ్నలు అడగవద్దు."

"అడగనులె. కానీ నాకొక సంగతి చెప్పు."

నా ఈ తాళం చెవి దొడ్డిదారిలోని తోటలో వుందా? ఊరి ఏటి వొడ్డున వుందా? కణ్‌కోణా (గోవాలో వూరు) లోని మూడుదార్ల కూడలి దగ్గర వుందా? లేక కన్యాకుమారిలో వివేకానందుడి స్మారక స్థలంలో వుందా?

"నాకు నీ ప్రశ్నలకి అర్థం తెలియడంలేదు."

నువ్వు నా తాళం చెవి దక్షిణ దిక్కులో పోతోందన్నావు. ఆ దక్షిణం ఎక్కడిది? ఇంటిదా? ఊరుదా? గోవాదా? లేక భారతదేశందా?

"ఈ వివరాలన్నీ నేను నీకు చెబితే నా జ్యోతిష్యంలో మిగిలేదేముంది?

అప్పుడే గుడిలోంచి పూజారి అక్కడికి వచ్చాడు. అతను విఠూతో అన్నాడు: "మా తమ్ముడు పదిరూపాయలకి ఇంతకంటే ఎక్కువ జ్యోతిష్యం చెప్పడు."

విఠూ తిట్టుకుంటూ అతనికి పదిరూపాయలిచ్చి యింటికి తిరిగి వచ్చేశాడు. భోజనానికి కూర్చుండగా, బయట తలుపు చప్పుడయింది. ఒక పోలీసువాడు లోపలికి ప్రవేశించాడు.

"నీతాళం చెవి పోయిందటగా."

విఠూని అతనడిగాడు.

"అవును. నీకెవరు చెప్పారు?"

"నీ పక్కింటి వాళ్లు."

"అందుకని నవ్వు యిక్కడికి వచ్చావా?"

"ఈ పని మేం చేయకపోతే, మరెవ్వరు చేస్తారూ? పోలీసంటే లోకులసేవ చేసేవాళ్ళు. మీరు మాకు పనిచెప్తారు. మేము దానిని చేస్తాము."

విఠూ రెండు నిమిషాలు ఆ పోలీసుని చూస్తూ నిలబడ్డాడు. అలనాటి రామరాజ్యంలోని భటుడు పోలీసు రూపంలో పొరబాటున యిక్కడకి వచ్చాడా ఏమిటి? ఇలా అతనికి సందేహం కలిగింది.

"సరే ఆ తాళం యిప్పుడు నాకెలా లభిస్తుంది?" విఠూ అడిగాడు.

"కంప్లెయింట్ వ్రాసియియ్యి."

"ఏమని?"

"తాళం ఎవరో దొంగలించారని. నీకెవ్వరిమీదనైనా అనుమానం వుంటే వాళ్ళ పేరు వ్రాయి."

"కానీ నా తాళం పోయింది. దానిని ఎవరో దొంగిలించారని నాకు అనిపించడంలేదు."

"ఆ తాళం ఎక్కడోపోతే దానిని వెతకడం మా పనికాదు. అది ఎవరైనా దొంగిలిస్తే ఆ దొంగని పట్టుకోవడం మా విధి."

"సరే, ఫిర్యాదు వ్రాసియిస్తే అది దొరుకుతుందా?"

"ప్రయత్నించడం మా కర్తవ్యం. దొరుకుతుందో, లేదో మేమెలా చెప్పగలం? రేపు యిక్కడ ఎవరైనా వచ్చి మంత్రిగారిని ఎత్తుకుపోయినా, ఆయన మాకు తప్పక దొరుకుతాడని చెప్పలేం."

ఆ పోలీసువాడు నిక్కచ్చిగా చెప్పాడు. ఐతే వకీలులా మాట్లాడుతున్నాడు.

'విరూ' అతను చెప్పిన ప్రకారం ఫిర్యాదు వ్రాసియిచ్చాడు. మళ్లీ అతన్ని అడిగాడు.

"నీకెవరు చెప్పారూ? నాతాళం పోయిందని? ఏ పొరుగింటివాడు?"

"ఆ విషయం అంత ముఖ్యంకాదు, పోయిన తాళం వెతకడం ముఖ్యమైన విషయం."

యిలా అంటూ, వాడు బయటకి వెళ్లిపోయాడు.

ఇదంతా జరిగిం తరువాత 'విరూ' విసిగెత్తిపోయాడు.

వెళ్ళి పక్కమీద విశ్రాంతి తీసుకున్నాడు.

ప్రపంచమంతా నరకం కానీ, నాకేం పట్టిందని గాఢ నిద్రలో మునిగి పోయాడు.

ప్రొద్దున్న లేచి బయట వసారాలోకి వచ్చి ఆలోచిస్తూ కూర్చున్నాడు. అప్పుడు అతనికి రోడ్డుమీద ఎవరో కనిపించారు. అతను శుక్ర నక్షత్రంలాగ కనబడ్డాడు. బ్రహ్మదేవుడిలా మాట్లాడుతున్నాడు.

విరూ అతన్ని చూసిన వెంటనే అడిగాడు "నీ తాళం చెవి పోయింది కదూ?"

"అవును."

"అది దొరుకుతుంది."

"ఎలా దొరుకుతుంది."

"ఏదైనా పోయిన వస్తువు సరిగ్గా వెతికితే దొరుకుతుంది."

"ఎలా."

"తాళం పోవడం అన్నది ఒక క్రియ అంటే ఒక సంఘటన. ఏదైనా సంఘటనకి, అది జరగడానికి ముందు ఒక కారణం వుంటుంది." ఆ కారణం లేకుండా ఆ సంఘటన జరగదు." ఒక సంఘటనకి ఒకే కారణం వుంటుందని చెప్పలేం. ఎన్నో కారణాలు వుండవచ్చు."

"అంటే అర్థం?"

"ఈ కారణాలు వెదకాలి."

"ఆ తరువాత తాళం దొరుకుతుందా?"

"తాళం ఎలా పోయిందో తెలుస్తుంది."

"తెలిసి వుపయోగం ఏమిటి?"

"తెలియడంతో అది వెతకడం సులభమవుతుంది."

"కానీ ఈ రెట్టింపు పని ఎందుకు? కారణాలు వెతికే బదులు నేను తాళాన్నే వెతుకుతాను."

"దొరకదు."

"ఎందుకు దొరకదు?"

"దొరికితే నువ్వు నన్ను యిబ్బందిలో పెడ్తావు."

"ఎలా?"

"కారణాలు వెతక్కుండానే నీకు తాళం లభ్యమైతే, అదెలా జరిగిందా అని నేను కారణాలు వెతకాల్సి వస్తుంది."

"సరే. కారణాలు ఎలా వెదకాలో మీరే నాకు కాస్త చెప్పి చూడండి బాబూ."

"తాళం పోయింది అంటే ఏమయింది అన్నమాట ముందు నాకు చెప్పు చూద్దాం."

"నాకు తెలియదు. మీరే చెప్పండి."

"తాళం పోయిందీ అంటే వున్న తాళం అదృశ్యం అయిపోయింది. అది దొరక్కపోవడానికి ఎన్నైనా కారణాలు వుండవచ్చు. ఉదాహరణకి :

1. నువ్వు తాళం ఎక్కడ పెట్టావో నీకు జ్ఞాపకం లేదు గనక అది నీకు

దొరకడంలేదు.

2. నువ్వు తాళం ఎక్కడ పెట్టానని అనుకొంటున్నావో అక్కడ నిజానికి పెట్టలేదు. అందుకని అది నీకు దొరకలేదు.

3. నువ్వు తాళం పెట్టినచోటు నీకు జ్ఞాపకం వుంది. కాని అది అక్కడలేదు అందువల్ల దొరకలేదు.

4. నువ్వు తాళం ఎక్కడ పెట్టావో, అక్కడే వుంది. అయితే ఆ చోటు నీకు జ్ఞాపకం రావడంలేదు అందువల్ల అది దొరకడంలేదు.

5. నువ్వు తాళం వుంచిన చోటునుంచి దానిని ఎవరో తీశారు. తీసి మళ్లీ అక్కడ వుంచలేదు. అందుకని నీకు దొరకడంలేదు.

6. నువ్వు తాళం పెట్టిన చోటునుంచి ఎవరో దానిని తీసి మళ్లీ మరోచోట పెట్టి, ఆ పెట్టిన స్థలం మఱచిపోయారు. అందువలన నీకు దొరకడంలేదు.

విఠూకి అనిపించింది. మంత్రిగారు తన ప్రసంగంలో ప్రతీ విషయాన్ని ఎలా తిమ్మిని బెమ్మిని చేసి విశ్లేషించి జనపనారలా అల్లుతాడో అలా వీడెవడో జ్ఞాని...

విఠూ అతనితో (నిష్టూరంగా) అన్నాడు. మిగిలిన కారణాలు నేను వెతికితీస్తాను. మీరిక్కడ మరికొంతసేపుంటే నాకు తలనొప్పి వస్తుంది. ఆ తరువాత ఆ తలనొప్పి ఎందుకొచ్చిందా అని కారణాలు వెతకాల్సి వస్తుంది.

అతను వెళ్లిపోయిన తరువాత విఠూ స్నానం చేశాడు. ఆ తరువాత పది, పదిన్నర ప్రాంతాలకి గోవా సచివాలయంకి వెళ్ళాడు. ముఖ్యమంత్రి పి.ఎ.ని కలిసి విషయం పూర్తిగా చెప్పి, తను ముఖ్యమంత్రిని కలవాలని కోరాడు. పి.ఎ. చెప్తాడు. మరో నెలన్నర వరకూ ముఖ్యమంత్రిగారిని కలిసే అవకాశంలేదని. అన్ని ఎపాయింట్‌మెంట్లు ఆయన ముఖ్యమంత్రి అయ్యారని తెలియగానే పూర్తయ్యాయి.

"ఇప్పుడు నేనేం చేయను?" విఠూ అతనిని అడిగాడు

"అన్నగారింటికి వెళ్లు" అతనన్నాడు.

మర్నాడు ప్రొద్దున్న విఠూ బండోడ్కర్ అన్నగారింటికి వెళ్లాడు. అక్కడ ఎంతోమంది జనం వున్నారు. అయినా విఠూని అంతమందిలోనూ గుర్తుపట్టి అన్నగారు అందరికంటే ముందు యింట్లోకి పిలిచి ఏం పనిమీద వచ్చాడో విచారించారు. విఠూ ఆయనకి పోయిన తాళంచెవి గురించి చెప్పాడు. తాళం పోయినట్లు పోలీసులకి ఫిర్యాదుచేసినట్లు, వాళ్లు ఈ విషయం లక్ష్యపెట్టనట్లూ

కూడా చెప్పాడు.

"అంటే నీ పోయిన తాళంచెవి వెతకమని పోలీసులకి నేను చెప్పనా? వాళ్ళకి వేరే మరేం పనిలేదూ?" బందోడ్కర్ అన్నగారు మండిపడ్డారు.

"అలాకాదు... నా ఆ ... తాళం... చాలా..." విఠూ భయంతో తడబడుతూ ఏదో అంటున్నాడు.

"సరేగానీ దాని వెల ఎంతుంటుంది?"

"నాకు తెలియదు."

అన్నగారు లేచి లోపలికి వెళ్ళారు. (ఆయనకి కోపం రాలేదు కదా!) కొంతసేపటికి ఆయన బయటకొచ్చి "ఇదిగో తీసుకో డబ్బు" అంటూ విఠూ చేతిలో కరెన్సీ నోట్లదొంతర్లు వుంచి "కొత్త తాళం చెవి చేయించుకో"

అంటూ సాగనంపాడు.

'విఠూ' యింటికి వచ్చి అన్నగారిచ్చిన నోట్లు లెక్కపెడుతూ కూర్చున్నాడు.

చూస్తే, అన్నగారిచ్చిన ఆ డబ్బు ఎంత వుందంటే దానితో బంగారపు తాళంచెవి కూడా చేయించుకోగలడు.



## 3

# ప్రేమనగరంలో అతిథి

**- అచ్యుత్ తోటేకార్**

ఈవేళ ప్రొద్దున్నించీ ప్రేమనగర్‌లో పెద్దపెద్ద లౌడ్‌స్పీకర్లు మ్రోగుతున్నాయి. ప్రేమ్‌నగర్‌లో ఏదో విశేషం వుందని చెప్పడానికి అది సంకేతం. రోడ్డుమీద వెళ్తున్న జనం ఒకర్నొకరు కనుసంజ్ఞలతో విచారిస్తున్నారు, ఏమిటీ ఈ హడావిడి? కొంతసేపట్లో వూరంతా ఈ వార్త పాకింది. ఈరోజు ప్రేమ్‌నగర్‌లో వేశ్యల వార్షిక సత్యనారాయణపూజ.

ఈ సత్యనారాయణపూజ ఎంతకాదన్నా అందరినీ - నవయువకుల నుండి వయోవృద్ధుల వరకూ అందర్నీ ఆకర్షిస్తుంది. దైవదర్శనంతో బాటు కొత్తకొత్త వేశ్యల ముఖారవిందాలు చూడడానికి అవకాశం వస్తుంది కదూ? అందుకని తరచూ వచ్చేవాళ్లేగాక, ఎప్పుడూ అటువైపు అడుగు వేయని వాళ్లు కూడా ఆరోజు సాయంత్రం ప్రేమ్‌నగర్‌కి ఆ ఉత్సవ దర్శనం నిమిత్తం వస్తారు. తమ పవిత్ర కర్తవ్యం నిర్వహిస్తారు.

ఆ ఊరుకి ఒక మూలగా వేశ్యల గృహాలు ఒక పాతిక-ముప్పై వున్నాయి. ఆ ప్రాంతాన్నే ప్రేమ్‌నగర్ అంటారు. పది సంవత్సరాలకి పూర్వం ఈ ప్రాంతంలో చచ్చిన ఆవుల, గేదెల మృతదేహాలు తెచ్చి పడేసేవారు. రోజంతా యిక్కడ ఆ కుళ్లు మాంసం వాసన, కుక్కలు, కాకులూ, గ్రద్దలూ మినహా మరెవ్వరి దర్శనం వుండేదికాదు. అటువంటి ఆ చండాలపు భూమి భాగ్యం పండి ఈనాడు ప్రేమ్‌నగర్ అనే శృంగార నామం రూఢి అయింది.

ఈ వేళ ఈ స్థలంలో వున్న వేశ్యలు యింతకుముందు వూరిలో ఎవరైనా ఆశ్రయం యిస్తే వాళ్ళలో వుండేవారు. యువకులకు యిది గిట్టలేదు. వాళ్లు వేశ్యలకి విరుద్ధంగా గొడవ చేశారు. ఊరు వదలమని బలవంతం చేశారు. వేశ్యలందరూ ఒక్కటయ్యారు. ఊరు బయట స్మశానభూమి దగ్గరకి వచ్చారు.

ఇంటి సామాన్లన్నీ తెచ్చుకొని సత్యనారాయణమూర్తిని స్మరిస్తూ గుడిసెలు వేసుకున్నారు. సంసారాలు పెట్టి కొత్త జీవితం ఆరంభించారు.

అనతికాలంలోనే గుడిసెలు ఇళ్ళుగా మారాయి. ఇళ్లముందు రోడ్లు వెలిశాయి. రస్తాలొచ్చాక లైట్లు వచ్చాయి. ఆ తరువాత నీళ్లపంపులు, ఒక చిన్నవాడ వెలిసింది. వేశ్యలు దేహం అద్దెకిచ్చేవాళ్లు లేదా ప్రేమని విక్రయించేవాళ్ళు. అందుకని ఎవరో వేళాకోళంగా ఆ వాడకి ప్రేమ్‌నగర్ అనే పేరు పెట్టారు.

ప్రేమ్‌నగర్‌లోని వేశ్యలందరూ కలిసి ఈ పూజని చేస్తారు. దానివెనక కారణం కూడా ఇదే. పూర్తిగా నిరాధార స్థితిలో వున్నప్పుడు శ్రీ సత్యనారాయణమూర్తి వాళ్లకి సహాయం చేసినందువలన ఆయన కృపతో మంచిరోజులు వచ్చాయి. ముందు ముందుకూడా ఆయన యిలా వాళ్ళని కాపాడాలని ఈ పూజలు. ఈరోజు వేశ్యలకి దైవ ధర్మవిధులు చేసే పరమ పవిత్రదినం. ఏ మొగాణ్ణీ ముట్టుకోడం కూడా జరగదు. ఎవరినీ దగ్గరకి చేరనివ్వరు. ఎవరికీ కన్ను కొట్టరు. నోట్లో తిట్లూ, బూతులూరావు. పూర్వకాలపు స్త్రీలలాగ తొమ్మిదిగజాల చీరలు ధరించి, కుంకుమతో అడ్డంగా రేఖలు వేసుకుని పూజకోసం వేసిన పందిరిలో తిరుగుతున్నారు. పూజ అందరికోసం కనక, ప్రజలందరూ యిమిడేలా పందిరివేస్తారు. అందరికీ తప్పక, నిరాఘాటంగా దర్శనం లభించాలని ఉద్దేశ్యం. పూజకి అన్ని హంగులు, రంగులలైట్లు, టపాకాయలు, చిచ్చుబుడ్లు, భజనలు, హారతి యివ్వడాలు... అడక్కండి... ఎంతోమంది ధనవంతులు ఈ పూజకి పరోక్షంగా సహాయం చేసి వుంటారు కదూ? ఈ పూజ నిర్వహణ చూసేది 'చంద్రమ్మత్త'. చంద్రమ్మత్త అంటే ఈ వాడలో వేశ్యలందరికీ నాయకురాలు. ఆమె అధికారంలో, అధీనంలో ఆమె మాటే, వాళ్ళందరిమాట. మొట్టమొదటి నుంచీ, ఈరోజు వరకూ ఈ పూజ నిర్వహించే గౌరవం 'విఠూ'భట్‌ది (భట్ అంటే పూజారి) వేశ్యలందరూ అతన్ని 'గురూజీ' అని వ్యవహరిస్తారు. వాళ్ల దైవ, ధర్మాధి కార్యాలు 'గురూజీ'యే చేస్తాడు. అతనికీ మంచి ఆదాయం. అందువల్ల 'గురూజీ' వలన ఎక్కడైనా తత్తరపాటు జరగవచ్చుకాని 'ప్రేమ్‌నగర్'లో మాత్రం 'యథావాచ-తథాకృతి' (మాటకీ చేతకీ పొంతన కుదిరేలా) అన్నట్టు వుండేవాడు.

లోకులు పైపైన అతన్ని హేళన చేసినా, మనస్సులో అతనిని అర్థం చేసుకొనేవారు. గురూజీ వంటి సాదాసీదా మనిషి, అంతర్ముఖుడు ఈ ప్రపంచంలో

మరొకడు వుండడు. నిజం చెప్పాలంటే గత పది సంవత్సరాలుగా ఈ వేశ్యలతో గురూజీగా తప్ప మరేవిధమైన (లైంగిక) సంబంధం లేదు. అందువల్ల దేవుడి తరువాత గురూజీనే వేశ్యలు గౌరవించేవారు. గురూజీ పీఠంమీద కూర్చుని పూజ చేస్తారు. వేశ్యలు పక్కల కూర్చుని చూస్తూ వుంటారు. అలా పుణ్యంలో భాగం పొందుతారు. పూజ పూర్తి అయ్యేవరకు ఎవరికీ పందిరిలోకి రావడానికి వీలుండదు.

ఈవేళ పగలు సూర్యోదయం అవగానే గురూజీ పందిరిలో హాజరయ్యాడు. పూజాసామాగ్రి సర్దడం మొదలయింది. చంద్రమ్మత్త కూర్చున్న చోటే వుండి ఒక్కొక్కరికీ సామాన్లు తెచ్చే పని పురమాయిస్తోంది.

"చంద్రమ్మత్తా! గంధం ఎక్కడుందో?" గురూజీ అన్నాడు.

"అరే సుమన్, నువ్వు గంధం తేలేదా?" చంద్రమ్మత్త అడిగింది.

"అయ్యో మఱచిపోయాను. ఇప్పుడే తెస్తానుండు... సుమన్."

"ఇలాగే నువ్వు అన్ని విషయాల్లో నిర్లక్ష్యం చేస్తావు" చంద్రమ్మత్త సుపారీని ముక్కలు చేస్తూ అంది.

"మరి కలశంలో వెయ్యాల్సిన రూపాయిపావలా?"

"ఇదిగో తీసుకొండి గురూజీ" చంద్రమ్మత్త వేళ్లతో రూపాయపావలా గురూజీకి యిచ్చింది.

"ఇదిగో ఈ ఐదుంపావలా తాంబూలంలో పెట్టడానికి."

చంద్రమ్మత్త తమలపాకుల మీద సున్నం రాయడం మొదలుపెట్టింది.

"సరేగాని, ప్రసాదం చేయడం సంగతి."

"గురూజీ మీరు పట్టించుకోకండి, ఆ పని మిలన్‌కి అప్పజెప్పాను. ఇంకా టైముంది కదూ?"

చంద్రమ్మత్త తమలపాకులు నోట్లో గుప్పుకొని, సగం మిగిలిన పళ్లతో నమలడం మొదలెట్టింది.

"హారతి సిద్ధం చేశారా?"

చంద్రమ్మత్త తమలపాకులు నమలడంలో నిమగ్నురాలయి ఏం మాట్లాడలేదు. ఆమె బదులు షైలా హారతి పళ్ళెంతో ముందుకి వచ్చింది.

"అరె షైలా! హారతి యిలాగేనా పెట్టడం? వొత్తులు మరీ మొద్దుగా చేశావు, కాస్త వాటిని మరింత వొత్తి సన్నంగా నాజూగ్గా చెయ్యమ్మా." గురూజీ మాటలు

విని షైలా నిర్ఘాంతపోయింది. ఆమె సిగ్గుతో హారతి పళ్లెం తీసుకుని పక్కకి పోయింది.

తన మాటలు బెడిసి కొట్టాయా అని అనుకొని గురూజీ చంద్రమ్మత్త వైపు చేశాడు. చంద్రమ్మత్త నోట్లో నమిలిన కిళ్లీ "తూ" అని పందిర బయట వుమ్మివేసి, గురూజీ మాటలకి తన వ్యతిరేక ఆవిధంగా తెలిపింది.

"గురూజీ ఈ దండ, ఈ తులసిఆకులూ తీసుకోండి" ఎవరో తెలియని ఒక నవయువకుడు అన్నాడు.

"ఒసే రూపా, నువ్వు ఎంత తొందరగా అల్లావమ్మా దండని." ఎవరో అన్నారు.

"రూపా అంటే రూపాయే. దానికి సాటి మరిఎవ్వరూ లేరు."

మరెవరో అన్నారు.

రూపా సిగ్గుతో వంకర్లుపోతూ చంద్రమ్మత్త ప్రక్కనే వచ్చి కూచుంది. రూపా ఇలా సిగ్గు పడడం గురూజీకి బాగా నచ్చింది. రూపావంటి సౌందర్య రాశిని గురూజీ ప్రేమనగర్‌లో ఎప్పుడూ చూడలేదు.

"సరే ఇక ప్రారంభిస్తా."

గురూజీ చంద్రమ్మత్త అనుమతి తీసుకుని పూజకి వుపక్రమించాడు.

"కేశవాయనమః"

"అందరూ నిశ్శబ్దంగా వుండండర్రా."

చంద్రమ్మత్త గట్టిగా అరిచింది. అరుపుతోబాటు నోట్లో కిళ్లీలో నుంచి ఊరిన లాలాజలం పెదవుల పక్కనించి కిందకి జారింది. దానిని వెంటనే తన కొంగుతో తుడిచింది. వేశ్యలందరూ చేతులు జోడించి దేవుడి పటం ముందు కూర్చున్నారు. ప్రశాంత వాతావరణంలో గురూజీ పూజ పూర్తిచేశాడు.

"ఇప్పుడు మీరందరూ ప్రతీ ఏడాదిలాగే దేవుడికి గంధం, పూలు సమర్పించడానికి రండి" గురూజీ సూచన చేశాడు.

"వెళ్లండర్రా అందరూ. ఒంటిమీద నీళ్లు చల్లుకుని తడిసిన శరీరంతో దేవుడికి గంధం, పూలు అర్పించడానికి రండి."

చంద్రమ్మత్త ఆర్డరు యిచ్చి, తనుకూడా పందిరివదిలి బయటికి వచ్చింది. దేవుడికి గంధం, పూలు యివ్వాలంటే పూర్తిగా మడికట్టు కోవాలి. అందుకే తడిసిన శరీరంతో, బట్టలతో రావడం నిజమైన మడి అని వేశ్యలందరి భావన.

అందరూ పందిర వెనక బయటకి వెళ్లారు. అక్కడ పెద్ద చన్నీళ్ల పాత్ర

నిండివుంది. అందరూ వాళ్లవాళ్ల పాతబట్టలు మార్చుకుని, కొత్త చీరలు కట్టుకుని, నెత్తిమీద నీళ్లు పోసుకున్నారు. తరువాత అలాగే తడితడి శరీరాలతో ఒక్కొక్కరూ పూజా మందిరంలోకి రాసాగారు.

మొదటి గౌరవం చంద్రమ్మత్తది. ఆమె అందరికంటే ముందు పందిరిలో అడుగుపెట్టింది. పందిరిలో గురూజీ తప్ప మరెవ్వరూ పురుషులు లేరు. దానికి కారణం వీళ్లందరూ గంధం, పూలు సమర్పించేవరకూ బయటవాళ్ళని పందిరిలోకి రానివ్వరు.

గురూజీ గంధం, పూలు ముందుకు చాపాడు. చంద్రమ్మత్త వాటిని అందుకుని దేవుడికి సమర్పించింది. తరువాత ఒంగొని సాష్టాంగ నమస్కారం చేసింది.

మనస్సులో ఆ తలంపు లేకపోయినా గురూజీ దృష్టి ఆమె శరీరంమీద పడింది. ఒకానొకప్పుడు తన సౌందర్యంతో యితరులని వివశులు చేసి ఆకర్షించిన చంద్రమ్మత్త శరీరపు చర్మం మడతలు పడింది. కొన్నిచోట్ల చర్మం వదులుగా వేళ్లాడుతోంది. మొహంమీద ముసలి తనపు చారలు వచ్చాయి. నోట్లోంచి నాలిక లోపలికి బయటకీ కదులుతోంది. శరీరంమీద ఇక్కడా, అక్కడా నలుపు, నీలపు చారలు పొంగుతున్నాయి. ఆమెని చూస్తేనే గురూజీ శరీరంమీద తేళ్లు, జెర్రులు ప్రాకినట్లయింది. చూడలేక తలవొంచుకున్నాడు.

చంద్రమ్మత్త తరువాత వొక్కొక్కరే క్రమంగా పందిర క్రిందకి వచ్చి గంధం,పూలు, అక్షింతలూ సమర్పించారు. చంపి, గంగి, యేసు, లక్ష్మే, మంజుళ... అందరూ తడిబట్టలతో, వొంటిమీది సౌందర్య వస్తువులు కడిగి వెళ్లారు.

ఈ వేశ్యలే సాయంసంధ్యలో ఇంటి గుమ్మం ముందో, కిటికీల వెనకో కూర్చుని చూపుల బాణాలతో విటులని గాయపరుస్తారు. ఇప్పుడు వాళ్ళ శరీరాలని చూడాలనిపించదు. సౌందర్యపు ఆటంబాబు పేలిపోయింది. అంతా ఏహ్యాభావం - చీదరింపు కలిగించేది. పెదవులమీద రంగు, మొహంమీద పౌడరు, తుడుచుకు పోయాయి. కళ్ళులోతుకి పోయాయి. వక్షోజాలు పొంగుతగ్గి చదరంగా మారాయి. పొట్టలోని పేగులు లెక్కపెట్టవచ్చు, నెత్తిమీది సవరంతీసి ఎవరో బయట వేలాడదీశారు. రాత్రి చీకట్లో మెరుస్తూ వుండే స్త్రీ వైభవం గిల్టు పోయిన నగలలాగ బయటపడింది. శరీరంలో ఏ భాగంలోనూ ఆకర్షణలేదు. గురూజీ కళ్ళు మూసుకుని ఒక్కొక్కరి చేతిలోనూ గంధం, పూలు పెడుతున్నాడు. అవి దేవుడికి అర్పించి,

ఒక్కొక్కరే పక్కకి తప్పు కొంటున్నారు.

"ఒసే రూపా! అలా సిగ్గుపడతావెందుకు? ముందుకురా."

చంద్రమ్మత్త పోకచెట్టు వెనక నిల్చున్న రూపాని చూసి అంది. రూప సిగ్గుతో వయ్యారంతో ముందుకి వచ్చింది. ఆమె కళ్లు వూరికే రెప రెప లాడుతున్నాయి. రెండుచేతులూ గుండెలమీద కప్పుకుని ఆమే గురూజీ ముందు నిలబడింది. గురూజీ గంధం, పూలు యివ్వబోయాడు. రూప గుండెలమీద చెయ్యితీసి ముందుకు చాపింది.

సౌందర్యపు అమూల్య ఖజానా గురూజీ ముందు నిల్చుంది. ఆమెను చూసి అతను అవాక్కయి పోయాడు. ఆహా! ఎంత అపురూప సౌందర్యం ఈ రూప! ఆ రూపంచూసి గురూజీకళ్ళు క్షణంసేపు మూతబడ్డాయి. చేతిలోని గంధ, పుష్పాలు రూపా జోడించి చాపిన చేతుల్లో పెట్టడం మఱచిపోయాడు.

"గురూజీ!"

ఒక నాజూకు శబ్దం గురూజీ చెవుల్లో ప్రతిధ్వనించింది. అతను స్పృహలోకి వచ్చాడు. కొద్దిగా కంగారుపడి సర్దుకొని జోడించిన రూపా చేతుల్లో గంధ, పుష్పాలు యిచ్చాడు. అల్లకల్లోలంగా వున్న మనస్థితిలో రూప కర కమలాల స్పర్శ గురూజీ చేతులకి తగిలింది. ఆ స్పర్శ గురూజీకి ఎంతో సుఖాన్ని యిచ్చింది. రూపా తిరిగి వెళ్లిపోయినా మొగలి ఆకులాంటి ఆమె శరీరకాంతి, ముత్యాలరంగులో తెల్లగా శుభ్రంగా వున్న కళ్లు, దానిమ్మపండు రంగు పెదాలు, చీరవెనక నుంచి తొంగిచూస్తున్న పావురాల జోడిలాంటి వక్షోజాలు కళ్ళముందు నుంచి అదృశ్యం కాలేదు.

చాలాసేపైనా, విచలితమైన గురూజీ మనస్సు కుదుట పడలేదు. మంత్రాలు సక్రమంగా జ్ఞాపకం రావడంలేదు. అయినా ఫరవాలేదు - హారతి యిస్తున్నప్పుడు వొత్తులు నూనెగిన్నెలో బదులు నీళ్లగిన్నెలో ముంచినప్పుడు ఎవరూ చూడలేదు. ప్రదక్షిణకూడ తప్పుగా మరోలా చేయసాగాడు. కానీ చంద్రమ్మత్త "గురూజీ, మీరేం చేస్తున్నారు?" అని అనబోయేలోగా, అతనికి తన తప్పు తెలిసింది.

"చంద్రమ్మత్తా, నేను నీతో ఒక విషయం మాట్లాడాలి."

పూజ పూర్తయిన తరువాత ఒక మూల నిలుచున్న చంద్రమ్మత్తతో గురూజీ అన్నాడు.

"ఏమిటి?

చంద్రమ్మత్త ఎగతాళిగా చూస్తూ అడిగింది.

"ఈ రూప ఎవరూ?"

"రూప? ఆ నవ్వు ముఖంతో వున్న అమ్మాయా?"

"అవును!"

"ఒక కొత్త అమ్మాయి. చాలా అందగత్తె. అతిధులకి ప్రాణం అర్పించైనా సుఖాన్నివ్వడానికి తయారుగా వుంటుంది. కానీ నేనే జాగ్రత్త తీసుకొంటాను. దానికి ఏ కష్టం రాకూడదని."

"అవును జాగ్రత్త తీసుకోవాలి. చిన్నది పైగా నాజూకైన పిల్ల."

"అవును."

"చంద్రమ్మత్తా, ఒకటి అడగనా?"

"అడగండి."

"కోపం రాదు కదా నీకు?"

"కోపం రావడానికి మీరు పరాయి వాళ్ళు కాదుకదా!"

గురూజీ నిర్మలంగా, తలవొంచుకుని మాట్లాడాడు.

"ఈరోజుతో పది సంవత్సరాలయింది - నేను యిక్కడికి వచ్చి వెడుతున్నాను. కానీ ఎప్పుడూ ఏ ఆడమనిషిని వక్రదృష్టితో చూడలేదు. కాని ఈవేళ అలా ఎందుకయిందో ఎవరికి తెలుసు? ఆ రూప నా మనస్సుని ఆకట్టుకుంది. నా కోరిక తీరుతుందా?" ఏదో దెబ్బ తగిలినట్టు చంద్రమ్మత్త మొహం గంభీరమయింది. గురూజీ మొహం చూస్తూ చూస్తూ ఆమె ఆలోచనల్లో మునిగింది.

గురూజీకి షాక్ తగిలింది. రూపాని కోరడంలో తను పెద్ద తప్పు చేయలేదుకదా? చంద్రమ్మత్త కాదని అంటే జరిగే అవమానం తను భరించగలడా? గురూజీ (మనసులో) తర్కించుకుంటున్నాడు. మనస్సులో అస్పష్టత పెరుగుతోంది.

కొన్ని క్షణాలు అలా గడిచాయి. ఆఖరికి చంద్రమ్మత్త ఏదో నిర్ణయం మనస్సులో చేసుకొని, ఆదర పూర్వకంగా గురూజీతో అంది.

"గురూజీ నేను మీకు ఎలా కాదనగలను?" మీ పుణ్యశక్తి వల్లనే మాకంతా శుభం జరిగింది. మీ మాట నేను తిరస్కరించలేను. మీ కోరిక తీరుతుందిలేండి. చెప్పండి ఎప్పుడు?"

"ఈ వేళ రాత్రి."

"సరే, ఇప్పుడు మీరు వుండండి. ప్రొద్దున్న పూజాసామాగ్రి తీసుకొని మా వీడ్కోలుతో వెళ్లండి..."

చంద్రమ్మత్త మాటలు విని గురూజీ గుండెలు చిన్నపిల్లాడిలా లోపల్లోపల గెంతులేయసాగాయి. రాత్రి రూప తన చేతుల్తో తయారుచేసి యిచ్చిన తాంబూలం గురూజీ స్వీకరించి తిన్నాడు. ఆ తరువాత రాత్రి ఎలా రంగుల రసడోలలతో గడిచిందో తెలియలేదు. తెల్లవారింది. గురూజీ ముస్తాబై సోఫామీద కూర్చున్నాడు.

పూజసామగ్రి తీసుకుని చంద్రమ్మత్త ముందుకి వచ్చింది.

"ఇది పూజ సామాను. ఇదిగో దక్షిణ. అలాగే అందుకొండి. నమస్కారం ఆఖరిది."

చంద్రమ్మత్త తన నడుము వెనకభాగం అతనివైపు త్రిప్పి (మొహం చాటేసి) మాట్లాడింది. ఆమె గొంతుకలో కంపన ధ్వనించింది. గురూజీకి ఆశ్చర్యం వేసింది. ఎప్పుడూ నవ్వు ముఖంతో ఆమె గురూజీకి వీడ్కోలు చెప్పేది. కాని ఈరోజు వేరే విధంగా గురూజీకి అనిపించింది. అతని నోటిలోంచి మాటలు వూడిపడ్డాయి.

"ఆఖరి నమస్కారమా?"

"అవును ఆఖరిది."

తన చెమ్మగిల్లిన కళ్లతో గురూజీ కళ్లల్లో చూస్తూ ఆమె అంది.

"ఈవేళ్టి వరకూ మీరు మా గురూజీగా వుండేవారు. ఇప్పుడు మీరు... కాదు నువ్వు మా అతిథివి అయ్యావు."

"అంటే ఏమిటి?"

"ఇది నేను చెప్పాలా? మీరు పుణ్య పురుషులని మేము (భావించి) మీకు శ్రేష్ఠ గౌరవం ఇచ్చాము. మడిని పాటించాము. మీ పుణ్యశక్తి వలన మా పాపాలు తుడుచుకుపోయేవి."

"కానీ మీరు మీ ప్రత్యేకతని త్యజించి మా ఎంగిలి మెతుకులు తింటే మేము మిమ్మల్ని గురూజీగా ఎందుకు గౌరవించాలి?"

గురూజీ నిల్చునే వున్నాడు. అతనికి చంద్రమ్మత్త మాటలు తూటాలుగా తగుల్తూ వుంటే, ఆ బాధలో ఎలా జవాబివ్వాలో తెలియలేదు.

"గురూజీ దుఃఖించకండి. రూప కోసం మీరు ఎప్పుడు కావాలన్నా రావచ్చు."

తన వ్యధిత హృదయంతో తలవొంచుని చంద్రమ్మత్త తక్షణం ఇంట్లోకి వెళ్లిపోయింది.

పూజా సామాగ్రితో వున్న సంచి భుజం మీద వేసుకుని గురూజీ చంద్రమ్మత్త ఇంటినుంచి బయటపడ్డాడు. జరిగిన అవమానం సహించే ధైర్యం అతనిలో లేదు. అధః పతనంతో, నల్లబడిన మొహంతో తలవొంచుకుని నెమ్మదిగా అడుగులేస్తూ అతను ప్రేమ్‌నగర్‌కి వీడ్కోలిచ్చాడు. మధ్యమధ్య అతనికి ఏదో భావన కలుగుతోంది. మూలల్లోని కిటికీలల్లోంచి రంగులు పులుముకున్న ముఖాలు "షూ...షూ" అంటూ తనని పిలుస్తున్నాయని. అప్పుడే చెవులు గింగురుమనేలా అపహాస్యంగా ఎవరో అరిచారు "ఏం అతిథీ! రాత్రి ఎలా గడిచింది?"

ఇంత ఆయుస్సులో ఏమి సాధించి, గడించానో అదంతా ఒక్కరాత్రిలో తగలెట్టేశాననే దఃఖభారం నెత్తిమీద వేసుకుని గురూజీ ఇంటిముఖం పట్టాడు.

పశ్చాత్తాపంతో అతని గుండెలు మండుతున్నాయి.



4

# ఇంటిపెద్ద

**- శాంతారాం హెదో**

వసారాలో గోడమీద గడియారం ఎనిమిది కొట్టింది. సూర్యాజీ షణైకి తెలివివచ్చి పక్కమీద కూర్చున్నాడు. ఆవలిస్తూ మొహంమీద చెయ్యివేసి చిటిక వేశాడు. కులదేవతని స్మరించుకొన్నాడు.

"శాంతె, శాంతె, శాంతె."

ఉయ్యాల మంచం నుంచి కిందికి దిగాడు. తెల్లటి దుప్పటిని సరిచేసి, పాదుకలు వేసుకుని మేడ మెట్లు దిగసాగాడు. మెట్లమీద పాదుకల చప్పుడు విని క్రింద వసారాలో జనం ఒకర్నొకరు సంజ్ఞలద్వారా హెచ్చరించుకుంటున్నారు.

"అరే, అరే, త్వరగా రండి, అయ్యగారొస్తున్నారు" వసారాలో స్త్రీలు, పిల్లలు వంటింటి వైపు పరిగెత్తారు. నీరెండలో కాళ్లు చాపుకు కునుకు తీస్తున్న పిల్లికూడా గాభరాగా లేచి తోక తెగినట్లు పరిగెత్తి మాయమయిపోయింది.

మెట్లకిందికి దిగి సూర్యాజీ షణై తన పెద్దకొడుకుని పిలిచాడు.

"భావూ"...

నిజానికి అతని పేరు అనంత్, కాని పెద్దకొడుకుని పేరుతో పిలవడం ఆచారంకాదు కనక అతనిని ముద్దుగా 'భావూ' అని పిలుస్తాడు.

భావూ తండ్రికోసం ఎదురుచూస్తూ అక్కడేవున్నాడు. తన తండ్రికి ఏదికావాలి, ఏది అక్కరలేదు అతనికి బాగా తెలుసు. అందుకని ఠక్కున జవాబిచ్చాడు.

"ఇదిగో చూడండి. మఱుగుదొడ్డికి వెళ్లడానికి వేడినీళ్ల చెంబు ఇక్కడ వుంది. అక్కడ గోడ అంచుమీద మొహం కడుక్కోడానికి నీళ్లు, పళ్లపొడి వుంచాను."

"దామూదర్ ఏడి?"

"కొబ్బరి తోటలోకి, నీళ్లు చల్లడానికి వెళ్లాడు."

"లాడూ...?"

"కారయ్యగారి తోటలో లేతగడ్డి తేడానికి వెళ్లాడు."

"మరి షాణూ..."

"ఆవు మందలని మేపడానికి వెళ్లాడు."

"పండరీ, దత్తూ, మాదోలు కనిపించడం లేదేమీ?"

"వున్నారు..."

"వున్నారా? ఇదేమిట్రా ఈవేళ నువ్వు మాటకి మాట జవాబిస్తున్నావు? ఏమయిందిరా నీకు?"

"అలాగని కాదునాన్నా... కానీ..."

అనంత్ తడబడుతూ అన్నాడు. అతనికి ఈరోజు పగలు జరిగిన విషయం ఎలాచెప్పాలో తెలియలేదు.

"నీ నోరు ఎందుకు విప్పవురా? చెప్పు త్వరగా?"

తండ్రి కోపం మెల్లి మెల్లిగా పెరగడం చూసి ఇక చెప్పక తప్పదని చెప్పేశాడు.

"విష్ణూని, కానూషణైని రాణె బృందం ఎత్తుకుపోయారు"

"ఆ( ఏమిటి?"

"నిజం నాన్నగారూ!"

"అంటే అర్థం? మీరందరూ ఎక్కడ చచ్చార్రా? నాలుగుదిక్కులా నిద్రపోతున్న కూలీలు, ఇంటి జనం ఏం చేస్తున్నారు? పేడ తింటున్నారా? మీరు మేడమీద నించి కటకటాల మధ్య తుపాకీ పెట్టి వాళ్ళని కాల్చేయవచ్చుకదా?"

"కానీ నాన్నగారూ, ఈసారి రాణె చాలా జాగ్రత్త తీసుకున్నాడు. ఎవరికీ, ఏదీ తెలియనివ్వలేదు. రాణే ఎక్కడినించి వచ్చాడో, ఎంతమందితో వచ్చాడో, ఎక్కడ దాగి వున్నాడో ఎవరికీ తెలియలేదు. వాళ్ల గాలంలో విష్ణూ, కానూషణైలు చిక్కుకున్నారు.

"అరే, వీళ్లిద్దరూ ఎక్కడ చచ్చార్రా?"

"కానూషణైకి ఈరోజు తెల్లవారు వేళ పెద్ద వాణుకులు వచ్చాయి. అందువల్ల విష్ణుని వెంట తీసుకుని బయటకి వెళ్లడానికి తలుపులు తెరిచాడు. అంతే, అక్కడ వసారాలో దాక్కున్న రాణె మురాకి చిక్కిపోయారు. బహుశా తెల్లవారువేళ తొలికోడి కూసే సమయంలో యిది జరిగి వుండవచ్చు. ఇప్పుడే మన దూరపుతోటల్లో పనిచేసే

కూలీలు వచ్చారు. పగలు మసక మసక చీకట్లో రాణె ముఠా వీళ్లిద్దరినీ బందీలుగా తీసుకుపోవడం చూశారుట. ఈ కబురు చెప్పడానికే ప్రత్యేకంగా వాళ్లు వొచ్చారు.''

సూర్యాజీ షెణై పడక కుర్చీమీద కాళ్లు వేళ్లాడదీసి కూర్చున్నాడు. పేరుకి తగ్గ విగ్రహ పుష్టి. తేజస్సుతో ఆజానుభావుడి రూపం, కండలు తిరిగిన విగ్రహం, చేతులకందని కండరాలు, బిగుతు, చిన్నవైనా దొంగ చూపులతో చూసే కళ్లు, కళ్లకి కొట్టొచ్చేలా కనిపించే పెద్దముక్కు, మీసం మెలేస్తూ వుండే అలవాటు, అందులో నెత్తిమీద బరువు పడ్డప్పుడు మరీ ఎక్కువ. ఇప్పుడే సూర్యాజీ షెణై తన రెండు చేతులతో మీసాలు మెలేశాడు. అతనికి గతంలో జరిగిన ఒక సంఘటన గుర్తుకొచ్చింది.

సూర్యాజీ షెణై తమ్ముడి కూతురిపెళ్లి. పెళ్లికి ముందురోజు దేవకార్యం. ముత్తైదువుల పూజ పూర్తయింది. మహాదేవ్ పూజ పూర్తిచేసి భోజనాలకి విస్తళ్లు వేశారు. వడ్డన అనగానే జనం భోజనం మొదలుపెట్టారు. అప్పటికే చాలా ఆలశ్యం అయింది. సూర్యాజీ షెణై నిత్యక్రియలు, అన్నపానాలు మందగతిలో సాగడం వలన రాజాంగనంలో నీరెండ, ముదురెండ అయింది. ఇంట్లో పెద్దవాళ్లు ఈ ఆలశ్యం వలన లోపల్లోపలే సణుక్కుంటున్నారు. పిల్లలు ఆకలితో అలసిపోయారు. ఎలాగైతేనేం చివరికి ''మహాదేవ్'' (భోజనానికి) శ్రీకారం చుట్టారు. జనం త్వరత్వరగా భోజనం చేస్తున్నారు. వాళ్లకి మొదటి విడత వడ్డించిన వంటకాలు యింకా తినడం పూర్తి అవలేదు, యింతలో ఒక యువకుడు ముఖద్వారం ముందు మెట్లమీద నిలబడ్డాడు. నెత్తిమీద రుమాలు తలకడ్డంగా కట్టుకొన్నాడు. ఒంటిమీద చొక్కా, భుజంమీద కంబళి. వసారాలో సోఫాలమీదా, మెట్లమీదా సూర్యాజీషణై కాపువాళ్లు, పనివాళ్లు చెల్లచెదురుగా, గుంపులుగా కూర్చున్నారు. లోపలకి వచ్చిన యువకుడు ఎవ్వరితో మాట్లాడలేదు. ద్వారం ముందు మెట్లమీద స్తంభంలా నిలబడ్డాడు. వడ్డనలో హడావిడిగా ''పెసలపప్పు'' గిన్నెతో పరుగులుతీస్తున్న 'దత్తు షణై' దృష్టి అలా ద్వారం ముందు నిలబడ్డ యువకుడి మీద పడింది. వెంటనే ఆ పప్పుగిన్నె అక్కడే పడేసి, చేతుల్లో కొబ్బరి చిప్పతో చేసిన గరిటతో ఆ యువకుడి దగ్గరకి వేగంగా వచ్చాడు.

''ఏమిట్రా భీమా, ఇలా అకస్మాత్తుగా వచ్చావు?''

''ప్రత్యేకంగా అన్నగారు పంపారు. యాభై పాతిక రాణె బృందం ఇక్కడికి

రావడానికి ప్రయాణమయ్యారుట. వాళ్లు అర్ధరాత్రిలోగా చేరుకుంటారు. మీకీ కబురు అందజేయడానికి నన్ను పంపారు.''

''అయ్యో దేవుడా! ఇదేమి అరిష్టం వచ్చిందిరా ఈ సమయంలో! ఇందుకే కాబోలు శాంతదుర్గ ప్రసాదం సమర్పిస్తున్నప్పుడు ఏదో కీడు వుందని సూచించింది'' కంగారుగా పంచె ముడి వూడిపోయినా గుర్తించక జనం భోజనాలు చేస్తున్న వసారాలోకి వచ్చి అప్రయత్నంగా అరిచాడు -

''అరే పాపాత్ములారా, ఇక్కడికి కొద్దిసేపట్లో రాణె వస్తున్నాడుట.''

అంతే! ఆ తరువాత ఆ యింట్లో లేచిన గగ్గోలు, దుమారం వర్ణించలేము. దత్తు షణై ఈ కబురు చెప్పిన ద్వారం ముందు, వెనక, పైన, దగ్గర జనం, నాలుగు వసారాలలో జనం గాభరాగా లేచారు. భోజనం అర్థాంతరంగా విడిచేశారు. కొందరు హాలులోకి, కొందరు స్నానాల గదిలోకి, కొందరు పెరడులోకి పరిగెత్తారు. లోపల వసారా దగ్గర వున్న వంటింట్లోకి ఈ వార్త ప్రాకగానే స్త్రీలు చేతిలోని వంటకాల గిన్నెలు అలాగే క్రింద పడేశారు. అరుస్తూ, ఏడుస్తూ చేతిలో బంగారు గాజులూ, మెడలో హారాలు, చెవిలో దుద్దులు, శిరస్సు మీద నగలు తడుముకోసాగారు.

తనకి తెలిసే సరికే ఈ కబురు చెయ్యి దాటిపోయిందని గ్రహించిన సూర్యాజి షెణై పరిస్థితి అదుపు చేయడానికి గట్టిగా అరిచాడు -

''దత్తూ! మీరంతా కాస్త నిశ్శబ్దంగా వుండండి చూద్దాం. ఎవ్వరూ కిమ్మనకూడదు అందరూ నోరుమూసుక్కూర్చోండి.''

'పెద్దదిక్కు' షెణైబాబు హెచ్చరికని కాదనే దమ్ములెవరికున్నాయి? అందరూ గమ్మున కూర్చున్నారు. తరువాత యిద్దరు కొడుకులనీ, తమ్ముడి కూతుర్నీ దగ్గరకి పిలిచి నచ్చచెప్పాడు.

''ఇప్పుడు యిలా అరిచి, ఏడ్చి ఏం లాభంలేదు. బయట వసారాలో మన పనివాళ్లు గోయ్‌దా, లాడూ, యెష్‌వంత వగైరాలు కూర్చున్నారు. వాళ్లనెత్తిమీద వండిన అన్నం, కూరలు, పిండివంటల గిన్నెలు, పక్క చుట్టలు, ఖాళీపాత్రలు యితర నిత్యావసర వస్తువులు వుంచి వెంటనే బయల్దేరండి, 'రాయ్‌తూర్'కి. ఆ స్థలం అవతలిగట్టున 'బస్తావ్ మునేలి'గారి బంగళావుంది. అది చాలా పెద్దది. విశాలమైనది. అతనికి నా పేరు చెప్పండి. మీకేవిధమైన యిబ్బందీ కలగదు. తరువాత అతనికి ఏం చెప్పాలో నేను చెబుతాను. 'భావూ' నువ్వు లోపలికెళ్లి

ఆడవాళ్లందరినీ త్వరగా తెమలమని చెప్పు. వాళ్ల ఒంటిమీద నగలు చిన్న భోషాణం పెట్టెలో వేసి ఆ పెట్టె నా దగ్గరకి చేర్చు. చూడు. నా సవారి (పల్లకి) సిద్ధం చేయమని చెప్పు. అలాగే అక్కడి సవారీ మోసే కిరస్తానీవాడిని, నేను రమ్మన్నానని, వెంటనే రమ్మని కబురుపంపు. ఊరికే ఆలస్యం చెయ్యకండి. చీకటి పడేలోగా 'రాయ్‌తూర్' చేరి నదిదాటి అవతలి గట్టు చేరుకోవాలి.''

సూర్యాజీ షెణై ఆదేశించిన ప్రకారం పెళ్ళి ఊరేగింపులూ, వంటకాల పాత్రలతో, గిన్నెలతో, వంట సామానుతో, మందీ మార్బలంతో గంటన్నర వ్యవధిలో అంతా ప్రయాణమయ్యారు. అనుకున్న మాట ప్రకారం 'రాయ్‌తూర్'చేరి నదిదాటి, చిఱుచీకట్లు కమ్ముతుండగా చేరవలసిన చోటు చేరుకున్నారు. 'రాయ్‌తూర్'లో పెద్ద చర్చి గంటలతో స్వాగతం పలికింది.

ఆ 'సష్టి' (Salcete) తాలూకా ప్రాంతంలో 'రాణె' ముఠాల బెడదలేదు.

అది చాలాకాలం క్రిందటిమాట. ఈసారి మాత్రం సూర్యాజీ షెణైకి ఏవిధమైన హెచ్చరికా లభించలేదు. పెద్ద సంకటం వచ్చిందని తబ్బిబ్బయ్యాడు. ''రాణె'' పట్టుకుపోయిన తన యిద్దరు బంట్లని ఎలా విడిపించాలా అని సమస్య. చేతులు వెనక కట్టుకుని వసారాలో ముందూ, వెనకా పచార్లు చేస్తూ ఆలోచిస్తున్నాడు. అతని పాదుకల చప్పుడు మినహా అంతా నిశ్శబ్దం. ఆఖరికి అతనికి ఒక ఉపాయం తోచింది.

ఇంతలో సూర్యాజీ షెణై యింటికి 'రాణె' బృందం వచ్చినట్లు, ఇద్దరు వ్యక్తులని అపహరించి తీసుకుపోయినట్లు వూరంతా గుప్పుమంది.

'షిరోడా'గ్రామంలో ఆరోజుల్లో సుమారు యాభై-ఎనభైమంది వున్న సిపాయిల దళం వుండేది. అందులో కొందరు పోర్చుగీసు వాళ్లు, కొందరు గుఱ్ఱాలతో ఆశ్విక భటులు. వాళ్లకి ఈ కబురు తెలియగానే వాళ్లలో కొందరు విచారణకోసం సూర్యాజీ షెణై యింటికి వచ్చారు. అప్పుడు సూర్యాజీ షెణై మేడ మీద వసారాలో కాఫీ తాగుతున్నాడు. లోపల క్రింది గదుల్లో వంటగది పక్కన యింట్లో మిగతా జనం జావ తాగుతున్నారు. సూర్యాజీ షెణై తన భుజంమీద కండువా తీసి చుట్టలా చేసి దానిమీద వెండికప్పులో వున్న వేడి వేడి కాఫీ తాగుతూ, మధ్యలో ఆగి ఆ కప్పుని వుంచుతున్నాడు. వేడికాఫీని వూ, వూ అని వూదుతూ చల్లార్చుతున్నాడు. మెల్లిగా ఒక్కొక్క గుటకే వేస్తూ ఆస్వాదిస్తున్నాడు. పక్కనే అతని భార్య వుంది. ఆమె చేతిలో

కాఫీ వున్న గిన్నె (చిన్నది) వుంది. ఆ గిన్నె ముందుకు చాపి, నోటిమాట పెగలకుండా కేవలం సంజ్ఞలతో అడిగింది.

"ఇంకాస్త కాఫీ పొయ్యనా?"

సూర్యాజీ షెణైకూడా మౌనంగానే తల అడ్డంగా తిప్పి వద్దన్నాడు.

ఐనా ఆవిడ బలవంతంగా కొంత కాఫీ అతని కప్పులో పోసింది.

అతను కోపంగా గుడ్లు పెద్దవి చేసి అన్నాడు.

"నాతో వేళాకోళమా...?"

పాపం ఆవిడ అలాగే తిరిగి వెళ్లిపోయింది - బెదిరిపోయి. మేడమెట్లు దిగుతున్న ఆమె కాళ్ల గజ్జల చప్పుడు వినిపిస్తోంది.

ఇలా సాధారణంగా రోజూ జరిగేది. సూర్యాజీ షెణై భార్య శరీరం పొట్టిది. అలాగే బుద్ధితక్కువ. తన భర్తని ప్రాణ సమంగా ప్రేమించడం ఒక్కటే ఆమెకి తెలుసు. సూర్యాజీ షెణై విలక్షణమైన, వినూత్న ఆకర్షణీయమైన వ్యక్తిత్వం ముందు ఆమె సాధారణ రూపం, భోళా స్వభావం వెలవెల బోతుంది.

ఇంతలో ఏడెనిమిది దేశీ సిపాయిలూ, ఒక తెల్ల పోర్చుగీసు పోలీసు ఆఫీసరూ మెట్లు ఎక్కి మేడ మీదకి రావడం, మేడమీది కిటికీల నుంచి సూర్యాజీ షెణై చూశాడు. తన తెల్లటి కుర్తా తొడుక్కొని గబగబా వసారాలోకి వచ్చి వాళ్ళని పలకరించాడు. వాళ్లని మర్యాదగా కుర్చీల్లో కూర్చోమన్నాడు. కానీ వాళ్ళు కూర్చోలేదు. వాళ్లు చాలా తొందర్లో వున్నారు. వాళ్లు సూర్యాజీ షెణైని ప్రశ్నలమీద ప్రశ్నలు వేశారు. అతను వాటన్నిటికీ సక్రమంగా జవాబులు యిచ్చాడు. తనకి జరిగిన విపత్తు వివరంగా చెప్పాడు. ఇంతలో లోపలనుంచి అతని యిద్దరు కొడుకులు, ఐదుగురు సోదరుల కొడుకులు త్వరత్వరగా జావతాగి బయటకి వచ్చారు. అందరికీ నున్నని గుండు, వెనక పిలక. వీళ్ళల్లో కాస్త అపవాదు ఒక అబ్బాయే.

సూర్యాజి షెణై ఆఖరి కొడుకుది. గోవాలో అప్పుడే గుండు, పిలకకి బదులు క్రాపు పెంచుకోవడం ఫ్యాషన్ అయింది. సూర్యాజీ షెణై రెండవ కొడుకు అందరికన్నా వయస్సులో చిన్నవాడవడం వలన ఎవరూ అభ్యంతరం పెట్టలేదు. ఒక సోదరుడి కొడుకు వస్తూ, వస్తూ తన చేతుల్తో జడలా వున్న పిలకని ఝళిపించి తడి చినుకులు చుట్టూ కురిపించాడు.

"సరే ఒక సంగతి చెప్పండి. మీవాళ్లని పట్టుకుని రాణెముతా ఎటువైపు

వెళ్లారు?" ఒక దేశీ సిపాయి అడిగాడు.

ఇప్పుడు మాత్రం సూర్యాజీ షెణై తత్తరపడ్డాడు. రాణె బృందం వెళ్లిన దిక్కునే ఈ సిపాయిలుకూడా వెళితే, రాణె కంటబడితే, సిపాయిల మీద కోపంతో రాణె, బందీలుగా వున్న తనవాళ్లని చంపేస్తాడేమోనని భయమేసింది. అందుకని సూర్యాజీ షెణై చెవులమీద చేతులు పెట్టి విధేయతతో అన్నాడు.

"ఇది మాకెలా తెలుస్తుంది? రాణె తిరిగే ప్రదేశాలు కొల్లలు. 'అంత్రుజ్', 'అస్టాగ్ర' 'అటంగి', 'సింహనాద్', 'చంద్రనాద్' పర్వతగుహలు, ఇలా ఎన్నో..."

కానీ ఆ సిపాయిలు యింకేం వినడానికి అక్కడ వుండలేదు. సూర్యాజీ షెణై భవనంలోని నలభైమెట్లూ గడ్ గడ్‌మని చప్పుడు చేస్తూ దిగి వెళ్లిపోయారు. వాళ్ళు "బోరిం"కి వెళ్ళే తోవలో "ఫోండా" చేరుకుని అక్కడి పోలీస్ ఠాణాలో రిపోర్టు యిచ్చి అక్కణ్ణుంచి రాణె ముఠాని గాలించడానికి వెళ్లాలి. అందుకే ఆ హడావిడి -

ఇక్కడ ఈ సంఘటనతో సూర్యాజీ షెణైకి ఒక హెచ్చరిక కలిగింది. రాణె బృందం వుచ్చులలోంచి ప్రాణాలతో తన సోదరుడి కొడుకునీ, తన పొరుగునే వుండే నమ్మినబంటునీ యిద్దరినీ విడిపించాలి. తన యింట్లోనూ, బయట వ్యవసాయంలోనూ విష్ణు ఎంతో సహాయం చేసేవాడు. సూర్యాజీ షణై తన తోటల, పొలాల విషయంలో ఏ కొత్త పథకం వేసినా, విష్ణుని తప్పక సంప్రదిస్తాడు. ఆ తరువాత ఆ కార్యభారం విష్ణుకే అప్పగించేవాడు. విష్ణు ఆ పని అనుకున్న ప్రకారమే కాక అంతకుమించి గొప్పగా పూర్తి చేసేవాడు. ఈ మంచి స్వభావము వలన అతనికి సూర్యాజీ షెణై ప్రేమాభిమానాలు లభించాయి.

ఒకసారి విష్ణుకి పగలు జ్వరం వచ్చింది. సూర్యాజీ షెణై ఎంతో శ్రద్ధతో ఉపచారాలు చేశాడు. ఏవో ఔషధాల, మూలికల కషాయాలు యిచ్చాడు, భగవంతుణ్ణి ప్రార్థించాడు, డాక్టరుని పిలిపించాడు అయినా జ్వరం తగ్గలేదు.

ఇలా ఎనిమిది రోజులు గడిచాయి. సూర్యాజీ ఆరోజు తెల్లవారుఝామునే నిద్రలేచాడు. అందరికీ ఆశ్చర్యం వేసింది. అతను భార్యనీ, పెద్ద కొడుకునీ లేపాడు. కొడుకుని శాంత దుర్గగుడికి పంపాడు. భార్యని స్నానంకోసం వేణ్ణీళ్ళు కాచమనీ, సంధ్యావందనం కోసం ఏర్పాటు చేయమని చెప్పాడు. ఈవేళ అతను స్నానం చెయ్యడంలో ఆలశ్యం చేయలేదు. కొబ్బరి చిప్పతో కాళ్లక్రింద రోజూ తోమినట్లు తోమలేదు, వొంటిమీద తుండు గుడ్డ (తువ్వాలు) స్నానం అయ్యాక రోజూలాగ

వుతకలేదు, కేవలం స్నానం చేశాడు. అతను కాషాయ వస్త్రాలు ధరించి పావురాలూ, నెమళ్లూ చెక్కిన ఇత్తడి రేకులున్న పీటమీద కూర్చున్నాడు. ఒక్క చుక్కకూడా నీళ్లు తాగలేదు, సంధ్యావందనంలో ఆచమనం చేస్తూ నోట్లోకి పోసుకున్న నీళ్ల చుక్కలు మినహా, అతని నోట్లోంచి "శాంతే... శాంతే..." అని కులదేవతని స్మరిస్తున్న శబ్దం మాత్రం వస్తోంది. అతని వక్కనే ఐదు ప్రమిదలున్న దీవవుసెమ్మెలు వెలుగుతున్నాయి. గదినిండా ఈదీపాల కాంతి, అగరువత్తుల సుగంధ వాసన నిశ్శబ్దంగా వ్యాపించాయి. ఈ నిశ్శబ్దంలో కేవలం రెండు మాటలు "శాంతే, శాంతే..." వినిపిస్తున్నాయి.

ఈ కారుణ్యమైన ప్రార్థనా, ఆ రోగి మూలుగులలో వేదనా కలిసి ఆ యింట్లో ఒక అనిశ్చితమైన నిశ్శబ్దం, భీతి, భయంతో వాతావరణం నెలకొంది.

గోడమీద గడియారం మధ్యాహ్నం పన్నెండుగంటలు కొట్టింది. సూర్యాజీ షెణై సోదరుడి పెద్దకొడుకుని పిలిచి అడిగాడు.

"విష్ణూ జ్వరం ఎలాగుంది?"

"అలాగే వుంది. పెరగలేదు, తరగలేదు."

"అలాగా. ఈవేళ నేను భోజనం చేయడం ఆలశ్యం కావచ్చు. మీరందరూ భోజనం చేయండి. విష్ణూ జ్వరం తగ్గే వరకూ నేను నోట్లో అన్నం మెతుకులు వేసుకోను."

అని సూర్యాజీ శాంతదుర్గ నామ వుచ్చారణ పునఃప్రారంభించి, ఎడతెగకుండా జరిపించాడు.

సాయంత్రం నాలుగు అయింది. ఐనా పరిస్థితిలో మార్పులేదు. సూర్యాజీ షెణై పెద్దకొడుకు "కవ్ళ్యా" (శాంత దుర్గ దేవస్థానమున్న ప్రదేశం) నుంచి తిరిగి వచ్చాడు. దేవి దయకోసం, ప్రసన్నత కోసం చేసిన పూజ ఘనంగా జరిగిందిట. దేవిని రక్షణ కోరుతూ సమర్పించిన పూజా పుష్పాలు శుభాన్ని పలికాయిట!

రెండుసార్లు జరిపిన ప్రత్యేక పూజలో రెండుసార్లూ పంచమస్థానంలోని పుష్పాలురాలి, అత్యుత్తమ ఫలితాన్ని సూచించాయి.

ఇంతలో రోగి గదిలోంచి,అతడి చిన్నతమ్ముడు హడావిడిగా బయటకొచ్చి, 'విష్ణూ' శరీరమంతా బాగా చమటలు పట్టాయని చెప్పాడు. అందరూ గదిలోకి పరిగెత్తారు. నిజమే! ఒళ్లంతా చెమటలు మూలుగులు ఆపి, 'విష్ణూ' కళ్లు తెరిచాడు.

అందించిన మూలికల కషాయం నెమ్మదిగా త్రాగాడు.

ఈ శుభవార్త చెప్పడానికి సూర్యాజీ షెణై కోసం అతని పెద్దకొడుకు గబగబా దేవుడి గదిలోకి వెళ్లాడు. సూర్యాజీ దేవి నామస్మరణం నిరాఘాటంగా సాగిపోతోంది. అతను కళ్లు మూసుకొని వున్నాడు.

"నాన్నగారూ, నాన్నగారూ, విష్ణూ జ్వరం తగ్గింది". కానీ సూర్యాజీ షణై ఈ ప్రపంచంలో లేడు. కొడుకు అదే విషయం మళ్లీ గట్టిగా చెప్పాడు. తండ్రి వులిక్కిపడి కళ్లు తెరిచాడు. అతనికి తెలివి వచ్చింది.

'ఆ(? నిజంగానా? ఎవరూ "భావూ" ఆ! నువ్వెప్పుడు వచ్చావు? దేవి ప్రసన్నం ఎలా జరిగింది?"

"ఆ బాగా జరిగింది! విష్ణూ ఆరోగ్యానికి ఏ ఢోకాలేదుట. దేవి ఐదవ స్థానంలోని పుష్పం యిచ్చింది... అలాగే విష్ణు జ్వరంకూడా తగ్గింది".

ఏమీ పలకకుండా సూర్యాజీ షణై నీళ్లు నిండిన కళ్లతో, కృతజ్ఞతా, భక్తి భావం నిండిన మనస్సుతో శాంతదుర్గ పటం ముందు సాష్టాంగ నమస్కారాలు చేసి నెమ్మదిగా జపించాడు.

"శాంతె, శాంతె, శాంతె."

  

ఇప్పుడు మళ్లీ ఈ 'విష్ణూ', తన తమ్ముడి కొడుకు 'కానూషణై' పెద్ద సంకటంలో పడ్డారు. వాళ్లని విడిపించే బాధ్యత సూర్యాజీ భుజస్కంధాల మీదనే వుంది. అతను రాణెతోటి ఒప్పందం కుదుర్చుకోవాలని నిశ్చయించాడు. ఈ పనిలో అతని కొబ్బరితోటలు చూసే కాపు "పొసూ" చాలా వుపయోగపడ్డాడు. సూర్యాజీ షణై ఈ మధ్యనే వూరిపక్కన వున్న కొండమీద ఒక కొబ్బరితోట వేశాడు. ఆ కొబ్బరితోటని చూసే బాధ్యత "పొసూ"కి అప్పగించాడు. ఆతోట పేరు "దేవఢ్డ". 'దేవఢ్డ'లో దట్టంగా వృక్షాలు, మనుష్యులు బహుతక్కువ. ఈ తోట వున్న కొండ 'సిద్ధనాత్' పర్వతంకి దగ్గరలోనే వుంది. అటువంటి లాభదాయకమైన ప్రదేశంలో రాణె ముఠా వాసం వేశారంటే ఆశ్చర్యం ఏముంది? అక్కడ "గోగ్ళె" అనే రాణె ముఠా సభ్యుడు నివాసం వుంటున్నాడు. ఈ 'గోగ్ళె'కి 'పొసూ'కి మంచి స్నేహం. కొంతకాలం పొసూ, గోగ్ళె కలిసి వుండేవారు. అంటే 'పొసూ'కూడా ఒకప్పుడు రాణెముఠాలో సభ్యుడు.

'సూర్యాజీ షణై' 'పొసూ'తోనూ, 'పొసూ' రాం'గోగ్ళె'తోనూ, 'గోగ్ళె' 'బల్‌వంత్

రాణే'తోనూ సంప్రదించారు. 'బల్వంత్ రాణే'కి 'సూర్యాజి షణై' అంటే గొప్ప అభిమానం. (పరదేశి పాలనలో కూడా గొప్పగా కీర్తి సంపదలు గడించినందుకు) అందువల్ల అపహరించి తీసుకెళ్ళిన అతని మనుష్యులని ఏమాత్రం హానిచేయకుండా, మర్యాదగా చూసుకున్నాడు. ఈ రాయబారం ముగియగానే రాణె ఆ ఇద్దరినీ విడిపించడానికి ఒప్పుకున్నాడు. అయితే ఒక షరతుమీద.

"సూర్యాజీ షెణై బుడతగీచుల (పోర్చుగీసు)కి విరుద్ధంగా మేము చేస్తున్న పోరాటానికి సహాయంగా రెండువేల బంగారు నాణాలు యివ్వాలి. సూర్యాజీ షెణైవంటి ఆస్థిపరులు మాకు సకాలంలో సహాయంచేసి వుంటే మాకీవిధంగా అడ్డుదోవలు, అడవిదోవలు త్రొక్కవలసిన గత్యంతరం ఎందుకొచ్చేది?"

'రెండువేల బంగారునాణాలా? అదీ యిప్పుడే! ఈరోజే!"

'సూర్యాజీ షెణై' బిత్తరపోయాడు. కాని మరి గత్యంతరం లేకపోయింది.

అతను తన ఏకైక కుమార్తె పెళ్ళి ఖర్చుకోసం జమచేసిన డబ్బు రాణేకి పంపించాడు. రాత్రి ఎనిమిదిగంటలకి విష్ణుషణై, 'కానూ షణై' 'దేవడ్గా'లోని పోసూతో బాటు క్షేమంగా యిల్లు చేరారు. సూర్యాజీ షెణై సహితం యింటిల్లిపాదీ స్త్రీలూ, పురుషులూ, పిల్లలు ఆపద తప్పినందుకు సంతోషించారు.

సూర్యాజీ షెణై ఆనందం ఎక్కువసేపు నిలవలేదు. ఈ ప్రకరణ అతని విషయంలో యింకా ముగియలేదు. ఈ పీడ అతని పాలిట ప్రాణాంతకం అయింది. నిజానికి విడుదల అయింది కానూషణై, విష్ణూషణైలు. వాళ్ళు క్షేమంగా యిల్లు చేరారు. సూర్యాజీకి ప్రాణాంతక సమస్య వుద్భవించింది.

రాణె ముఠా చేస్తున్న అత్యాచారాలు రోజురోజుకీ పెరిగిపోతూండడం గమనించిన పోర్చుగీసు ప్రభుత్వం, వాళ్ల ఆటకట్టించడానికి 'అత్యవసర పరిస్థితి' (EMERGENCY ACT) (చట్టం) ప్రకటించింది. గోవా నివాసుల మూలహక్కులు అపహరించింది.

'సూర్యాజీ షెణై' యిటీవలే సంపదలు గడించి పైకి వచ్చిన షావుకారు. ఆ వూళ్లో పేరు పొందిన దొడ్డ కుటుంబాలు రెండే వుండేవి. వాళ్ల షోకులు, పోకడలు గొప్పవి. వాళ్లు ఎక్కడికివెళ్ళినా అడుగులకి మడుగులు ఎత్తేవారే. వాళ్ల యిష్టాలకీ, మాటలకీ తిరుగులేదు. ఊళ్లో ఏ ప్రదర్శన జరిగినా, దొమ్మెర మేళం వచ్చినా, మరే సాంస్కృతిక ప్రదర్శన జరిగినా మొదటి గౌరవం, అగ్రతాంబూలం వీళ్లకే. చిన్న

చిన్న వ్యాపారుల, రైతుల ఇళ్లముందు ప్రదర్శన యిచ్చినా, యివ్వకపోయినా ఫరవాలేదు కానీ ఈ రెండు దొడ్డ కుటుంబాలనీ విస్మరించకూడదు. విస్మరిస్తే ఆ కళాకారులకి పుట్టగతులుండవు. ఊళ్ళో 'కమ్యునిబాద్' (సహకార సంఘాలు) లోనూ, దేవాలయ కమిటీలలోనూ వీళ్లదే సభ్యత్వం, వీళ్లదే ఆఖరిమాట. వాళ్ళు చెప్పిందే వింటారు. వాళ్ల మాటే చెల్లుతుంది.

ఇవన్నీ చూసి 'సూర్యాజీ షణై'కి చాలా బాధ కలిగేది. తన కుటుంబం కూడా వాళ్లస్థాయికి పెరగాలనీ, వూళ్లోని శ్రీమంతుల జాబితాలో రావాలనీ, ఈర్ష్యతో, కడుపుమంటతో దృఢనిశ్చయం చేసుకున్నాడు. వెంటనే రంగప్రవేశం చేశాడు. కొన్ని సంవత్సరాలు అతను 'డెజంప్రెదియాలా' అని పిలిచే ప్రభుత్వ టెండర్లు సంపాదించాడు. వివిధరకాల పనులుచేసి శ్రమించి బాగా డబ్బు గడించాడు. ఈ డబ్బుతో అప్పులు తీర్చి పాతభూములూ, తోటలూ విడిపించాడు, కొత్తవి కొన్నాడు. ఈ పనిలో అతనికి అతని సహోదరుల సహకారం బాగా లభించింది. ప్రతీవాళ్లూ తమతమ శక్తికి, యుక్తికీ తగినట్లు శ్రమించారు. ఈ విధంగా 'సూర్యాజీ షెణై' స్వప్నం ఫలించింది. ఇప్పుడు ఆయన కుటుంబం పేరుకూడా ఆ వూళ్ళోని దొడ్డ కుటుంబాల జాబితాలోకి ఎక్కింది. 'కమ్యూనిదాద్' (గోవాలోని వ్యవసాయ సహకారసంఘాలు) మరియూ దేవస్థాన కమిటీ మీటింగులలో 'సూర్యాజీ షెణై' వోటుకి, మాటకీ విలువ ద్విగుణీకృత మయింది. ఊళ్లో మేళాలు వచ్చినా, 'ఇంత్రుజ్' (కార్నివాల్) జరిగినా ఆయన యింట్లో పెద్ద హడావుడి. అందుకని దూరంగా 'బాణావ్లే' అనేచోట వుంటున్న అతనికి రస్తానీమిత్రుడు సలహాయిచ్చాడు.

"సూర్యా, నువ్వు నీ ఈ ఇల్లూ, పొలాలూ అమ్మేసి ఇక్కడికి మకాం మార్చు, ఆ డబ్బుతో యిక్కడే మళ్లీ కొనవచ్చు. మా మధ్య హాయిగా వుండిపో."

"మీరన్నట్లు చేయవచ్చు. నాకు తెలును మీరందరూ ఈ పనిలో తోడ్పడుతారని. కానీ మనం ఏ ఘనకార్యం సాధించినా, గొప్ప గౌరవం గడించినా దాని విలువ మనం పుట్టి పెరిగిన వూళ్లో వున్నంత మరోచోట వుండదు."

అందువల్ల 'సూర్యాజీ' తన స్వగ్రామంలోనే యిల్లూ, భూములూ సమకూర్చుకున్నాడు. పాత యింటి ప్రక్కనున్న స్థలంలో ఒక పెద్ద విశాలమైన భవనం కట్టాడు.

'సూర్యాజీ షెణై' తన 'షష్ఠీ' తాలూకాలోని 'బాణావ్లీం' గ్రామపు క్రైస్తవ

మిత్రుడితో చెప్పిన విధంగానే సొంత వూళ్లోనే పేరు, ప్రతిష్టలు, మానాభిమానాలూ, పెద్దరికం, ఆస్థి, సంపదలూ అన్నీ గడించాడు. అతనికీ అన్నీ కలిసి వచ్చాయి. అయితే వీటన్నిటితోటీ మరొకటికూడా కలసివచ్చింది. అదే ఈర్ష్య. ఊళ్లో ఎందరో చిన్నచిన్న రైతులు, షావుకార్లూ కుట్రలుపన్ని అతని మంచిపేరుని పాడుచేయాలని ప్రయత్నించసాగారు.

అటువంటి ఒక చిన్నరైతుతో, 'సూర్యాజీ'కి పొలం, భూముల విషయంలో చిన్న వివాదం వుంది. ఈ వివాదం ఒక నిమిత్త కారణం మాత్రమే. అతని పొట్టలో వున్న అసలు విషయం 'సూర్యాజీ'మీద ఈర్ష్య.

'విష్ణూ'ని 'కానూ'ని (రాణె ముఠా) ఎత్తుకుపోయారనే సంతోషవార్తతో అతను ఆరోజు భోజనంలో మరో నాలుగుముద్దలు ఎక్కువ తిన్నాడు. అయితే ఆరోజు రాత్రే 'సూర్యాజీ షెణై' వాళ్ళిద్దరినీ విడిపించి తీసుకువచ్చాడని విని వొళ్ళంతా మంటలతో కాలిపోయినట్లు కోపంతో భగభగ మన్నాడు. తక్షణం ఆలోచన వచ్చి పోలీస్‌స్టేషన్లో 'సూర్యాజీ షెణై'మీద ఫిర్యాదు చేశాడు.

''సూర్యాజీ షెణై మిమ్మల్ని పూర్తిగా మోసం చేశాడు. రాణె దక్షిణదిక్కుగా వెళ్లాడు, కానీ మీకు ఉత్తరదిక్కు చూపించాడు. అంతేకాదు తన మనుష్యులని చీకటి పడేలోగా విడిపించి తెచ్చుకున్నాడు. ఇవన్నీ ఎలా చేశాడని? హాయిగా ఇంట్లోనే కూర్చుని, కేవలం పురమాయింపులద్వారా. దీనివల్ల మీకు తెలియడంలేదూ 'సూర్యాజీ షెణై'కి రాణేకి ఏవో లావాదేవీలున్నాయని?''

ఇంత విన్నాక యింకా ఏవన్నా వుందా? మెట్లమీద నన్ను పోలీసాఫీసర్ పరుగు పరుగున "ఫొండా" (గోవాలో తాలూకా కేంద్రం) వెళ్లి అక్కడి పెద్ద అధికారికి సవివరంగా అన్నీ చెప్పాడు. ఆ తరువాత యిద్దరూ కలిసి "పంజిం" (గోవా రాజధాని)కి వెళ్లి పై అధికారులతో సవివరంగా చర్చించి ఒక నిర్ణయానికి వచ్చి "ఫొండా"లోని "ఎడ్మినిస్ట్రేటర్" (తాలూకా పరిపాలానాధికారి)కి తెలియజేశారు.

ఆకాలంలో ''గోవ్‌హనాడార్'' (గవర్నర్) అంటే గోవాకి రాజు, "ఎడ్మినిస్ట్రేటర్" అంటే తాలూకాకి పెద్ద. ఇద్దరి చేతుల్లోనూ గొప్ప పెత్తనం.

ఆరోజుల్లో "ఫొండా" తాలూకాకి 'విల్‌ఫ్రెడ్ పెరైర్' అనే పేరుగల అధికారి వుండేవాడు. అతను 'బాణవ్లీ' గ్రామంకి చెందినవాడు. చాలా తెలివైనవాడు, అలాగే నిష్ఠాపరుడు. పెద్దా, చిన్నా అనే తారతమ్యం లేకుండా న్యాయాన్ని కాపాడేవాడు.

కాని వయస్సులో పెద్ద. అడపా తడపా ఆరోగ్యం బాగోలేక సెలవు తీసుకోవడంవల్ల అతని 'సెక్రటరి' 'గణ్షూ షణై'కి అతని కార్యభారాలు చూసుకోవలసి వచ్చేది. అయితే అతనిమీద 'ఎడ్మినిస్ట్రేటర్'కి పూర్తి విశ్వాసం. "గణ్షూషణై" మానవత్వం గలవాడు. లౌక్యం తెలిసి వ్యవహరిస్తాడు. మితిమీరడు. తెలివైనవాడు. ఈరోజు 'పెరైరా' రానందున 'గణ్షూ' అతని పని చూసుకుంటున్నాడు.

"సూర్యాజీ షణై'కి సంగీతమంటే ప్రాణం. ప్రతీ పంచమిరోజు వాళ్ల యింట్లో భజన జరిగేది. వాడలోని కళాకారులు, గాయకులు, భజంత్రీలు ఆ భజనల్లో పాల్గొనేవారు. 'షణై' వుంటున్నవాడలో సంగీతంలో కనీస జ్ఞానంలేని వాళ్లులేరు. కొందరు పాడితే, కొందరు వాయిద్యాలు వాయిస్తారు. పెద్దలు, పిన్నలూ అందరూ సంగీత సాధకులూ, సంగీత ప్రియులూను. స్వతహాగా 'సూర్యాజీ షెణై'కి 'సితార్' వాదన చాలాయిష్టం. మనస్సు బాగులేనప్పుడు ఈతి బాధలన్నీ మఱచిపోయి వొంటరిగా గదిలో కూర్చుని 'సితార్' వాదనలో మునిగిపోతాడు.

ఈవేళ కూడా బయట మేడమీద వుయ్యాలలో కూర్చుని సితార్ వాయిస్తున్నాడు. అయితే ఈవేళ ఆనందంగా వున్నాడు. తన మీద వచ్చిన పెద్ద సంకటం సవ్యంగా తప్పిపోయినందుకు సంతోషంతో 'సితార్'మీదికి మనసు మళ్ళింది. ఇలా ఓ అరగంట గడిచింది. 'సూర్యాజీ షెణై' పెద్దకొడుకు మేడమీదికి వచ్చాడు. అతనితోబాటు 'ఫోండా' ఎడ్మినిస్ట్రేషనల్ ఆఫీసుకి చెందిన 'అబ్దుల్' అనే అధికారి వచ్చాడు. అతన్ని చూస్తూనే 'సూర్యాజీ షణై' సితార్ పక్కకి పెట్టి అడిగాడు.

"ఏంటిరా తమ్ముడూ, ఏమయింది?"

"ఇదిగో చూడు. 'ఫోండా' నుంచి 'అబ్దుల్' వచ్చాడు. సెక్రటరీ వ్రాసిన వుత్తరం తెచ్చాడు. నే నివ్వమని అడిగాను. కాని తననే మీ దగ్గరకి తీసుకుపొమ్మని చెప్పాడు."

సూర్యాజీ షెణై అబ్దుల్లా కేసి చూశాడు ప్రశ్నార్థకంగా.

"అవునండి. సెక్రటరీగారు ఈ ఉత్తరం మీకే స్వయంగా యిమ్మని చెప్పారు." అంటూ కోటు జేబులోంచి ఒక పెద్దకవరు, అందులోనున్న వుత్తరం తీసి 'షణై'కి యిచ్చాడు. 'సూర్యాజీ షెణై' ముందు సెక్రటరీ వ్రాసిన వుత్తరం చదివాడు. అది పోర్చుగీసు భాషలో వుంది.

"ఎల్లుండి పగలు పదిగంటలకి 'ఫోండా'లోని మా ఆఫీసుకి నువ్వు హాజరు కావాలి. ఈ నోటీసుని రెండు కాపీలుగా పంపుతున్నాము. ఒకటి నువ్వు వుంచుకుని మరోదానిమీద సంతకం చేసి తిరిగియియ్యి. రేపుప్రొద్దున్న నీ పనులన్నీ పక్కకిపెట్టి నన్ను వచ్చి కలుసుకో. ఈ వుత్తరం గురించి ఎవరికీ తెలియకూడదు."

'సూర్యాజీ షణై' విచారంలో పడ్డాడు. 'గణ్‌షూ షణై'కి అతనితో చాలా దగ్గర సంబంధం వుంది. ఒకరితో ఒకరు లావాదేవీలు కూడా పెట్టుకునే వారు.'సూర్యాజీ షణై' అతనికి తన భూములలోని చెరువులలోని రొయ్యలు, చందువాయి చేపలూ తాజాగా పట్టినవి పంపేవాడు. 'గణ్‌షూ షణై' బదులుగా అతనికి చిలగడదుంపలూ, కంద, యిత్యాదివి తన తోటలో పండినవి పంపేవాడు. కానీ ఈ వేళ పొడి అక్షరాలతో ఎవరో పరాయి మనిషి రాసినట్లు నాలుగు వాక్యాల వుత్తరంతో 'సూర్యాజీ'కి వింత, దిగులు కలిగింది. పొరుగున వుండే 'ఆత్మా షెణై' అతనికి విరుద్ధంగా పోలీసులకి రిపోర్టు యిచ్చిన వైనం అతనికి తెలియనే తెలియదు. రేపు ప్రొద్దున్న 'ఫోండా'కి వెళ్ళక తప్పదు. పెద్దకొడుకుని పిలిచిచెప్పాడు.

"భావూ(, దేవల్‌వాడలోని 'సావ్‌ళా'ని పిలుచుకురా, వాడిదగ్గర కెళ్లి వాడికి తుపాకీ, మందుగుండు సామాగ్రి యిచ్చి రెండుమూడు పిట్టలని కొట్టి తెమ్మను. రేపు నేను 'ఫోండా' వెళ్తున్నాను. నాతో తీసుకువెళ్ళడానికి. మరి చూడు, రేపు నేను 'ఫోండా' వెళ్లడానికి అన్నీ సిద్ధం చెయ్యి.

మర్నాడు ప్రొద్దున 'సూర్యాజీ షణై' పల్లకీ (సవారి) 'గణ్‌షూ షణై వల్‌వట్‌కార్' యింటిముందు దిగింది. అతనితో (సూర్యాజీ షెణై) బాటు అతని నమ్మిన బంటు 'లాడూ' అనే నౌకరూ వచ్చాడు. "లాడూ" పల్లకీ పరదాని పక్కకి జరిపాడు. సూర్యాజీ షెణై బయటికి వచ్చాడు. శుభ్రమైన పంచె, కాళ్లకి చెప్పుల జత, పొడుగైన కోటు, నెత్తిన తలపాగా, చేతిలో పాముతల రూపంలో చేతి కఱ్ఱ ఈ తరహా వేషంలో 'సూర్యాజీ షెణై' ఎవ్వరినైనా ఆకర్షిస్తాడు. అతని మొహంమీద ఆకర్షణతోబాటు చూసేవారికి భయభక్తులు కూడా కలుగుతాయి. 'గణ్‌షూ షణై' బయట గుమ్మం దగ్గర అతనికి స్వాగతం పలకడానికి నిలబడ్డాడు. తెల్లటి అంగవస్త్రం, జుబ్బా వేసుకున్నాడు. అతని నున్నని గుండుచివర, నల్లని వొత్తైన జుట్టుతో కదిలే పిలక ముందుగా అందర్నీ ఆకర్షిస్తుంది. పిలకకి ముడివేశాడు. ఈవేళ పగలే క్షవరం చేసుకున్నాడు. అందువల్లనే పిలక పరిసరప్రాంతం (తలమీది) ఆకుపచ్చగా

కనిపిస్తోంది.

'సూర్యాజీ షెణై' గుమ్మం ముందు అడుగుపెట్టగానే అతనికోసం ఎదురుచూస్తున్న 'గణ్‌షూ షణై' ముందుకువచ్చి కౌగిలించుకున్నాడు. ఆ తరువాత అతన్ని ఆదరంగా బయట గదిలోని వాలుకుర్చీలో కూర్చోబెట్టాడు. ఈలోగా 'లాడూ' సవారీలోని సామాన్లన్నీ - అందులో వేటాడిన మూడు పిట్టలుకూడా వున్నాయి - లోపలకి చేరవేశాడు.

'గణ్‌షూ షణై' 'సూర్యాజీ షెణై'ని అన్నివిధాలా పరామర్శిస్తున్నాడు. అయితే ఈవేళ ఎందుకో అతని మాటల్లో ఎప్పుడూవుండే వుత్సాహం, నిష్కపటత్వం కరువయింది. అతని మొహంమీద, మాటలతీరులోనూ హావభావాలలోనూ ఒకవిధమైన శోకం, వుద్వేగం దాగున్న ఛాయలు కనిపిస్తున్నాయి. అతను 'సూర్యాజీ షెణై'కి ఏదో ముఖ్య విషయం చెప్పాలని అనుకొంటున్నాడు. కానీ ఎలా చెప్పాలో తెలియక తికమక పడుతున్నాడు. ఈ గందరగోళ మనస్థితిలో చాలాసేపు మగ్గి, ఈ ముసుగులో గుద్దులాట యింకెంతసేపని ఒక నిర్ణయానికి వచ్చాడు.

మధ్యాహ్నం భోజనం అయింది. ఇద్దరూ ఒకే గదిలో విశ్రమించి లేచారు.

టీ త్రాగి, తాగుతూ మధ్యలో ఆగి 'సూర్యాజీ షెణై' అతనిని అడిగాడు.

"గణేష్, నేను వచ్చినప్పట్నించీ నిన్ను చూస్తున్నాను. ఈవేళ నీ చిత్తం నీలోలేదు. నువ్వు నాతో ఏదో చెప్పాలనుకొంటున్నావు. కానీ చెప్పలేక పోతున్నావు. అవునా? ఏం జరిగింది? ఆ "ఇతింసాఁవ్" (పోలీసుల పిలుపు) ఎందుకు?"

"... నువ్వు అంటున్నది నిజమే. ఆ సంగతి చెప్పడానికి నేను తటపటాయిస్తున్నదీ నిజమే! అంతేకాదు, నాకు చాలా బాధ కలుగుతోంది. అయినా తప్పదు. ఆ విషయం చెప్పక తప్పదు. కానీ ముందు ఈ పనిచెయ్యి. నీ బంటు 'లాడూ'ని 'షిరోడా'కి పంపి, నీ యిద్దరు కొడుకులనీ యిక్కడికి తెప్పించు. నీ పొరుగువాడు 'ఆత్మా షణై' నీకు ద్రోహం చేశాడు. నీమీద అతడు చేసిన పితూరీ యిదిగో. దాని ఆధారంగా 'పంజిం'లోని 'క్వార్తెల్ జనరల్' (పోలీస్ సూపరింటెండెట్) యిచ్చిన ఆదేశం యిదిగో. రెండు కాగితాలూ నువ్వు చదువుతూ వుండు. నేనిప్పుడే లోపలకి వెళ్లివస్తాను. 'గణేశ్' మాటల చివర్లో గొంతుక గద్గద స్వరం పలికింది.

'సూర్యాజీ షెణై' ఖిన్నుడయ్యాడు. అతనికి ఈ సంఘటన అర్థమే తెలియలేదు. మనస్సు దృఢం చేసుకునే ముందు 'ఆత్మ షణై' పితూరీ వున్న కాగితం

పైపైనే చదివాడు. ఆ తరువాత పంజిం నుంచి వచ్చిన 'ఆర్డర్' (ఆదేశం) చదివాడు. ఆర్డర్ ఏమిటి? అది మరణశాసనం!!

అందులో ఇలా వ్రాశారు.

" 'షిరోడా' గ్రామ వాసి 'సూర్యాజీ షెణై'కి బందిపోటు దొంగ 'బల్వంత్ రాణె'తో సహాయ సంబంధాలున్నాయని తెలిసింది. అందువల్ల అతనిని పట్టి ఎల్లుండి పదకొండు గంటలకి తుపాకీగుండుతో పేల్చి చంపెయ్యాలని నిర్ణయించబడింది. అందుకు వీలుగా ఎల్లుండి పదిగంటలకి ముందు అతనిని మాకు అప్పగించమని ఆదేశిస్తున్నాము."

హా(! అమ్మా! 'సూర్యాజీ షెణై' కళ్లముందు చీకట్లు క్రమ్మాయి. తలతిరిగి, వొళ్ళు స్పృహ తప్పింది. ఇంతలో గది లోపలికి 'గణేష్ షణై' వచ్చాడు. అతన్ని చూడగానే 'సూర్యాజీ' గబగబా ముందుకి అడుగులువేసి అలింగనం చేసుకున్నాడు.

"గణేశ్."

"సూర్యా."

ఒకర్నొకరు వాటేసుకున్నారు. ఇద్దరికీ మాటలు కరువయ్యాయి. అంతా నిశ్శబ్దం. మధ్యమధ్య ఏడుస్తున్న ఎక్కిళ్ళు. గుండె లోతుల్లోంచి వులికి వులికి వస్తున్న దుఃఖ సముద్రపు కెరటాలు కాస్త శాంతించాక యిద్దరు మిత్రులూ కళ్లు తెరిచారు. 'గణేశూ షణై' తన యిష్ట మిత్రుడిని యిదివరకటిలాగ ముందుగదిలోని పడక కుర్చీలో కూర్చోపెట్టాడు. నెమ్మదిగా ఓదార్పుగా అతనితో అన్నాడు.

" సూర్య, శాంతించు. నీకు వచ్చిన ఉపద్రవం తొలగించడానికి నేను గగన ప్రయత్నాలు చేస్తున్నాను. విజయం మన కులదేవత కరుణా కటాక్షాల వల్లనే సాధ్యపడుతుంది. ఆ దేవికే ప్రార్థనలు చేద్దాం."

'ఆర్డర్' అందిన్ క్షణం నుంచీ 'గణేశూ షణై' మనశ్శాంతి పోయింది. అతను తక్షణం వెళ్లి 'అడ్మినిస్ట్రేటర్'ని కలిశాడు. షణైకి - రాణెకి ఏవో భేదాలున్నాయనే కేసు నమోదయినట్లు చెప్పాడు. 'సూర్యాజీ షెణై'కి, 'రాణె'కి భేదాలున్నాయంటె ఆ కేసుకి అర్థం 'సూర్యాజీ షణై' శత్రువులు అతనికి మరణశిక్ష పడి, అతను ఈ ప్రపంచం విడిచిపోవాలని ఈర్ష్యతో పన్నిన కుటిల, క్రూర కుట్ర అని 'అడ్మినిస్ట్రేటర్'కి నచ్చ చెప్పాడు. 'అడ్మినిస్ట్రేటర్'కి తన సెక్రటరీ చెప్పిన విషయం సబబైనదే ననిపించింది. ఇటువంటి కుట్రలు ఆ కాలంలో చాలా జరిగాయి.

(ఎందరో అమాయకుల ప్రాణాలు తీశాయి) అతను యిటువంటి కెసులన్నీ కలిపి ఒక సంయుక్త నివేదికని ప్రభుత్వానికి సమర్పించాడు. అలాగే ఆ నివేదికలో ఒక హెచ్చరిక చేశాడు.

"ఇటువంటి ఏవిధమైన పాతకమూ చేయని అమాయకులని మీరు కాల్చి చంపితే, తిరుగుబాటు అణగదు సరికదా ఇంకా హెచ్చిపోతుంది. అందువల్ల ప్రభుత్వ హితంకోరి మొదటి 'ఆర్డర్' (ఆదేశం) వెనక్కి తీసుకుని 'సూర్యాజీ షణై'ని విడుదలచేసి గౌరవంతో పంపేయాలి'' అని అతను నిష్కర్షగా విజ్ఞాపనలో వ్రాశాడు.

ఈ విజ్ఞాపనకి జవాబు ఈవేళకి రావాలి. కానీ సాయంత్రం అయిపోయినా అది అందలేదు. అందువల్ల 'గణ్శూ షణై'కి బెంగ పట్టుకుంది.

రాత్రి ఎనిమిది గంటలకి 'సూర్యాజీ షణై' యిద్దరు కొడుకులనీ, యిద్దరు పనివాళ్ళనీ తీసుకుని 'లాడూ' వచ్చాడు, 'గణ్శూ షణై' యింటికి. ఈ సంగతి తెలిసి వాళ్ల కళ్లల్లో నీళ్లు నిండాయి. అయితే అలా దుఃఖించకూడదని 'గణ్శూ షణై' గట్టిగా హెచ్చరించాడు. కొడుకులిద్దరూ రాత్రంతా తండ్రి పక్కనే కూర్చుని గడిపారు.

మర్నాడయింది. అందరూ కాలకృత్యాలు మౌనంగా చేసుకుంటున్నారు. ఎవ్వరి మనసూ మనసులోలేదు. పగలు ఎనిమిదయింది, తొమ్మిదయింది, అయినా 'పంజిం'నుంచి ఏ కబురూ లేదు.

సరిగ్గా పదిగంటల సమయంలో ఐదుగురు సైనికులతో ఒక పటాలం 'గణ్శూ షణై' యింటికి వచ్చింది., 'సూర్యాజీ షణై'ని తమకి అప్పగించమని కోరింది. ఆ 'పటాలం' అధిపతి తనకి వచ్చిన 'ఆర్డరు' (ఆదేశం) 'గణ్శూ షణై'కి చూపించాడు. అదిచూసి 'గణ్శూ షణై' అలాగే లోపలికివెళ్లి, ఒక వ్రాసిన కాగితం తీసుకువచ్చాడు.

" ఇదిగో చూడండి. మా 'ఎడ్మినిస్ట్రేటర్' ఈ విషయం గురించి 'గవర్నర్'గారికి పంపిన విజ్ఞాపన పత్రం కాపీ. ఈ వుత్తరానికి జవాబు వస్తేగాని 'సూర్యాజీ షెణై'ని మీకు అప్పగించడం మంచిదికాదు. 'సూర్యాజీ షెణై' విషయంలో పూర్తి బాధ్యత నాది.''

ఈవిధంగా వాళ్లు తర్జన భర్జనలో వుండగా, స్వయంగా 'ఎడ్మినిస్ట్రేటర్' 'విల్‌ఫ్రెడ్ పెరైరా' తన సెక్రటరీ సహితంగా పెద్దగా మాట్లాడుతూ నవ్వుతూ లోపలికి వచ్చాడు. వాళ్లతోబాటు యిద్దరు 'పాక్లో' (పోర్చుగీసు హయాంలోని తెల్ల పోలీసులు

- విదేశీయులు)లు కూడా వచ్చారు. 'ఎడ్మినిస్ట్రేటర్' నవ్వుతూ, నవ్వుతూ శుభవార్త చెప్పాడు - పోర్చుగీసు భాషలో.

"మన మాననీయ 'గవర్నర్'గారు మన విజ్ఞాపన స్వీకరించి, తన 'ఆర్డర్' (ఆదేశం) రద్దు చేశారు. అంతేకాదు 'సూర్యాజీ షెణై'ని గౌరవాలతో విడుదల చేయమని ఆజ్ఞాపించారు. అంతేకాదు అతని జీవితంలో యిది చిరస్మరణీయమైన రోజు కాబట్టి అతని గౌరవంగా ఒక 'తర్‌సాదయ్' (రాచమర్యాదకి చిహ్నమైన ఖడ్గం) పంపారు. శుభం."

ప్రొద్దున్నించీ నల్లని మంచు తెరలలో పొంచి వున్న అరుణ కిరణాలు హఠాత్తుగా ప్రేలుడు అయినట్లు బయటపడ్డాయి, ఆవరణచుట్టూ మసలుతున్న ప్రకృతి కన్య పకపకా నవ్వింది. ఇంతవరకూ ముడుచుకు కూర్చున్న చెట్లు, విప్పిన గొడుగుల్లా లేచాయి, అలాగే వాటి నాశ్రయించిన వేలాది పక్షులకి బద్ధకం పోయి రెక్కలు వచ్చాయి. అవి గొంతుక విప్పాయి. నవోదయానికి నాంది పలికాయి.



5

# ముడుపు

**- దామోదర్ మావ్‌జో**

పుణ్యం, పాపం ఈ రెండు సరిహద్దుల మధ్య నిల్చొని నేను చేసిన ఒక కార్యం గురించి ఈ కథ.

నాకు 'మాజోర్డె' ('గోవా'లో ఒక వూరు) చర్చికి సహాయ ఫాదరీ అని బదిలీ అయింది. వేసవికాలం మొదలయింది. చర్చిలో చేయవలసిన పనులూ, వూళ్లోని మనుష్యుల కొత్త పరిచయాలూ-ఈ విషయాలలో నిమగ్నమైపోయాను. ఒక నెల తెలియకుండానే గడిచిపోయింది.

'సహాయ మతగురువుగా' (ఫాద్రీ) నా పని, నాకెంతో మనస్ఫూర్తిగా యిష్టం. స్నేహ సంబంధాలుపెంచుకోడం, పిల్లలతో ఆడుకోడం, చదువుకొనే పిల్లలకి వుత్సాహ ప్రోత్సాహాలు యివ్వడం, చెడునడతల్లో మసిలేవాళ్ల విషయం వాకబు చెయ్యడం, కష్టాలలో చిక్కినవాళ్ళకి తగిన సహాయం చేయడం నాకు మొదట్నించీ బహు ఇష్టం - 'ఫాద్రీ' అయాక ఈ నా తత్వం మరీ బలపడింది. నేను ఈ గుణాన్ని పూర్తిగా సద్వినియోగం చేస్తున్నాను.

ఒకరోజు నేను చర్చిలో ప్రవచనాలు (సెర్మన్) చెబుతూ మంచి పట్టులో వున్నాను. ఒక స్త్రీ తన కొడుకుని ఒక జాతరలో ఏవిధంగా పోగొట్టుకుందీ, ఆ పిల్లవాడు తప్పిపోతే వెతికి, వెతికి విసిగిపోయి, ఏవిధంగా భగవంతుణ్ణి ప్రార్థించి, ఆయన మీదే భారం వదిలిందీ, తరువాత ఆవిడ మ్రొక్కుబడికి ఫలితంగా 'మేరీ'మాత (Mother Mary) కరుణించి కొన్ని సంవత్సరాల పిదప ఆ పిల్లవాడు తిరిగి లభించేలా చేసిందీ వివరంగా చెప్పాను. నా 'సెర్మన్' పూర్తయ్యాక జనమంతా దేవుడికి ప్రార్థనలు చేసి, ఇళ్ళకి వెళ్లిపోయారు. కానీ ఒక వయస్సుమీరిన వ్యక్తి వెళ్లలేదు. ఇంకా బల్లమీదే తలవొంచి కళ్లు మూసుకు కూర్చున్నాడు - ప్రార్థనచేస్తూ.

అతని భక్తి, శ్రద్ధ నన్ను ఆకర్షించాయి. ఏదో కష్టంలో పడి భగవంతుణ్ణి రక్షించమని ప్రార్థిస్తున్నాడు కాబోలు. అతడి ధ్యానం భగ్నం చేయడం యిష్టంలేక, అతడిని అలాగే విడిచి నేను లోపలికి వెళ్లిపోయాను. చర్చి విషయాలు ఫాదరీ (మతాచార్యుడు)తో మాట్లాడడానికీ, చర్చి సేవకులకి చెప్పవలసిన పనులు పురమాయించడానికీ వెళ్లాను. ఆ ప్రకారమే ఫాదరీతో మాట్లాడి 'సాంక్రిష్టావ్' (చర్చిలో సామాన్లు వుంచే కొట్టు)లో సేవకులకి చేయవలసిన పనులు చెప్పి, బయటకి వచ్చాను.

చర్చి ప్రవేశద్వారం దగ్గరే అతన నిలబడి, చేతిలో జపమాలతో భగవన్నామం స్మరిస్తున్నాడు. వయస్సు యాభై లేదా యాభైఅయిదు సంవత్సరాలు వుండవచ్చు. కానీ నడుం వొంగి, చర్మం ముడుతలుపడి డెబ్బై ఏళ్ల ముసలివాడిలా కనిపిస్తున్నాడు. మెడమీద శాలువా కప్పుకొన్నాడు. ఈరోజుల్లో యిలా శాలువాని కప్పుకునేవాళ్లు బహుతక్కువ. అందువల్ల అతడి ఈ వేషం కొంత అసామాన్యంగా తోచింది. నాకు ఫేస్-రీడింగ్ (ముఖాన్ని చూసి వ్యక్తిత్వాన్ని విశ్లేషించడం - అనే కళ) రాదు. అయినా నాకనిపించింది - ఈ వ్యక్తి దయామయుడు, పరోపకారి. అతడు నా కోసమే నించునట్టు వున్నాడు. నన్ను చూడగానే తలవొంచి వందనం చేశాడు. వయస్సులో నేను చాలా చిన్నవాడిని గనక సిగ్గేసింది.

నేను ఆ పెద్దాయన దగ్గరకి వెళ్లి భుజంమీద చెయ్యివేసి పలకరించాను "ఏం నాయనా? ఎలాగున్నావు?"

నేనింత అన్నానో లేదో, ఆ ముసలాయన పెదవులు వొణకసాగాయి. కళ్లు చిన్నవిచేసి, ఏదో అర్థిస్తున్నట్లు చూడసాగాడు. అతని కళ్ళల్లో నీళ్లు నిండాయి. వొణుకుతున్న చేతుల్తో తన భుజంమీదనున్న నా చేతుల్ని నిమురుతూ అన్నాడు.

"నా కొడుకా! ... నువ్వు... నువ్వు నా కొడుకువా?"

నేను తడబడుతూ అన్నాను "నువ్వు నాకు జన్మనివ్వకపోయినా, నన్ను నీ కొడుకుగా భావించు".

నా ఓదార్పు మాటలతో ఆ ముసలాయన కాస్త స్థిమిత పడ్డాడు. కళ్లల్లో నీళ్లు అరచేయితో తుడుస్తూ, అన్నాడు.

"గురూజీ! క్షమించాలి. మీరు నన్ను 'నాయనా' అని సంబోధించారు. నాకనిపించింది ... నాకనిపించింది... నా కొడుకే నన్ను పలకరించాడని ... నా

కొడుకే నాకు లభించాడని ... బహుశా నీ అంతే పెరిగి వుంటాడు ఇప్పుడు.''

ఆ ముసలాయన దుఃఖం నాకు అర్థమయింది. అయన కొడుకు ఎక్కడికో దూరప్రాంతాలకి వెళ్లివుంటాడు. బహుశా నావికుడయి వుండొచ్చు. నేను ఆయన్ని అడిగాను.

''మీ అబ్బాయి ఎక్కడుంటాడూ?''

పెద్దపెద్దగా తలాడిస్తూ, లోపల నుంచి వరదలా వస్తున్న దుఃఖాన్నీ, ఏడుపునీ ఆపడానికి గట్టిగా పళ్లతో పెదాల్ని నొక్కిపెట్టి, గద్గదస్వరంతో అతనన్నాడు.

''నాకు తెలియదు... ఎవ్వరికీ తెలియదు''ఆగి, శిలవ (క్రాస్) వైపు వేలు చూపిస్తూ ''ఒక్కరికే తెలుసు... భగవంతుడికి.''

నా గందరగోళం మరంత హెచ్చింది. క్షణంసేపు నాకు అనుమానం వేసింది. ఈ ముసలాడు పిచ్చివాడు కాదు కదా? కానీ పాపం అతని దుఃఖం చూసి నా మనస్సు కరిగిపోయింది.

''నీ పేరేమిటి?'' అడిగాను.

''కామిల్.''

''నువ్వెక్కడుండేది?''

''చెఱువు దగ్గరున్న మేడ ఇంట్లో.''

''నాయనా 'కామిల్' నువ్వింక ఇంటికివెళ్లు. నేను తరువాత నిన్ను కలుస్తాను'' నే నన్నాను.

''గురూజీ! మీరు మీ ప్రవచనంలో చెప్పిన ప్రకారం నేనుకూడా ముడుపు చెల్లించడానికి సిద్ధంగా వున్నాను.''

నా జవాబుకోసం 'కామిల్' ఎంతో ఆతృతతో నా కళ్లల్లో చూస్తున్నాడు. నేను అతని దృష్టిని తప్పించుకుని వూరికే వున్నాను.

''అలా చేస్తే నా కొడుకు తిరిగొస్తాడు కదూ?''

అతను నన్ను అడిగాడు.

''అవును వస్తాడు. దేవుడి మీదే భారం వెయ్యి. వేసి ఎదురుచూడు'' నేను అతని భుజం తట్టి ధైర్యం చెప్పాను.

''కామ్‌లిన్'' వెళ్లడానికి వెనుతిరిగాడు. వెళ్తూ, వెళ్తూ అతనన్నమాటలు నా చెవికి తగిలాయి.

"చాలా, చాలా ఎదురుచూశాను ఫాద్రీ. ఇంకా ఎదురు చూస్తున్నాను. అయినా ఫరవాలేదు... ఇంకా ఎదురుచూస్తాను."

అతను వెళ్తూ వుండగా, అతనిని సాగనంపడానికి ఎందుకో నాకాళ్లు ఆడలేదు. నేను తిరిగి లోపలికి వచ్చేశాను. లోపలికి వచ్చి 'సాంకిశ్తాన్'ని పిలిచాను, వచ్చాడు.

"ఇదిగో ఒక విషయం చెప్పు. ఇప్పుడు వచ్చిన ఆ ముసలాయన ఎవరు? అతను నీకు తెలుసా?"

"ఎవరూ? కామిలా."

"అవును. అతని కథ ఏమిటి? అతని కొడుకు ఎక్కడున్నాడట!"

నేను ఉత్సుకతతో అడిగాను.

"ఏం చెప్పను అయ్యా! 'కామిల్' నాకు బాగా తెలుసు. మనిషి స్వచ్ఛమైన బంగారం. ఎవ్వరికైనా అవసరానికి ఆదుకొంటాడు. అతనికి ఎవ్వరూ నా అనే వాళ్లు లేరు. పాపం ఒక్కడే ఒంటరిగా వుంటాడు. అతనికి ఒక్కడే కొడుకు. ఆ కొడుకు పుట్టగానే, పెళ్లాం చనిపోయింది. ఆ తరువాత 'కామిలే' కొడుకుని పెంచి పెద్దచేశాడు. కానీ పాపం ఒకరోజు ఆ కుఱ్ఱవాడు - సుమారు పన్నెండేళ్లు వుంటాయి - తప్పిపోయాడు. ఎక్కడికెళ్లాడో, ఏమైపోయాడో ఎవరికీ అంతుపట్టలేదు. చాలా వెతికారు. ఏం ప్రయోజనం లేకపోయింది. ఇది జరిగి సుమారు ఇరవై సంవత్సరాలయింది. ఆ అబ్బాయి గురించి ఏవిధమైన సమాచారం అందలేదు. అసలు బతికున్నాడో, లేదో కూడా తెలియదు, ఎవ్వరికీ!"

నేను ఆశ్చర్యంగా అడిగాను. "మరి 'కామిల్' ఆశ వదులుకోలేదా? ఇంకా కొడుకు కోసం వెతుకుతున్నాడా?"

"అవును. అతనికనిస్తుంది - కొడుకు తప్పక తిరిగొస్తాడని - ఏనాటికైనా! పాపం ముసలివాడయ్యాడు. కాస్త మతిభ్రమణం కూడా వచ్చినట్లుంది."

నేను ఆలోచనల్లో పడ్డాను. 'సాంకిస్తావ్' చెప్పుకుపోతున్నాడు.

"కామిల్‌కి చాలా వుంది. పిల్లవాడు తప్పిపోయినప్పట్నించీ, ఎంతో ఆచూకీ చేశాడు. అందుకోసం ప్రత్యేకంగా బొంబాయి కూడా వెళ్లాడు. ఈ ఊరికి వచ్చే ప్రతీ ఓడ పనివాళ్ళని, పడవవాళ్లనీ విచారిస్తాడు, జాలేస్తుంది - పాపం - 'కామలిన్' దుస్థితి! మనిషి చాలా ఉత్తముడు. ఈ 'కామలిన్' గత పది, పన్నెండేళ్లలో కనీసం ఐదారు పిల్లల్నయినా తన పిల్లల్లాగా ప్రేమావాత్సల్యాలతో పోషించి పెంచాడు!

కానీ పాపం ఏం చేస్తాం అందరూ కృతఘ్నులై విడిచి వెళ్లిపోయారు!"

"మరి అలా ఎందుకు పోషించాడు అంతమందినీ?"

"ఐదుగురు అంటే ఒక్కసారే అందర్నీకాదు. ఒక్కొక్కసారి ఒక్కొక్కర్ని! ఎందుకు పోషించాడో అతనికే తెలియాలి. అతనికి బహుశా ఇలా అనిపించేది! ఎవరైనా బీద పిల్లవాడిని పోషించి పెద్దచేస్తే, ఆ పుణ్యంవల్ల తన కొడుకు - వాడెక్కడున్నా - సుఖపడతాడనీ! ఆకుర్రాళ్ళకి మాత్రం మదమెక్కినట్లుంది. అతను పెట్టిన తిండీ, బట్టా అనుభవించినన్నాళ్లూ అనుభవించి అతనికే ఎసరుపెట్టి పలాయనం చేశారు!"

'కామిల్' కథ విని నా మనస్సు చివుక్కుమంది. ఆరోజు ఆ ఆలోచనల్లోనే గడిచింది. మర్నాడు 'కామిల్' 'సెర్మన్' (ప్రవచనం)కి ఎందుకో రాలేదు. నేను మధ్యాహ్నం లేచి, వెతుక్కుంటూ కామలిన్ ఇంటికి చేరాను 'కామిల్' వసారాలోనే వాలుకుర్చీలో పడుకున్నాడు. ఒంటిమీద నిన్నటి బట్టలే వున్నాయి. నా అలికిడి అవగానే గబగబా లేచాడు.

"ఎవరూ? నా కొడుకు 'జుజో' వచ్చాడా? రా బంగారు తండ్రీ రా"

నేను ముందనుకొన్నాను. 'ఫాద్రీ' (గురువు) వచ్చాడనే గౌరవభావంతో లేచాడని! కానీ తన ముద్దుల కొడుకు వచ్చాడనుకున్నాడు, పాపం! నా 'రోబ్' (మత గురువులు ధరించే ఘనమైన దుస్తువు)ని చూసి కూడా గుర్తు పట్టలేదు. నాకు చెప్పక తప్పలేదు.

"నాయనా 'కామిల్'! నేను 'జుజో'ని కాదు. 'ఫాద్రీ'ని."

'కామిల్' నిరాశపడి, శక్తి హఠాత్తుగా పోయినవాడిలాగ వరండాలో చతికిలబడ్డాడు. అతని పొరుగింటి వ్యక్తి వచ్చి నాతో అన్నాడు.

"ఈ మధ్య అతని ప్రవర్తన కాస్త పిచ్చిగా వుంటోంది. ఎవరొచ్చినా 'జుజో' వచ్చాడని భ్రమపడతాడు. ఆ తరువాత కాదని తెలిసి నిరాశపడి, కూర్చుంటాడు."

ఆ వ్యక్తి మాటలు విని నా గుండెల్లో దుఃఖం వరదలా వచ్చింది. 'కామిల్' దగ్గర కూర్చుని మెల్లిగా అడిగాను.

'కామిల్'గారూ, ఈవేళ మీరు 'సెర్మన్'కి రాలేదేమి?

"రోజు రావడం వీలవడంలేదు. నిన్న వచ్చాను కదా, ఆ బడలిక యింకా తీరలేదు."

"ఫరవాలేదు. దీనులకీ, దుర్బలులకీ భగవంతుడు యింటి దగ్గరే దర్శనమిస్తాడు."

'కామిల్' నిజం తెలిసినట్లు తలూపాడు. క్షణం ఆగి అన్నాడు.

"నేను 'మేరీ'మాతకి మొక్కుకున్నాను."

"మంచి పని చేశావు" నే నప్రయత్నంగా అన్నాను. నేనింకా ఏదో చెబుతానని ఆకాంక్షతో ఎదురు చూస్తున్నాడు. కానీ ఎందువల్లో నా గొంతుక ఎండిపోయింది. "నీ కొడుకు జుజో తప్పకవస్తాడు." కానీ... కానీ అలా అనాలనిపించినా మాటలు పెగల్లేదు. గొంతుక మూగదయిపోయింది.

"ఇప్పుడొస్తాడు. నా 'జుజో' ఇప్పుడొస్తాడు."

'కామిల్' తనకి తానే చెప్పుకుంటున్నాడు.

ఆరోజునుంచీ నేను 'కామిల్' ఇంటికి వెళ్ళలేదు. నాకు భయంవేసేది, 'కామిల్' ఆ విషయం నన్నడుగుతాడేమోనని, మొక్కుబడి చేసినా ఇంకా ఎందుకు రాలేదు నా కొడుకు అని. "విశ్వాసం వుంచి ఎదురుచూడు" అని నేను ముందే చెప్పాను. "కానీ ఎన్నిరోజులని ఎదురుచూడను?" అని నన్ను ప్రశ్నిస్తే, నేను ఏమని జవాబివ్వడం? అందువల్ల నేను 'కామిల్' ఇంటికి వెళ్లకపోయినా, అతని బాగోగులు విచారిస్తున్నాను.

'కామిల్' ఆరోగ్యం రోజురోజుకీ దిగజారిపోతోంది. మతి చలిస్తోంది. కానీ కొడుకు తిరిగి వస్తాడనే విశ్వాసం మాత్రం రోజు రోజుకీ పెరిగిపోతోంది!

వర్షాకాలం చేరువయింది. స్కూళ్ల సెలవులు పూర్తయి కొత్తగా తెరిచారు. ఒకరోజు ఒక స్త్రీ 'చాందోర్' (గోవా 'సాల్‌సెట్' తాలూకాలో గ్రామం) నుంచి వచ్చింది - ఒక పిల్లవాడిని వెంటబెట్టుకుని - చర్చికి. మతగురువు బయటకి వెళ్లాడు. నేనే ఆమెని కూర్చోబెట్టి అసలు సంగతి అడిగాను. తాను అతి పేదరికం వలన కొడుకుని పోషించలేకపోతోందనీ, అందువలన చర్చి ఆధీనంలో వున్న 'బోర్డింగ్' (భోజన, వసతి సౌకర్యాలు యిచ్చే యిల్లు)లో జేర్చుకోమని అర్థించడానికి వచ్చింది. ఆమె దీనంగా అంది.

"ఈ కుఱ్ఱవాడిని మీరు వుంచుకుంటే ఎంతో పుణ్యముంటుంది. మీరు చెప్పిన ప్రతీ పనీ చేస్తాడు." మా చర్చి 'బోర్డింగ్' ఇంట్లో యిటువంటి పిల్లలు యింకా వున్నారు. ఆ స్త్రీ విన్నపం స్వీకరించి, ఆ పిల్లవాడిని మా చర్చి వసతిగృహంలో

చేర్చుకోడానికి అంగీకరించాను. ఆమె ఆ బాలుణ్ణి మా కప్పగించి యింటికి వెళ్లిపోయింది.

ఆ పిల్లవాణ్ణి దగ్గరకి పిలిచాను. పధ్నాలుగు సంవత్సరాలుండవచ్చు - హుషారుగా కనిపిస్తున్నాడు - నేనడిగాను-

"నీ పేరేమిట్రా?"

"జుజో."

పేరు వినకముందే నాకు హఠాత్తుగా 'కామిల్' గుర్తుకి వచ్చాడు. అతని కొడుకు పేరు కూడా 'జుజో'. నా కనిపించింది. ఇలా చేస్తే ఎలాగుంటుందీ? 'కామిల్' ఈమధ్య స్థిమితం తప్పాడు. ఎవ్వరు యింటికొచ్చినా, అలికిడయినా, తన కొడుకొచ్చాడని తహతహలాడుతున్నాడు. అందుకని ఈ కుఱ్ఱవాడినే 'కామిల్' దగ్గరకి పంపి, అతని కొడుకే 'జుజో' వచ్చాడని నమ్మిస్తే ఎలాగుంటుంది? మనిషి మారుతాడేమో, మనస్సు, ఆరోగ్యం బాగుపడుతుందేమో! ఈ పిల్లవాడి అవసరాలూ తీరతాయి, 'కామిల్'కీ ఈ ముసలితనంలో ఆధారం దొరుకుతుంది.

ఈ ఆలోచన రాగానే, నాకు ఏమాత్రం స్థిమితం లేకపోయింది. లేచినా, పడుకున్నా, కూర్చున్నా, నడుస్తున్నా యిదే ఆలోచన. పాప, పుణ్యాల బేరీజు మాని, ఆ పిల్లాడికి విశ్వాసంగా సంగతి చెప్పాను. చేయవలసిన పని నచ్చజెప్పాను. తిరిగొచ్చిన 'కామిల్' కొడుకుగా నటించాలనీ, 'కామిల్'ని 'నాన్నా' అని సంబోధించాలనీ నేర్పాను. అన్నీ నేను చెప్పినట్లే చేయమని హెచ్చరించాను. ఆ తరువాత నాటకం సిద్ధం చేసి ఒకరోజు 'కామిల్' ఇంటికి వెళ్లాము.

సాయంకాల సమయం. 'కామిల్' ఇంటిపట్టునే వున్నాడు. లోపల వంట చెయ్యడం కోసం కట్టెలు అగ్గిలో పెట్టి 'ఫూ' అంటున్నాడు.

"కామిల్ బాబూ, ఇదిగో చూడు - ఎవరొచ్చారో."

వంట చేయడాని కుపక్రమించిన 'కామిల్' గబగబా లేచాడు. తుండుగుడ్డతో చెయ్యి తుడుచుకుని, అలా తుడుచుకుంటూనే అడిగాడు -

"ఎవరొచ్చారూ?"అని.

'జుజో వచ్చాడు - ఇదిగో చూడు" అలా అని నేను 'జుజో'ని ముందుకు తోశాను. 'జుజో' ముందే నేర్పిన ప్రకారం ఎదురువెళ్లి 'నాన్నా' అన్నాడు.

"నా తండ్రీ వచ్చావా?" అని అంటూ తడబడుతూ 'కామిల్' ముందుకు

వచ్చాడు.

సూర్యుడి ఆఖరి కిరణాలు వాలుగా వరండామీద పడుతున్నాయి. 'కామిల్' 'జుజో' ని దగ్గరికి తీసుకుని చేతులతో ఆత్రుతగా నిమిరాడు. ఆగి, అనుమానపు చూపులతో నన్ను పొడుస్తూ అన్నాడు.

''ఎవరు 'ఫాద్రీ' - ఇతడు 'జుజో' అని ఎవరు చెప్పారు? నన్ను మోసం చెయ్యొద్దు. నా 'జుజో' పెద్దవాడయి వుంటాడు. నీ అంత ఎదిగి వుంటాడు!''

అలా అని 'కామిల్' వున్నచోటే చతికిలబడ్డాడు. నాకనిపించినట్లు ఈవేళ 'కామిల్' ఏ పిచ్చిలోనూ లేడు. నాలాగే కులాసాగా, మెలుకువగా, తెలివిగా కనిపించాడు.

''నేను బహుశా 'జుజో' ని గుర్తుపట్టలేక పోవచ్చు. వాడిప్పుడు పెద్దవాడయి వుంటాడు. కానీ వాడు నన్ను తప్పక గుర్తుపడ్తాడు. నీకు తెలుసా ఈ కుర్తానే నేనెప్పుడూ తొడుక్కుంటాను? లోకులు అంటారు - ఇంక చాలు ఈ కుర్తా వదిలిపెట్టు - చక్కగా చొక్కా తొడుక్కో అని. లోకులేమైనా అననీ - నేను పట్టించుకోను. నా 'జుజో' వున్నప్పుడు నేను ఈ కుర్తానే వేసుకొనేవాడిని. ఇప్పుడు నా 'జుజో' తిరిగివస్తే, నన్ను గుర్తు పట్టలేకపోయినా, నా 'కుర్తా' చూసి తప్పక జ్ఞాపకం తెచ్చుకుంటాడు.'' 'కామిల్' అలా చాలా మాట్లాడి, అలసిపోయాడు. నాకు ఏం చెప్పాలో తెలియలేదు.

''ఫాద్రీ! నా 'జుజో' తప్పక తిరిగివస్తాడు. నేను 'సాయ్‌బిణీ'కి మ్రొక్కుకున్నాను. వాడురాక మానడు. నేను ఎదురుచూస్తున్నాను. 'జుజో' వస్తాడు. వాడు వచ్చేవరకూ, వాడిని చూసేవరకూ నేను ఈ ప్రాణం వదిలేదిలేదు... నేను చావను... నేను చావను'' అంటూ 'కామిల్' ఏడవసాగాడు.

నాకు చాలా సిగ్గువేసింది. నా ప్రయోగం ఫలించలేదని కాదు. 'కామిల్'కి దేవుడిమీదున్న విశ్వాసం చూసి. నాకుకూడా క్షణం సేపు అనిపించింది. నిజంగానే 'జుజో' వస్తాడు!

బరువైన హృదయంతోనూ, అలసిపోయిన కాళ్లతోనూ, నేను కృత్రిమ 'జుజో'ని వెంటబెట్టుకు తిరుగుముఖం పట్టాను. ఇది జరిగి పక్షంరోజులు గడిచాయి.

అకస్మాత్తుగా ఒకరోజు సాయంకాలం 'కామిల్' ఇంటి పక్కావిడ పరుగు పరుగున వచ్చింది.

"ఫాద్రీ, 'కామిల్' మరణావస్థలో వున్నాడు. త్వరగా రా, వచ్చి దైవ విధి చెయ్యి."

"మరణిస్తున్నాడా? డాక్టరుకి కబురు వెళ్లిందా?

"లేదు. ఈ రాత్రి గడవకపోవచ్చు." నాకు ఆవిడ మాటలకి కోపం వచ్చింది. వీళ్లకి ముందు 'ఫాద్రీ' గుర్తుకొస్తాడు-డాక్టరుకాదు.

"నువ్వు వెంటనే వెళ్లి డాక్టరుని పిలుచుకురా - నేను పంపానని చెప్పు. నేనూ వెంటనే వస్తాను." ఆవిడ వెళ్లిపోయింది. క్షణంసేపు నా బుఱ్ఱ తిమ్మిరెక్కినట్లయింది. 'కామిల్' మరణిస్తున్నాడా! 'కామిల్' మాటలు మనస్సులో గింగురుమంటున్నాయి. 'జుజో' తిరిగివస్తాడు. వాడిని చూడకుండా నా ఆఖరిశ్వాస విడవను. వాడిని చూసే నేను ప్రాణాలు వదుల్తాను" పాపం 'కామిల్' మరణం గుమ్మందాకా వచ్చినా ఆశ వదులుకోడం లేదు!

నేను రెండు మూడు అతి ముఖ్యపనులు పూర్తిచేసి, గబగబా బయటపడ్డాను.

నేను 'కామిల్' ఇంటికి చేరేసరికి చీకటిపడింది. డాక్టరు అతన్ని పరీక్షించి తిరిగి వెళ్లిపోతున్నాడు. నన్ను చూసి డాక్టరు ఆగాడు. "Old Age" ముసలితనం. జ్వరం తగ్గవచ్చు. నేను ఇంజక్షన్ యిచ్చాను. అయినా 'సా(సా(వ్' (దైవవిధి) చేయడం మంచిది.

డాక్టరు వెళ్లిపోయాడు. నేను బాల్కనీలో నించున్నాను. పక్కింటావిడ గుమ్మం దగ్గరే నిల్చొని నాకేసి చూస్తోంది.

"పడుకున్నాడా?" అడిగాను.

"లేదు. తెలివిలోనే వున్నాడు. ఇప్పుడు కూడా కొడుకు గురించి జ్ఞాపకం తెచ్చుకుంటున్నాడు."

"నువ్వు ఇంటికి వెళ్లు. భోజనంచేసి రా. ఇక్కడుండేం చేసేది లేదు."

పక్కింటావిడ వెళ్లేవరకూ నేను ఆగాను. బాగా చీకటయింది. లోపలగదిలో ఓ కిరోసిన్ నూనె దీపం మిణుకు మిణుకుమని వెలుగుతోంది. గదిలో పాత పట్టె మంచంమీద 'కామిల్' పడుకున్నాడు.

నేను ఇటూ అటూ చూశాను. అంతా కటిక చీకటి. దగ్గరలో ఎవ్వరూ కనబడ్డంలేదు. నేను తొరతొరగా నా పొడుగైన 'రోబ్' (మతాధికారి దుస్తువు) తీసేశాను.

అది తీశాక లోపల ముందే వేసుకున్న ఫ్యాంటూ, బుష్‌కోటూ బైటపడ్డాయి. 'రోబ్' (పొడుగు అంగీ) కుర్చీలో పడేసి నేను లోపలికి వెళ్ళాను.

"నాన్నా!" నేను మృదువుగా పిలిచాను.

'కామిల్' తెలివిలోనే వున్నాడు. కళ్లుకూడా తెరిచే వున్నాయి. పిలుపు వింటూనే కళ్లు పెద్దవిచేసి, స్పృహలోకి వచ్చాడు.

"నాన్నా! నేను 'జుజో'ని - వచ్చాను" నేను దగ్గరకెళ్లి వొంగొని చెవిలో అన్నాను.

"ఓ నా కొడుకా... 'జుజో'... నా కొడుకా", 'కామిల్' అమితానందంలో మాటలే కరువయ్యాయి. 'కామిల్' హఠాత్తుగా బలం పుంజుకుని లేచాడు. లేచి కూర్చున్నాడు.

"నాన్నా" అంటూ ప్రేమతో నేను 'కామిల్' భుజంమీద నా తల వుంచాను. 'కామిల్' అవస్థ చూసి నాకుకూడా కళ్లనీళ్లు వచ్చాయి. నాలుగు కళ్లల్లో నీళ్లు ఆగకుండా ప్రవహిస్తున్నాయి.

కిరోసిన్ నూనెదీపం చాలా కొద్దిగా కాంతినివ్వడం వలన 'కామిల్' నన్ను గుర్తుపట్టేయగలడనే భయం లేకపోయింది. నేను 'కామిల్'ని గట్టిగా కౌగిలించుకున్నాను. 'కామిల్' ఆతృతగా నా వెన్ను నిమురుతున్నాడు. 'కామిల్' వొళ్ళు జ్వరంతో భగభగ మండుతోంది. అయినా మొహంమీద ఆనందంతో కూడిన నవ్వు నృత్యం చేస్తోంది!

"నా కొడుకా... 'జుజో' నా కొడుకా", 'కామిల్'కి ఎంతో మాట్లాడాలని అన్పించినా, నోట్లోంచి పదాలు పెకలడంలేదు. మాటలు దొర్లడం లేదు.

"నాన్నా... నాన్నా... ఇంక నిద్రపో" నేనన్నాను. కానీ 'కామిల్' కదలలేదు.

"జుజో... నా బంగారు తండ్రీ ... నువ్వు వచ్చావా యిన్నేళ్లకి. నాకు తెలుసు నువ్వు తప్ప వస్తావని. నేను 'మేరీ'మాతకి మ్రొక్కుబడి చేశాను. ముడుపు చెల్లిస్తానని వాగ్దానం చేశాను. దేవుడిమీదే విశ్వాసం నిలిపాను. ఆయన దయవల్ల నువ్వు వచ్చావు ... ఇప్పుడు ... ఇప్పుడు ... నాకు శక్తిలేదు ... నాకు ఏ ... నువ్వు ముడుపు చెల్లించు దైవానికి ... నువ్వు ..." కామిల్ గొంతుక నూతిలోంచి వస్తూన్నట్టు, ఎక్కడో దూరం నుంచి వస్తూన్నట్టు తగ్గి తగ్గి ... క్రమేణా అంతరించింది. అతని తల నా భుజం మీద వాలింది. కాళ్లూ, చేతులూ చల్లబడ్డాయి.

నేను నెమ్మదిగా అతని తల జరిపి దిండుమీద వుంచాను. అతని కళ్లు

తెరిచే వున్నాయి! వాటిని వేళ్లతో స్పృశించి మూసేశాను. అతని శరీరం మీద దుప్పటీ కప్పాను. ఆ తరువాత బయటకి వచ్చి మళ్ళీ 'రోబ్' ముందులాగే ధరించాను.



6

# కొంచెం చలి - కొంచెం వేడి

- షీలా కోళంబ్‌కార్

'మే' నెల సెలవులిచ్చారు. ఆడపడుచు కొడుకు మా యింట్లో వుండడానికి వచ్చాడు. వాడు వచ్చి సుమారు నాలుగు రోజులయ్యింది. వాడిని నేను ఒకరోజు బజారుకీ, ఒకరోజు గార్డెనుకీ మా పిల్లలతో బాటూ తీసుకెళ్లాను. నేను మా ఆయన్తో అన్నాను "ఆడపడుచు కొడుకు వచ్చాడు కదా! మీరు నాలుగురోజులుసెలవు పెట్టండి. పిల్లలని ఎక్కడికైనా యాత్రకి తీసుకువెళ్దాం. ఇంట్లోనే వుంటే పిల్లలు విసిగిపోతారు", ఆయన ఒప్పుకున్నారు.

నిజానికి నేను చాలాసార్లు పోరుపెట్టాను. ఆయన వెంటబడి బ్రతిమిలాడాను. "ఓ వారం, పదిరోజులు సెలవు పెట్టండి" అని. కానీ వింటేనా? ఎప్పటిలాగే పాతపాట" "నీకు బాగా తెలుసు. మాకు సెలవు దొరకడం చాలా కష్టం! ఒకవైపు ఎంతోమంది సెలవుమీద వెళ్లారు. మరోవైపు ఆఫీసులో బోలెడంత చెయ్యాల్సిన పని పేరుకు పోయింది."

ఆయన ఎప్పుడూ పాడే పాటే యిది. నేను సెలవు పెట్టండి స్వామీ అని ఎంత బ్రతిమిలాడినా సెలవు తీసుకోరు ఎప్పుడూ! "సెలవు దొరకదు. చాలా బాధ్యతాయుతమైన పని నాది" ఆయన సెలవు తీసుకుంటే ఆయన ఆఫీసు మూసివేస్తారు. కాబోలు! సెలవు యివ్వలేకపోతే 'క్యాజువల్ లీవ్', 'సిక్‌లీవ్' అని ఎందుకు ఏర్పాటు చేశారుట మరి? కానీ, ఎప్పుడు నాతోబాటు పిల్లలు కూడా మారాం చేసి భీష్మించుకు పట్టుబట్టినప్పుడు, ఏదో మాకు పెద్ద ఉపకారం చేసిన వారిలా ఒప్పుకున్నారు. రెండురోజులు సెలవు తీసుకున్నారు.

సెలవు మొదటిరోజున 'రాణా' సర్కస్‌కి వెళ్దామని నిశ్చయించాం, రెండవరోజు 'నెహ్రూ ప్లానెటోరియం'కి.

కానీ ఆ మొదటిరోజే ఆయన ఆఫీసుకి ఫోన్ వచ్చింది, ఆయన చెల్లెలు దగ్గర్నించి. పిల్లల్నందరినీ తీసుకుని వాళ్ల యింటికి రమ్మనమనీ, అక్కడే భోజనం చేయమనీ చెప్పింది. అందువల్ల ఆయన రాగానే పిల్లల్తోబాటు మేము, మా ఆడబడుచు ఇంటికి వెళ్లాము. మా ఆడబడుచు ఎనిమిదిరోజులు సెలవు తీసుకుంది. అలాగే సర్కసు చూపించడానికి టిక్కెట్లుకూడా సిద్ధం చేసింది. ఆమె అంది "ఎనిమిది రోజులు నేను ఎలాగూ సెలవు పెట్టాను, అందుకని మీ పిల్లల్ని కూడా మా ఇంట్లో వుండనివ్వండి. నా సెలవులు అయిపోగానే మీ పిల్లల్ని మీ యింటికి క్షేమంగా చేరుస్తాను" అని. పిల్లలకీ సరదాగా వుంటుందని నేను అభ్యంతరం చెప్పలేదు. అక్కడే భోజనంచేసి రాత్రికి మేమిద్దరం యింటికి వచ్చాము. రాత్రి పన్నెండున్నర అయింది.

బాగా అలసిపోయాము. గాఢంగా యిద్దరం నిద్రపోయాము. ప్రొద్దున్న తెలివొచ్చి చూస్తే ఏముంది? శ్రీవారు ఆఫీసుకి వెళ్లడానికి తయారవుతున్నారు. నేనన్నాను "ఏంటిదీ? మీరు సెలవు తీసుకొన్నారన్న సంగతి మఱచిపోయారా? మీరు ఈ వేళ ఆఫీసుకి వెళ్లరనుకున్నాను. అందుకనే లేవడానికి బద్ధకించాను?"

"ఏ పిల్లల కోసం సెలవు తీసుకొన్నానో ఆ పిల్లలు నా చెల్లెలింట్లో వున్నారు. ఇప్పుడు నేను యింట్లో కూర్చుని మాత్రం చేసే దేముంది గనక."

ఆయన మాటలు విని నేనేం అనలేదు.

"కానీ, అలాంటప్పుడు మీరు నన్నెందుకు లేపలేకపోయారూ?"

"నువ్వు నిద్రపో - శుభ్రంగా నిద్రపో - కాకపోతే, రాత్రి మనం యిల్లు చేరేసరికి చాలా ఆలశ్యం అయింది కదూ? నేను వెళ్తాను."

"అలా ఎలా కుదుర్తుంది?" నేను గబగబా లేచాను. పాలుకాచి, టీ తయారు చేశాను. ముందురోజు తరిగివుంచిన కూరలు 'ఫ్రిజ్'లో వున్నాయి. అవితీసి పోపులో వేసి, కూర సిద్ధం చేశాను. చపాతీల కోసం పిండి నానేసి, కాసేపట్లో చపాతీలు వొత్తసాగాను. ఆయన స్నానం గీనం, ధ్యానం పూర్తయేసరికి నాకూర, చపాతీలు తయారయాయి. ఆయనకు టిఫిన్ డబ్బాలో వేసి యిచ్చాను. ఆయన ముస్తాబై ఆఫీసుకి వెళ్లారు.

నేను మిగిలిన పిండితో చపాతీలు చేస్తూ ఆలోచనలో పడ్డాను. నాకు మనస్సు చివుక్కుమంది. ఏం మనిషీ ఈయన? సెలవు తీసుకుని కూడా ఆఫీసుకి వెళ్లారు.

ఏ పిల్లలకోసం సెలవు తీసుకున్నారో, ఆ పిల్లలు యింట్లో లేరని సెలవు క్యాన్సిల్ చేసుకున్నారు. పిల్లలులేక పోతేనేం? నేను లేనా ఇంట్లో? నేను యిక్కడి వ్యక్తుల్లో లెక్కకిరానా? పిల్లలు యింట్లోలేరు. ఇంట్లో మేమిద్దరమే రాజా-రాణీలాగ వుండవచ్చుకదా! ఎప్పుడూ లభించని ఏకాంతం దొరికింది. మా పెళ్లిరోజులు మఱచిపోయారా? అప్పుడాయన పిచ్చివాడిలా నా చుట్టూ తిరిగేవారు. సినిమాలకీ, నాటకాలకీ వెళ్లడం, ఆ తరువాత వాకర్నొకరు వాటేసుకుని నిద్రపోవడం - సర్వ ప్రపంచాన్నీ మఱచిపోవడం. ఇంతగా ఎలా మారిపోయారీయన? నా ఖర్మకాలా! చపాతీ పేనంమీద మాడిపోయిన వాసన!

చపాతీలు రెడీ అయ్యాయి. కూర ఎలాగూ సిద్ధంగా వుంది. ఒక్కరికోసం యింతకంటే ఏం వండాలి? ఆయన రాత్రి తిరిగి వచ్చిన తరువాత చూద్దాం ఏం చేయాలో, ఏం వండాలో...

కానీ ఆయన యింటికొచ్చాక మాత్రం ఏంచేయాలి? ఒక పెద్ద ప్రశ్న! పిల్లలింట్లో వున్నప్పుడు కాలం ఎలా గడిచిపోతుందో తెలియదు. వాళ్లు బిలబిలా వందసార్లు బైటికీ, ఇంట్లోకి వస్తారు. ప్రతీసారీ వాళ్లకోసం తలుపుతీయాలి, వేయాలి. అదికాక వాళ్ల కొట్లాటలు, గిల్లికజ్జాలు, వాళ్ల ఆటలు - వాళ్ల నవ్వులూ, పకపకలూ, వాళ్ళు చేసే అగడాలు, చెత్తా చెదారాలు, చిల్లర మల్లరగా పారేసిన వస్తు సముదాయాలూ, నీళ్లు తాగి వదిలేసిన ఖాళీ సీసాలూ - యిన్నీ చేసేసరికి ఎప్పుడు పగలయిందో, ఎప్పుడు రాత్రయిందో తెలిసేదికాదు. కానీ ఈ వేళ...

నేను చీపురుకట్ట తీశాను. ఊడుస్తూ ఊడుస్తూ బాల్కనీ చేరుకున్నాను. అక్కడ పక్కింటావిడ చూసి పలకరించింది. ఆవిడ అంది -

"ఏమిటీ? తొరతొరగా పనులు పూర్తిచేసి సర్కనుకి వెళ్లాలని తయారుకాబోలు! ప్రొద్దుట్నించీ బయట కనబళ్లేదు మీరు. భర్త సెలవు తీసుకుని యింట్లోనే వున్నారనా?"

"ఏం సెలవూ? ఏం సర్కసూ?" నేను నిస్తేజంగా అన్నాను.

"నిన్న పిల్లలు ఆదపడుచు ఇంటికి వెళ్లారు."

"మరి మీరిద్దరే కదా యింట్లో - మజా కదూ రాజా-రాణీ."

"ఏం మజా, నాఖర్మ!"

"మీ ఆయన సెలవుపెట్టారు కదూ?"

"తీసుకున్నారు. కానీ క్యాన్సిల్ చేశారు."

"ఎందుకో?"

"ఏ పిల్లలకోసం సెలవడిగారో ఆ పిల్లలు యింట్లో ఎలాగూలేరు కదా!"

"కానీ నువ్వెందుకు ఆయన్ని వెళ్లనిచ్చావు? వెళ్లొద్దని చెప్పొచ్చుగా?"

నిజం చెప్పాలంటే అదే నాకూ, మా పక్కింటావిడకీ తేడా! ఆవిడ తన భర్తతో ఖండితంగా అంటుంది. నాకు ఫలానా సినిమా చూడాలనుంది. మీరు అపు నూరైనా తీసుకువెళ్లక తప్పదు అని. ఆవిడకి ఏ వస్తువు కావాలన్నా మొగుడితో చెప్తుంది. లభించకపోతే ఆ కోపం పిల్లలమీద చూపిస్తుంది. రుసరుసలాడుతూ, వాళ్ళని చావబాదుతుంది. మొగుడికి బ్రతుకు దుర్భరం చేస్తుంది. ఇలా చేయడం నాకు చేతకాదు. నేను చెప్పడం, మొగుడు వినడం అర్థంలేని విషయం. భర్తకి నా అవసరాలు అడక్కుండానే తెలియాలి. 'మామిడికాయని' పండుగా చేయడానికి ముగ్గేయడం కంటే అది సహజంగా చెట్టుమీదే ముగ్గి పండయితే రుచి ఎక్కువ. మే మిద్దరమే యింట్లో మిగిలాం - పూర్తి స్వాతంత్ర్యంతో, ఈరోజు మా చేతుల్లో వుంది. ఎక్కడికైనా విహారయాత్రకి వెళ్లినా, పిల్లల బెడద లేదుకదా! కానీ ఈ విషయం నాకు మాత్రం తెలిసి ఉపయోగం ఏమిటి? ఆయనకీ తెలియాలి కదా?

ఆలోచనలతో తలనొప్పి వచ్చింది. మా పక్కింటివాళ్ళది ప్రేమ వివాహం. వాళ్లిద్దరు భార్యా - భర్తలు బాల్కనీలో కూర్చుని గంటల తరబడి ముచ్చటించుకుంటూ వుంటారు! సెలవురోజుల్లో పిల్లల్ని యింటిదగ్గరే వదిలి, ఎంచక్కా యిద్దరూ చెట్టాపట్టాలేసుకుని బయటకి విహరించడానికి వెళ్తారు... మరి మా ఆయన చూడండి, ఇంటికి రావడమే తరువాయి, పేపరు చదువుతూ కూర్చుంటారు. తన ఆఫీసులో ఈరోజు విశేషాలేమిటో... ఎవరేమన్నారో... తను గమనించిన విషయాలూ... చిన్న విషయాలే - కాని చెప్పడంలో చాతుర్యం వుంటే.. ఎన్నైనా వినబుద్ధి కలుగుతుంది. కానీ ఆయనకా అలవాటు ససేమిరా లేదు. ఎప్పుడైనా సెలవురోజు వచ్చి ఎక్కడికైనా బయటికి సరదాగా షికారు వెళ్దాంరండి అంటే, వారానికోరోజు సెలవు దొరుకుతుంది - కాస్త విశ్రాంతిగా ఇంట్లోనే కూర్చోనియ్యి! నేను ఎప్పుడూ ఇంట్లోనే గడుపుతూ విసిగెత్తిపోతాననే సంగతి, సద్భావం ఆయనకి స్ఫురించదు, లేదు.

... ఆరోజు ముచ్చట. కూతురిని తీసుకుని డాక్టరుదగ్గరకి వెళ్లాము. డాక్టరు

మేజాబల్లమీద ఒక పాపని ఎత్తుకొని, అందమైన యువతి బొమ్మ వుంది. నే నడిగాను

"డాక్టరుగారూ ఈ చక్కటి బొమ్మ మీ కెవరిచ్చారూ?"

"ఎవరూ ఇవ్వలేదు. నేనది కొన్నాను."

"మీరు కొన్నారా?"

"మీకు ఆశ్చర్యంగా వుందా? నాకు చిత్రకళ అంటే ప్రాణం. ఒకప్పుడు నేను కూడా బొమ్మలు వేసేవాణ్ణి. ఈ డాక్టరీ చదువువల్ల ఆ కళని కొనసాగించలేక పోయాను. ఐతే ఆ దృష్టి, ఆ తృష్ణ యింకా వుంది నాలో. చక్కటి చిత్రం ఎక్కడ కనిపించినా కొంటాను."

"డాక్టర్, మీ పని బాగుంది కదూ? దవాఖానా మూసేసిన తరువాత యింటికి వెళ్లి హాయిగా కూర్చుంటారు బొమ్మలు గీస్తూ - పని అలసట కూడా పోతుంది."

అని నే నన్నాను.

"నిజం చెప్పనా? నాకు ఎప్పుడూ అనిపిస్తుంది. ఎప్పుడీ పేషెంట్లు వెళ్లిపోతారు - ఎప్పుడు నేను యింటికి చేరుకుంటాను అని. మా ఆవిడ నాకోసం ఎదురుచూస్తూ వుంటుంది. ఇంటికెళ్లిం తరువాత మేమిద్దరం షికారుకెళ్తాం. అలా కాకపోతే ముచ్చట్లు చెప్పుకుంటూ కూర్చుంటాం. అలా కబుర్లు చెబుతూవుంటే టైమ్ ఎలాగడిచి పోతుందో తెలియదు. భార్యతో కబుర్లు చెప్పడంలోని ఆనందం, సుఖం వేరే ఎందులోనూ లేదు."

నా ఖర్మకాలా! ఇప్పుడే ఆ డాక్టరు ఎప్పుడో చెప్పిన విషయం గుర్తురావాలా? నా కోపం ద్విగుణీకృతం అయింది.

నేను ఆ కోపంతో విజృంభించాను. ఇంట్లో మాసిన అన్ని దుప్పట్లూ వుతకడానికి సబ్బు నీళ్ళల్లో నానేశాను. కోప తాపాలతో వుతికిన దుప్పట్లు గ్యారంటీగా శుభ్రపడతాయి! ఇల్లంతా నీళ్లతో కడిగాను. ఆ తరువాత స్నానం చేశాను. ఆ పనులవల్ల పూర్తిగా అలసిపోయాను. ఎప్పుడు కాస్త మేను వాల్చి విశ్రాంతి తీసుకుంటానా అని అనిపించింది. వొంటింట్లోకి వెళ్లి చపాతీలు తిన్నాను. నాకు చిఱు నిద్ర వచ్చింది! నేను వెళ్లి పడుకున్నాను. సరిగ్గా నిద్ర పడుతూ వుండగా కాలింగ్‌బెల్ మ్రోగింది.

... అరే ఈవేళ ఎవరొచ్చారో ప్రాణాలు తీయడానికి? ... తలుపు తీసిచూస్తే... ఆశ్చర్యం... మా ఆయన! ఆయన్ని చూసి నా కోపం పెచ్చు పెరిగింది. నాకు ఓపిక

పోయింది. పైగా నాకు నిద్ర ముంచుకొస్తోంది. ఇంకా నేను వంట వండలేదు. ఇప్పుడు మా ఆయన కోసం వంటింట్లో తంటాలు పడాలి కాబోలు!

"వడ్డించనా?" ఆయన్నడిగాను, వంట సిద్ధంగా వున్నట్లు! (చీకట్లో బాణం)

"వద్దు (నేను "హమ్మయ్య!") నేను భోజనం చేశాను. నువ్వు ప్రొద్దున్న టిఫిన్ డబ్బా యిచ్చావు చూడు?" అని మళ్లీ "త్వరగా తయారవు, బయటకి వెళ్దాం సరదాగా."

"ఎక్కడికెళ్లాలి?" అడిగాను.

"సినిమాకి" ఆయన.

"అందుకే త్వరగా ఇంటికొచ్చారా?"

"అవును, ఆఫీసులో వున్నప్పుడు గుర్తొచ్చింది. నువ్వు పాపం ఒంటరిగా ఇంట్లో వున్నావని! అందుకనే పరిగెత్తి వచ్చేశాను."

... ఊ ... ఈ తెలివి ప్రొద్దున్నే వస్తే బాగుండేది కదా! ... నేనేం మాట్లాడలేదు. తరువాత నే నన్నాను.

"నాకిప్పుడు ఎక్కడికీ రావాలనిలేదు. నాకు చాలా నిద్రగా వుంది. మీరూ నిద్రపోండి."

-అని, ఆయన జవాబుకి ఎదురు చూడకుండా నేను మంచంమీద వ్రాలాను.

లేచాక టైముచూస్తే ఐదున్నరయింది. నేను లేచి టీ పెట్టాను. ఆయన్నీ లేపి టీ యిచ్చాను. ఇక వంటకి తయారీ. బియ్యం కొలుస్తున్నాను. ఆయన అడిగారు "మధ్యాహ్నం ఏం వొండావు?"

"ఏం వొండలేదు."

"అలాగైతే ఇప్పుడూ ఏం చేయవద్దు. మనం బయటకెళ్దాం. బయటే (హోటల్లో) భోంచేద్దాం. ఆ తరువాత సినిమాకి వెళ్దాం."

-మేం బయటకెళ్లాం. హోటల్లో భోజనం చేశాం. ఎన్నాళ్లకో ఈవిధంగా బయటికివెళ్లి భోజనం చేశాము.

అక్కడ్నించి సినిమాకి వెళ్లాం. హిందీ సినిమా. "రాంతేరీ గంగామైలీ." థియేటర్ చేరగానే ఒకడెవరో అడిగాడు "టిక్కెట్లు కావాలా?" అని.

-ఆయన టిక్కెట్లు కొనడానికి సిద్ధమయ్యారు.

"ఎంత టిక్కెట్టు?"

"నాలుగుది - ఆరు రూపాయలు."

నే నన్నాను "బాల్కనీ టిక్కెట్లకి అంతగా క్యూలేదు. మనంవెళ్లి అక్కడ నిలబడదాం. ఊరికే బ్లాక్‌లో టిక్కెట్లు ఎందుకు కొనడం?"

మేం వెళ్లి లైన్‌లో నిల్చున్నాం. మా ముందరి వ్యక్తి టిక్కెట్టు తీసుకున్నాడో, లేదో కౌంటర్ తలుపు మూతబడింది. టిక్కెట్లు అయిపోయాయట!

"ఇప్పుడేం చేద్దాం?"

ఆయన అడిగారు.

"ఇప్పుడింటికి తిరిగి వెళదాం" అన్నాను.

"పిచ్చిదానా! నువ్విక్కడే వుండు. నే నిప్పుడే వస్తాను." అంటూ, నామాట వినకుండానే వెళ్లి ఆ జనంలో అదృశ్యమై పోయారు.

కొంతసేపటికి చేతిలో రెండు టిక్కెట్లతో వచ్చారు.

"ఎంతయింది టిక్కెట్లకి?"

"ఒక్కటీ ఏడు రూపాయలు."

"ఎందుకు తీసుకున్నారు? ఇంత ఖరీదు టిక్కెట్లు? మీలాగ యిలా 'బ్లాక్'లో టిక్కెట్లు తీసుకునేవాళ్ళు వున్నారు గనకనే వాళ్లు బ్లాక్‌లో టిక్కెట్లు అమ్ముతారు. భ్రష్టాచారానికీ, అవినీతికీ మూలం మనమే, ఇతరులనని ఏం లాభం?"

"మహారాణీగారూ, నీ లెక్చరు కట్టిబెట్టు. నీ అభిప్రాయాలన్నీ నాకు బాగా తెలుసు. అందుకే నిన్నడక్కుండానే వెళ్లి తెచ్చాను - టిక్కెట్లు. కానీ ఒకటి గుర్తుంచుకో. నీలాగ ఈ ప్రపంచంలో ఎవరూ చేయరు. ఎవరైనా అలా చేశారనుకో, వాళ్ల బ్రతుకు నరకతుల్యం అవుతుంది. నీలాగ ఆలోచించే వ్యక్తికి ఈలోకంలో బతకడం బహుకష్టం. మామూలుగా బేరీజువెయ్యి! ఏనాడూ లేనిది, ఈరోజు అన్నీ కలసివచ్చి, మనం సినిమా ప్రోగ్రాం వేసుకున్నాం. ఈవేళ మనకి టిక్కెట్లు దొరకడం చాలాముఖ్యం. అందుకని కాస్త ఎక్కువ డబ్బులిచ్చి టికెట్టు కొన్నాం. ఆ టిక్కెట్లు మనం తీసుకోకపోతే, అమ్మకం జరగదా? మరెవ్వరో తీసుకుంటారు. మరి ఆ తరువాత జరిగే పెద్దమార్పు ఏమిటి? అందుకని యిప్పుడు నామాట విను. ఎక్కువ ఆలోచించొద్దు. నీ చిన్న సైజు బుఱ్ఱకి అంత ఎక్కువ చిరాకు పనికిరాదు. హాయిగా సినిమాచూసి ఇంటికి తిరిగివెళ్దాం. దొరికిన నాలుగు క్షణాలూ ఏకాంతంగా, సుఖంగా గడుపుదాం."

మేము హాలులోపలికి వెళ్లాం. టిక్కెట్లు 'డోర్‌కీపర్'కి యిచ్చాము. చూస్తే మొత్తం మూడు టిక్కెట్లున్నాయి. రెండు 'డోర్‌కీపర్'కి యిచ్చాము. వాడు మమ్మల్ని పైన సీటుల్లో కూర్చోబెట్టాడు. ఆయన వెళ్లి ఆ మూడో టిక్కెట్టు ఎవరికో ఏడు రూపాయలకి అంటగట్టి వచ్చి తాపీగా నా పక్క కూర్చున్నాడు.

"ఇదిగో చూడు. పద్నాలుగు రూపాయలిచ్చి రెండు టిక్కెట్లు కొన్నామా, పైన మరో ఏడు రూపాయల లాభం. దేవుడు మన పక్షంలో వున్నాడు, కనకనే మనకి కేవలం మూడున్నర రూపాయలకే లభించాయి. అవును కదూ?" నా జవాబు వినకుండానే మళ్లీ అన్నారు.

"జీవితమే అటువంటిది. మంచీ, చెడ్డా ఆలోచించే వ్యవధి ఒక్కొక్కప్పుడు వుండదు. అందుకే బ్రతుకులో ఒడుదుడుకులు ఎలా వస్తే, అలాగే స్వీకరించాలి. ఇప్పుడు మనకొక వస్తువు కావాలంటే, ఆ వస్తువుని ఎలాగైనా సంపాదించాలి. అది ఎలా సంపాదించామో అంత ముఖ్యం కాదు. అది దొరికిందా, లేదా అన్నది మాత్రం ముఖ్యం! అర్థమయిందా?"

సినిమా ప్రారంభమైంది. ఆ విషయం అక్కడితో వదిలేశాం.

"పిల్లలు ఈ సినిమా చూస్తామంటే నువ్వెందుకు వద్దన్నావు? ఆయన అడిగారు.

"పిల్లలు ఈ సినిమా చూడవచ్చునని మీరెందుకు భావిస్తున్నారో ముందు చెప్పండి" ఎదురు ప్రశ్న వేశాను.

"కాదు. వాళ్ల క్లాసులో పిల్లలు ఈ సినిమా చూశారట. మన పిల్లలు చూడలేకపోతే వాళ్లకి కాంప్లెక్ష్ (న్యూనతాభావం)రాదూ?"

"ఆరోజు పిల్లలు అన్నారు. వాళ్ల క్లాసులో అందరిళ్లలోనూ వి.సి.ఆర్.లు వున్నాయట. మరి మీరూ వి.సి.ఆర్. తీసుకోవచ్చుగా?"

"ఒద్దు తల్లీ, ససేమిరా వొద్దు, అది వస్తే భూతాన్ని ఇంటికి పిలవడమే!"

"ఆ తెలిసిందా! ఈ సినిమా విషయం కూడా అంతే." అని ఆగి, అన్నాను.

"పెద్దలకోసం మాత్రమే అని సూచించిన ఈ సినిమా పిల్లలెందుకు చూడాలి? పిల్లలు వాళ్లకోసం తీసిన సినిమాలే చూడాలి."

ఆయన ఏం అనలేదు. నాకు మనస్సులో బాగా తెలుసు. ఈయన వీలుంటే వి.సి.ఆర్. కూడా తప్పక తీసుకొనేవారే! ఎందుకంటే ఆయనకి ఆదర్శ తండ్రి ఎలా

వుండాలో అన్న ఆదర్శ చిత్రం, నా రూపకల్పనకి పూర్తిగా భిన్నం. పిల్లలడిగిన ప్రతీ వస్తువూ తెస్తూ, వాళ్ల కోరికలు అడిగినదే తడవుగా తీరుస్తూ వుండడమే ఆయన దృష్టిలో ఆదర్శ తల్లిదండ్రుల కర్తవ్యం. తమకి బాల్యంలో లభించనివన్నీ పిల్లలకి లభ్యమయ్యేలా జాగ్రత్త పడడమే యీ తండ్రి కర్తవ్యం.

సినిమా వేగం పుంజుకుంది. మేము కథలో నిమగ్నమైపోయాం. ఇంటర్వెల్ అయింది.

"నేనొక సిగరెట్టు ముట్టించి వస్తాను. నీకేదైనా కావాలా?" ఆయన అడిగారు.

"ఏమీవద్దు. మీరెళ్ళిరండి" అన్నాను.

కొద్దిసేపట్లో ఆయన వచ్చారు. చేతిలో 'ఐస్‌క్రీం'తో. ఇద్దరం ఒకేసారి నవ్వుకున్నాం! ఎందుకంటే ఈ 'ఐస్‌క్రీం' వెనక ఒక చరిత్ర వుంది. పెళ్లయిన కొత్తలో మేం మొదటిసారి కలిసి సినిమాకి వెళ్లాం. ఈయనగారు ఇంటర్వెల్ సమయంలో యిలాగే అడిగారు. "ఏవైనా కావాలా?" అని. నేనూ యిలాగే ఏంవొద్దని అన్నాను. ఆయన ఏమీ తీసుకురాలేదు. ఇంటికొచ్చిన తరువాత ఆడపడుచు అడిగింది - నన్ను :

"నీకు మా అన్నయ్య ఇంటర్వెల్‌లో ఏదైనా ఇచ్చాడా?"

"మీ అన్నయ్యనే అడుగు."

"ఏమిచ్చావురా మీ ఆవిడకి ఇంటర్వెల్‌లో?"

"ఏం ఇవ్వలేదు."

"ఎందువల్ల?"

"నేను అడిగాను. ఏవైనా కావాలా అని. ఏం అఖ్ఖరలేదంది."

"పిచ్చివాడా!"

ఈ గోష్ఠి విని యింట్లో అందరూ నవ్వుకున్నారు. అప్పట్నించీ ఆయన సినిమాకి వెళ్లినప్పుడల్లా విరామ సమయంలో నన్ను ఏం కావాలని అడగడం, నేనూ ఏమీ వద్దని అనడం, ఆయన 'ఐస్‌క్రీం' తీసుకురావడం - అది చూడగానే ఇద్దరం ఒకేసారి నవ్వుకోడం - మా తీపిగుర్తులు.

సినిమా వదిలారు. సినిమా గురించి చర్చిస్తూ, ఇంటికి చేరుకున్నాం. ఆయనకి సినిమా నచ్చింది.

నాకు మాత్రం నచ్చలేదు. ఈ రాజ్‌కపూర్ చాలా తెలివైనవాడు. అతను

భారతీయ పురుషుల నాడి ఖచ్చితంగా గుర్తించాడు. స్త్రీల అంగాంగాలు ఎంచక్కా విడదీసి సవిస్తారంగా చూపిస్తాడు. ఎంత కౌశలంతో చూపిస్తాడంటే, ఆ చూసిన వాళ్లు అశ్లీలంగా వుందని ఫిర్యాదు చేసినా, 'అబ్బే అది నా తప్పు కాదు - చూసేవాళ్ల దృష్టి లోపం' అని తెలివిగా తప్పుకుంటాడు!

"మరి యిప్పుడేం చేద్దాం?" ఆయన అడిగారు. నే నన్నాను -

"మీరే చెప్పండి."

"హం తుం ఏక్ కమ్రేమె బంద్ హో, ఔర్ చాబీ ఖో జాయె..."

"చాలించండి, చిలిపితనం, పిల్లల్లాగ."

"నే నంటున్నాను. ఎంత కాలానికో మనిద్దరం యిలా ఏకాంతంగా వుండే అవకాశం వచ్చింది కదూ? గొడవల్లేవు, చికాకులు లేవు. పిల్లల లేతమనసుల మీద బరువు పడుతుందనే భయం లేకుండా... ఈ వేళ ... ఔనా?" అలా అర్థవంతంగా అంటూ నన్ను దగ్గరకి తీసుకున్నారు. ఆయన వేడి స్పర్శ... చిలిపిమాటలు... నేను మనస్సులో అనుకొన్నవే... ఆయన అన్నారు. నాకు ఆశ్చర్యం వేసింది.

ఆయన ఆతృతగా వాటేసుకున్నారు... ఆయన వుద్రేకం కట్టలు తెంచు కొంటోంది... నా మనస్సు నెమలిలా నాట్యం చేస్తోంది...

వేసవికాలం గనక వొళ్ళంతా చెమటలు పట్టి ముద్దముద్ద అయింది. నేను గోముగా అన్నాను :

"కాస్త ఆగండి. నేను స్నానం చేసి వస్తాను."

"వొద్దు. నువ్వు స్నానం చెయ్యొద్దు."

"ఎందుకు?"

"ఈవేళ నేను నీకు స్నానం చేపిస్తాను."

ఆయన నన్ను బాత్రూంలోకి తీసుకెళ్లారు. నా బట్టలు తానే తీయసాగారు- పండు వొలిచినట్లు. ఆయన ఒక్కొక్క చేష్ట, నామనః పుష్పంలో ఒక్కొక్కరేఖనీ విడదీస్తోంది!

నాకు జ్ఞాపకం వచ్చింది.

ఒకరోజు నేను, మా పొరుగింటావిడ యింటికి వెళ్లాను. బెల్లు నొక్కాను. కొంతసేపటికి ఆవిడ మొగుడు తలుపుతీశాడు. వొంటికి పెద్ద తువ్వాలు చుట్టుకుని.

ఆవిడ బాత్‌రూంలో స్నానం చేస్తోందట! నాకు దిగ్భ్రమ కలిగింది. "ఏం కావాలి? అని అడిగితే, ఫరవాలేదు మళ్లీ వస్తాను" అని ఇంటికి తిరిగి వచ్చేశాను. వస్తూ వుంటే, మరో యింటి ప్రక్కనుండే స్నేహితురాలు కలిసింది. జరిగిన విషయం చెప్పాను. ఆవిడ అంది.

"నీకు తెలియదా? వాళ్ల పిల్లలు ఇంట్లో లేరు. అందుకని ఆవిడ మొగుడు నాలుగురోజులు సెలవుపెట్టారు. ఇద్దరూ ప్రేమపక్షుల్లా నోట్లో నోరు పెట్టుకుని గంటలు గడిపేస్తున్నారు. వాళ్ళిద్దరూ బయటకూడా కనిపించరు. వాళ్ల ప్రేమరాజ్యంలో వాళ్లు, తన్మయమైవున్నారు... పోనీ వాళ్ళని అలాగే తగలడనియ్యి! ఇటువంటి విషయాలు మనం చూసీ చూడనట్లు వూరికే వుండాలి. ఇటువంటి సాధారణ ముచ్చట్లతోనే కావ్యాలూ, కథలూ, కవితలూ ఉద్భవిస్తాయి. ఈవిధమైన ప్రణయ కలాపాలు మనవాళ్లకి అర్థమవదు. అది మన ఖర్మం! ఏం చేస్తాం! మనం కూడా మన ఇచ్ఛా, స్వేచ్ఛలని వాళ్లకి సిగ్గువిడిచి చెప్పడానికి జంకుతాం. ఎందుకంటే అలా తెగించి చెప్పినా వాళ్లు అర్థం చేసుకొంటారని మన కనిపించదు. మరో సంగతి. పువ్వులు సహజంగా పుష్పించి గుబాళించాలి, గాలి సహజంగా వీయాలి, వర్షం హఠాత్తుగా రావాలి, అలాగే ప్రేమికుడిగా భర్త అకస్మాత్తుగా ప్రణయ ప్రకరణం సాగించాలి. ఆ ప్రేమ వర్షం ఎలా కురవాలంటే, ఆ గాలి వాన ఎప్పుడొచ్చిందీ, ఎప్పుడు మనని బ్రహ్మానందంలో తడిపి ముద్ద చేసిందీ తెలియకూడదు."

స్నానాలగదిలో ఇద్దరం, ప్రేమ పక్షులం. చన్నీళ్ల స్పర్శ... సబ్బుబిళ్ల నీళ్ళతో కలిసి ఉత్పన్నమైన సుగంధపు నురగ... ప్రేమ కుసుమాన్ని నాజూగ్గా పుష్పించేలా చేసే వేడి వేడి పురుష స్పర్శ... నేను, పువ్వు తేకు, తేకునా వికసించినట్లు క్రమేణా తెరుచుకొంటున్నాను! పెదాలు పెదాల మీదపడి ఆస్వాదిస్తున్నాయి... అర్థ నిమీలిత నేత్రాలతో గాలిలో తేలుతున్నాము, ఇద్దరం. ఆ కోమల తరంగాలలో, తరంగాలయి పోయాము. ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు.

పూర్తి ప్రపంచాన్ని మఱచిపోయి, ఒకరిమీద ఒకరు చేతులువేసి గాఢంగా నిద్రపోయాము. ఇంత మంచి నిద్ర నాకీ జన్మలో పట్టలేదు.

ప్రొద్దున మళ్లీ అదే ప్రేమ స్పర్శతో మెలుకువ వచ్చింది. ఆయన చెయ్యి నెమలి ఈకలాగ నా శరీరంమీద తిరుగుతోంది... నేను మళ్లీ అణువణువునా పుష్పించి రేకులు విప్పుతున్నాను.

ఆయన మాటలు -

"నువ్వు రాత్రి నాకు స్వర్గసుఖాన్ని అందించావు. ఇంత సుఖం ముందెప్పుడూ నాకు లభించిన గుర్తు లేదు. నువ్వింతగా స్పందించగలవని తెలియదు. ఈ రోజే తెలిసింది. మంచికే అయింది - నిన్న నేను మధ్యాహ్నం యింటికి రావడం. నిజానికి ఆఫీసులో చాలా పనుంది. నేను సాయంత్రమే తిరిగి వచ్చేవాణ్ణి. కానీ జరిగిందేమిటంటే మా తోటి ఉద్యోగి శర్మ అడిగాడు "అరే నువ్వు సెలవు పెట్టావుకదూ? మరి ఆఫీసు కెందుకొచ్చావు?" అని.

నే నన్నాను. "పిల్లలకోసం సెలవు తీసుకున్నాను. వాళ్లు మా చెల్లెలింటికి వెళ్లారు. అందువల్ల"...

అప్పుడతను భావ గర్భితంగా నవ్వి "వట్టి మూర్ఖుడవిరా నువ్వు. పిల్లలు యింట్లో లేరు అంటే అర్థం మీ ఆవిడ ఒక్కర్తే ఒంటరిగా యింట్లో వుంది. మరి నువ్విటువంటి ఛాన్స్ వదులుకొంటావా? నేనైతే యిటువంటి సువర్ణావకాశం ఎప్పుడూ వదులుకొనే వాణ్ణికాను. వెళ్లు - నువ్వింటికి. పదినని త్రిప్పడానికి తీసుకెళ్లు - సినిమా, సర్కస్ వగైరా - అన్నానని కోపగించవుకదూ? నువ్వింత అమాయకుడవా? మీ ఆవిడకి ఎంత నిరాశ కలిగి వుంటుందో ఊహించావా?"

"నేనింక క్షణంలో ఆఫీసునుంచి బయటకొచ్చాను. తొరతొరగా ఇంటికి వచ్చాను."

ఆయన కథనం పూర్తిచేశారు.

అంటే అర్థం? శర్మగారు చెప్పారు కాబట్టి ఆయన యింటికి నా కోసం వచ్చారు. ఆయన చెప్పారు కాబట్టి నన్ను అలా సినిమాకి తీసుకెళ్ళారు. తనకు తానై ఆలోచన వచ్చిందికాదు. అకస్మాత్తుగా కుండెడు నీళ్లు వొంటిమీద పోసినట్లు నేను చల్లబడ్డాను. నా హృదయంలో నెమ్మదిగా విప్పుకుంటున్న కుసుమాల రేఖలు ధప్పున మూతపడ్డాయి! పువ్వులు హఠాత్తుగా వాడి పడిపోయాయి!!

"ఏమయిందమ్మా? నేనేదైనా పొరపాటు మాటలన్నానా?

నేనన్నాను. "అబ్బేలేదు. మరీ వేడిగా వుంది కదూ? అందువల్ల."

- అని నేనని, ఆయనకి దూరంగా జరిగి నడుం ఆయన వైపుతిప్పి, రగ్గు కప్పుకుని ముడుచుకు పడుకొన్నాను.



7

# దేవతా వంశి

**- మీనా కాకోడ్కర్**

సంగీతపు శ్రావ్యమైన ధ్వని నా చెవుల్లో పడుతోంది... ఆ నాదంలో నేను తన్మయమై, పూర్తిగా లీనమయిపోయాను. ఈ స్వరాలు నన్ను తమతోబాటు దూరం దూరంగా దిగంతాలకి లాక్కెళ్లుతున్నాయి. సంగీతం ఎంత గొప్పది! 'నన్ను సుఖ వృక్షాల శిఖరాగ్రాలు చేర్చుతుంది. అలాగే గుండె లోతుల్లో దాగున్న దుఃఖ వీణా తంత్రికలని మీటుతుంది - పాత గాయాలని రేపుతుంది. ఈ గాయాలు జీవితయాత్రలోని దైనందిన క్రియల వల్ల మఱుగున పడతాయి - ఏమాత్రం అలికిడి చేయక. అయితే ఏ క్షణంలో నేను నా ప్రియుడితో కలుస్తానో, అదే క్షణం ఈ మాయని గాయాలు నెమ్మదిగా నా మనస్సు మందిరంలోకి జారుకుంటూ వస్తాయి. అవి నాలోంచి విడదీయలేని అంతర్భాగాలు! ఎంత సుఖాన్ని గడించి, ఎంత ఎత్తు పెరిగినా, ఈ దుఃఖపు గాయాలు నన్ను నీడలా వెంటాడతాయి. ముళ్లకంబళీలా నన్ను వాటేసి, కళ్లల్లో నీళ్లు నింపుతాయి.'

ఇలా ఎందుకవుతుందో? ఎవరైనా పూర్తి సుఖాన్ని ఎందుకు పొందజాలరు? అది వీలవదని కాదు. వీలవుతుంది. అయితే దానికి జీవితంలో అత్యాశ త్యజించాలి. ఎప్పటికైనా ఆగి అంతటితో తృప్తి పడాలి. అప్పుడైనా పూర్తి (పరిపూర్ణ) సుఖం లభిస్తుందా? లభించవచ్చు... లభించకపోవచ్చు. ఆశల వెంబడి పరుగులు తీస్తున్నప్పుడు, మనం వెనక ఏఏ అమూల్య విలువలు పోగొట్టుకొన్నామో, ఆ విలువలే మనం ఆనంద మందిరంలో అడుగిడుతున్నప్పుడు మనని వెక్కిరిస్తూ, ముళ్లలా కాళ్లకి గుచ్చుకొంటాయి!

కానీ 'దేవయాని' అలాకాదు. చాలాకాలం క్రితమే, ఆమె తన పూర్తి ప్రపంచాన్ని సొంతం అవగతం చేసుకుంది. విజయం సాధించింది. ఆమె తన చిన్న

ప్రపంచం అవతల ఎప్పుడూ చూడలేదు. ఎంత వేరైనదీ ఆమె మనస్తత్వం - నాకంటె! మా యిద్దరి ప్రపంచాలు కూడా వేరైనవే! కానీ చిన్నతనంలో ఆమె నాలాగే వుండేది. ఆ వయస్సే అటువంటిది. ముక్కుపచ్చలారని పిచ్చిపిల్ల! అన్ని తేడాలూ, భిన్నత్వాలూ తెలిసేది బాల్యం పోగొట్టుకొన్నాకనే!

ఎక్కడ పోయిందబ్బా అది? మిణుగురు పురుగులు తిరిగే ఆ నది వొడ్డునా? ... ఆ కొండమీదున్న చంద్రేశ్వర్‌గుడి దగ్గరా? ... లేక అత్తయ్య వుండే గదిలోనా - ఆ అత్తయ్య వుండే ఉగ్రాణం గదిలో దేవుడి దీపపు సెమ్మాలు వెలుగుతూ తళతళా మెరిసే ఇత్తడి గిన్నెలమీద పడి బంగారంగా మారుస్తూ ... ఎక్కడ పోయిందబ్బా - నా బాల్యం అక్కడ ఆ ఉగ్రాణంలో వున్న గాదెలు - బియ్యం, గోధుమలూ నింపి వుంచినవి - నా కంటే చాలా ఎత్తుగా వుండేవి, అక్కడ నూనె డబ్బాలూ, ఎండు మిరపకాయలూ, లవంగాలూ, మిరియాలూ, దాల్చిన చెక్కలూ, సాంబారు పొడరు దాచడం వల్ల ఘుమఘుమ సువాసన వచ్చేది. ఆ వాసనల అదృశ్యపు గోడలు ప్రక్కగదుల్లోనూ వుండేవి. అక్కడ మూలలో దొంతర్లుగా పేర్చిన పక్కచుట్టలు, వాటిమీద పడుకుని వేరే ప్రపంచపు స్వప్నాలని కనేదానిని. ఆ భిన్న ప్రపంచంలో నేనుకూడా ఆ 'దేవయాని'లా అద్భుత చాకచక్యం, తెలివితేటలు చూపిస్తాను., ఆ ప్రపంచంలో నేను కూడా తెల్లవారుఝామున లేచి వంట చెయ్యడానికి పొయ్యి రాజేస్తాను., ఆ ప్రపంచంలో నేనుకూడా సర్‌సర్‌మని గబగబా బావిలోని నీళ్లు తోడుతాను., పెద్దకొండలా పేరుకున్న గత దినపు గిన్నెలు, కంచాలూ శుభ్రంగా, తళతళా మెరిసేలా తోముతాను., అలాగే పొలంలో పలుపుకోస్తూ పనిచేస్తూ వుంటే నా చేతిగాజుల్లోని ఎఱుపురంగు అద్దాలు బంగారు సూర్యకిరణాలు తాకి మాణిక్యాలలా మెరుస్తాయి.

"దేవయాని" మా యింట్లోని పనిమనిషి కూతురు. మా నాయనమ్మ-అత్తయ్యల యింట్లో దేవయాని తల్లి పనిచేస్తూంటే 'దేవయాని' తల్లికి సహాయం చేసేది., తీరిక వేళల్లో నాతో ఆటలాడేది. ఊళ్ళో ఒక చిన్న నది ప్రవహించేది. ఆ నది ఎండి పోయినప్పుడు, జనం దానిలో నుంచి అవతలకి వెళ్లేవారు! దేవయాని కూడా వాళ్ళతో వెళ్లేది. నాకు వెళ్లాలని ఎంత వుత్సాహం చూపించినా అత్తయ్య వాళ్ళతో వెళ్లనిచ్చేదికాదు.

కొబ్బరిచెట్ల పక్కనించి, పొలాల మధ్యనుంచి ఒక పిల్లకాలువ ప్రవహించేది.

అక్కడికి ఎలాగో అత్తయ్య చూపు తప్పించుకుని, 'దేవయాని'తో బాటు వెళ్లేదానిని, పరుగు పరుగుతో. ఈనది కాస్త నిండినప్పుడు, దానికి అడ్డంగా పేర్చిన కొబ్బరిచెట్ల దూలాల మీద నడిచి యివతలి గట్టు నుంచి అవతలి గట్టుకు చేరుకొనేవాళ్లం. 'దేవయాని' దానిమీద నుంచి సునాయాసంగా, పరుగు పరుగున వెళ్లి అవతలి గట్టు చేరేది. నేను మాత్రం బితుకుబితుగ్గా, మెల్లిమెల్లిగా ఆ కొబ్బరిచెట్టు బోదె మీదనించి అడుగడుగునా తటపటాయిస్తూ నడిచేదాన్ని., అలా నడుస్తూ నది మధ్యలోకి రాగానే నా దృష్టి కిందనున్న బోదెల మధ్య వేగంగా ప్రవహిస్తున్న నది కనిపించి మరింత భయపడి, ఆ కంగారులో గట్టిగా 'దేవయానీ' అని అరిచేదాన్ని ( ఆ నది ప్రవాహం నన్ను మింగేయడానికే వస్తోందని నా భయం). నా కేక విని క్షణాల్లో 'దేవయాని' అటునుంచి వచ్చి నాకు చెయ్యి అందించి సురక్షితంగా అవతల గట్టు చేర్చేది. ఎన్నిసార్లు మేము ఆ పిల్లకాలువ దాటినా, అన్నిసార్లూ యిలాగే తప్పక జరిగేది. ఆ తరువాత దగ్గరలోని కొబ్బరిచెట్టుకి ఆనుకుని కూర్చునేవాళ్లం. నదిఒడ్డున బొరియల్లోంచి ఎండ్రకాయలు గబగబా లోపలకీ - బయటకీ వస్తూ, పోతూ వుండేవి. తెల్లతెల్లని కొంగలు గుంపులుగా ఆకాశం నించి వచ్చి, కలసికట్టుగా పొలాల మధ్య వ్రాలేవి. ఎక్కడో దూరంలో పక్షి ఏడుస్తోంది. కాలవనీళ్లల్లో గులకరాళ్లు వేస్తూ, 'దేవయాని' నాకు అచ్చట్లు - ముచ్చట్లూ చెప్పేది., కథలూ, కాకరకాయలూ, లౌక్యం, లోకనైజం వగైరా...

"నీకు ఈ సంగతి తెలుసా? ఈ కొబ్బరిచెట్టు కాయలు ఎవ్వరూ దొంగలించరు."

"ఎందువల్ల?"

"కొస్తుర్యా తాతగారు 'గోపాల్‌దాద్' అని వుండేవాడు. నెత్తికి తువ్వాలు చుట్టుకుని, చేతిలో కఱ్ఱ పట్టుకుని వూరంతా తిరిగేవాడు. చవితినాడు అందరిళ్లలోనూ "ఘుమట్" (ఢంకా, డోలు) వాయించేవాడు."

"ఇప్పుడు వాయించడా?"

"వాయించడు"

"ఎందువల్ల"

"చచ్చిపోయాడు. ఈ కాలవలోనే పడి ప్రాణాలు అర్పించాడు. ఆత్మ హత్యట."

నాకు చెమటలు పోశాయి. భయం భయంగానే కాలవ నీళ్ళని చూస్తున్నాను. నెత్తిన తువ్వాలు చుట్టుకొని, చేతికఱ్ఱని ఆడిస్తూ 'గోపాల్‌దాద్' ఆ కాలవ నీళ్లల్లోంచి నాకేసి పెద్ద కళ్లతో కోపంగా చూస్తున్నాడు. మరి యిప్పుడు మళ్లీ వచ్చినట్లే తిరిగి ఆ కొబ్బరిచెట్టు వంతెన మీదుగా అవతలి గట్టుకు చేరుకోడం ఎలా? ఈ బెంగతో నేను తల్లడిల్లిపోయాను.

"పిల్లల్నేమీ చేయడతను."

'దేవయాని' నాకు ధైర్యం చెప్పింది.

"కొబ్బరికాయలు దొంగిలించే వాళ్లని మాత్రం కఱ్ఱతో కొడ్తాడు."

నా చేతుల్లో వున్న బొండాన్ని నీళ్లల్లోకి పడేశాను., ఆ చచ్చిన ముసలాడితో గొడవెందుకని...

ఒకసారి 'దేవయాని' అంది.

"నీకు తెలుసా? మొన్న గవ్వల చేపల వేటలో నాకు ఇంత పెద్ద గవ్వచేప దొరికింది," రెండుచేతులూ చేర్చి పెద్ద ఆకారంగా చూపించింది.

"అలాగా?"

"ఇంత పెద్దది, ఇంత పెద్దది."

"ఎంత పెద్దదీ?"

"పేడ-తట్ట కంటే పెద్దది."

పేడ-తట్ట ఎంత పెద్దదో, ఎంత బరువైనదో నాకు తెలియదు. అయినా ఆ 'గవ్వచేప' చాలా పెద్దదనీ, బరువైనదనీ నాకు తెలిసింది - నిశ్చయంగా

"ఆఁ తరువాత?"

"ఆ తరువాత ఆ గవ్వలోంచి అదే తెరుచుకుని..."

"ఆఁ తెరుచుకుని?"

"అందులోంచి 'చంద్రేశ్వర్' వుద్భవించాడు."

"ఆఁ అందరికీ కనిపించాడా?"

"అందరికీ ఎందుకు కనిపిస్తాడూ? ఆ గవ్వ నాకు మాత్రమే దొరికింది కదూ?"

"నిజంగా! ఒట్టు?"

"హాఁ ! స్వామి నాతో ఒక విషయం చెప్పాడు."

"ఏం చెప్పాడబ్బా!"

నా ఉత్సుకత పరాకాష్ఠని అందుకొంటోంది. ఆ తరువాత ఆ రహస్యం బయట పెట్టేందుకు షరతుగా నాతో రెండు కళ్లమీదా, కంఠంమీదా, చెట్టు క్రింద గట్టుమీది గ్రామదేవత మీదా, భూత, ప్రేత పిశాచాలమీదా ఒట్టు పెట్టించుకుని, కొంతబెట్టు చేసి చివరికి చెప్పింది.

"ఎవరో చెప్పారు. ఎప్పుడూ గుమ్మడికాయ తినకుండా వుంటే మనుష్యులకి యితర ప్రాణుల భాష అర్థం అవుతుందిట."

"ఇతర ప్రాణులు - అంటే చెరువులోని కప్పలు?"

"అవును."

"నదిలోని చాపలు? ఆకాశంలో పక్షులు? మా ఇంట్లోని 'మోతీ' (కుక్కపిల్ల)?

"అవును."

"కేవలం గుమ్మడికాయ తిననంత మాత్రాన?"

"అవును."

చాలా సులభమైన షరతు. గుమ్మడికాయని నేనిక ముందు కళ్లతో చూడడంకూడా మానెయ్యాలని నిశ్చయించాను. అది తినకుండానే నేను హాయిగా బ్రతగ్గలను., మా 'మోతీ'తో కావలసినన్ని ముచ్చట్లు మాట్లాడుకోవచ్చును., యిలా కలలుకంటూ నేను యింటికి చేరుకున్నాను.

కానీ గుమ్మడికాయ తినకుండా వుండగలగడం ఎంత కష్టమైన విషయమో నాకు ఆ తరువాత తెలిసొచ్చింది.

మాటిమాటికీ అత్తయ్య గుమ్మడికాయతో పులుసు, కూర, వేపుడు, పచ్చడీ, చారు యిలా రోజూ చేస్తూ వుండేది. వండిన ప్రతీ వంటకం అందరూ కొంతైనా తినకపోతే వూరుకోదు. ఆమె ధాటికి తట్టుకోలేక ఒకరోజు సంగతి చెప్పేశాను.

"చంద్రేశ్వరుడు నన్ను గుమ్మడికాయ ససేమిరా తినొద్దని చెప్పాడు."

చీర అంచు నోటికడ్డంగా పెట్టుకుని అత్తయ్య కిలకిలా నవ్వింది. అలా నవ్వుతూ మరో గరిటడు గుమ్మడికాయ కూర నా విస్తరిలోకి వడ్డించింది. అత్తయ్యమీద నాకు పీకలవరకూ కోపం వచ్చింది. నా కలలన్నీ ఒక్కక్షణంలో వమ్ము చేసింది.

మా పొలాలకి అవతల దారిలో దూరంగా ఒక పెద్ద కొండ, ఆ కొండ

శిఖరాన శ్రీ చంద్రేశ్వర్ దేవాలయం వుంది. ఎక్కడా, ఏమాత్రం విశ్రాంతి తీసుకోకుండా పరుగు పరుగున ఆ కొండ ఎక్కి గుళ్లో మొదట గంట కొట్టిన వాళ్లు గెలిచినట్టు - అని పందెం వేసుకొనే వాళ్ళం. పొరబాటున కూడా ఈ పందెంలో నేను ఎప్పుడూ గెలవలేదు. ఆ తరువాత గుడిస్తంభాలనానుకుని కూర్చుని విశ్రాంతి తీసుకొనేవాళ్లం.

'దేవయాని' తన గౌను జేబులోంచి వుసిరికాయలు తీసేది.

"నీకు తెలుసా...?" అది చెప్పేది, "ఈ ఉసిరికాయలు తిని, నీళ్లు త్రాగితే, ఎంతో తియ్యగా వుంటుంది."

ముందుండే తీపి అనుభవంకోసం ఆ పుల్లటి వగరు వుసిరికాయలు అతికష్టంమీద తినేదాన్ని. ఆ తరువాత పూజారి లేనప్పుడు దేవుడి దగ్గర తీర్థపునీరు గటగటా త్రాగి బయటపడేవాళ్లం. అప్పుడు ఆ నీళ్ల తియ్యదనం అమృతతుల్యం.

ఎన్నో లెక్కలేనన్ని సార్లు దేవాలయంలో హారతికి మేమే వచ్చేవాళ్లం. ఆ తరువాత గుళ్లో గంటలు లయబద్ధంగా కొట్టేవాళ్లు. దేవాలయం బయట పెద్ద అద్దాన్ని చూపించి సూర్యభగవానుడి కిరణాలు శ్రీ చంద్రేశ్వరుడి విగ్రహంమీద పడేలా చేస్తారు. ఆ హారతిని యిస్తూ చేసే భజనలు, వాయిద్యాల పవిత్ర శబ్దాలూ, కొండ గాలితోబాటు మెల్లిగా దిగి పరిసర ప్రాంతాలని పావనం చేసేవి.

అత్తయ్య ఎప్పుడూ అనేది - నేను చాలా బలహీనురాలనీ, బొత్తిగా శక్తి లేదనీ, ఏ పనీ సరిగ్గా చేయలేనట, అయితే ఏ పనైనా నిశ్చింతగా 'దేవయాని'కి చెప్పేది, బావి దగ్గరకెళ్లి, నీళ్లుతోడి తీసుకురావడం వరకూ. ఆ తరువాత ఇత్తడిబిందె, బాల్చీ తీసుకుని బావి దగ్గరకి వెళ్లేది. బాల్చీ సరసరా బావిలోకి విడిచి క్షణాలలో అది నిండేలా కదిపి బయటకి (పైకి) లాగేది. ఆ బాల్చీనీళ్లు బిందెలోపోసి, మళ్లీ ఖాళీ బాల్చీ బావిలోకి తోసేది. మళ్లీ పైకి లాగి, ఆ నీళ్లు బిందెలో పోసేది. తరువాత మరో పెద్ద బిందెలోకి ఈ నీళ్లుపోసి, ఆ పెద్ద బిందె నడుంకి ఆన్చి ఇంట్లోకి తెచ్చేది. బిందెలో నీళ్లు కుదుపువల్ల టపక్టపక్మని బయటకి చిమ్మేవి. 'దేవయాని' గౌను తడిసి ముద్దైపోయేది. అలా తడిసిన బట్టలతోనే 'దేవయాని' రోజంతా తిరిగేది. ఆ తడి బట్టలు మార్చి మరో పొడి బట్టలు వేసుకొనేలా ఎవ్వరూ దానిని బలవంతం చేసేవారు కాదు. నన్ను మాత్రం అలా తడి బట్టల్తో ఒక్క క్షణంసేపు వుండనిచ్చేవారు కాదు. అందువల్ల 'దేవయాని' మీద నాకు ఒకవిధమైన

అసూయకూడా కలిగేది. అలా తడిబట్టలతో నిర్భయంగా, దీటుగా తిరిగే 'దేవయాని' నా దృష్టిలో ఒక గొప్ప స్నేహితురాలు.

'దేవయాని'కి అసంఖ్యాక తమ్ముళ్లు, చెల్లెళ్లు. వాళ్లల్లో ఎవరో ఒకర్ని సంవత్సరం పొడుగునా ఎత్తుక తిరిగేది. వాళ్ల అవసరాలన్నీ (స్నాన, పానాదులు) చూడడం, జలుబు చేస్తే ముక్కు తుడవడం, మరీ చిన్న పిల్లలు మైలపడితే, వాళ్లని శుభ్రపరచడం, ఏడ్చినా, అల్లరిచేసినా భయపెట్టి అదమాయించి, బుజ్జగించి వూరుకోబెట్టడం, ఇలా పెద్ద మనుష్యుల తరహాలో వ్యవహరించేది. నేను ఆట బొమ్మలతో ఏ ఏం చేసేదాన్నో అవే పనులు నిజమైన మనుష్యులతో, అది నిజంగా చేసేది!

ఒకరోజు కొండ ఎక్కుతూ వుంటే, అది ఒక తీగ (లత) చూసి ఆగింది. ఆ తీగకి చిన్నచిన్న ఎఱ్ఱటి పళ్లు వున్నాయి.

''దేవతావంశి'' అని ఆమె నాకు ఆ పళ్ల గురించి చెప్పింది.

'దేవ్‌తన్‌వషీ' (దేవతావంశి) అంటే దేవుడి దోసకాయలు! హా! పేరుకూడా అగరొత్తు ధూమంలాగ ఘుమఘుమ మంటోంది!

''తింటారా?'' నేనడిగాను.

''అవును.''

''తియ్యగా వుంటుందా?'' పళ్లు కోయడానికి చెయ్యి చాపుతూ, నేనడిగాను.

''ష్! 'దేవ్‌తన్‌వషీ' అలా కోయకూడదు. అలా కోస్తూ వుంటే సూర్యకిరణాలు దానిమీద పడి అది చేదుగా మారిపోతుంది.''

'దేవయాని' ఒక 'దేవ్‌తన్‌వషీ'ని రెండు గుప్పెట్లలో పట్టుకుని, గబుక్కున పెరికి నోట్లోకి వేసేసుకుంది.

''హా! నాకూ ఒకటి కోసి యియ్యి'' నేను అడిగాను.

''ష్! ఎవరికి వాళ్లే కోసుకోవాలి. మరొకరు కోసి యిస్తే చేదైపోతుంది.''

నేను గుప్పిట్లో ఆ పండుని కప్పి, 'దేవయాని' చేసిన విధంగానే ఆ పండుని కోసి నోట్లో గబగబా వేసుకున్నాను. చేదు విషం! నోటి రుచంతా అదృశ్యమై పోయినట్లయింది!

''ష్! వర్తి చేదు!''

''సూర్యుడి చూపులు పడ్డట్టున్నాయి దానిమీద'' ఆమె తాపీగా మరో పండుని

కోసి నోట్లో వేసుకుంటూ అంది.

సూర్యకిరణాలు తగలకుండా ఆ "దేవతావంశి" ఫలాన్ని కోసి తినడానికి నేను విశ్వ ప్రయత్నం చేశాను. ఫలించలేదు. నా భాగ్యానికి ఎప్పుడూ చేదు పళ్ళే! 'దేవయాని' కోసిన పళ్లు ఎంచక్కా తియ్యన! నేను అలాగే కోసిన పళ్లు చేదువిషం! ఇలా ఎందుకవుతోందో నాకు అంతుపట్టలేదు.

మామూలు, సాధారణ ముచ్చట్లు. అయినా అవన్నీ జోడించి బేరీజువేస్తే, 'దేవయాని' నాకంటే ఎంతో హుషారు, తెలివైనదని స్పష్టంగా తెలుస్తోంది.

  

నేను కేవలం సెలవుల్లో వచ్చేదానిని. నేను పెద్దదాన్ని అవుతున్న కొద్దీ ఈ సెలవుల్లోని మాధుర్యం తగ్గుతూ తగ్గుతూ పోయింది. ఆ వుసిరికాయలూ, ఆ 'దేవ్‌తన్‌వషీ' పళ్లూ తినాలని కూడా అనిపించలేదు.

అక్కడికి వెళ్లినప్పుడు నేను వసారాలో కూర్చుని, చేతిలో పుస్తకం పెట్టుకుని చదువుతూ కాలం గడిపేదాన్ని - పెద్దపెద్ద పుస్తకాలు - అవీ 'ఇంగ్లీషు'వి. ఆ ఇంగ్లీషు నవలల్లో 'కౌన్‌టస్' (రాజకుమారి) 'డ్యూక్స్' (రాజకుమారులు) నన్ను పరవశం చేసేవి. బంగారుకేశాలూ, నీలంకళ్లూ - సౌందర్యరాసులైన రాజకుమార్తెల గురించి చదివి నన్ను నేనే అద్దంలో చూసుకునేదానిని. వాళ్లు వుండే రాజసౌధాల వర్ణన చదువుతూ, పేద అలికిన అత్తయ్య యిల్లు చూసి చాలా లజ్జ వేసేది.

చిన్ననాటి ఊహాలు, భావాలు కళ్లముందు నుంచి మెల్లిగా తప్పుకొంటున్నాయి. అత్తయ్య వుగ్రాణపు గదిలోనే ఆడుతూ, పాడుతూ ఎక్కువ కాలం గడిపిన నేను, యిప్పుడా గదిలోకి పొరబాటున కూడా అడుగు పెట్టడంలేదు. ఇప్పుడా గ్రామీణ పరిసరాల్లో నేను యిమడలేక పోతున్నాను. శ్రీ చంద్రేశ్వరుడి దేవాలయపు గంటలు చెవికి సోకినా, నాకు తెలిసేదికాదు. 'దేవయాని' కంటే నేను ఎంతో పెద్ద జ్ఞానిని అయ్యాను. ఎన్నోరెట్లు (విజ్ఞానంలో) ఎత్తుకి పెరిగాను. మరి యిప్పుడు ఆమెతో కలుసుకోవడానికి నా మనస్సెలా కోరుకుంటుంది?

ఇప్పుడు 'దేవయాని' నా పాతగౌనులు వేసుకోవడంలేదు. 'లంగా-వోణీ' వేసుకొంటోంది. గవ్వచాపలూ, ఆ పెద్ద గవ్వలోంచి శ్రీ చంద్రేశ్వరుడు ప్రత్యక్షమవడం వంటి వుత్సుకత కలిగించే చమత్కారపు కథలు చెప్పడంలేదు. ఇప్పుడు అది యింటి చుట్టుప్రక్కల వాళ్ల విషయాలూ, విశేషాలూ చెప్తోంది. మరి వేరే విషయాలు

చెప్పడానికి దాని దగ్గర ఏమున్నాయని? ఇలా అనిపించి నాకు నా విజ్ఞానం మీద, నా అవగాహన మీదా ఎంతో గర్వం కలిగేది. అలావున్నా ఎందుకో, బావిలోంచి సరసరా నీళ్లు తోడే 'దేవయాని', బట్టలు శుభ్రంగా వుతికి ఆరవేసే 'దేవయాని', గిన్నెలు తళతళా తోమే 'దేవయాని' కనబడితే చాలు, నా చిన్నతనపు లోటు వెక్కిరి తలవేసి పలకరించేది! నా మనః అంతరంగాల్లోని 'దేవయాని' పులకరించేది! ఎందుకో ఒప్పుకోక తప్పదు, 'దేవయాని' నాకంటే ఎక్కువ పరిపూర్ణత సాధించింది.

కాలం గడిచిపోతోంది. మధ్యలో ఎప్పుడో 'దేవయాని'కి పెళ్లి అయింది. ఇక యిప్పుడు దీనికికూడా తల్లిలాగే పుట్టెడు సంతానం కలుగుతారు! అలా క్షణం ఆలోచనవచ్చి - ఆ విషయం విస్మరించాను. దాని గురించి ఆలోచించడానికి నాకు తీరికేది? వేళ ఏది? ఎన్నో రంగుల స్వప్నాలతో నా మనస్సు నిండిపోయింది. ఇంకా ఎంతో చదువుకోవాలనీ... పైపై హర్మ్యాలు ఎక్కి ప్రపంచం చుట్టి రావాలనీ, ఆ నవలల్లోని రాకుమార్తెలూ, రాకుమారులూ తిరిగిన ప్రదేశాలు స్వయంగా చూసిరావాలనీ యిలా ఎన్నో రంగుల కలలు, ఒక్కొక్క కల ఫలించి నిజమవగానే, మరో పదికలలు ఆ స్థానంలో... కొత్త కొత్త కలలు... ఎక్కడైనా ఆగి.. ఇంతటితో చాలు అని అనడం కూడా అసాధ్యమయింది.

నాకు స్కాలర్‌షిప్పు లభించింది. నేను 'లండన్'కి వచ్చాను, నా స్వప్నలోకపు రాజధాని - ఎంతసేపు కల నిజమైన మహత్మ్యానందంలో నా మనను మునిగిపోయిందో తెలియదు... నేను మళ్లీ మా అత్తయ్య గురించి, ఆ ఇల్లు, 'దేవయాని' గురించీ ఎందువల్లనో ఆలోచించడం ప్రారంభించాను. ఈ ఆలోచన మెల్లిమెల్లిగా మొదలయింది - మధ్యలో అర్థాంతరంగా వచ్చే మెరుపుల్లాగ. కానీ యిప్పుడది నా కాలక్షేపం కోసమే పరిమితం అయింది.

ఇప్పుడు రాత్రి చీకట్లో కళ్లు మూసుకుని నిద్రపోవడానికి ప్రయత్నిస్తున్నప్పుడు కళ్లముందు వచ్చే దృశ్యాలు - ఆ నది ప్రక్కన, పొలాల మధ్య వ్రాలిన తెలతెల్లని కొంగలబారులు, గుప్పిట్లో 'దేవతావంశి' ఫలాలు పట్టుకుని నిలబడ్డ 'దేవయాని' - మరి ఎందుకో ఆ బంగారుకేశాలూ, నీలంకళ్ల రాకుమార్తెలు మాత్రం నాముందుకు రావడం మానేశారు. నా చింతనలు ఒక చిరు తుఫానుగా మారి మా అత్తయ్య యింటి ముందు తోటలోని పారిజాత వృక్షాన్ని కదిలించి, హడలకొట్టాయి! శ్రీచంద్రేశ్వరుడి గుడికి ఆ తుఫానే మెల్లిగా వెళ్లి గుడి గంటల నన్నింటినీ గణగణా,

గణగణా మ్రోగించింది పిచ్చిగా!

పార్టీలో వైనుగ్లాసు పెదవులకి తగిలినప్పుడు గుండెల్లో ధ్వనించే రుచి, ఆ వుసిరికాయలు తిన్న తరువాత త్రాగిన తీర్థపు నీళ్లవి - అనిపిస్తుంది., ఈ వాతావరణం వదిలి బయటపడాలని., యివన్నీ వదిలి పారిపోవాలని... కానీ ఎందుకిలా అనిపిస్తోంది? నా ఆశయాలూ, ఆకాంక్షలు ఫలించే కదా నేనీ వుచ్ఛస్థితికి చేరుకున్నాను? మరి, అన్నీ సాధించి యశస్సు గడించినా ఈ లేమి, ఈ లోటు, ఈ డొల్లతనం ఎందుకో?

  

సంగీతం ఆగిపోయింది. జ్ఞాపకాల భారం భరించలేనంత అయింది. దుఃఖపు ముళ్ల కంబళీ మళ్లీ నన్ను చుట్టుకుంది. ఇన్ని మధురానుభవాలు వదులుకొని, ఇంతదూరం వచ్చాను నేను - అదీ నేను పోగొట్టుకొన్నాననే బాధకూడా లేకుండా!

నాకు మళ్లీ తిరిగి వెళ్లిపోవాలనుంది. ఈ విదేశాన్ని వదిలి, స్వదేశానికి... మా అత్తయ్య ఇంటికి! కానీ అక్కడికి వెళ్ళినా నేను సుఖపడతానా? లేక మళ్లీ మరో మానసిక రోగం పట్టుకుంటుందా? ఏమో చెప్పలేను! అయినా నేను వేళ్లక తప్పదు... సుఖాన్ని వెతుకుతూ - వెతుకుతూ తిన్నగా ప్రియ 'దేవయాని' దగ్గరకి... ఈ ప్రశ్న వేయడానికి.

"దేవయానీ, నువ్వు సుఖంగా వున్నావా?"

నాకు తెలుసు. ఆమె నా ప్రశ్నకి జవాబు యివ్వదు. ఊరికే చూస్తూ వుంటుంది. ఆమె కళ్లల్లోని భావాలు నేను కనిపెట్టలేను., అయినా ఆమె నైజం నాకు బాగా తెలుసు. అందులో ముఖ్య అంశం 'Acceptance' (అంగీకారము). వున్నదాంట్లో సర్దుకుపోయి, సంతృప్తితో సమాధానంతో సంసారం సాగించే 'దేవయాని'కి నాలాగ సుఖాలకోసం అఱ్ఱులు చాస్తూ పరిగెత్తే నైజం పనికిరాదు.

ఇన్నేళ్ల తరువాత నాకు తెలిసింది. 'దేవయాని' కోసిన 'దేవతావంశి' ఫలం ఎప్పుడూ తియ్యగా ఎందుకుండేదో! ఆ ఫలంలో నేను అపేక్షించిన తీపి, నిజానికి ఆ ఫలంలో లేనేలేదు. ఆ పళ్ళన్నీ చేదువే! ఆ తీపి వున్నది తినేవాళ్ల నైజంలో. చేదు విషమైన (జీవ) ఫలంలో తీపి అనుభవాన్ని, తియ్యదనాన్ని గ్రహించి సేవించే సామర్థ్యం 'దేవయాని' సహజగుణం.

ఆమెలాగ అవాలనే ఆకర్షణ మళ్లీ నాలో మొలకెత్తసాగింది, గుండె లోతుల్లో

చీలుస్తూ! అశిక్షిత, పల్లెటూరిపిల్ల 'దేవయాని'... అయినా నా కంటే ఎంత వున్నత వ్యక్తిత్వం కలది! నాకు బాగా తెలుసు., ఆమె నా కంటే పూర్తి భిన్నమైన మనస్తత్వం కలది. ఆమెలా అవడం నాకు అసంభవం., అయినా నేను ఆ వూరు వెళ్లాను. తప్పక వెళ్లాను. 'దేవతావంశి' ఫలంలోని తియ్యదనం అన్వేషిస్తూ.



8

# పున్నమిరాత్రి గుర్తు

- దత్త శ్రీ నాయక్

'సోనూ బాబ్ రిటైరైన తరువాత తన సొంత వూళ్లో స్థిరబడ్డాడు. వూళ్లో అతని పొలాలూ, తోటలూ వున్నాయి. ముందు అతని తండ్రి అవి చూసుకొనేవాడు. ఆయన పోయిన తరువాత ఆ బాధ్యత 'ఆరం దోమంత్'కి అప్పగించాడు. 'సోనూ బాబ్' 'జడ్జి'గా యిన్నేళ్ళు పనిచేశాడు. 'గోవా' బయటే వుద్యోగం. పని ఏదీలేక మేడమీద వాలు కుర్చీలో కూర్చుని 'సోనూ బాబ్' చుట్టూ పరికిస్తున్నాడు. 'సోనూ బాబ్' కుటుంబం అంటే ఇద్దరే - అతనూ అతని భార్య. అతనికి పిల్లల్లేరు. పిల్లలకోసం అతని పెళ్లాం ముందు ముందు ఎంతో తపించిపోయింది. డాక్టర్ల వైద్యోపచారాలు, దైవకార్యాలు, పూజలూ, వ్రతాలూ, వుపవాసాలూ, అయినా పిల్లలు కలగలేదు. చివరికి విసిగెత్తి యిది మన ఖర్మం' అని వూరుకున్నారు.

అలా మేడమీద కూర్చుని నాలుగుదిక్కులా చూస్తున్న 'సోనూబాబ్' దృష్టి 'మీరా దేశాయ్' మూడంతస్థుల ఇంటిమీద పడింది. మూడవ అంతస్తు కిటికీ బయట ఒక తేనె పట్టు వేళాడుతోంది., నల్లనల్లగా వుండి మెరుస్తూ, గాలికి కదులుతోంది.

'సోనూబాబ్' జడ్జిగా చాలాకాలం పనిచేసి రిటైరయినా, అతనిలోని జడ్జి (న్యాయమూర్తి) గుణం పోలేదు. ఇప్పుడుకూడా తప్పులు చేసిన వాళ్లకి శిక్షలు యివ్వాలని వుత్సాహపడతాడు.

'సోనూబాబ్' యింటిముందు పిల్లల ప్రాథమిక పాఠశాల వుంది. ఆ స్కూలులో మాస్టారు ఎప్పుడూ నల్ల కళ్లజోడు తగిలించుకుని కూర్చుంటాడు., చాలా గంభీరమైన మొహంతో కూర్చుంటాడు., ఏదో గొప్ప ఆలోచనల్లో వున్నట్లు - నిజానికి చక్కగా నిద్రపోతూ వుంటాడు. చదువుల కోసం స్కూలుకి వచ్చిన

పిల్లలు మాత్రం కావలసినంత అల్లరిచేస్తూ, ఆడుకొంటూ వుంటారు. ఆ మాస్టారు చాలా పొడుగు. నల్ల బల్లముందు నిల్చొని వ్రాస్తున్నప్పుడు వెనకనున్న పిల్లలకి పొలంలో పాతిన దిష్టిబొమ్మ గుర్తుకి వస్తుంది. 'సోనూ బాబ్'కి పిల్లలు లేకపోవడం వల్ల ఈ బడి పిల్లలంటే ఎంతో ప్రేమ, వాత్సల్యం. ఈ మాస్టరు యిలా బాధ్యతారహితంగా క్లాసులోనే నిద్రపోతూ, పిల్లల బంగారు భవిష్యత్తుని పాడు చేయడం అతనికి చాలా కోపం తెప్పిస్తోంది. తనూ ఒకరోజు మాస్టరు అయి, ఈ మాస్టరుకి పాఠం చెప్పాలనీ, అతన్ని బెంచీమీద వొంగొని నిలిచేలా శిక్ష యివ్వాలనీ 'సోనూబాబ్' ఆలోచన. గట్టిగా కేకలేస్తూ అతనికి యిలా అనాలని అనిపించేది "అరే మాస్టారూ! లే! నిద్ర లే! కళ్లు తెరచి ఆ పిల్లలకి పాఠాలు చెప్పు! కాకపోతే నీకు రెండునెలల కఠిన కారాగారశిక్ష యిస్తాను."

'సోనూబాబ్' యింటి దగ్గరలో 'ఫాద్రీ మోంతేరో' వుంటున్నాడు. కోతికి ఫాద్రీ వేషం వేస్తే ఎలాగుంటుందో, అలా అతనుంటాడు. ఎప్పుడూ అతని కళ్లజోడు క్రిందికి జారి ముక్కు చివరకి చేరుకుంటుంది. ఆ కళ్లజోడు మీద నుంచి అందరినీ చూస్తూ వుంటాడు. 'ఫాద్రీ' మొహం చూస్తేనే 'సోనూబాబ్'కి వొళ్లు మండిపోతుంది. అతని ముక్కుమీద ఒక గుద్దు గుద్దాలనిపిస్తుంది!

రోడ్డుమీద 'వినోపళ్' వెళ్తున్నాడు. అతన్నిచూస్తే 'సోనూ బాబ్'కి చాలా జాలేసింది. 'వినోపళ్' కుంటివాడు. రెండు చంకల్లో రెండు కఱ్ఱలు వుంచి, చిన్న పడవలో పడవవాడు రెండు చేతులతో తెడ్లువేసి నీళ్లల్లో ముందుకు పోతున్నట్లు నడుస్తున్నాడు, హడావిడిగా.

'సోనూ బాబ్' చూసిన మరో దృశ్యం. 'గోపాల్ ఫోవ్‌కార్' వస్తున్నాడు., ఎప్పటిలాగే పాములా వంకరటింకరగా నడుస్తూ, రోడ్డు మీదంతా పేడముద్దలూ, గొఱ్ఱె బెత్తులూ పడినట్లు! వాటిమీద పడి తనకాళ్లు మైలపడి పోతాయి గనక జాగ్రత్తగా చూసి నడవాలి అన్నట్లు. 'సోనూ బాబ్'కి అతను కాస్త అతి తెలివి తేటలున్నవాడిలా కనిపిస్తాడు. ఎప్పుడైనా రోడ్డుమీద తటస్థబడితే అడ్డగించి అల్లరి చెయ్యాలనిపిస్తుంది.

'సోనూబాబ్' ఇంటికి సరిగ్గా ఎదుటి యింట్లో 'దత్తూబాబ్ ఫళారీ' వుంటున్నాడు. 'దత్తూ బాబ్' ఎప్పుడూ తన చూపుడు వేలుతో గాలిలో ఏదో అదృశ్య కాగితంమీద ఏదో వ్రాస్తూ వుంటాడు.

"సుంగ్‌టా" (రొయ్య చేపలు) కావాలా? "అంటూ ఒక చేపలమ్మి

అరుస్తోంది. 'దత్తూ బాబ్' వెంటనే గాలిలో చూపుడువేలుతో వ్రాశాడు. "సుంగ్‌టా కావాలా"అని.

'దత్తూ బాబ్' మీసాలు 'హిట్లర్' కట్‌వి. ఏదో రెక్కల పురుగు పెదాలమీద వాలిందా అన్నట్లు వుంటాయి. 'సోనూ బాబ్'కి 'దత్తూ బాబ్'ని చూస్తే నవ్వొస్తుంది. 'దత్తూ బాబ్' మఱబొమ్మలా వుంటాడు. 'కీ' యివ్వగానే మఱబొమ్మ నడిచినట్లు నడుస్తాడు (చేతులు ఆడిస్తూ). అతనికి పళ్లులేవు. అందువల్ల నవ్వితే ఏదో గుహలోంచి శబ్దం వచ్చినట్టు వుంటుంది.

'సోనూబాబ్' ఇంటిగోడ బయట రోజూ ఒక చిలక జ్యోతిష్కుడు కూర్చుంటాడు. అతని చుట్టూ ఎప్పుడూ జనం. లోకులు అతనికి డబ్బులు యివ్వగానే అతడు తలుపుతెరిచి చిలకని బయటకి విడవడం, ఆ చిలక దొంతర్లుగా పేర్చిన కార్డులలో తనకి తోచింది ముక్కుతోతీసి పక్కన పడేసి మళ్లీ పంజరం వంటి పెట్టెలోకి వెళ్లిపోవడం, జ్యోతిష్కుడు తలుపు మూసేయడం - యివీ నిత్యకృత్యాలు. ఆ కార్డులమీద వివిధ రకాల ఈతి బాధలకి, భవిష్యత్తుకి సంబంధించిన జ్యోతిష్యం ముందే వ్రాసి వుంటుంది. అలా చిలకతీసిన కార్డుని జ్యోతిష్కుడు తన గిరాకీదారుడుకి చదవడానికి యిస్తాడు.

'సోనూబాబ్' నవ్వుకున్నాడు. నిన్నప్రొద్దున్న బయటికి షైరుకెళ్లినప్పుడు, ఆ జ్యోతిష్కుడు అతనికి ఆదరంగా నమస్కారం చేశాడు. 'సోనూ బాబ్' పరిహాసంగా ఆ చిలకద్వారా తన భవిష్యత్తు గురించిన కార్డు తీయించాడు. కార్డుమీద మరాఠీలో జోస్యం వ్రాసివుంది.

"లవ్‌కరచ్ పుత్రప్రాప్తి హోయీల్" (శీఘ్రంగా పుత్రప్రాప్తి అవుతుంది)

"హుఁ" అని తిరస్కార వదనంతో ఒక పావలా కాసు ఆ జ్యోతిష్కుడి ముందు విసిరేసి, గబగబా యిల్లు చేరుకున్నాడు.

"శీఘ్రమే పుత్రప్రాప్తిట! పచ్చిమోసం! దగా! దొంగ వెధవ! అందర్నీ యిలాగే ముంచుతున్నాడు."

'జడ్జి'గా చాలాకాలం పనిచేసిన అనుభవం వలన మనస్సులో భావాలు ఏమాత్రం మొహం మీద కనబడనీయని చాతుర్యం 'సోనూబాబ్'కి అబ్బింది. కాకపోతే ఆ జ్యోతిష్కుణ్ణి పట్టుకుని యథేచ్ఛగా చావబాదాలన్నంత కోపం వచ్చింది.

"మిమ్మల్ని కలవడానికి ఎవరో ఆడమనిషి వచ్చింది" 'సోనూబాబ్' భార్య

'సావిత్రీబాయి' వరండాలోకి వచ్చి అతనికి చెప్పింది.

"సోనూబాబ్" బయటకి వచ్చాడు. ఒక పెళ్ళైన స్త్రీ-సుమారు నలభై ఐదేళ్ల వయస్సు - అశిక్షిత - అయినా తళ తళ మెరిసే సౌందర్యవతి - వచ్చింది.

"నన్ను గుర్తు పట్టావా? పెద్ద దొరా? నేను 'విఠల్‌కోంగ్‌లు' కూతురు 'మీరా'ని."

"విఠల్ కోంగూల' మీరా?!! 'మీరా'వా?" "సోనూ బాబ్' మనః అంతరాళాలలో ఏదో పెద్ద మెరుపు మెరిసింది. అయినా తమాయించుకుని మళ్లీ ఏ హావభావాలూ లేని 'జడ్జి' మొహంతో చూశాడు.

"నన్ను గుర్తు పట్టావా, పెద్దదొరా?"

"అవును - అవును. గుర్తు పట్టాను. 'విఠల్ కోంగల్' చెప్పాడు మొన్న. నీకు 'కారాపూర్' వ్యక్తితో పెళ్లిచేశాడని. అవును! ఎందుకొచ్చావు?" 'సోనూబాబ్' పెద్దమనిషి తరహాలో అడిగాడు.

"పెద్దదొరా! ఈవేళ కాస్త తోటలోకి వస్తారా? నేను ఈవేళే పుట్టింటికి వచ్చాను. మీకు రావడం కుదురుతుందా పెద్దదొరా?" 'మీరా' తనని సూక్ష్మంగా, ఎగాదిగా చూస్తున్న 'సోనూ బాబ్' కళ్లల్లో సూటిగా చూస్తూ అడిగింది.

"సరే నువ్వెళ్లు. నేను సాయంత్రం వస్తాను", 'ఎందుకోసం' అని ఆరాలు తీయకుండానే 'సోనూబాబ్' జవాబిచ్చాడు.

"మీకు పుణ్యం వుంటుంది, తప్పకరండి" అంటూ ఆ స్త్రీ సెలవు తీసుకుని వెళ్లిపోయింది.

"ఆ వచ్చిన ఆవిడ ఎవరు?" 'సావిత్రీబాయి' ఆశ్చర్యంతో 'సోనూబాబ్'ని ప్రశ్నించింది.

"మన తోటమాలి 'విఠల్ కోంగల్' కూతురు."

'సోనూబాబ్' సహజ స్వరంలో అన్నాడు. అలా అని మళ్లీ పడకకుర్చీలో కూర్చున్నాడు. అతని మనస్సు అల్లకల్లోలమయింది.

మీరా! విఠల్ కోంగల్ కూతురు! ఇది జరిగి పాతిక సంవత్సరాలయి వుంటుంది. 'సోనూ బాబ్' అప్పుడే 'లా' పరీక్షలు ప్యాసయి, సెలవుల్లో యింటికి వచ్చాడు. అప్పటికి అతనికి వివాహం అవలేదు. తండ్రితోబాటు వాళ్ల తోటకి వెళ్లాడు. 'విఠల్ కోంగల్' కుమార్తె 'మీరా' అక్కడ కలిసింది. తీసిన కొబ్బరికాయలు ఏరి

రాసిగా పెట్తోంది తోటమాలి కూతురు. తనకంటే ఒక పది సంవత్సరాలు చిన్నది కాబోలు. 'సోనూ బాబ్' ఆ అమ్మాయిని చూశాడు. ఆ అమ్మాయి 'సోనూ బాబ్'ని చూసింది. రెండు యువ హృదయాలు స్పందించాయి. అన్ని బంధాలు త్రెంచి ఏకమయ్యాయి. వాళ్ల చూపులు మళ్లీ మళ్లీ కలుసుకుంటున్నాయి. మళ్లీ మళ్లీ 'పొరబాటు'న ఒకర్నొకరు స్పర్శిస్తున్నారు. మళ్లీమళ్లీ 'అనుకున్న' ప్రకారం రహస్యంగా కలుసుకొనేవారు. ఒక పున్నమిరోజు రాత్రి - కొబ్బరికాయల కొట్టడి (గిడ్డంగి)లో - తోటలో చెట్లు చల్లగా వినురుతూండగా - చల్లగా చందమామ వెన్నెల కురిపిస్తూండగా - మొదటి - యిద్దరి జీవితాలలో - మొదటి సంగమం జరిగింది. 'సోనూ బాబ్' ఆ తరువాత రెండురోజులు మాత్రం వుండి పట్టణానికి వెళ్లిపోయాడు. పెద్ద చదువులు చదివి 'జడ్జ్' (న్యాయమూర్తి) అయాడు. సావిత్రీబాయితో పెళ్లి అయింది. ఆ పున్నమి రాత్రి ఘటన మఱచిపోయాడు.

ఈవేళ ఆ 'మీరా' సుమారు పాతిక సంవత్సరాల తరువాత కలిసింది. మా ఇంటికి వచ్చి. ఆమెకి ఏం పని వుందీ నాతో? ఆమె ముసలిదయింది. నేనూ వృద్ధాప్యంలో అడుగుపెడుతున్నాను. నన్నెందుకు పిలిచిందిటా? బ్లాక్‌మెయిల్ చెయ్యడానికా? డబ్బు గుంజడానికా?...

'సోనూబాబ్' భోజనంచేసి కాస్త విశ్రమించాడు. కొద్దిసేపట్లోనే లేచాడు. తన తోటకి వెళ్లాడు. 'విఠల్ కోంగల్' ఇంటి ముందుకు వచ్చి 'విఠల్' 'విఠల్' అని పిలిచాడు.

'నాన్నలేడు. బయటకెళ్లాడు - పెద్దదొరా - లోపలకి రా' 'మీరా' బయటకి వచ్చి 'సోనూబాబ్'తో అంది. 'సోనూబాబ్' లోపలికి వెళ్లాడు. పేడతో అలికిన ఆ గదిలో, ఒకే ఒక కుర్చీ వుంది. దానిమీద కూర్చున్నాడు. 'మీరా' వెంటనే ఒక కొబ్బరి బొండాం, పెచ్చుతీసి అతనికి అందించింది - తాగమని సంజ్ఞచేస్తూ.

"నా దగ్గర నీకు ఏం పని తగిలింది మీరా?" 'సోనూబాబ్' యధాలాపంగా 'మీరా'ని అడిగాడు. 'మీరా' అతని చూపులు తప్పిస్తూ, నేలమీదికి దృష్టి మళ్లించింది, తలవొంచుతూ.

"పెద్దదొరా! పాతిక సంవత్సరాలకి పూర్వం ఆ పున్నమినాటి రాత్రి అనుభవం జ్ఞాపకం వుందా? సరే ఆ తరువాత రెండు నెలల్లో నా పెళ్లి అయింది. నేను పెళ్లిలో హారం పట్టుకు నిలబడినప్పుడే నాకనిపించింది, నాకు మీ వల్లనే నెల తప్పిందని.

నాకు పెళ్లయిన ఏడునెలల్లోనే మొగ పిల్లవాడు పుట్టాడు." వాడే మీ కొడుకు. ఆ తరువాత నాకు పిల్లలు పుట్టలేదు. ఇదిగో చూడండి వాడి ఫోటో. వాడు చిన్నప్పుడే అచ్చు మీ పోలికతో వున్నాడు. మీ కళ్లల్లాగే వాడి కళ్లు. మీ గుర్తుకోసం వాడి పేరు 'సోనూ' అని పెట్టాను. తోటమాలి (కాపుల) ఇళ్లలో పుట్టినా, చదువుమీద ఎంతో శ్రద్ధ చూపిస్తున్నాడు. వాడు బి.ఎ. పూర్తి చేశాడు. సొంతంగా వుద్యోగంచేసి గడిస్తూ, చదువులు సాగించాడు. నా మొగుడు, వాడు తన కొడుకేనని భావిస్తాడు. కేవలం ఆ పున్నమిరాత్రికీ, భగవంతుడికీ, మీకూ, నాకూ నిజం తెలుసు - వాడు మనిద్దరికీ పుట్టిన కొడుకని. ఈవేళ నేను పుట్టింటికి వచ్చినప్పుడు తెలిసింది., మీరు యిక్కడే స్థిరపడ్డారని. మిమ్మల్ని పిలిచింది కేవలం ఈ విషయం చెప్పడానికే., మీకూ, నాకూ కలిగిన ఒక కుమారుడు వున్నాడనీ, ఆనాటి పౌర్ణమి రాత్రి ఫలం - రోజు రోజుకీ పెరిగి పెద్దవాడవుతున్నాడనీ."

'సోనూబాబ్' లేచాడు. 'మీరా' దగ్గరకి వెళ్లాడు వుద్వేగంతో. 'మీరా' రెండు భుజాలమీదా చేతులు వేశాడు. 'మీరా' మూసుకున్న కళ్లల్లోంచి బొటబొటా నీళ్లు కారాయి. ఆమె కళ్లల్లో కళ్లు పెట్టి 'జడ్జి'గారిలా 'సోనూబాబ్' ప్రశ్నించాడు సూటిగా

"మీరా నువ్వు నిజం చెప్తున్నావా?"

'మీరా' అశ్రువులు నిండిన నయనాల్తో అతని కళ్లల్లోకే చూస్తూ అంది.

"నిజం చెబుతున్నాను దొరా, దైవసాక్షిగా."

'సోనూబాబ్' 'మీరా'ని దగ్గరకి తీసుకోబోయాడు. కానీ 'మీరా' దూరంగా జరిగింది.

"ఒద్దు దొరా, ఒద్దు. నేనిప్పుడు పరాయిదాన్ని అయిపోయాను" ఆమె 'సోనూ బాబ్' కాళ్లమీద పడి శిరస్సు వంచి నమస్కారం చేసింది. 'సోనూబాబ్' హృదయం ఆనందంతో చిందులు త్రొక్కింది.

"మీరా! ధన్యుణ్ణి. నాకు పిల్లలులేరని యిన్నాళ్లూ తపించాను. అది పొరపాటనీ, నాకు పెరిగి పెద్దవాడైన కొడుకు వున్నాడనీ, యిప్పుడే తెలిసింది. 'మీరా' నేను వాణ్ణి దత్తత తీసుకుంటాను., నా గారాల బంగారు తండ్రివాడు. 'మీరా' త్వరగా చెప్పు, వాడెక్కడున్నాడు?"

"దొరా, వాడు రేపు వస్తున్నాడు. వాణ్ణి మీ దగ్గరకి పంపుతాను. అయితే దొరా ఒక షరతు. వాడు చాలా బుద్ధిమంతుడు., స్వాభిమానం వున్నవాడు. వాడు

మనిద్దరికీ కలిగిన సంతానం అని తెలిస్తే, నేను నా భర్తని మోసం చేశానని తెలిసి ఖిన్నుడయి పోతాడు. వాడికి నామీదున్న గౌరవం, ప్రేమాభిమానాలు పటాపంచలయి పోతాయి. నన్ను త్యజిస్తాడు., అది ఖాయం., కానీ మిమ్మల్నీ విడిచిపోగలడు. కనక ఈ రహస్యం మన యిద్దరి మధ్యే వుండిపోవాలి. వాడిని మీరు కోరినట్లే దత్తత తీసుకోండి., జాగ్రత్తగా చూసుకోండి. అయితే నిదానంగా, తొందరవద్దు.''

'సోనూ బాబ్' ఇంటి ముఖం పట్టాడు, మనస్సు అపరిమిత ఆనందోత్సాహాలతో నిండి.

స్కూలు ముందునుంచి నడుస్తూ గట్టిగా అరిచాడు.

''అరే మాష్టారూ! లే నిద్రలే, పిల్లలకి చదువు చెప్పు.''

'ఆత్మాబోర్కర్' ఇంటిముందు ఆగాడు. 'ఆత్మాబోర్కర్'కి లోకుల పుస్తకాలు చదివి యిస్తానని చెప్పి తస్కరించడం అలవాటు. 'సోనూబాబ్'వి ఎన్నో పుస్తకాలు తీసుకుని తన యింట్లో ముచ్చటైన 'హోం లైబ్రరీ'ని వెలిగించాడు.

''ఆత్మా! నువ్వు తీసుకెళ్ళిన నా పుస్తకాలన్నీ తీసి సిద్ధంగా వుంచు. రేపు నేను వచ్చి తీసుకెళ్తాను'' 'సోనూ బాబ్' కోర్టులో న్యాయమూర్తి ఆదేశం యిచ్చినట్లు కఠోరంగా అన్నాడు. 'సోనూ బాబ్' గొంతుకలోని విచిత్ర జీర, గాంభీర్యం విని 'ఆత్మా'కి 'షాకు' తగిలినట్లయి, ఆ తొందర్లో యింట్లోకి పోతూ పోతూ గుమ్మం ముందు కాలుజారి పడబోయాడు.

'''ఏంటి విశేషాలు 'పాతీవ్' (ఫాద్రీ)?'' అంటూ 'సోనూ బాబ్', కళ్లజోడు ముక్కు అంచున జారుతూంటే, పైనుంచి చూసే కోతిముఖం ఫాద్రీ 'మొంటైరో'ని పలకరించాడు. ఫాద్రీ వులిక్కిపడి వెనక్కి తిరిగాడు. ఆ తొందర్లో కళ్లజోడు కిందపడింది.

'సోనూబాబ్' 'నాగోబా' (నాగుపాము)లా వంకరటింకరగా నడుస్తూ వస్తున్న 'గోపాల్ ఫోవ్‌కార్' త్రోవని కాస్త చిలిపిగా పిల్లవాడిలా అడ్డగించాడు. అలా కాసేపు ఆడించి వెళ్లనిచ్చాడు.

''దత్తూ బాబ్! ఎలాగున్నావు?'' దత్తూ ఫలార్ ఇంటిముందుకు చేరకముందే 'సోనూ బాబ్'' కుశలం అడిగాడు.

''బాగావున్నాను.'' దత్తూ బాబ్ అన్నాడు. ఆ తరువాత వెంటనే గాలిలో వ్రేళ్లు త్రిప్పుతూ 'హవేర్' (అదృశ్య లిపి) వ్రాసాడు. ''దత్తూ బాబ్! ఎలాగున్నావు?''

''బాగా వున్నాను'' వగైరా.

'సోనూ బాబ్'కి చిలక జ్యోతిష్యపు ఆసామి మీద ఎంతో సంతోషం కలిగింది. ఆ పట్టరాని ఆనందంతో పూర్తి వందరూపాయల పచ్చ కాగితం అతని చేతుల్లో వుంచాడు. ఆ చిలక జోతిష్కుడు నిర్ఘాంతపోయి, క్షణాల్లో తేరుకుని తన చిలక పంజరాన్ని, చాప చుట్ట భవిష్యత్తు వ్రాసిన కార్డు ముక్కలూ భద్రంగా తీసుకుని యింటి ముఖం పట్టాడు. 'సోనూ బాబ్' బుద్ధిమారి, ఆ నోటుని తిరిగి యిమ్మంటాడేమోననే భయంతో, ఆరోజుకి వ్యాపారం కట్టిపెట్టి అతను పరుగెత్తి వెళ్లిపోయాడనే చెప్పవచ్చు.

''ఇదిగో విను. నేను ఒక అబ్బాయిని దత్తత తీసుకోవాలని నిశ్చయించాను.'' ఇంటికి చేరగానే 'సావిత్రీబాయ్'ని హఠాత్తుగా కౌగలించుకుని, ఆమె సిగ్గు దొంతర్లలో వుండగా 'సోనూబాబ్' అమిత వుత్సాహంతో అన్నాడు.



9

# పెళ్లికూతురు

**- ఓలి విన్యు గోమ్స్**

కోర్టు (ట్రిబ్యునల్) సెలవులయిపోయిం తరువాత కేసుల హడావిడి ముమ్మరంగా వుంటుంది. ఆ కోర్టుకి సంబంధించిన పనులు నిర్వహించే ఆఫీసుల్లో ఎంతో అలజడిగా వుంది. కోర్టు నోటీసులు యివ్వడం, దస్తావేజుల నమోదు వగైరాల పనులు.

నిన్ననే న్యాయస్థానం పని ప్రారంభించింది. "మడ్‌గావ్" (గోవాలో పెద్ద పట్టణం) వంటి నగరంలోకి ఒక కారువచ్చి ఆగింది. అందులోంచి ఒక పెద్దమనిషి బయటకొచ్చాడు. గబగబా నా రూము ముందుకువచ్చి, నాతో మాట్లాడడానికి అనుమతి కోరాడు. అతను తొందరలో వున్నాడని తెలిసి, నేను లోపలికి రమ్మన్నాను.

అతను చెప్పింది విన్నాక, నాకు పని ఆపి వెళ్లవలసి వచ్చింది. ఒక మహిళ విషయం సూక్ష్మంగా చెప్పాడు. ఆవిడ అతని తండ్రి చెల్లెలు (అత్త) ఎప్పుడూ తలుపేసుకుని ఇంటిపట్టునే వుంటుందట! ఇప్పుడామెకి తన తుది 'టెస్టామెంట్' (మరణ శాసనం - వీలునామా) వ్రాయాలిట. ఆమె మతి సరిగా లేదట. ఆమె చెప్పిన ఏ పనైనా వెంఠనే చేసెయ్యాలి., లేకపోతే రాక్షసిలాగ ప్రవర్తించి, ఎంత అఘాయిత్యం చేసినా ఆశ్చర్యం లేదట. ఆమె అతనిని వెంటనే రమ్మనమని కబురు చేసిందట!

"కాయ్‌తానా" (అతని పేరు) నేను కారులో కూర్చుని వెళ్లాను. 'రాయ్' (గోవాలో ఒక ఊరు) ప్రాంతంలో చాలా లోపలకి వెళ్లగా, ఆవిడ ఇంటికి చేరాం. సందులూ - గొందులూ దాటి అరగంట కారులో ప్రయాణం తరువాత ఆవిడ యిల్లు వచ్చింది.

ఆ ఇల్లు ఎలావుందని వర్ణించడం! ఇల్లు అంటే అదొక పెద్ద భవనం. అది

ఏ కాలంలో కట్టిందో ఎవరికి తెలుసు? దాని బాగోగులుకూడా ఎవరూ పట్టించుకున్నట్లు కనబడదు. దట్టమైన అడవి మధ్య కట్టిన ఈ భవంతి, పూర్వకాలపు వైభవానికి చిహ్నం. సున్నపు బెళ్ళలు బయటపడి, లోపలి ఎరుపురంగు రాళ్లు కనిపిస్తున్నాయి. మిగిలిన చోట గతకాలపు శిధిల జ్ఞాపకాలు కనిపిస్తూ, ఆ బంగళా అవసానదశని సూచిస్తున్నాయి.

మెట్లు ఎక్కి మేము లోపలికి వెళ్లాము. 'కాయ్‌తాన్' పిలిచాడు. లోపల్నించి ఓ నౌకరు (పని మనిషి) వచ్చింది. ఆమె చేతిలో ఒక దీపం (లాంతరు) వుంది. తలుపులన్నీ మూసివేయడం వలన, ఆ ఇంట్లో పగలే చీకటి ఆవరించింది. మితంగా మాట్లాడి నేనూ, నా బ్యాగూ, కాయ్‌తాన్‌తో బాటు దీపం చూపిస్తూ నడుస్తున్న ఆ పనిమనిషి వెంట లోపలికి వెళ్లాము.

'కాయ్‌తాన్' లోపల ఒక గది దగ్గర ఆగి ఆ గది ద్వారానికి వేసిన పరదా పక్కకి జరిపాడు. అక్కడ చూసిన దృశ్యం నా గుండెల్ని కదిలించింది! పట్టపగలు, ఆ మూసిన ఇంట్లో పై కప్పుకి వేలాడుతున్న గాజు లాంతర్లలో నూనెదీపాల వొత్తులు నిశ్చలంగా వెలుగుతూ గుడ్డి కాంతిని యిస్తున్నాయి. మూలలో ఒక మేజా బల్లమీద ఎన్నో వస్తువులు చిల్లరమల్లరగా పడివున్నాయి. సెంటు సీసాలు, దువ్వెనలూ, కేశాల క్లిప్పులు, తువాళ్లూ, లేసులూ, చేతిరుమాళ్లూ, పౌడర్లూ, స్నోల సీసాలూ, చిన్న చిన్న అద్దాలు ఇక్కడా, అక్కడా చెల్లాచెదురుగా పడివున్నాయి. వాటిపైన తదేకదీక్షతో చూస్తున్న ఆమె ఏదో ఆలోచనల్లో వున్నట్లు కుర్చీమీద కూర్చుని వుంది. పెళ్లికూతురిలా ధవళ వస్త్రాలతో ముస్తాబై వున్నా, ఆమె వాడిన పువ్వులా వుంది. పెళ్లిరోజు తాజా తెల్లదనంతో, మల్లెపూలలా నవనవలాడిన ఆశ్వేత వస్త్రాలు యిప్పుడు కాలచక్రపు పరిభ్రమణంలో రంగు మాసిపోయి, వెలసిపోయి వెలవెల బోతున్నాయి, పాతవయినట్లున్నాయి. పౌడరు పులిమిన ఆమె మొహం మిరియాల్లో పాతరవేసిన వూరగాయలా ముడతలు పడివుంది. ఆమె వయస్సు సలభై దాటే వుంటుంది అనుకొంటా. పక్షులు ఆ గదిలో గూళ్లు కూడా కట్టాయి!

నేను 'కాయ్‌తాన్'తో బాటు నెమ్మదిగా, శబ్దం చెయ్యకుండా ఇంట్లోకి వెళ్లాను. అయినా నా అడుగుల చప్పుడు వినీ వినక ముందే ఆమె స్తబ్ధురాలయింది., వులిక్కిపడింది.

పెద్దపెద్ద చక్రాల్లా కళ్లని చేసి నన్ను నఖశిఖ పర్యంతం పరీక్షగా చూసింది.

తరువాత కళ్లని తీక్షణంగాచేసి, చూస్తూ క్రమేణా ఏదో భూతం అవహించినట్లు ఏదో పూనకం వచ్చినట్లు వెర్రి నవ్వు నవ్వుతూ లేచింది. ఆ తరువాత ఏం జరిగిందంటే, ఏదో వింతశక్తి ఆవేశించినట్లు ఆమె నా వైపు పట్టరాని సంతోషంతో చూస్తూ పిచ్చిపిచ్చిగా నవ్వసాగింది. "హాఁ హాఁ హాఁ ... వచ్చాడు నా మొగుడు... నా ముద్దుల పెళ్లికొడుకు... వీడే... వీడే... నా మొగుడు... నా పెళ్లి యితడితోనే... రా... రా... రా రా నా పెళ్లికొడుకా, బంగారు పెళ్లి కొడుకా, నీ కోసమే ఎదురుచూస్తున్నా... యిన్నాళ్లూ."

ఆ వెర్రి నవ్వు, వెకిలిచూపులూ చూసి, నా ఒళ్ళంతా తేళ్లూ,జర్రులూ పాకినట్లయింది. భయంతో శరీరంమీది రోమాలు ముళ్లల్లా నిలుచున్నాయి. నావంటి యిన్ని సంవత్సరాల అనుభవజ్ఞుడు, ఎలాంటి కఠోర పరిస్థితులలోనూ నిబ్బరంగా, శాంతంగా వుండే నేనే చలించిపోతే ఎలా?

నేను నా మనస్సు అదుపులో వుంచుకోవడానికి విశ్వప్రయత్నం చేశాను. నా లక్ష్యం అంతా కేంద్రీకరించి, ఆప్యాయతతో, సానుభూతితో ఆమె చేతులు నా చేతుల్లో పెట్టి అన్నాను. "ఏమీ భయం వద్దు తల్లీ 'రోజా' - నేను లాయర్ని - నా పేరు 'ఆమోర్త్ గోమిష్ ద కోస్త'. నీకేం కావాలో నేను చూస్తాను - సంకోచించకుండా చెప్పు - సిగ్గు పడవద్దు. హా..."

ఈ నా మాటలు వింటూ, వింటూ ఆమెలో మరొక రకపు సంతోషఛాయలు వచ్చినట్లు ఆమె వదనంలో కనిపించింది. సిగ్గు పడింది. కాస్త మోతాదుకు మించే సిగ్గు పడిందనవచ్చు. తన వైఖరి పూర్తిగా భిన్నంగా మార్చి, నెమ్మదిగా, మృదువుగా రహస్యం చెబుతున్నట్లు దగ్గరకి జరిగి చెప్పింది. తన ఆస్తంతా తన పొలాలూ, తోటలూ, ఈ యిల్లూ సమస్తం తన తండ్రి సోదరుడైన 'కాయ్‌తాన్' పేరిట వ్రాసి యివ్వాలని నిశ్చయించినట్లు. ఈ విధంగా ఎందుకు చేస్తున్నదీ, ఇంత పెద్ద ఐశ్వర్యం అతని కుటుంబానికే ఎందుకు యిస్తున్నదీ, కథా, కమామిషూ అడగవద్దనీ, ఆ కారణాల తోరణాలు బయటకెళ్లిం తరువాత 'కాయ్‌తాన్'నే అడగవచ్చనీ, అతనికంతా తెలుసనీ క్లుప్తంగా చెప్పింది.

ఎలాగైనా యిప్పటికిప్పుడే తన 'వీలునామా' వ్రాసి తీరాలనీ, మరి జాప్యం సహించననీ ఆమె స్పష్టంగా, నిఖచ్చిగా ఆదేశించింది. 'సరే'నని నేనూ, 'కాయ్‌తాన్' ఆ గదిలోంచి బయటపడి 'హమ్మయ్య' అని వూపిరిపీల్చాం. పోయిన ప్రాణాలు

తిరిగి వచ్చినట్లయింది!

లోపలే మరోగదిలోకి వెళ్లి కూర్చున్నాం. చూడాలంటే ఏముందీ? అన్ని గదుల్లోనూ చీకటే! ఈ గది మాత్రం కొంత మెరుగు - కాస్త వెలుగు చోటుచేసుకుంది- ఒక కిటికీ తెరచి వుండడంవలన. మేము కూర్చునే లోగానే, పనివాడు వచ్చి భోజనం సిద్ధం అయిందని చెప్పాడు. సుష్టిగా భోజనం చేశాం.

ఆ తరువాత, 'కాయ్‌తాన్' తన తండ్రి చెల్లెలి - అంటే 'రోజా' కథా - వ్యధా చెప్పడం ప్రారంభించాడు.

'రోజా' పూర్తి పేరు 'రోజా ఇస్మెరాల్‌దా దస్ దోరీస్ దసిల్వా'. ఇంట్లో ఒక్కర్తే కూతురు. ప్రేమతో గారాబంతో పెరిగింది. చూడ్డానికి అపురూప సౌందర్యవతి, గుణంలో సుగుణశీలి, తెలివిలో అద్వితీయం. పదహారవ సంవత్సరం నిండకుండానే 'మెట్రిక్' పరీక్ష ప్యాసయింది. ఆ తరువాత పై చదువుల నిమిత్తం కాలేజీలో జేరడానికని 'బొంబాయి' పంపారు. 'గోవా'లో ఆ రోజుల్లో కాలేజీలు లేవు.

అప్పుడామెది యుక్త వయస్సు. పొంగుతున్న యవ్వనంలో వికసిస్తున్న గులాబీపువ్వు. ఏ యువకుణ్ణైనా యిట్టే అయస్కాంతంలా ఆకర్షించే సౌందర్యం ఆమెది.

అయినా 'రోజా' ఏ యువకుణ్ణీ దగ్గరకి చేర్చేది కాదు. ఏ నవయువకుడినీ - ఎంత అందగాడైనా సరే - ఖాతరు చేసేది కాదు. తనూ, తన చదువులూ, తన స్నేహితురాళ్లూ!

తన ప్రపంచంలోనే భద్రంగా తనుండేది!

బొంబాయిలో 'బాంద్రా'లో వున్న నేషనల్ కాలేజీలో చేరింది. నివాసం ఒక తెలిసిన కుటుంబంతో. బహుకొద్ది దినాల్లోనే 'రోజా' పేరు కాలేజీలో ఖ్యాతి గడించింది. చదువుల్లో ఆమె ఫస్టు., డ్యాన్సుల్లో ఆమెకి సరైన అమ్మాయిలేదు. ఆమె సౌందర్యానికి ముగ్ధులయి అందరూ నిశ్చేష్టులై, కళ్లార్పకుండా చూడసాగారు. ఎందరో యువకులు ఆమెని చూసి లొట్టలేస్తూ, ఆమె వెళ్లగానే వెనక ఈలలేస్తూ గోల చేసేవారు. పక్షం రోజుల కొకసారి 'రోజా'కి యింటినుంచి వుత్తరం వచ్చేది.

ఇలా ఏడెనిమిది నెలలు గడిచాయి. ఒకరోజు 'రోజా' వ్రాసిన వుత్తరం - ఆమె తల్లిదండ్రులు చదివి ఖిన్నులయ్యారు. అయినా తమ ఏకైక సంతానం, కుమార్తె 'రోజా' యిష్టానికి వ్యతిరేకంగా వెళ్లడం వాళ్లకి ఎలాగూ వీలవదు. అందులో

వ్రాసిన విషయం., తనకి ఒక అందమైన, మంచి యువకుడితో పరిచయమైందనీ, ఇద్దరూ ప్రేమించు కున్నారనీ, అనుమతిస్తే పెళ్లి చేసుకుంటారనీ. ఆ అబ్బాయి ఉత్తర భారతదేశానికి చెందినవాడనీ - పంజాబీవాడనీ 'రోజా' వ్రాసింది. అలాగే వచ్చే ఆరునెలల్లోగా వాళ్ల అంగీకారం తెలుపుతూ వాత్సల్యంతో శుభకార్యం జరిగేలా సహకరించమనీ., ఈ డ్యాన్సుకి వెళ్లాము, ఆ సినిమా చూశామూ అంటూ వ్రాసి చివరకి డబ్బు అవసరం గురించీ, త్వరగా పంపమనీ వ్రాసి వుత్తరం ముగించింది.

తరువాత ఒక విచార వార్తతో మరొక వుత్తరం వచ్చింది. ఆ అబ్బాయి కాలేజీ మానేసి, బొంబాయి వదిలి తన స్వగ్రామం వెళ్లిపోయాడుట! 'రోజా' విషయం అసలు ప్రసక్తే ఎత్తలేదుట. రెండు మాటల్లో చెప్పాలంటే అతను ఆమెని విడిచి వెళ్లిపోయాడు. పాపం 'రోజా' ఆత్మహత్యా ప్రయత్నం చేసిందిట. ఎవరో పుణ్యాత్ముడు అడ్డుకొని రక్షించాడు. ఆమె తండ్రి యిది తెలిసి బొంబాయికెళ్లి ఆమెని యింటికి తిరిగి తీసుకువచ్చాడు. సుమారు సంవత్సరంపాటు యింట్లోనే గడిపింది. కళ్లకి కొట్టొచ్చేలా ఆమెలో మార్పు వచ్చింది. ఇదివరకటిలా నీటుగా, నియమంగా, క్రమబద్ధంగా ఆమె జీవించడం మానేసింది. జీవితమంటేనే విరక్తి కలిగింది. ఇంత చిన్న వయస్సులో!

అలాగైనా, ఆమె ఎలాగో ఆశలు చిగుర్చుకొని బొంబాయికి మరోసారి వెళ్లింది. ఇప్పుడామెకి కొత్త స్నేహతులూ, స్నేహితురాళ్లూ కలిశారు. క్రొత పరిచయాలు గట్టిపడి కొత్త స్నేహితులు క్రమేణా అప్తులయ్యారు. ముఖ్యంగా కొందరితో ఆమె సంబంధం పెట్టుకుంది. పార్టీలు, డ్యాన్సులూ, పిక్‌నిక్లూ, విందులు వినోదాలూ! ఈ వ్యవహారం అన్ని హద్దులూమీరి, క్రమేణా వ్యసనంగా మారింది. ఆమె ఎవ్వరినీ లెఖ్ఖచెయ్యక, సిగ్గూ బిడియం వదిలేసింది. ఒకసారి ఏదైనా అలవాటయితే, అందులోనూ దురలవాటు అయితే వదిలించుకోవడం మరీ కష్టం. అది వ్యసనంగా మారడం సహజం. ఐతే ఈ వ్యసనంలో శారీరక సుఖం, ఆనందం లభించనా, మానసిక తృప్తీ, శాంతీ వుండదు. అది అన్వేషించడానికీ, అంతకుముందు విఫలమైన ప్రేమ ఫలితంగా ఏర్పడిన లోటు భర్తీ చేయడానికీ ఆమె నానా అవస్థలూ పడుతోంది. కొందరు యువకులు - క్రూరాత్ములు - యువతులకి ప్రేమ పాశం తగిలించి వాళ్లలో ప్రణయ జ్వాలలు రగిలించి, తమ లాభం చూసుకుని చల్లగా అదృశ్యమై పోతారు! అటువంటి వాళ్లకి చిక్కడమంటే బలిపీఠం ఎక్కడమే! ఇటువంటి

దుర్మార్గులకి వశం కాకుండా మెలగగల స్త్రీ వుత్తమురాలు. అందరి దృష్టిలోనూ ఆమె మాన, మర్యాదలు పెరుగుతాయి. ఆమె శీలవతిగా ఖ్యాతి గడిస్తుంది. అయితే యవ్వనపు తొలి పొంగుల్లో, తారుణ్యపు వయస్సులో చాలా కొద్దిమందికే ఈ పరిజ్ఞానం వుంటుంది. అయితే ఏ పాపం మనస్సులో లేక నిష్కల్మషమైన, నిర్మలమైన ఆనందోత్సాహాలతో జల్సాగా (డ్యాన్స్యులూ-పార్టీలూ) చేసుకోవడం వేరూ, ఏదో కుటిల మనస్సుతో, లైంగికతృష్ణతో మజా చేసుకోవడం వేరూ. ఈ రెండింటికీ తేడా తెలిసిన యువతులు బహుకొద్దిమంది మాత్రమే!

నేను అతని ఈ ప్రవచనం ఆపమన్నాను.

''మీరన్నవన్నీ నిజమే 'కాయ్‌తాన్'గారూ! కానీ నాకు కావలసింది ప్రస్తుత ముఖ్యవిషయం నే నొచ్చిన పని. అందుకని ఆవిడ జీవితంలోని ముఖ్య సంఘటన, ఆవిడ దుస్థితికి కారణం ముందు చెప్పండి. నేను 'టెస్టామెంట్' వ్రాయాలి.

''నా పొరబాటయింది డాక్టర్! సరే అలాగే! నేను ఏం చెబుతున్నాను?... హాఁ'' అంటూ 'కాయ్‌తాన్' చెబుతున్న కథ అంతు దొరికి ముందుకి సాగాడు.

'రోజా'కి తన జీవిత పడవని చుక్కాని లేకుండానే సముద్రంలో వదిలెయ్యాలని అనిపించేది. అయినా తుఫానులో చిక్కుకుని తీరం కోసం వెతుకుతోంది. ఆఖరికి ఆమె లక్ష్యం ఒక అబ్బాయిమీద మళ్లింది. ఆమె వ్రాసింది. ఇతనే నా భావిజీవిత భాగస్వామి అని. అతను 'గోవా'లోని 'బార్‌దేజ్' తాలూకాలోని 'మప్సా' పట్టణంలో వుంటాడు. చక్కటి రూపం, సంపన్న కుటుంబంలోని వాడు., మంచి ఆస్తిపరుడు.

అతను 'రాయ్' గ్రామం వచ్చి 'రోజా' తల్లిదండ్రులని కలుసుకున్నాడు. అతనికి 'రోజా' నచ్చిందట. అన్ని విషయాలూ సంప్రదింపులు జరిగాయి. ఏడాదిలోగా పెళ్లి ముహూర్తం నిశ్చయించారు. జనవరి 15వ తేదీ 1943వ సంవత్సరం.

'రోజా' పెళ్లికి నెల ముందు ఇంటికి వచ్చింది. అప్పుడే బి.ఎ. పూర్తి చేసింది. ఇప్పుడింక కష్టాలు తీరాయనీ, పెళ్లి చేసుకుని హాయిగా, శాశ్వతంగా భర్తతో సంసారం చేస్తాననీ తృప్తిగా నిట్టూర్చింది. ఇంట్లో సిరిసంపదలకీ ఏమీ లోటులేదు. మరో రెండు తరాలు హాయిగా కాళ్లమీద కాళ్లేసుకుని బ్రతకగలిగినంత వుంది! ఇంకేం బెంగ? ఇదివరకు పాడుచేసుకున్న గత జీవితాన్ని మరచిపోవాలి! కొత్త ప్రపంచాన్ని నిర్మించుకొనే ప్రయత్నాలు యిప్పుడే ప్రారంభించాలి. పెళ్లికొడుకు బొంబాయిలో

వున్నాడు. ఇటువైపు పెళ్లి ఏర్పాట్లు, దుస్తుల తయారి - అన్నీ ముమ్మరంగా జరుగుతున్నాయి. తను పదమూడవ తారీఖులోగా వస్తానని వ్రాసిన పెళ్లికొడుకు 'ఎడ్వర్డ్' వుత్తరం అందింది. ఆరోజు ఆనందడోలల్లో అందరూ వూగుతున్నారు.

భూస్వామి (కామందు) ఒకానొక ముద్దుల కుమార్తె పెళ్లంటే సహజంగానే పనివాళ్ళకీ, కూలీలకీ, కాపులకీ హడావిడీ, ఆనందం, ఉత్సాహం! పెద్ద పండగ! ఒక్కొక్క కానుక., ఒక్కొక్క ముడుపు., ఒక్కొక్క అభినందన పూర్వక బహుహతీ, స్నేహితులు, బంధువులూ, ఇరుగుపొరుగువారూ యిచ్చినవి క్రమేణా యిల్లు చేరుతున్నాయి. అయితే భూస్వామి ఎంతోకాలం క్రితం చనిపోయాడు. అతని భార్యే యజమానురాలు. బహుశా అందువల్లే కాబోలు కానుకలు ఆశించినన్ని రాలేదు.

పెళ్ళికొడుకు - 'రాయ్' (గోవాలో 'మడ్గావ్' అనే పట్టణపు అంచుల్లోని వూరు)కి వచ్చాడు. తోటంతా ఆనంద పల్లవులు! మూడవరోజు 15వ తారీఖు పెళ్లి. పగలు పదిగంటలకి 'రాయ్' చర్చిలో పెళ్ళికొడుకు 'మప్సా' (మరో 'గోవా') వూరు వెళ్తున్నానని చెప్పి వెళ్లిపోయాడు.

రాత్రంతా ఏర్పాట్లు జరిగాయి. మర్నాడు పగలు వుత్సాహంగా తెల్లవారింది. మా నాన్నగారి చెల్లెలు యిప్పుడు సిగ్గు దొంతర్లలో వున్న కొత్త పెళ్ళికూతురయింది. సుఖ,శాంతుల మనస్సుతో పెళ్లి దుస్తులు తొడుక్కుంది. తెల్ల మల్లెపూలవంటి వస్త్రాలతో ముస్తాబయింది. ఆ ప్రత్యేకంగా తయారుచేసిన విలువైన పెళ్లి దుస్తులతో, సహజ సౌందర్యం మిళితమై ఎంత అందంగా వుందో వర్ణించలేము! 'రోజా'కి ఆ రోజు చాలా ఆనంద భరితం, చిరస్మరణీయం. బయటకి (చర్చికి) వెళ్లే సమయమయింది.

పావుతక్కువ పది అయింది. 'కుద్రేకర్' ఒక టెలిగ్రాం తీసుకుని వచ్చాడు. బహుశా అభినందన (గ్రీటింగ్స్) టెలిగ్రాం అయివుంటుందని అనుకొన్నాం. ఎడ్రసు 'రోజా'ది. నేను ఆ టెలిగ్రాం తెరిచాను. నా చేతుల్లోంచి ఒక చిన్నదెబ్బ వేసి. ఆ టెలిగ్రాం ఆమె (రోజా) చటుక్కున లాక్కుంది. అది చదివి ఆమె గొంతుక గద్గదమైంది., నిశ్చేష్టురాలయింది., క్షణాలు గడిచాక లబోదిబోమని గుండెలు బాదుకుని అరుస్తూ ఏడవసాగింది. ఆమె పట్టు తప్పి వివశురాలయింది. కళ్లుతిరిగి బైర్లు కమ్మాయి.

ఆమెని పట్టుకొందామని దగ్గరకి వెళ్లేలోగానే ఆమె నేలమీద దబాలున

పడిపోయింది.

టెలిగ్రాంలో యిలా వ్రాసివుంది. "నాకు పెళ్లికి రావడం వీలవదు. నా ఆశ వదులుకో" పంపిన వాడిపేరు ఎడ్వర్డ్ - పెళ్లికొడుకు పేరు. ఆ తంతి బొంబాయినుంచి వచ్చింది. ఇంత ఘోర అన్యాయం మా అత్త 'రోజా' కోసం విధి యిచ్చిన పెళ్లికానుక! ఇక ఈ విషయంలో మేం చేయగలిగిందేమిటని?

ఈ జ్ఞాపకాలు రాగానే 'రోజా' చచ్చే సిగ్గుతో బుగ్గి బుగ్గి బూడిదైపోయేది. మతి చలించిపోయేది. అప్పట్నించీ పాపం ఆమె ఆ మూసిన తలుపుల గదిలోనే వుంటూ తన తలపుల తలుపులు కూడా మూసుకోవాలని ప్రయత్నిస్తోంది. అయితే ఆశ్చర్యం ఏమిటంటే యింత జరిగినా పెళ్లికొడుకు మీద ఆమెకి విశ్వాసం పోలేదు. అన్ని ఆభరణాలూ, వస్త్రాలు ధరించి, గొప్పగా ముస్తాబై నిత్యం కొత్త పెళ్లికూతురులా అలంకరించుకొని, ఆ రాని రాకుమారుడి కోసం ఎదురు చూస్తుంది. ఇప్పుడూ చూస్తోంది. వేళాపాళా లేకుండా స్నాన, పానాలు చేయడం, ముస్తాబై అవే పెళ్లి వస్త్రాలు మళ్లీమళ్లీ ధరించడం, మొహానికి పౌడరు పులమడం - ఆ తరువాత సిద్ధంగా, ఆ మేజాబల్లమీద కూర్చుని పెళ్లికొడుకు కోసం ఎదురుచూడ్డం! నిజంగానే ఆమె మతి చెడింది. అలా కూర్చుని, కూర్చుని విసిగెత్తి, మధ్యమధ్యనే లేచి తిరుగుతుంది., ఏవో అర్థం పర్థంలేని మాటలని, గట్టిగా అరుస్తూ కేకలేస్తుంది. హఠాత్తుగా నవ్వుతుంది., హఠాత్తుగా ఏడుస్తుంది. పాపం ఆమెలో ఏ అగ్ని పర్వతాలు పేలుతున్నాయో! ఆమెని ఏ దుఃఖ సముద్రాలు ముంచుతున్నాయో! దేవుడికే తెలియాలి. అయినా ఆ క్రూర, దౌర్భాగ్యపు పెళ్లికొడుకు పత్తాలేదు. ఏ జాడా లేకుండా అదృశ్యం అయ్యాడు! ఎవ్వరికీ తెలియదుట. ఆ బెంగతో ఆమె తల్లి ఆమెని వదిలి కన్ను మూసింది. 'రోజా' బతికుండడమే పెద్ద ఆశ్చర్యం.

ఈ మాటలతో 'కాయ్‌తాన్' ఆ పెళ్లికూతురు విషాదగాథ ముగించాడు.

ఈ గుండెల్ని గొడ్డలితో నరికి వేసే దెబ్బలాంటి విషయం విని నా మనస్సు దుఃఖంతో తల్లడిల్లి పోయింది. చేసిన ఖర్మకి ఎటువంటి ఘోర పరిణామాలు సంభవిస్తాయో, ఎటువంటి చేదు ఫలాలు ఆరగించవలసి వస్తుందో తెలిసి నేను అవాక్కయి పోయాను. నిజానికి వచ్చిన కార్యం మఱచిపోయాను!

నాకింక ఆమెని చూడబుద్ధి పుట్టలేదు. నా కళ్లల్లో కన్నీటి వరదలు.

ఎంత అభాగ్యురాలు! సుఖ, సౌఖ్యపు ఆనంద లహరుల్లో పుట్టి పెరిగింది.

కానీ యిప్పుడు దురదృష్టపు బాధా సర్పదష్టురాలయింది. విషమ పరిస్థితుల పురిత్రాడు పుచ్చుల్లో చిక్కుకుంది - వూపిరి సలపకుండా!

కాలచక్రం తిరుగుతూ ఎన్నో సంవత్సరాలు గడిచిపోయాయి - ఇప్పుడామెలో ముసలితనం ప్రవేశించింది. ఆమెకి తెలిసొచ్చింది. ఇలాగే సాగితే ఎప్పుడో ఈ నూనె అయిపోయి, ఈ వత్తులు యిగిరిపోయి, ఈ దీపం కొండెక్కుతుంది! దీపం ఆరిపోయి పగలే ఈ ఇంద్రసౌధంలో చీకటి భూతాలు ప్రవేశిస్తాయి! అందుకే అలా జరగకూడదనీ, ఎలాగైనా ఈ భవనంలో కాంతి పంటలు పండాలనీ ఆమె తాపత్రయం. అందుకే ఆ 'టెస్టామెంట్' (మరణశాసనం) విషయం ఆదుర్దా!

'టెస్టామెంట్' (మరణశాసనం) గబగబా వ్రాశాను. నెమ్మదిగా ఆమె సంతకం తీసుకున్నాను. తరువాత పెల్లుబుకుతున్న దుఃఖపు వరదని అర్థగిస్తూ, అణుచుకుంటూ చింత మనస్సుతో, ఈ విశాల ప్రపంచపు వైచిత్రికి విచారాన్ని ప్రకటిస్తూ, నేను అక్కణ్ణించి మెల్లిగా జారుకున్నాను. కానీ నా మనస్సులో ఆ అందాల పెళ్లికూతురి దయనీయమైన విషాదదృశ్యం కళ్లముందు ఎప్పుడూ వస్తుంది! గుండెలోతుల్లోంచి ఆ దుఃఖపు బాధ తొలిచేస్తుంది. నన్ను సొంతం తినేస్తుంది.



10

# ప్రేమ జాతర

**- పుండలీక్ నాయక్**

తోటలో తెల్లవారింది. పక్షుల చిత్ర, విచిత్ర శబ్దాలతో, కువకువలతో అరుణోదయపు కళ సర్వత్రా వ్యాపించింది. పొడుగ్గా, నిటారుగా నిలబడ్డ పోకచెట్లు, కొబ్బరిచెట్లు మధ్యనించి సూర్యకిరణాలు నెమ్మదిగా కిందికి దిగుతున్నాయి., అరటిచెట్ల పెద్ద పసుపుపచ్చ ఆకులమీదుగా జారి బంగారంలా మెరుస్తున్నాయి.

తోట పై ఎత్తు భాగంలో వర్షపునీరు పడి ఒక చిన్న తటాకంలా ఏర్పడింది. చిన్న చెరువులాగ కనిపిస్తోంది. ఆ చెరువులోంచి కిందికి నీరు చిన్నధారగా పారుతూ, అక్కడ నీరు ప్రవహించడానికి ఏర్పాటుచేసిన గొట్టాలలో గళగళ శబ్దం చేస్తూ కిందికి జారుతోంది.

నల్లని ఛాయలోని ఒక యువకుడు 'బాబూరాయ్' బొచ్చె తీసుకుని నీళ్లల్లోకి దిగాడు. వయస్సుకి మించిన పొడుగు ఎదిగిన అతని శరీరం నీరెండలో టేకు కఱ్ఱలా మిలమిలా మెరుస్తోంది. అతడు ఆ బొచ్చె తీసుకుని నీళ్లల్లో ముంచి పోకచెట్లకీ, అరటి చెట్లకీ సరిగ్గా గురిచూసి మొదళ్ళలో పడేలా చిమ్మాడు. పోకచెట్లు, అరటిచెట్లకు తగిలిన నీళ్లు కొన్ని తిరిగి తుంపరగా అతని నగ్నశరీరం మీద రాలుతున్నాయి. అతని నెత్తిమీది వుంగరాల జుత్తులోకూడా కొన్ని నీటిబిందువులు యిరుక్కుని వుండిపోయాయి.

'బాబూరాయ్' నీళ్లు చల్లడం ఒక లయబద్ధంగా చేస్తున్నాడు. ఎన్నోఏళ్లుగా చేస్తూ అలవడిన ఆ లయ, తాళబద్ధమైన సరళికి, గాలిలో తేలుతున్న నీటిధారకి కూడా ఒక క్రమం, ఒక కవాతు అలవడి ఒక వయ్యారి వొక్రాకారం ఏర్పడింది.

'బాబూరాయ్' చూపులు మళ్ళగానే, లయభగ్నమయి మళ్లీ మామూలుగా నీటి ఆకారం వొంకర టింకరగా మారింది. 'బాబూరాయ్' లక్ష్యం తప్పిన నీటి

బాణాలు తమవైపు ఆకర్షించాలని కొన్ని కొబ్బరిచెట్లూ, అరటిచెట్లూ విఫల ప్రయత్నం చేస్తున్నాయి!

మంచుతెరలు చీలుస్తూ 'మోగా' ముందుకొచ్చి నిలబడింది. అరటిచెట్టు ఆకుల సందుల్లోంచి 'బాబూరాయ్' కళ్లు ఆమెమీద పడ్డాయి! 'మోగా' ఎప్పటిలాగే నిద్రమంచం నించి అదృశ్యమై వచ్చింది. ఆమె శరీరాన్ని నిద్ర యింకా వదలనందున కాళ్లు తడబడుతున్నాయి. చేతిలోని పాఅ వూగుతూ ఒకసారి నేలమీదా, ఒకసారి పక్కనున్న కొబ్బరి చెట్లకీ తగులుతోంది. తనదైన తోటభాగంలో ప్రవేశించగానే ఆమె ఆగింది. తన చేతిలోని దొనె ఆకారంలోని పాఅ సరిగ్గా పట్టుకుంది. నీళ్లు చల్లేపని ఆరంబించే ముందుగా కాస్త నడుంతిప్పి, దుస్తులు సరిచేసుకుంది. అక్కడి కొబ్బరిచెట్లూ, అరటిచెట్లూ ఆమె తరహా గమనించి 'ఈవేళ మనకి నీళ్లు దొరకవు. మనకి ఉపవాసమే' అని దిగులుతో వొణుకుతున్నాయి. కారణం నీళ్లు తోడి, చల్లడానికి ముందు కాలవలోకి నీళ్ల వదలడం మఱచిపోయింది.

తన తోటలో చెట్లకి నీళ్లు పోస్తున్న 'బాబూరాయ్' దృష్టి తనమీదే వుందన్న ధ్యాస 'మోగా'కి లేనేలేదు. అకస్మాత్తుగా ఆమె మొహంమీద చల్లటి నీళ్ల తుంపరలు పడ్డాయి. ఆమె చలితో ఆకులా వొణుకుతూ స్పృహలోకి వచ్చింది. నిద్ర మత్తు పోయింది. కాలువలో నీళ్లు చప్పుడే చేసినట్లే 'బాబూరాయ్' నవ్వాడు. తన పొరబాటూ, 'బాబూరాయ్' చిలిపితనం ఆమె గ్రహించింది. కాస్త నిబ్బరంతో, కాస్త కోపంతో ఆమె 'బాబూరాయ్'ని చూసి అంది.

"ఏ బాబూరాయ్ - వొళ్లు దగ్గరుంది కదూ? ఇంకా తల తిరుగుతోందా?"

తన అరచేతితో, ఆమె కళ్లు తుడుచుకుంది. తలమీద చిందరవందరగా పడిన జుత్తుని సరి చేసుకుంది. రెండు చేతులతోనూ కేశాలని ముడివేసి వెనకవైపు నడుంమీద విదిలింది. నీళ్లులేని కాలవదారిలో గబగబా పైకి ఎక్కి పై తటాకంలో నీళ్లు వదిలి మళ్లీ కిందకి ప్రవహిస్తున్న నీళ్లతోబాటు పరుగెత్తుతూ, తన తోటలోకి వచ్చింది. దోసిళ్లతో నీళ్లు తాగింది పొట్టనిండేలా. బిందె తీసుకుని నడుంమీద వేసుకుంది.

తన దోనెపాఅతో కాలువలోని నీళ్లు అరటిచెట్ల మొదళ్లకి వేయడానికి వెతుకుతూ వెళ్తూంటే, హఠాత్తుగా దోసెడు నీళ్లు పొట్టమీద పడ్డాయి. తన బాణం ఖచ్చితంగా తగిలిందని 'బాబూరాయ్' మళ్లీ నవ్వాడు.

"బాబూరాయ్, నవ్వు శృతి మించుతున్నావ్! తోటకి నీళ్లు పోస్తున్నావా, లేక హోళీ ఆడుతున్నావా?"

"హోళీకి ఇంకా వేళ వుంది. ముందు జాతర వస్తుంది" 'బాబూరాయ్' ఆమెని వేళాకోళం చేస్తూ అన్నాడు.

"ఈసారి నేను నీ జాతరకి రాను."

"జాతర నా వొక్కడిదేకాదు, అందరిదీ."

"నాకు తెలుసు. అయినా నేను రాను, నిజం."

"ఎందువల్లట?"

"ప్రతీ ఏడాదీ, అవే పులివేషాల్తూ, అవే కుప్పిగంతులూ - అందులో కొత్తేమిటనీ? అందులో నీ నృత్యం - వొంటి కళ్లమీద నిల్చుని కోతిగెంతులు - లా... లా... లా... యివేగా జాతరంటే."

'మోగా' ఒక కాలుమడిచి మరోకాలు మీద ఆన్చి, వొంటికాలుతో నృత్యం చేస్తూ 'బాబూరాయ్'ని ఆక్షేపించింది, ఎగతాళి చేసింది.

"జాతర కోసం వూరంతా జనం మండపంలో గుమికూడుతారు. నువ్వొక్కర్తవే యింట్లో కూర్చుంటావా?"

'బాబూరాయ్' 'మోగా'ని అడిగాడు.

"ఆఁ వుంటాను ఒక్కర్తినే వుంటాను" 'మోగా' నిర్లక్ష్యంగా జవాబిచ్చింది.

"అలా నువ్వు ససేమిరా వుండలేవు. నేను విచిత్ర వేషం వేసుకుని వొంటి కళ్లమీద నిలబడి మాట్లాడిన మాటల శబ్దం నీ చెవిన పడగానే ఆవు వెనక తోకాడిస్తూ, నాలుగు కాళ్ళూ ఈడుస్తూ దూడ వచ్చినట్లు, నువ్వూ పరిగెత్తుకుంటూ వస్తావు మండపంలోకి".

ఆమె బలహీనతని పరిశీలించిన బాబూరాయ్ అన్నాడు.

"నీ పులివేషాల కొక్కిరి మాటలు నా చెవి వరకూ రాకుండా నేను జాగ్రత్త పడతాను" ఆమె నిశ్చలంగా అంది.

"చెవులకి శబ్దం రాకుండా దూది వుండలు చెవుల్లో దోపుకుని కూర్చుంటావా?"

"అబ్బే, అలాకాదు. మడుగులో కప్పలాగ నీళ్లల్లో మునిగి కూర్చుంటాను."

'మోగా' మడుగువైపు వేలు చూపించి అంది.

"నువ్వు మడుగులో మునిగి కూర్చుంటావా? కుక్కలకంటే నువ్వే నీళ్లంటే భయపడతావు."

'బాబూరాయ్' ఏదో గాయం తగిలినట్లు గుండెలమీద చెయ్యి వేసుకున్నాడు. అతను ఓడిపోయినవాడిలా మొహం పెట్టినా, అతని మాటల్నే 'మోగా' నెమరువేస్తోంది. పళ్లు యికిలించి, అతనికేసి చూసి "కుక్క" అని అంది.

"ఎవరూ?"

"నువ్వే."

'బాబూరాయ్'కి కోపం వచ్చింది. దోనెపాళతో నీళ్లుపట్టి 'మోగా'మీద విసిరాడు. 'మోగా' మాత్రం వూరుకుంటుందా? తనూ తన పాళతో అతనిమీద నీళ్లు చిమ్మింది. ఇద్దరూ తడిసి ముద్దయిపోయారు. అరటిచెట్లు చుట్టూ నలువైపున పోసిన నీళ్లు నిలకడగా వున్నాయి. ఆఖరికి 'మోగా' అరటిచెట్ల చాటున దాక్కుంది. 'బాబూరాయ్' అరటిచెట్లకి నీళ్లు పోస్తున్నాడు. అరటిచెట్లమీద నీళ్లు ధారగా కురుస్తున్నాయి. ఆ చెట్ల దగ్గర నిలుచున్న 'మోగా' అరటి వూడలా తన నాలికని చాపి 'బాబూరాయ్'ని వెక్కిరిస్తోంది. దోనెపాళతో బాబూరాయ్ అరటిచెట్ల కుదుళ్ల దగ్గరి పల్లపు ప్రదేశంలో నీళ్లు నింపాడు. అరటిచెట్లు ఆనందంతో తలలూపాయి.

వర్షఋతువులో ఒకరాత్రి వూరి మండపంలో డోలు చప్పుడు వినిపించింది. డోలు, డప్పు, తబలా, హార్మోనియం, షెహనాయి తదితర వాయిద్యాల శబ్దంతో వూరంతా ఒక్కుమ్మడిగా మేల్కొంది. అందరికీ అర్థమయింది. ప్రతీ ఏడాదిలాగే, ఈ సంవత్సరపు జాతర ఆరంభమయిందని. మంగళవాయిద్యాలతో దేవుళ్లకీ, దేవతలకీ స్వాగతం పలికి, అన్నివిధాలా గ్రామవాసులకి సుఖశాంతులు ప్రసాదించమని ప్రార్థనలు, విన్నపాలూ చేశారు.

దేవ గణపతికి

నమస్కారాలు.

మండపం చుట్టూ కూర్చునున్న వాద్యగాళ్లూ, పాటలూ, భక్తిగీతాలూ సమర్పించడానికి వచ్చిన గాయకులూ, కళాకారులూ ముందుగా వివిధ దేవుళ్లకి పూలహారాలు పేరుపేరునా అర్పించారు. పిల్లలు, తల్లులూ, పెద్దలూ వారి వారి స్థానాలు చూసుకుని కూర్చున్నారు. మొగవాళ్లు యిటూ, అటూ వూరికే పచార్లు చేస్తూ, జాతర హడావిడిలో పాల్గొంటున్నారు. మండపంకి సమీపాన ఒకటి, రెండు

టీ కొట్లు వెలిశాయి. అవిగాక బటాణీలమ్మేవాళ్లూ, పాన్, బీడీలు, గాజులు, పూసలహారలమ్మేవాళ్ళూ జాతరకి శోభని తెచ్చారు. మండపంలోనూ. మండపం చుట్టుపక్కలా జనం వుత్సాహం పొంగుతూ హుషారుగా తిరుగుతున్నారు.

మహిళలకి వుద్దేసించిన విభాగంలో 'మోగా' కూర్చుంది. ఆమె నీలంరంగు దుస్తులు - వోణి, పరికిణీ వేసుకుంది. వెనక జడ వదులుగా వెళ్లాడుతోంది. తలవెనక మొగలిరేకుల దవనం వేసుకుంది. మెడలో బంగారుహారం, చెవికి తొడుగులాంటి బంగారు నగ సింగారించుకుంది. లైట్లకాంతిలో అవి ధగధగ మెరుస్తున్నాయి.

పూజ, ప్రార్థనాలూ ముగిశాయి. ఆ తరువాత వివిధ విచిత్ర వేషాలలో వూరి కళాకారులు రంగస్థలం మీద అభినయం చేయసాగారు. ముందు తోటమాలి వచ్చాడు. ఆ తరువాత అతని కొబ్బరిచెట్లు అద్దెకి తీసుకుని కల్లుగీత తీసే గీత పనివాడు వచ్చాడు. వాళ్ళిద్దరి మధ్య రొక్కం గురించి లావాదేవీలూ, వాగ్వివాదాలూ నాటకరూపంలో చూసి జనం కడుపుబ్బ నవ్వుకున్నారు. ఆ తరువాత ఆ గ్రామానికి రక్షకుడైన పోలీసువాడు - రెండు కాళ్లకీ రెండు పొడుగైన గడకఱ్ఱలు ధరించి, ఆ కఱ్ఱలమీద తాళబద్ధంగా, అతి చాకచాక్యంతో నృత్యం చేశాడు. జనం మెచ్చుకుంటూ చప్పట్లు కొట్టి, ఈలలు వేశారు.

'మోగా'కి దగ్గరలో మూలకూర్చున్న ఒక వృద్ధ స్త్రీ ఆవలిస్తూ అంది 'మోగా'తో

"అమ్మా, ఆ రెండవ నృత్యగాడు - ఒంటికాలిమీద కఱ్ఱమీద నిలబడి నృత్యం చేస్తాడు చూడు - వాడు రాగానే నన్ను లేపు. భలే అద్భుతంగా చేస్తాడు" అంటూ కునుకు తీస్తోంది.

ఆ వృద్ధ స్త్రీ మాటలు 'మోగా'కి ఎవరో కితకితలు పెట్టినట్లయి నవ్వొచ్చింది. తనుకూడా 'బాబూరాయ్' - అదే ఆమె వర్ణించిన వొంటికాలి నృత్యగాడు - కోసం ఎదురుచూస్తోంది. అప్పుడే 'మోగా'కి దగ్గర్లో కూర్చన్న ఒక యువతి "అవును - మరే. నాకూ అతని నృత్యం అంటే చాలా ఇష్టం" అంది. 'మోగా' వాలు చూపులతో ఆమెని పరిశీలించింది. ఆమె మాటలు 'మోగా'క నచ్చలేదు.

ఒక నృత్యగాడు ప్రదర్శన చేసిం తరువాత, మరో నృత్యగాడు వచ్చేముందు ఆ రాబోయే కళాకారుడికి గౌరవ సూచకంగా అతని మిత్రులూ, కుటుంబ సభ్యులూ టపాకాయలు కాల్చడం ఆనవాయితీ. టపాకాయల మోతలు తగ్గాక, మరో కళాకారుడు సంగీత వాయిద్యాల మధ్య రంగంలో ప్రవేశించాడు. రంగు రంగు

నగిషీ పట్టుబట్టలతో, చేతుల్లో వివిధ రంగుల జెండాల గుత్తి పట్టుకుని గుండ్రంగా తిరుగుతూ నృత్యం చేశాడు. జనం చప్పట్లతో, ఈలలతో, కేరింతలతో వుత్సాహం మిన్నంటగా అతడికి అభినందనలు తెలిపారు. ఆ తరువాత కొంత నిశ్శబ్దం., మళ్ళీ టపాకాయల హడావిడీ, మళ్ళీ ఈసారి ఈలలు, కాస్త ఎక్కువ మోతాదులో డప్పులూ, డోళ్ళూ, బాకాలూ, సన్నాయిలూ వంతుబాటుగా ఆ కుంటి నాట్యగాడు 'బాబూరాయ్' ఆకాశంలోంచి దిగినట్లు వొంటికాలి నృత్యం చేస్తూ రంగప్రవేశం చేశాడు. జనం గుండెలు గుప్పిట్లో వున్నట్లు, వూపిరి బిగబెట్టి చూస్తున్నారు. 'బాబూరాయ్' కుడికాలు మడిచికట్టి, ఒంటికాలు మీద అద్భుత చాతుర్యంతో, అనితరసాధ్యంగా నృత్యం చేస్తున్నారు.

బ్రతుకు బజారులో
ప్రేమ జాతరలో
కుంటివాడికి - కుర్రవాడికి
ప్రేమ ఎలా దొరుకుతుంది? బ్రతుకు ఎలా ఫలిస్తుంది?

బాబూరాయ్ నోట్లోంచి వస్తున్న శబ్దాలు, వాయిద్యాల చప్పుడులో మునిగి సరిగ్గా వినబడడంలేదు. అయితే ప్రతీ ఏడాదీ పాడే పాటలే కాబట్టి జనానికి అవి అప్పటికే కంఠతా వచ్చును. అందువలన స్పష్టంగా గొంతుక వినబడకపోయినా ఫరవాలేదు.

కుంటికాళ్ల కుర్రవాడా
కంటికింపుగ నృత్యగాడా

జనం ఆ కుంటివాడి ఒంటికాలి నృత్యాన్ని బాగా ప్రశంసించారు. బాబూరాయ్ అభినయం వాళ్లని కరుణతో ముంచింది.

కాళ్లు లేకున్నా - కాదులే శిక్ష
దేవుడి కరుణే నీకు రక్ష
కుంటి కాళ్ల కుర్రవాడా
కంటిగింపుగ నృత్యగాడా.

బాబూరాయ్ నృత్యం చూస్తూ, చూస్తూ 'మోగా' స్తబ్దురాలయింది. ముందు ఆమెకి భయం వేసింది. ఆ వొంటికాలు నృత్యం చేస్తూ, చేస్తూ 'బాబూరాయ్' పడిపోడు కదా? కానీ ఆ తరువాత నృత్యం చేయడంలో బాబూరాయ్ చూపించిన

కౌశలం, ప్రజ్ఞ ఆమెని అబ్బుర పరిచింది. భయం ఎగిరిపోయింది.

బ్రతుకు బజారులో - ప్రేమజాతరలో

కుంటివాడికి - కుర్రవాడికి

ప్రేమ ఎలా దొరకుతుంది? బ్రతుకు ఎలా ఫలిస్తుంది?

ఇంతసేపూ కొబ్బరిచెట్ల మధ్య యిక్కడా, అక్కడా తిరుగుతూ షికారు కొడుతున్న 'దేమూ' వాడి మిత్రులూ ఒకేచోట స్థిరపడి నిల్చున్నారు. అక్కడ నిల్చుని మాటిమాటికీ వూరికే 'మోగా'ని చూస్తున్నాడు. పుచ్చిపోయిన పళ్లతో ముప్పై అయిదేళ్ల 'దేమూ', ఆకులతో, వక్కలున్న నోటితో మేస్తూ, 'మోగా'నే తదేకంగా చూస్తున్నాడు. అతని మిత్రులు సిగరెట్లు త్రాగుతూ, అతనితో ఏదో చెబుతున్నారు.

"నచ్చిందా?"

మరో సిగరెట్టు ముట్టిస్తూ, మిత్రుడు 'దేమూ'ని అడిగాడు. 'దేమూ' సంతోషంగా నవ్వాడు.

"నచ్చితే ఎత్తుకుపోవడమే" మిత్రుడు అన్నాడు. ఇంతసేపూ మౌనంగా వీళ్ళని గమనిస్తున్న ఒక పెద్దమనిషి కోపంతో అన్నాడు.

"ఎత్తుకుపోవడం అంటే ఏమిటీ? అది ఒక ఆటబొమ్మా?"

"ఆటబొమ్మ కాదు కనకనే యింతసేపూ వూరుకొన్నాం. కాకపోతే ఎప్పుడో ఎత్తుకుపోయే వాళ్లం" 'దేమూ' మిత్రుడు నిర్లజ్జగా నవ్వాడు.

"కాస్త వొళ్లు దగ్గరుంచుకుని మాట్లాడండి. ఎవరనుకొన్నారు? అది నా కూతురు" 'మోగా' తండ్రి నిగ్రహంతో అతన్ని హెచ్చరిస్తూ అన్నాడు.

"అలాగా? ఐతే మరీ మంచిది. మొదటి ప్రయత్నంలోనే పని అయిపోయింది. ఇప్పుడు యింక అటూ, ఇటూ చూసే అవసరం లేదు. ఏమంటావు దేమూ?"

'దేమూ' తన మిత్రుడి మాటలు మనస్సులోనే వొప్పుకున్నాడు.

"ఇంటికి రండి - మాట్లాడదాం."

"ఎప్పుడు."

ఆతృత, ఆశతో అతను 'దాదీ' (తండ్రి)ని అడిగాడు.

"మీకు కావల్సినప్పుడు రండి. పుష్పించిన పుష్పాలని ఏనాటికైనా ఒకరికి అర్పించక తప్పదు కదా!"

'దాదీ' మాటలు విని ఎంతో సంతోషించిన వాడిలా 'దాము' నవ్వాడు. నవ్వినప్పుడు, అతని పుచ్చిన పళ్లు స్పష్టంగా కనిపించాయి.

తనని తానే మరచిపోయిన తన్మయత్వంతో 'మోగా' బాబూరాయ్ ఒంటికాలి నృత్య అభినయాన్ని చూస్తూ, చూస్తూ అకస్మాత్తుగా తెలివిలోకి వచ్చింది. దూరంగా తన తండ్రి ఎవరో యిద్దరు యువకులతో ఏదో మాట్లాడుతూ వుండడం గమనించింది. మళ్లీ ఆమె దృష్టి మళ్లించి, రంగస్థలం మీది బాబూరాయ్ నృత్య ప్రదర్శన చూడసాగింది.

"ఇంటి దగ్గరి బజారు - ప్రేమ జాతర హాజరు
కుంటివాళ్లకీ - గుడ్డివాళ్లకీ
యివ్వండిరా దానాలు - అన్నాలూ
యివ్వండిరా దానాలు - అన్నాలూ."

అందరి సెలవు తీసుకుని ఒంటికళ్ల నృత్యగాడు 'బాబూరాయ్' నిష్క్రమించాడు. ఆమెకి అకస్మాత్తుగా జ్ఞాపకం వచ్చింది. ఆ ముసలిదానిని లేపాలని. కానీ అప్పటికే 'బాబూరాయ్' వెళ్లిపోయాడు.

రాత్రంతా నడిచిన జాతర పగలు తెల్లవారుఝామున ముగిసింది.

జాగరణ వలన కళ్లల్లో అలసట, మనస్సులో మనోవినోదం వలన కలిగిన ఆనందంతో జనం తమతమ పనుల్లో నిమగ్నమయ్యారు.

'బాబూరాయ్', 'మోగా'లు రోజూలాగే తోటలో కలుసుకున్నారు. చెట్లకి నీళ్లు అందించే పని నెపంతో చలిమంటలు కాచుకునే స్థలంలో యిద్దరూ మాట్లాడుకున్నారు.

"జాతరలో నీ కుంటి నృత్యం చాలా బాగుంది. నాకెంతో నచ్చింది. నిజంగా చెబుతున్నా. వొంటి కాలిమీద అంత అద్భుతంగా నృత్యం చేయడం మాటలుకాదు."

'మోగా' అతన్ని ఎంతగానో పొగిడింది. 'బాబూరాయ్' ఉప్పొంగిపోయాడు. నిన్నరాత్రి ప్రదర్శనలో వినిపించిన చప్పట్లు, ఈలలు కన్నా ఈ 'మోగా' ప్రశంస ఎన్నోరెట్లు అమూల్యమయిందిగా తోచింది.

"అన్ని పనుల్లోనూ, నాకు జాతరలో వొంటికాలి నృత్యం చేయడం అంటే చాలాయిష్టం. అలా నృత్యం చేస్తూ వుంటే, నేను ఈ లోకంలోనే లేనట్టుగా, నన్ను నేనే మరచిపోయినట్లు అనుభూతి కలుగుతుంది. ఏదో వేరే లోకంలో విహరిస్తున్నట్టు

అనిపిస్తుంది.''

'బాబూరాయ్' వుద్వేగంతో చెప్పాడు.

''ఆఁ అవును. నిన్ను చూస్తే మాకూ అదే అనుభూతి కలుగుతుంది. నువ్వు రంగంమీద నిలబడినప్పుడు, ఎంతో ఎత్తుగా, భూమికి దూరంగా కనిపిస్తావు.''

''ఈ జాతర సంవత్సరానికి ఒక్కసారే, ఒక్కరోజే వస్తుంది. ఇప్పుడు మళ్ళీ వచ్చే ఏడాదే'', 'బాబూరాయ్' నిట్టూరుస్తూ, నిరాశగా అన్నాడు.

''నీకంత ముచ్చటగా వుంటే, మధ్యమధ్య అప్పుడప్పుడు నృత్యం చేయవచ్చుగా?''

''ఒక్కణ్ణే గెంతులెయ్యనా? అయినా చూసేవాళ్లెవరూ?''

''నే నున్నానుగా?''

''ఒక్తి నువ్వేనా?''

''అవును. నేనొకర్తినే. నువ్వు కేవలం నాకోసం నృత్యం చేస్తే, అది చూడడం నాకు మరీ యిష్టం. నాకోసం నృత్యం చేస్తావుకదూ?''

'మోగా' గొంతుకలో మార్దవం వచ్చింది. మృదువుగా, గోముగా అడిగింది.

''కానీ ఎలా నాట్యం చెయ్యడం? కాళ్లకి వెదురు కఱ్ఱలు కట్టాలిగా?''

ఆమె వెఱ్ఱిదనే భావంతో 'బాబూరాయ్' అన్నాడు.

'మోగా' ఆ తటాకం అంచుమీద నిలబడింది. తన ఎడమకాలు ఎత్తి మడిచిపెట్టి, కుడికాలు మీద నిలబడి అరిచింది.

''ఇదిగో యిలాగ.''

గెంతులేస్తూ, వేస్తూ ఆమె తనమీద అదుపుతప్పి తూలబోయింది. ఆమె కింద పడేలోగా బాబూరాయ్ ఆదుకుని పట్టుకున్నాడు. ఒడ్డున వున్న కొన్ని రాళ్లూ, యిసకా 'తటాకం'లో పడ్డాయి.

ఒంటికాలుతో నృత్యం చెయ్యాలనే 'మోగా' ప్రయత్నం బాబూరాయ్‌కి బలే నచ్చింది. ఇద్దరికీ ఒకరిమీద ఒకరి ప్రేమ పెరిగిపోయింది. ఆ మత్తులో వాళ్లుండగా, కర్కశంగా ఒక గొంతుక -

''మోగాఁ.''

తోటలో 'దాదీ' కేక వినిపించింది. 'మోగా' తెలివిలోకి వచ్చి గాబరాగా 'బాబూరాయ్'కేసి చూడనైనా చూడకుండా పారిపోయింది. పరుగెత్తుతూ మేకలాగ

గెంతులేసింది.

తొందరగా వూపిరితీస్తూ, ఆయాసంతో 'మోగా' యింటికి చేరుకుంది. ఇంటి ఆవరణలో అడుగుపెడుతూంటే, ఎవరో యిద్దరు గుర్తు తెలియని వ్యక్తులు వరండా మెట్లు దిగుతూ ఎదురొచ్చారు. ఇద్దరూ 'మోగా'ని చూశారు. 'మోగా' క్షణం తడబడింది.

"ఇదే మా 'మోగా'."

వరండామీద నిల్చున్న 'దాదీ' వాళ్లతో అన్నాడు. ఇద్దరూ పళ్లు యికిలిస్తూ నవ్వారు. 'మోగా'కి నిన్న రాత్రి సంగతి గుర్తొచ్చింది. అప్పుడు 'దాదీ'తో మాట్లాడుతున్న వ్యక్తులు వీళ్లే. 'మోగా' మౌనంగా యింట్లోకి పరుగెత్తింది.

ఒకరోజు రాత్రి 'దాదీ' అంగణంలో పోకలు (సుపారీ) వొలిచే పని చేయసాగారు. ఆరుగురు స్త్రీలు పనిచేస్తున్నారు. ఒక్కొక్కరూ ఒక్కొక్క కత్తిపీట ముందు కూర్చుని వున్నారు. 'మోగా'కూడా ఒక కత్తిపీట తీసుకుని సుపారీ (పోక చెక్కలు) కాయలు వొలుస్తోంది.

పని తేలిక అవడానికని, యథా ప్రకారం ఆ స్త్రీలు జానపద గీతాలు పాడసాగారు. అలా పాడుతూ, పాడుతూ ఒక మహిళ తన వొంతు రాగానే పెళ్లిళ్లల్లో పాడే పాట అందుకుంది.

'మోగా' తండ్రి (దాదీ), తల్లి (బా) సుపారీ యింట్లోకి, బయట అంగణంలోకీ చేరవేస్తున్నారు. పెళ్లిపాటలు మొదలవడంతో 'దాదీ' అన్నాడు.

"ఈ పెళ్లిపాటలు నిజం పెళ్లిలోనే పాడే అవకాశం మీకు త్వరలో వస్తుంది."

"పెళ్లా? ఎవరిదీ?"

అక్కడి స్త్రీలందరూ ముక్త కంఠంతో అడిగారు.

"మరెవ్వరిదనీ? మా 'మోగా'ది."

"అమ్మాం."

'మోగా' గట్టిగా అరిచింది. అందరూ వొక్కుమ్మడిగా 'మోగా' దగ్గరకి పరిగెత్తారు. సుపారీకాయలు తరుగుతున్న 'మోగా' చేతికి కత్తిపీట ధార కోసుకుంది. తటాకం నుంచి నీళ్లు కారుతున్న విధాన ఆమె వేలులోంచి రక్తం బొటబొటా కారింది. తండ్రి ఏదో మూలికలు రాసి తడిబట్ట కట్టాడు. తల్లి 'మోగా'ని హత్తుకుంది ప్రేమతో. 'మోగా' తండ్రి మాటలు విని బెంగతో తల్లడిల్లింది. ఆమె దృష్టికి ఆరోజు వాళ్ల

యింటికి వచ్చిన యిద్దరు యువకులూ గుర్తుకొచ్చారు. ఒకడు పుచ్చిన పళ్లున్న 'దేమూ'., మరొకడు వెకిలి నవ్వుల అతని మిత్రుడు.

"వద్దు."

'మోగా' మళ్లీ గట్టిగా అరిచింది - తల్లి వొళ్లో తలదాచుకుంటూ. ఆమె ప్రవర్తనకి 'దాదీ' నివ్వెరపోయాడు. ఆశ్చర్యంతో గొణుక్కున్నాడు. "దీనికేం రోగం వచ్చిందో?" రోజులు దొర్లుతున్నాయి. 'మోగా' పరిస్థితి అయోమయం అయింది. తన వివాహం 'దేమూ'తోనే జరగవచ్చని తెలిసిన తరువాత ఆ వార్త పిడుగులా తగిలి, బ్రతుకంటేనే ఒక ఏహ్యాభావం మొదలయింది. ఏ పనిలోనూ శ్రద్ధ, లక్ష్యం చూపించడంలేదు.

'బాబూరాయ్' కలుసుకుంటాడనే భయంతో, చెట్లకి నీళ్లు పట్టే పనినే నిర్లక్ష్యం చేయసాగింది. ఏ క్షణంలోనైనా 'బాబూరాయ్' కళ్లకి కనిపిస్తాడనే బెదురుతో తటాకం దగ్గరకి వెళ్లడమే మానేసింది. ఇంటి వరండాలో కూర్చుని పూలహారం చేయడానికి దారంలో సూదితో పూలు గుచ్చుతున్నా, ఎన్నోసార్లు అవి గురి తప్పి కింద పడుతున్నాయి.

తోటంతా ఎప్పుడూ లేడిలా గెంతుతూ తిరిగే 'మోగా', నిస్తేజంగా, నిశ్చలంగా గంటల తరబడి ఒకే స్థలంతో, అక్కడే పాతేసినట్లు కూర్చోసాగింది.

ఈ మార్పు తల్లి గమనించడానికి ఎక్కువ కాలం పట్టలేదు. ఈ విషయం భర్తతో చెప్పడానికి అవకాశం కోసం ఎదురుచూస్తోంది.

ఒకరోజు సాయంత్రం 'దాదీ' వరండాలో సిమెంటు సోఫాలో కూర్చుని బీడీలు చుట్టుతున్నాడు. అదే సందిగా, 'మోగా' తల్లి అక్కడికి వచ్చి, అతని కాళ్ల దగ్గర కూర్చుని ఆకులతో విస్తళ్లు చేయసాగింది. అదే మంచి సమయమని, 'మోగా' పెళ్లి ప్రస్తావన తెచ్చింది.

"మన 'మోగా'కి 'దేమూ' నచ్చినట్లు లేదు."

"అయినా పెళ్లిచూపులెక్కడ అయ్యాయనీ, నచ్చడానికీ, నచ్చక పోవడానికీ? ఇంకా ఏ విషయం యితమిద్ధంగా మాట్లాడలేదు." 'దాదీ' అరటి ఆకులో తంబాకు (పొగాకు) వేసి చుట్టలు కడుతూ అన్నాడు.

"అయితేనేం? 'దేమూ' ప్రసక్తి వచ్చింది కదా? అది చాలదా?"

"అందులో ఏమయిందనీ? కుర్రవాడు తోటపనిలో మంచి హుషారైనవాడు.

అదీగాక పొలం పనుల్లోనూ దిట్ట. వడ్రంగి పని కూడా చేస్తాడు. ఇద్దరిదీ మంచి జంట" 'దాదీ' ఒక బీడీ చుట్టడం పూర్తిచేసి రేకుడబ్బా (టిన్ను)లో వేశాడు.

"అది అంతా సరే. కానీ 'మోగా'కి నచ్చవద్దూ?" తల్లి బెదురుతూ, బెదురుతూ అడిగింది. ఆ మాటలు విని 'దాదీ' ఆ సోఫామీదే కదులుతూ అన్నాడు.

"అతనికి 'మోగా' నచ్చింది. మరి 'మోగా' ఎందుకని వొద్దంటుందీ?"

'ఆ సంగతి 'మోగా'నే ఎందుకడగరూ?"

ఆ మాటలతో 'దాదీ' కాస్సేపు వూరుకున్నాడు. బీడీలు చుట్టడం మానేశాడు.

లోపల గదిలో పక్కమీద వెల్లకిలా దిండులో తల దూర్చుకు పడుకున్న 'మోగా' ఈ సంభాషణ జాగ్రత్తగా వింటోంది.

"మోగా."

'దాదీ' గొంతుక విని తెలివిలోకి వచ్చింది. గుమ్మం దగ్గరకొచ్చి నిలబడింది.

"అమ్మా, నీకు 'దేమూ'తో సంబంధం నచ్చలేదా?" 'దాదీ' 'మోగా'ని తదేకంగా పరిశీలిస్తూ అడిగాడు. 'మోగా'కి వుద్వేగంతో కళ్లనీళ్లు వచ్చాయి. మాటలు పెకలలేదు.

"చెప్పమ్మా, చెప్పు. సిగ్గుపడకు."

"అదేం చెబుతుందనీ? దాని మొహం చూస్తే తెలియటం లేదా?"

"అలాగా? నా కనిపిస్తోంది., దానికంటే కూడా నీకే 'దేమూ'తో పెళ్లి చేయడం యిష్టంలేదని."

'దాదీ' పెళ్లాంమీద మండిపడ్డాడు.

"వద్దు నాన్నా - నాకు వద్దు", 'మోగా' అప్రయత్నంగా వెంటనే అనేసింది.

"కానీ ఈ విషయంలో నీ యిష్టాయిష్టాల ప్రసక్తి ఎందుకు వస్తుందీ?"

దాదీ కూతురివైపూ, భార్యవైపూ వొంతులుగా చూస్తూ, అన్నాడు. అతని భార్యకి అతని మాటలకు విరుద్ధంగా జవాబు చెప్పే ధైర్యం లేదు. దాదీ కాసేపు నిశ్శబ్దంగా వుండి, 'మోగా'ని ప్రేమతో దగ్గరకి పిలిచి అడిగాడు.

"అమ్మా, ఇవ్వేళ కాకపోతే రేపు నీకు పెళ్లి చేసుకోక తప్పదు. నీకు 'దేమూ'తో పెళ్లి యిష్టం లేకపోతే సరే. మరెవ్వరైనా నీకు నచ్చిన వాడు వుంటే చెప్పు".

"చెప్పమ్మా - తటపటాయించొద్దు" తల్లి కూడా 'దాదీ' మాటలకి వొంతు కలిపింది.

"బాబూరాయ్"

'మోగా' ఒక్క వుదుటున చెప్పింది. 'దాదీ' కళ్లముందు ఒంటికాలితో జాతరలో నృత్యం చేసే 'బాబూరాయ్' కనిపించాడు. చాలాసేపటి వరకూ అక్కడ నిశ్శబ్దం అలుముకుంది. ఎవ్వరూ ఏమీ అనలేదు.

"ఒక్కరాత్రి జాతరలో గెంతులేసినంత మాత్రాన పొట్ట నిండదు." దూరంగా చీకట్లో తోటవైపు చూస్తూ 'దాదీ' నసిగాడు.

"అతనికేం కాళ్లూ చేతులూ లేవా?"

"వున్నాయి. లేకేం? కానీ అవి వుపయోగించడం తెలియాలి కదా? మనం తోటపని వాళ్లం. మన పనులన్నీ కాళ్లూ, చేతులూ ఆడితేనే జరుగుతాయి. వొళ్లువంచి, చెమటోడ్చి పనిచెయ్యాలి. అందరికీ తెలుసు. ఈ బాబూరాయ్ నైజం. ఒఠ్ఠి పనిదొంగ. నెత్తిమీద తట్ట పట్టుకుని నడవడం ఎవ్వరూ యింతవరకూ చూళ్లేదు. గోనె బస్తాలు నడుంమీద మోయడం ఎవ్వరూ చూళ్ళేదు. అరటిచెట్ల చుట్టూ కుదరు త్రవ్వుతుంటే పెద్దకొండ మోస్తున్నట్లు నటిస్తాడు.

'దాదీ', బాబూరాయ్ పరాక్రమం గురించి ఒక పెద్ద దండకం చెప్పాడు. 'మోగా'కి కూడా తండ్రి చెప్పినదాంట్లో నిజం కనిపించింది. ఒకలాగ ఆమెకి బాబూరాయ్ మీద కోపం కూడా వచ్చింది. అయినా అతడిమీద ఆమెకున్న అనురాగం యిసుమంతైనా తగ్గలేదు.

"నేర్చుకుంటాడులేండి క్రమంగా. ఇంకా చిన్న వయస్సు కదా?" తల్లి పట్టుదల వదలలేదు.

"అవును నాన్నా, అతను తప్పక నేర్చుకుంటాడులేండి", 'మోగా' తల్లిమాటలకి తాళం కొడుతూ హామీ యిచ్చింది.

"ఎప్పుడు నేర్చుకొంటాడనీ? సుపారీ (పోక కాయలు) తీస్తున్నప్పుడు ఒక చెట్టుమీద నుండి మరో చెట్టుమీదకి చెట్టుని వుయ్యాల్లా వూగి దాటడం వచ్చా అతనికి? తోటలోని పనివాళ్ల పరాక్రమానికి అదే పరాకాష్ఠ. కాళ్లకి గడకఱ్ఱ కట్టుకుని జాతరలో ఒంటికాలి కుప్పిగంతులు వేయడం అంత సులభంకాదు అది. అర్థమయిందా?"

"అదీ నేర్చుకుంటాడు. అలాగే చేస్తాడు" 'మోగా' ఆత్మవిశ్వాసంతో 'బాబూరాయ్' పక్షాన పలికింది. 'దాదీ'కి అనిపించింది. ఈ వ్యవహారం

చిన్నపిల్లలాడుకునే బొమ్మల పెళ్లికాదు కదా అని. ఈ పిన్నవయస్కుల లేత మనస్సులూ, అమాయక వూహలూ అతనికి ఒక విధంగా మెచ్చుకోవాలని అనిపించాయి.

"అమ్మా! నీ సుఖమే, మా సుఖం. నేను 'దేమూ'కి పిలవదని కబురు పంపిస్తానులే."

"నాన్నా!" 'మోగా' వుప్పొంగే సంతోషంతో తండ్రిని హత్తుకుంది. తండ్రీ, కూతుళ్ల ప్రేమా, వాత్సల్యాలు చూస్తూ, 'మోగా' తల్లి కళ్లల్లో ఆనంద బాష్పాలు నిలిచాయి. విస్తళ్లు అల్లడానికి తెచ్చిన ఆకులు పక్కకి జరిపింది. ఆ పని తరువాత చూడొచ్చని.

మర్నాడు ఉదయమే 'మోగా' బొచ్చె (పాఱ) తీసుకుని తోటలోకి వెళ్లింది. ఆమె అడుగుల చప్పుడు వినగానే, తటాకం వొడ్డున కూర్చున్న 'బాబూరాయ్' లేచి నిలబడ్డాడు. జాతర మర్నాడు వాళ్లిద్దరూ ఆఖరిసారి కలిశారు. ఆ తరువాత చాలారోజులకి ఈ కలయిక.

"మోగా" అతను ఆత్రంగా పిలిచాడు.

"ఇక్కడేం చేస్తున్నావ్ - బాబూరాయ్?"

"నీ కోసమే ఎదురు చూస్తున్నాను"

"రోజూ యిలా వస్తున్నావా?"

"అవును. ఏ రోజూ మరచిపోకుండా."

తరువాత చాలా సేపటివరకూ 'బాబూరాయ్' తలొంచుకుని నిశ్శబ్దంగా కూర్చున్నాడు. తరువాత అతడే మాట్లాడాడు.

"మోగా, నీదేం నిశ్చయమయింది?"

"నిశ్చయమవడం నిజమే. కానీ యిప్పుడు మారిపోయింది."

"అంటే?"

"ఇప్పుడు నాకు 'దేమూ'తో పెళ్లవదు. అతడు నా మొగుడవడం జరగదు."

"అంటే అతను నిన్ను చేసుకుంటానని అన్నాడటా?"

"అవును. కానీ నిన్న నేను అమ్మా, నాన్నలకి ఖచ్చితంగా చెప్పేశాను.

"ఏమనీ?"

"అతను నాకు ఇష్టంలేదనీ - నాకు నువ్వే యిష్టమని."

"నేనా?"

"అవును."

'మోగా' ఒక్క గుక్కలో అంతా చెప్పేసింది. 'బాబూరాయ్' చెవికి ఈ శుభవార్త చెప్పాలని నిన్నటినుంచే వువ్విళ్లూరుతోంది. 'బాబూరాయ్' విని వూరుకున్నాడు. 'మోగా' తికమక పడింది.

"బాబూరాయ్, నేనే పొరబాటు చేశానుకదూ? అమ్మా, నాన్నలకి చెప్పేముందు నిన్ను అడిగి వుండాల్సింది కదూ?" 'మోగా' జాలిగా చూస్తూ అంది.

"అలాకాదు 'మోగా' నేనే తప్పు చేశాను. నేనే నీకు ముందు చెప్పవలసింది"

ఆమె చెయ్యి తన చేతిలో తీసుకుని నిమురుతూ 'బాబూరాయ్' అన్నాడు.

"ఏమిటనీ?"

"నేను నిన్ను ప్రేమిస్తున్నానని."

"నిజంగానా? నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?"

"అవును."

"ఎంత?"

"ఈ చెఱువులో నీళ్లంత."

ఆ మాటలు వినగానే 'మోగా' సంతోషం పట్టలేక గట్టుమీద నుంచి భూమిమీదకి గెంతింది.

తటాకపు ప్రవాహం రూపంలో తోటలోకి పారుతున్న నీళ్లని ఒక చిన్న అరటిపిలక అడ్డగిస్తే 'మోగా' పీకేసింది. "మోగా, ఏం చేస్తున్నావు?"

"మన ప్రేమకి అడ్డంకులు తొలగిస్తున్నాను."

ప్రవహిస్తున్న నీళ్లలా 'మోగా' కిలకిలా నవ్వింది. అలా ఆ నీళ్ళలోనే ఎగురుతూ నెమలి నాట్యంలా గెంతులేసింది.

ఎంతోసేపు వాళ్లిద్దరూ అక్కడ గడిపారు పిచ్చాపాటి మాట్లాడుకుంటూ. పాన్ తిని పళ్లు పుచ్చినట్లుండే 'దేమూ'నీ, అతని మిత్రుడు సిగరెట్టుతాగి పొగ వదులుతూ విచిత్రంగా నవ్వే విధానాన్ని అనుకరిస్తూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకున్నారు.

నవ్వుతూ, నవ్వుతూ 'మోగా' అకస్మాత్తుగా ఆగింది. రావిచెట్టు ఆకుల గలగలలు హఠాత్తుగా ఆగినట్టు.

"ఏమయిందే మోగా?"

'మోగా' మొహం మీది విషాదఛాయలు చూసి 'బాబూరాయ్' ఆత్రుతగా అడిగాడు.

"బాబూరాయ్, నీ గురించి 'దాదీ' (తండ్రి) ఏమన్నాడో తెలుసా?"

"నాకు తెలుసు ఏమంటాడో."

'మోగా' బాబారాయ్ కంటే ఎక్కువ గంభీర స్వరంతో అంది - "తెలిస్తే చెప్పు."

"మీ నాన్నే కాదు. వూళ్లో అందరి నోళ్లలోనూ అవే మాటలు. నాకు తోటపని చేతకాదని - నాకు ఈ వ్యవసాయం - పొలం పనులూ, తోటపనులూ ఏమాత్రం కుదరవనీ, రావనీ హేళన చేస్తారు. నా ప్రశంస ఏడాదికి వొక్కసారే - అదీ జాతరనాడు రాత్రి నేను చేసే వొంటికాలి నృత్యం చూసి. నీకూ అలానే అనిపిస్తుంది కదూ మోగా?"

"అలాకాదు 'బాబూరాయ్' నాకు ఆ వొక్కరాత్రి ఒక ఏడాదితో సమానం. కానీ ..."

'మోగా' తడబడింది. మాటలు పెగల్లేదు. కానీ 'బాబూరాయ్'కి ఆమె చెప్పదలుచుకున్నది తెలుసు. గుండెలో పెద్ద శ్వాస తీసుకుని అన్నాడు.

"నేను అన్నిపనులూ చేస్తాను. గునపంతో త్రవ్వి భూమిలో మట్టి వదులు చేస్తాను. నెత్తిమీద పెట్టుకుని బరువులు మోస్తాను. తోటపనిలో చేయవలసిన పనులన్నీ వొళ్లు వొంచి చేస్తాను. అయినా యిందులో పెద్ద కష్టమైన పనేముందనీ?"

"ఒక చెట్టుమీద నుంచి మరోచెట్టు మీదికి వూగుతూ దాటగలవా?"

"అవునవును. ఆ విద్యకూడా చేసి చూపిస్తాను."

బాబూరాయ్ గర్విస్తూ అని, వెంటనే ఒక్క వుదుటున తటాకం ఒడ్డునుంచి, దగ్గర్లో వున్న కొబ్బరిచెట్టు దగ్గరకి గెంతి కోతిలా, వూగుతూ, ఎగురుతూ ఆ చెట్టు ఎక్కసాగాడు.

"ఇప్పుడొద్దు రా! బాబూరాయ్."

'మోగా' బ్రతిమిలాడింది. అయినా వినక 'బాబూరాయ్' వుడతలా గబగబా ఎక్కి పైకి చేరాడు. ఆ కొబ్బరిచెట్టు కాయలు చేతికందే వరకూ చివరంటా ఎక్కి, ఒక్క నిమిషం అక్కడే కూర్చున్నాడు. తరువాత ఆ చెట్టుని గట్టిగా వూపాడు. క్రమంగా

అలా వూపుతూ, వూపుతూ ఒక పెద్ద వూపు రాగానే దాని సహాయంతో, ఆసరాతో మరో చెట్టుని పట్టుకొని మొదటిచెట్టుని వదిలేశాడు. ఇదంతా సావధానంగా, సునాయాసంగా చేశాడు. క్రింద నించి వూపిరి బిగపెట్టి కళ్లల్లో ప్రాణాలు పోసుకుని చూస్తున్న 'మోగా' పెద్ద గండం తప్పినట్లు ఉపశమనంతో నిట్టూర్చింది.

మర్నాటి నుంచి 'బాబూరాయ్' ఒక కొబ్బరిచెట్టు మీదనుంచి వూగుతూ మరో కొబ్బరిచెట్టుకు దాటే విద్యని నిష్ఠతో దృఢం చేసుకోసాగాడు. అందుకు వొక్కొక్క చెట్టు మధ్య దూరం వుజ్జాయింపుగా లెక్కకట్టడం మొదలెట్టాడు. జాతరకి కొద్ది వారాల ముందు నుంచీ అతను గడకఱ్ఱమీద వొంటికాలి నృత్యం ఈ విధంగానే శ్రద్ధతో అభ్యసించేవాడు (పునఃపునః చేయడంద్వారా).

అప్పుడప్పుడు ఆ కొబ్బరి తోటలోకి వెళ్లిన వాళ్ళకి, ఆ చెట్ల గుంపులోంచి జాతరలో వినిపించే ఈ పాట చెవుల్లో పడుతుంది

బ్రతుకు బజారులో
ప్రేమ జాతరలో
కుంటివాడికి
కుర్రవాడికి
ప్రేమ ఎలా దొరుకుతుందీ? బ్రతుకు ఎలా ఫలిస్తుందీ...

ఈ గొంతుక ఏ కొబ్బరి చెట్టు మీదనుంచి వస్తోందా అని తల ఎత్తి చూస్తే, అప్పటికి బాబూరాయ్ వూగుతూ మరో చెట్టు పట్టుకు మాయమయ్యేవాడు.

ఒకరోజు మాత్రం 'బాబూరాయ్' గొంతుకలో పాటకీ, మరో కొబ్బరిచెట్టు మీదికి మారడానికి చేసిన వూపుకీ పొంతన కుదరలేదు. ఘోరంగా జారిపడ్డాడు. కొబ్బరిచెట్టు మీదనుంచి అరటిచెట్ల బోదెలమీద పడి, అక్కణ్ణించి తిన్నగా నేలమీద జారిపడ్డాడు. ఒక పెద్ద కారుణ్యం రేకెత్తించే కేక తోటంతా ప్రతిధ్వనించింది. ఆ కేకవల్ల ఎన్నో అరి చెట్ల ఆకులు చిరిగి, విరిగిపడ్డాయి. తోటలో జనం అటువైపు పరుగెత్తారు, ఆరాటంగా.

'దాదీ' సిమెంటు సోఫా మీద కూర్చుని బీడీ కాలుస్తున్నాడు. దగ్గు రాకపోయినా వస్తున్నట్టు బలవంతాన దగ్గుతున్నాడు. 'బా' (తల్లి) అతని ముందు కూర్చుని విస్తళ్లు చేయడానికి పనస చెట్ల ఆకులు కోసి సరిచేస్తోంది. తన మాటలు గదిలో మంచం మీద విశ్రాంతి తీసుకుంటున్న 'మోగా' చెవుల్లో కూడా పడాలని

కావలసి కాస్త గట్టిగా భార్యతో అంటున్నాడు.

"అయినా 'బాబూరాయ్' అదృష్టం. ప్రాణాలు దక్కాయి. కేవలం ఎడంకాలు పోయింది. నడుం వరకూ కోసెయ్యవలసొచ్చింది."

"ప్రాణాలు మిగిలేయి. అదే పదిలక్షలు బిచ్చమెత్తయినా బతకవచ్చు" 'బా' అంది.

"ఆ విషయం బిచ్చగాళ్లకి వర్తిస్తుంది. తోటల్లో, పొలాల్లో పనిచేసే వాళ్ళకి కాళ్లూ, చేతులూ గట్టిగా వుంటేనే బతుకుతెరువు. కుంటివాళ్లకి స్థానంలేదు. మొదట్నించీ చూస్తున్నాను. ఆ 'బాబూరాయ్' వరస నాకేం నచ్చలేదు. పనికి వచ్చే లక్షణాలే లేవు."

నోట్లో దోపిన బీడీ పొగ బయటకి వదులుతూ 'దాదీ' అన్నాడు.

"నా కూతురు కొద్దిలో బతికిపోయింది. అదీ అదృష్టమే."

"ఆఖరికి దేవుడి యిష్టప్రకారమే జరుగుతుంది. వీడు నాకు నచ్చడు., వాడు నాకు నచ్చుతాడు అనగానే అయిపోతుందా? కాలం కలసి రావొద్దూ. మనం మనుష్యులం, నిమిత్తమాత్రులం, వాడు ఆడించినట్లు ఆడాలి. తప్పదు."

  

రోజులు మెల్లిగా దేకుతూ, దేకుతూ ఒక సంవత్సరం గడిచింది. ఒక వర్షాకాలపు రాత్రి మళ్లీ జాతర వచ్చిందనే సూచనగా, వూరి మండపంలో డప్పుల చప్పుడు గట్టిగా వినిపించింది.

'మోగా' తల్లిదండ్రులు - బా, దాదీలు యిద్దరూ కొత్త పండగ దుస్తులు వేసుకుని బయటకి వచ్చారు జాతర చూడడానికి. వరండాలో పచార్లు చేస్తూ 'మోగా' బయటకెళ్లడానికి అవకాశం కోసం కాచుకుంది. ఈసారి తను జాతరకి రాదల్చుకోలేదని తల్లిదండ్రులకి ముందే హెచ్చరించింది. అయినా వాళ్లు బుజ్జగించి చెప్పారు.

"అమ్మా, ఊరి మండపంలో జాతర జరుగుతున్నప్పుడు ఇంట్లో ఎవ్వరూ పడుకోకూడదు. అలా చేస్తే అరిష్టం. జాతర దేవుడికి అవమానం చేసినట్లు అవుతుంది."

'దాదీ' మాటలకి 'బా' వంత పలికింది.

"ఈసారి జాతరలో వొంటికాలిమీద నృత్యం చేయడానికి ఒక కొత్త

యువకుడు వస్తున్నాడుట. నువ్వురావా వాణ్ణి చూడడానికని?"

'బా' (తల్లి) మాటలు 'దాదీ' వింటూ, చూపులతోనే విసుక్కున్నాడు - "ఆ విషయం తేవద్దు" అని చెప్పకుండానే చెబుతూ. 'దాదీ' మౌనంగా 'మోగా' కేసి చూస్తున్నాడు - 'మోగా' వస్తుందా, రాదా అనే సంశయంతో.

అకస్మాత్తుగా 'మోగా' బయటకొచ్చింది వరండా మెట్లు దిగడానికని.

"అదేంటీ? ఈ బట్టల్తో నేనా?"

తల్లి ఆశ్చర్యంగా అడిగింది. 'మోగా' జవాబివ్వలేదు., నడక వేగం తగ్గించలేదు. ఆమె వెనకే తల్లి గబగబా పరిగెత్తి వెళ్లి చేతిలోనున్న రెండు పువ్వులు 'మోగా' జడలోకి గుచ్చడానికి ప్రయత్నించింది. కానీ ఫలితం లేకపోయింది. క్రిందపడ్డ పువ్వుల్ని ఏరి, తల్లి 'మోగా' వెనక పరుగులెత్తింది. వెలిగించిన 'లాంతరు' (కిరసనాయిలు దీపం)తో 'దాదీ' వాళ్లిద్దరి వెనకా తాపీగా వూగుతూ అడుగులు వేస్తూ అనుసరించాడు.

; మండపంలో పూజలూ, ప్రార్థనలూ పూర్తయ్యాయి. ఇక పులివేషగాళ్ల వంతు. వివిధ రూపాలలో, విచిత్ర ఆహార్యంతో (Makeup) ఒక్కొక్క కళాకారుడూ వంతులుగా వచ్చి, ప్రదర్శించి వెళ్లిపోతున్నారు. ప్రేక్షకులు అమితోత్సాహంతో చప్పట్లు, ఈలలూ వేస్తూ, మధ్య మధ్య టపాకాయలు, బాణాసంచా వెలిగిస్తున్నారు. 'మోగా' తల్లినుంచి దూరంగా వెళ్లి ఒక మూల స్త్రీలకి కేటాయించిన విభాగంలో కూర్చుంది.

రంగురంగుల డిజైన్లూ, అద్దకాలూ వున్న బురఖా వేసుకుని, ఆకర్షణీయంగా సింగారించుకుని, విలాసంగా నృత్యం చేస్తూ ఒక కళాకారుడు వేదికమీదకొచ్చాడు. అతడి నృత్యం అయాకనే ఒంటికాలి నృత్యం అని గుర్తుకువచ్చి 'మోగా' తృళ్ళిపడింది.

"ఇప్పుడొస్తాడు - ఒంటికాలి నృత్యగాడు గడ కఱ్ఱలతో గెంతుతూ"

"ఈసారి బాబూరాయ్ లేడుట, కదా?"

"చూద్దాం, ఎవరొస్తారో."

'మోగా' దగ్గర్లో కూర్చున్న ఆడవాళ్లు కూడబలుక్కుంటున్నారు.

మండపం చుట్టూ స్నేహితులతో తిరుగుతున్న 'దేమూ', అతని ప్రియమిత్రుడితో కలిసి ఆడవాళ్లు కూర్చున్న విభాగంలో 'మోగా' కోసం వెతుకుతున్నాడు. అంతమంది జనం వున్న గర్దీలో 'మోగా' వాళ్లు దాచుకున్నట్లు

కూర్చున్నా, వాళ్ల దృష్టిని తప్పించుకోలేక పోయింది.

"వొరేయ్ 'డామూ', 'దాదీ' గారి వస్తువు యింకా ఎవరూ కొనలేదు. మళ్లీ వో సారి మాట్లాడి చూద్దామా?"

'దేమూ' మిత్రుడు సిగరెట్టు పొగ వదులుతూ అన్నాడు. అది విని 'దేమూ' నములుతున్న ఖారా ఖిల్లీ తుపుక్కున వుమ్మేసి అన్నాడు.

"ఏం లాభం? మాట్లాడదాం రమ్మని యింటికి పిలుస్తాడు. ఆ తరువాత వీలవదని కబురు చేస్తాడు. మళ్లీ కథ మొదటికి వచ్చి, మనం ఈ గట్టుమీదే, యిలాగే కాళ్లు ముడుచుక్కూర్చుంటాం"–

"దేమూ" 'దాదీ' గొంతుక

"ఏమంటారు దాదీ?"

'దాదీ' 'దేమూ'ని వోరకంట చూస్తూ, అతని మిత్రుడితో అన్నాడు.

"మోగాని ఈసారి కూడా జాతరకి తీసుకువచ్చాం."

"మీకు అభ్యంతరం లేకపోతే మంతనాలకి మీ ఇంటికి రామా?"

'దామూ' ఏ దాపరికం లేకుండా తిన్నగా అడిగేశాడు.

"మా ఇంటికి మీరెప్పుడొచ్చినా ఫరవాలేదు. కానీ మంతనాలు యిక్కడే చేయవచ్చు. జాతరంటే కేవలం పాటలూ, నృత్యాల కోసమే కాదు. ఇటువంటి ముచ్చట్లు జాతరలో జరపవచ్చును." దాదీ ఒక అడుగు ముందువేశాడు. 'దేమూ' మిత్రుడు 'దాదీ'కి సిగరెట్టు అందించాడు. చేతిలో చుట్టని మూలకి విసిరేసి 'దాదీ' అతని సిగరెట్టు అందుకుని, దానిని ఆ మిత్రుడి సిగరెట్టుకి తగలించి వూపిరిపీల్చాడు. వాళ్ల సంభాషణకి రంజు వచ్చింది.

ఆడవాళ్ల గుంపులో కూర్చున్న 'మోగా' ఇది గమనించింది. దాదీ, దేమూ, అతని యిష్ట మిత్రుడూ ముగ్గురూ ఏదో మాట్లాడుకోవడం చూసింది. ఆమె వొంటిమీద తేళ్లూ, జెర్రులూ పాకినట్లయింది. గుండెలో బల్లి పాకినట్లయింది!

వేదికమీద ఒక కళాకరుడి ప్రదర్శన పూర్తయింది. పెద్దగా చప్పట్లు, ఆ తరువాత రాబోయే కళాకారుడికి స్వాగతం పలుకుతూ టపాకాయలు పేలాయి. లోకుల వుత్సాహం తారాపథం అందుకుంది. అందరి కళ్లూ వేదికవైపు మళ్లాయి. గడకఱ్ఱలమీద వొంటి కాలి నృత్యం రానున్న కార్యక్రమం. కొత్త కళాకారుడికి స్వాగతం యివ్వడానికి అంతా సిద్ధంగా వున్నారు. 'మోగా' వూపిరి బిగించి, వుత్సకతతో

చూస్తోంది.

"కుంటికాళ్ల కుర్రవాడా
కంటికింపుగా నృత్యగాడా
దేవుడి కరుణే నీకు రక్ష
కాళ్లు లేకున్నా కాదులే శిక్ష"

చప్పట్లు చల్లబడ్డాయి. వాయిద్యాల ధ్వనుల మధ్య వొంటికాలుకి కజ్జ బిగించి, వివిధ రీతుల్లో నృత్యం చేస్తూ, తగిన వేషంతో ముస్తాబైన యువనటుడు వేదికమీదకి దూసుకుంటూ వచ్చాడు. 'మోగా'కి మనఃపూర్వకంగా అనిపించింది. అతను మరొకడు, మరొకడూ కాదు - ముమ్మూర్తులా తన ప్రియుడు 'బాబూరాయే'!

"బాబూరాయ్ కంటే బాగా చేస్తున్నాడు.

'మోగా'కి దగ్గరలో కూర్చున్న ఒకావిడ మరో స్త్రీతో చెబుతోంది. అప్పుడు 'మోగా' భ్రమపోయి, ఈ లోకంలో పడింది.

కొత్త కళాకారుడు మొదటిసారి రంగప్రవేశం చేసినందువలన, ప్రజలు మరింత ఎక్కువ కరతాళ ధ్వనులు చేసి, ఈలలు వేశారు. కొందరు తమ స్థలాలు వదిలి ముందుకు జరిగారు. ఈ అవకాశం తీసుకుని ఖాళీచేసిన జాగా నుంచి నడిచి, 'మోగా' మెల్లిగా జారుకుని చీకట్లో అదృశ్యమయింది. తననెవ్వరూ గమనించలేదని నిశ్చయం చేసుకుని, చీకట్లో వేగంగా నడవసాగింది. ఆమె అడుగులు తోటలోని తటాకంవైపు దారితీశాయి.

ఆయాసంతో, తడబడుతూ చీకట్లో దారి వెతుకుతూ 'మోగా' తటాకం వొడ్డుకి - జాతరలో వాయిద్యాల ధ్వని, కళాకారుల పాటలూ, కరతాళ ధ్వనులూ అక్కడి వరకూ వినిపిస్తున్నాయి. నక్షత్రాల వెలుగులో, తటాకం అంచున ఒంటికాలిమీద నిల్చుని, జాతరలో పాటలకి తాళ, లయబద్ధంగా నృత్యం చేస్తున్నాడు - వొంటరిగా.

ఎడంకాలు కోసి వేయబడడం వలన అతను నిజంగానే కుంటివాడయి పోయాడు. అందువలన అతను నటించే ప్రసక్తి లేదు. అతను కుడికాలు మీద నిలబడి తన తృప్తి, ఆనందం కోసం నర్తిస్తున్నాడు.

హఠాత్తుగా కనిపించిన 'మోగా'ని చూసి తత్తరపాటుతో లయతప్పి, క్రింద తటాకంలో పడబోయాడు. 'మోగా' ఒక్క వుదుటున ముందుకు దూకి అతనిని పట్టుకుంది. పట్టుకుని అతనిని మనస్సు తీరా గాఢంగా హత్తుకుంది. ఇద్దరి కళ్లల్లో

ఆనందబాష్పాలు. జాతర మండపంలో నుంచి పాట వినిపిస్తోంది.

బ్రతుకు బజారులో
ప్రేమ జాతరలో
కుంటివాడికి
కుర్రవాడికి
ప్రేమ ఎలా దొరుకుతుంది?
బ్రతుకు ఎలా ఫలిస్తుంది?



11

# బ్యూటిఫుల్ లేడీ

**- ఎన్. శివదాస్**

జీవిత సాయంత్రాన్ని హత్తుకుని కూర్చున్న ఆ స్త్రీని నేను తదేకంగా చూస్తూ కూర్చున్నాను. ఇంకా ఆమెని లోపలికి పిలవలేదు. తలుపు తెరుచుకునేలోగా, ఆమె వాడి చూపులు తొరతొరగా ఆ ద్వారంవైపు తిరుగుతున్నాయి. నర్సు ఎవరెవరివో పేర్లు పిలవడం, వాళ్ళు లోపలికి (డాక్టరు దగ్గరకి) వెళ్ళడం జరుగుతోంది. నర్సు నన్ను కూడా లోపలికి పిలవాలని నాకనిపిస్తోంది; అలాగే నా ముందు కూర్చున్న ఆ తెల్లని అందమైన వయస్సు మీరిన మహిళకి కూడా అనిపిస్తోంది. ఆమె తల్లడిల్లుతున్న అవస్థ, ఆమె కళ్ళల్లో నిండిన కరుణరసంలో ద్యోతకమవుతోంది.

తలుపు తెరుచుకుంది. నర్సు ఎవరిపేరో పిలిచింది. ఆ వ్యక్తి లోపలికి వెళ్ళాడు.

ఇప్పుడు మరో పావుగంటవరకూ ఆ తలుపు తెరుచుకునే అవకాశం లేదు. లోపల యిద్దరు పేషెంట్లు (రోగులు) ముందే కూర్చుని వున్నారు. నా మనస్సు అకలావికలం అయింది. చేతిలో చదవడానికి ఏ పుస్తకం, పత్రికా లేదు. మనస్సు ఒంటరిగా, చేసేది చూసేదీ ఏమీలేక ఆ నాలుగు గోడల మధ్య కొట్టుమిట్టాడుతోంది. గోడకి ఆనుకుని బల్లమీద కూర్చున్న యితర వృద్ధ రోగులని యథాలాపంగా చూస్తూ చివరికి నా దృష్టి మళ్ళీ ఆ తెల్లని సుందరమైన వృద్ధ వనితమీద వాలింది.

ఆ వృద్ధ వనిత పొడుగ్గా, దృఢంగా వుంది. మెడలో ముడుతలు పడి వున్నాయి. పెదవులు నిస్తేజంగా వున్నాయి; కళ్ళచుట్టూరా లోతుగా వుండి నల్లటి చారలు కనిపిస్తున్నాయి. బుగ్గలు ముడుచుకున్నాయి, లోతుకిపోయి. ఆమె జుత్తు సరిగ్గా దువ్వుకుని వున్నా, ఆమె శిరస్సుమీది తెల్లని చర్మం మధ్య మధ్య కనిపిస్తూ, ఆమె బట్టతలని బట్టబయలు చేస్తున్నాయి, అక్కడక్కడ. ఆమె వయస్సు

దాచుకోడానికి చేస్తున్న ప్రయత్నాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ఆమె చెవులు క్రిందికి వ్రేలాడు తున్నాయి. ఆ చెవుల్లో వున్న దుద్దులలో వజ్రాలు పొదిగి వున్నాయి. మెడలో బంగారు నెక్లసు, వజ్రాలూ, నీలాలూ పొదిగి చేసినది మెరుస్తోంది. ఆమె చాలా ఖరీదైన గౌను వేసుకుంది. గౌను బయట కనిపిస్తున్న ఆమె చెయ్యిమీద ముడుతలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఒక చేతిలో రిస్టువాచీ, బంగారుగొలుసు నాదాతో వుంది. మరోచేతిలో బంగారు గాజులు వున్నాయి. ఇవన్నీ ఆమెవైపు పరుల దృష్టిని ఆకర్షిస్తున్నాయి. ఆమె కాళ్ళు సన్నగా వున్నాయి. ఆ కాళ్ళవేళ్ళు ఒకటి కొకటి అతుక్కున్నట్టు వున్నాయి. నా ఊహ ప్రకారం ఆమె వయసు డెబ్భై అయిదు ఏళ్ళు వుండవచ్చు. ఆమె శిథిలావస్థలో వున్న శరీరం చూసి, నేను కూడా వృద్ధాప్యంలో అలాగౌతానని వొళ్ళు జలదరించింది. కల్పన వాస్తవికత కంటే భయంకరమైనది. మనస్సులో ఆ భయంకరమైన ఆలోచన ఎక్కువకాలం నిలవలేదు. నా మనస్సు మళ్ళీ, ఆ ముసలి వనిత మీదకు మళ్ళింది. మనస్సులోని భావాలు పుంజుకుని పైకి వుబికాయి.

ఇప్పుడామె వయస్సు మళ్ళినది కావచ్చు. కానీ ఆ కాలంలో ఆమె నిస్సందేహంగా అపురూప సౌందర్యవతి అని తెలుస్తోంది. కళ్ళముందు కనిపిస్తున్న ఆ వృద్ధ స్త్రీమూర్తి అదృశ్యమైపోయి ఆమె స్థానంలో తారుణ్యంతో, మిసమిస యౌవ్వనంతో మిటమిట లాడుతున్న సుందర సౌందర్యరాసి నా ముందు సాక్షాత్కరించింది! నేను ఆ 'వృద్ధస్త్రీ' స్థానాన్ని ఆక్రమించిన (నా కల్పనలో) యువతిని కళ్ళు మిటకరించి చూస్తున్నాను. ఆమె ప్రతి అంగాన్నీ, నా కల్పనలో పునర్‌నిర్మించసాగాను. క్షణంసేపు మైకం కమ్మింది. ఆ సమయంలో నా అవస్థని, మిగిలిన వ్యక్తులు గమనించి వుండవచ్చు - నాకు తెలియదు; వాళ్ళకే తెలియాలి. ఆమె మాత్రం ఖచ్చితంగా గమనించింది. తన బంగారు అంచుల మందపు గాజు కళ్ళద్దాల నుంచి చూస్తూ, నా గుండెల్లోంచి ఉవ్వెత్తుగా వుబికి వస్తున్న భావతరంగాల్ని స్పృశించింది. సూచనగా తన మెడలోని మాల మెల్లగా వూపుతూ ఒక చిరునవ్వు విసిరింది. ఆమె మందహాసంతో కట్టుడుపళ్ళు కనిపించి, ఆమె అసలు వయస్సుని జ్ఞప్తికి తెచ్చాయి. ఇక చూడబుద్ధి పుట్టలేదు. ఆమె ఏమనుకుని వుంటుంది? ఛీ - ఇలా అవకుండా వుండవలసింది. నేను నా లక్ష్యం మరోచోటికి మార్చవలసింది, లేకపోతే కుర్చీమీద నుంచి లేచి బయటకి వెళ్ళవలసింది. నిజానికి డాక్టరుని

చూడ్డానికి వచ్చినవాళ్ళు చాలామంది ఉన్నారు. అందులో ఎందరో స్త్రీలు, ఈ వృద్ధ మహిళ కంటే వయసులో ఎంతో చిన్నవాళ్ళు, తరుణులు వున్నారు. కానీ నా దృష్టి వాళ్ళమీదికి వెళ్ళలేదు. వెళ్ళినా అలా యధాలాపంగానే గాని నిలకడగా ఈ స్త్రీని చూసినట్లుగాదు. ఇంతలో జనం మధ్యనించి ఆ తెల్లని అందమైన వృద్ధ వనిత నిలబడడం చూశాను - ఆమె అస్తమిస్తున్న అందం వెనక నవనవలాడిన యవ్వనపు ఛాయలు కనిపించాయి. "ఆవే మారియా ద కోస్తా" నర్సు తలుపు తీసి లిస్టుచూసి జనంకేసి అరిచింది. నా ఎదురు కుర్చీ ఖాళీ అయింది. ఆమె లేచి నిదానంగా, దర్జాగా లోపలికి వెళ్ళింది. లోపలికి వెళ్తూండగా, నర్సు ఆమెకి ఆధారం యిచ్చింది. అస్తమిస్తున్న సూర్యుడు కొండలవెనక మాయమవుతున్నట్లో, సముద్రపుటంచుల్లో మునిగిపోతున్నట్లో మెల్లమెల్లగా మాయమయినట్లు నర్సు తెరిచి మూసిన తలుపు సందుల్లోకి ఆమె వెళ్ళి అదృశ్యమయింది.

ఆమె లోపలికి వెళ్ళడంతో నాకొక పెద్ద సమస్య, బరువు తీరినట్లు అయింది. అప్పుడు చుట్టూ చూసే ధైర్యం నాకు లేకపోయింది. ఏదో దొంగిలించినట్లు, ఏదో తప్పుచేసినట్లు అనిపించింది.

చాలాసేపటికి నేను స్థిమితపడ్డాను. ఇప్పుడు నాకు చుట్టుపక్కల కూర్చున్న జనం కనబడసాగారు. ఆమె కుర్చీ ఖాళీగానే వుంది. బయట చాలామంది జనం నిలబడివున్నారు. అయినా ఎవరూ వచ్చి ఆ కుర్చీలో కూర్చోలేదు. ఎవరైనా కూర్చుంటే బాగుంటుందని నా కనిపించింది. నేను బయట తలుపుదగ్గర నిల్చున్న జనంకేసి చూసి సంజ్ఞలతోనే సూచించాను - లోపల ఖాళీ కుర్చీవుందని. అయినా అందులో కూర్చోడానికి ఎవ్వరూ లేరని సంజ్ఞలద్వారానే జవాబిచ్చారు. నా పేరు ఈవేళ మరి వచ్చే అవకాశం లేదని నిశ్చయించి, నేనూ నా జాగా వదిలి బయటకొచ్చాను. బయట నిలబడ్డ జనంలో ఎవరైనా తెలిసినవాళ్ళు తగులుతారేమోనని చూశాను. ఎవ్వరూ వున్నట్టులేరు. అయితే స్కూటరుకి ఆనుకొని, డాక్టర్ని కలవాలని వచ్చిన ఒక మెడికల్ రిప్రజెంటేటివ్ (మందులు తయారుచేసే కంపెనీ ప్రతినిధి) నన్ను గుర్తించినట్లు చూసి నవ్వాడు. అతని నవ్వు నాకా సమయంలో ఎంతో ప్రసన్నత నిచ్చింది. నా మనస్సు కాస్త కుదుటపడుతుందని, యిదివరకు రేగిన తుఫాను పూర్తిగా పోయి శాంతి దొరుకుతుందని, నా మనస్సు మరో విషయాలకి మళ్ళుతుందని, అతని దగ్గరకి వెళ్ళాను.

"రోగులందరూ వెళ్ళిపోయేవరకూ నాకు డాక్టరుగారు దర్శనం యివ్వరు" అతను నవ్వుతూ అన్నాడు.

"లోపల కుర్చీ ఖాళీగా వుంది. వెళ్ళి కూర్చోవచ్చు" నేను అన్నాను.

"నాకు తెలుసు. ఇప్పుడే తలుపులోంచి చూశాను. కానీ ఆ కుర్చీ ఆమెది."

"ఆమె కుర్చీ" అతని వాక్యం పూర్తికాకుండానే, మళ్ళీ నా మనఃఫలకంలో ఆమె రూపం సాక్షాత్కరించింది. మళ్ళీ ఆ ఆలోచనలు. మళ్ళీ ఆ తుఫాను ఛాయలు, నల్లమబ్బులు వస్తున్నాయి!

"ఆమె ఎవరు?" నేను ఉత్సుకతతో అడిగాను.

"జడ్జి (న్యాయమూర్తి)గారి భార్య - పెద్ద శ్రీమంతురాలు."

"ఆమెని చాలామంది గుర్తుపడతారు కదూ?"

"ఒక కాలంలో ఆమే రాజ్యం ఏలింది."

"అంటే?"

"రాజ్యం ఏలిందీ అంటే, పోర్చుగీసు గవర్నర్ని సహితం వేళ్ళమీద నృత్యం చేయించింది."

"అంతదా ఆమె ఘనత?"

"షీ వాజ్ మోస్ట్ బ్యూటిఫుల్ లేడీ (ఆమె ఆ కాలంలో అత్యంత సౌందర్యవతి)"

అతను చెప్పిన విధం ఎలాగుందంటే, అతనే స్వయాన ఆమె ఈనాటి సౌందర్యాన్ని చూసినట్లు. కానీ అతనూ నా వయస్సువాడేలా కనిపిస్తున్నాడు. నేను నవ్వుతూ అన్నాను :

"ఆమె అందం స్వయంగా చూసినట్లే మాట్లాడుతున్నారు మీరు."

"ఆమె ప్రఖ్యాతి గాంచింది. మొత్తం 'మడ్గావ్' ('గోవా'లో పెద్ద పట్టణం). అంతా తెలుసు. మీరు ఈ వూరివారు కాదు. అందుకే మీకు తెలియదు."

"జడ్జిగారి భార్య. సౌందర్యరాశి, శ్రీమంతురాలు. ఇన్ని విశేషాలున్నా డాక్టరుగారిని కలవడానికి కన్సల్టింగ్ రూంకి స్వయంగా రావలసివచ్చింది! నిజం చెప్పాలంటే డాక్టరుగారినే ఆమె తన యింటికి రప్పించుకోవడం భావ్యంకదూ?" ఈ నా ప్రశ్న నా మనస్సులోనే వుండిపోయింది. తెరిచిన తలుపు ద్వారం నుంచి ఆమె రాజహంసలా బయటకొస్తోంది - అది చూసి నా మనస్సు మళ్ళీ అతలాకుతలం

అయింది. నా అధీనం తప్పింది. నేను మూగవాణ్ణయిపోయాను. త్వరత్వరగా కొట్టుకుంటున్న నా గుండె చప్పుడు, నాకే స్పష్టంగా వినిపిస్తోంది!

తలుపు తీసి వస్తూవుంటే ఆమె కాళ్ళు తడబడుతున్నాయి. చేతిలోని గొడుగు, పర్సు సర్దుకుంటూ ఆమె గుమ్మం దిగుతోంది. ఎవరైనా ముందుకి వచ్చి తనకి సహాయపడతారేమోనని ఆమె అపేక్షించింది. ఆ ఆశతో ఆమె మెట్లు దిగేముందు, కాస్త కంపించుతూ ముందుకు చూసింది. నేను తటపటాయించాను. ముందుకెళ్ళి ఆమెకి సహాయపడాలనే ఆలోచన వచ్చింది. ఆమె దిగుతూ కిందకి తూలుతున్నట్లు కనిపించి, నేను వెంటనే ముందూ, వెనకా ఆలోచించకుండా దూసుకుపోయి ఆమె చెయ్యిని అందుకొన్నాను. ఆమె చేతిలో నా చెయ్యి వేసి ఆదరంగా అడుగులు ముందుకి వేసి నడిచాను. ఆమె మందహాసంతో "ఓబ్రిగాద్" (పోర్చుగీసు భాషలో 'ధన్యవాదాలు' అని) అంది, కృతజ్ఞత వ్యక్తపరుస్తూ.

"ఇదిగో - ఇలా రండి" అంటూ ఆమెని నేను చదునుగావున్న నేలమీదికి దారిచూపిస్తూ నడిపించాను.

ఆమె కారు బయట నిలబడి వుండవచ్చని భావించి, నేను అన్నాను.

"మిమ్మల్ని కారుదాకా సాగనంపుతాను."

"లేదు నాయనా. నేను కార్లో రాలేదు. నడిచే వచ్చాను. మా ఇల్లు చర్చికి దగ్గరేవుంది."

ఆమె యింటికి వొంటరిగానే నడిచి వెళ్తుందని తెలిసి, నేను చెయ్యి వదిలి దారియిస్తూ, పక్కకి జరిగాను.

రెండడుగులు ముందుకు నడిచి, ఆగి నాకేసి తిరిగి అంది :

"'సింజ్‌యోర్' (పోర్చుగీసు భాషలో "మీకు కాస్త వీలుంటే నాతోకూడా వస్తారా?") ఆమె మృదువుగా, ప్రేమగా చేసిన మనవిని కాదనలేకపోయాను. నిజానికి నా పేరు వచ్చే సమయం దగ్గరపడింది. నేను డాక్టర్ని కలవడం ముఖ్యం. నేను అప్రయత్నంగా ఆమెతోబాటూ నడవసాగాను. చాలాసేపు నడిచిం తరువాత ఒక పెద్ద భవనం యొక్క ప్రాంగణంలో ప్రవేశించాం.

పూర్వపు పద్ధతిలో కట్టిన పెద్ద యిల్లు. నేను యిటువైపు వొచ్చినప్పుడు చాలాసార్లు యిదివరకు చూశాను. కళ్ళకి కొట్టొచ్చేటంత ప్రశస్తమైన భవనం. ఇంటిముందు ప్రాంగణంలో ఒకప్పుడు పెద్ద గార్డెన్ (పూలతోట) పెంచేవారని

గుర్తులు చెబుతున్నాయి. తోటలో అమర్చిన పెద్ద ఉక్కు ఉయ్యాల గొలుసులు తుప్పుపట్టాయి. ఆ గొలుసులు పక్కస్తంభానికి చుట్టారు - ఆ ఉయ్యాల ఉపయోగంలో లేదనే సూచనగా. తోటలో చెట్లు చాలావరకు ఎండిపోయాయి. కొన్ని లతలు మాత్రం కొనవూపిరితో నిలబడ్డాయి, చెట్లనీ తుప్పలనీ చుట్టుకుని. పూలచెట్లు నాటడానికి చేసిన ప్రత్యేక కట్టడాలూ, ఏర్పాట్లూ యిప్పుడు పాడుబడిన కోటల ప్రాంగణాలని గుర్తుచేస్తున్నాయి. ఆ వృద్ధురాలులాగే, ఆ తోట కూడా గతించిన వైభవానికి ఒక గుర్తు!

అందమైన పూల, అందమైన తోటకి అందమైన యజమానురాలు! ఈ ఆలోచన మనస్సులో రాగానే సుందరనందనవనాలు, సుందరీమణుల సంచారం వలనా, స్పర్శవల్లనే పుష్పించి స్పందిస్తాయన్న నిజం తెలిసింది.

మేము వసారాలోకి చేరగానే లోపల్నించి ఒక గౌను తొడుక్కునున్న నలుపు స్త్రీ బయటకి వచ్చింది. ఇంట్లోని నౌకరు అయివుంటుంది అని నేను భావించాను.

"ఆలశ్యం అయిందమ్మా" ఆ పనిమనిషి అంది. ఆమె నాకేసి చూసి, అలవాటు ప్రకారం పోర్చుగీసు భాషలో 'వెంజ్' అని, మళ్ళీ వెంటనే తన తప్పు తెలుసుకున్నట్లు కొంకణీలో 'కూర్చోండి' అంది. అలా అంటూనే తనూ ఒక కుర్చీలో కూలబడింది. ఆమె కూర్చున్నది వాలుకుర్చీ - ఆమె రోజూ అలవాటుగా కూర్చునేదని స్పష్టమయింది. ఆ వసారాలోని యితర కుర్చీలలో మందంగా పేరుకున్న దుమ్మువలన, ఆ కుర్చీలని చాలాకాలంగా ఎవరూ వాడలేదనీ, ఎవరూ కూర్చోలేదనీ తెలుస్తోంది. గోడలమీద ఆ యింటి పెద్దలవీ, పూర్వీకులవీ చిత్రాలు (ఫోటోలు) వేళ్ళాడుతున్నాయి. నా దృష్టి నలువైపులా వున్న ఫోటోలని ఒక్కొక్కటే చూస్తూ, చూస్తూ హఠాత్తుగా ఒక ఫోటో దగ్గర ఆగింది.

ఆ ఫోటోలోని అపురూప సౌందర్యవతిని చూసి నేను స్తంభించిపోయాను.

"అది నా ఫోటో" అని ఆమె మెల్లిగా, గర్వంగా అంది, నా దృష్టి ఆ ఫోటోమీదే కేంద్రీకరించడం (బహుశా) చూసి.

"అపూర్వ సౌందర్యం! అద్భుతం! అమోఘం!" నేను ఉత్సాహం పట్టలేక అని, ఆమె కళ్ళని సూటిగా చూశాను. ఆమె చాలా పొంగిపోయింది, ఆనందంతో. ఆమె ముఖం ముద్దగులాబీలా వికసించింది. ఆమె ఎంత సంతోషించిందంటే, ఏదో కొత్త శక్తి శరీరంలో ప్రవేశించినట్లు, తన వాలుకుర్చీనుంచి ఠక్కున లేచి ఒక్క

ఉదుటున నాదగ్గరకి వచ్చి నా చెయ్యి పట్టుకుని ప్రేమతో, ఉద్వేగంతో అంది -

"రండి - నా గదిలోకి రండి. నా ఫొటోల ఆల్బమ్ చూపిస్తాను."

నాకు ఏదోలా అనిపించి, అన్నాను, "వద్దు. ఉండనివ్వండి. నేను వెళ్ళాలి త్వరగా. నా పేరు పిలుస్తారు."

"అలా కాదు 'సింజ్యేర్'. వచ్చి చూడండి. నేను మీరు డాక్టరు దగ్గర కూర్చుని వున్నప్పుడు గమనించాను. మీరు నన్నే తదేకంగా చూస్తూ ఏదో ఆలోచనల్లో పడ్డారు. ఆ ఆలోచన లేమిటో నాకు తెలియదంటారా? నేను ముసల్దాన్నయ్యాను నిజమే. నా ఈ శరీరం పట్టుతగ్గి వొదులయిపోయింది నిజమే. అలాగని నా హృదయం కూడా ముసల్దయిందని అనుకోకండి. అది యిప్పటికీ తాజాగా నవనవలాడుతోంది. నాకు నా గత వైభవం గుర్తుకొచ్చింది. అదీ మీ పదుచుచూపులవల్ల. మీరెవరో సౌందర్య పిపాసులయి వుంటారు. మీరు నన్ను చూసి ఏమనుకున్నారో నాకు బాగా తెలుసు. అందువలన, నేను నా జీవితంలోని మధురస్మృతులు - ఏవైతే నేను నా ఫొటో ఆల్బమ్‌లో భద్రపరిచానో - అవి మీకు చూపిస్తాను. ఈ రోజు మీకివ్వడానికి నా దగ్గర ఏమీ లేదు. కానీ ఒకప్పుడు యిక్కడ ఎంత ఘనంగా విందులూ, వినోదాలూ జరిగేవో, ఎంత వైభవంగా వుండేదో వర్ణించలేను."

"ఒద్దు. నాకేం చూపించవద్దు. నేను వెళ్ళాలి."

"మీరు కంగారుపడవద్దు - మీ మనస్సులో ఆలోచనలు నాకు తెలిశాయని" ఆమె నన్ను చెయ్యిపట్టుకు లేపింది. నేను మౌనంగా ఆమెతోబాటు ఆమె శయనమందిరం (బెడ్‌రూం)లోకి వెళ్ళాను.

అక్కడ అద్దాలతో చక్కగా అలంకరించిన పెద్ద మంచం కనిపించింది. తలుపుకి వున్న పరదాలు చిరిగాయి. గోడమీద ఏసుక్రీస్తు ప్రభువు 'లాస్ట్ సప్పర్' చిత్రపటం వేళ్ళాడుతోంది. లోకప్పులో వేళ్ళాడుతున్న 'షాండెలియర్' (గాజు దీపస్తంభం) బూజులు పట్టి వుంది.

"కూర్చోండి" ఆమె ఒక చక్కటి కుర్చీమీద నన్ను కూర్చోమని సంజ్ఞ చేసింది. అల్మరా దగ్గరకి వెళ్ళి, నిదానంగా అల్మరా తెరిచి సొరుగులో ఒక పెద్ద కవరులో భద్రపరచిన రెండు పెద్ద ఆల్బమ్‌లు బయటికి తీసింది. ఆ ఆల్బమ్‌లు జాగ్రత్తగా తెచ్చి నాముందుకి వచ్చింది.

"ఇదీ నా జీవితం - సంక్షిప్తంగా" అంటూ. ఆ పెద్ద రెండు ఆల్బమ్‌లూ నా వొడిలో వుంచింది. అవి చక్కటి లేసుబట్టతో, పరిమళం చిమ్ముతూ చాలా ఆకర్షణీయంగా వున్నాయి. ఉత్సుకతతో ఆ ఆల్బమ్ చూడాలని నా మనస్సు ఉవ్విళ్ళూరుతోంది. డాక్టరుని రేపు కలుద్దాంలే, అని మనస్సులో నిశ్చయించి, ఆ ఆల్బమ్‌లు చూడసాగాను. మొదటి ఆల్బమ్‌లో మొదటి పుటలో పోర్చుగీసు భాషలో ఏదో వ్రాసివుంది. మొదటి పుటే ఎంతో మనోహరంగా వుంది. ఒక్కొక్క ఫోటోని కళ్ళతో నెమ్మది, నెమ్మదిగా ఆస్వాదిస్తున్నాను. ఏదో మత్తు, ఏదో నిద్ర నన్ను కమ్ముకున్నట్లుంది. నేను అమితానందంతో ఆ ఫోటోలు చూడడం ఆమెకి చాలా ముచ్చటేసింది. ఆమె నా దగ్గరకొచ్చి, నా కుర్చీపక్కన ఆనుకొని నిల్చుంది.

ఆల్బమ్‌లో ఆమె ఫోటోలు వివిధ భంగిమలలో వున్నాయి. కన్నెరికపు తొలిదినాలలోని ఫోటోలు, యవ్వనపు పొంగులు, పెళ్ళి ఫోటోలూ, 'హనిమూన్' - వివాహానంతరం విహారాలకి వెళ్ళినప్పటి ఫోటోలూ, పార్టీలూ, పిక్‌నిక్‌లు, ఇంట్లో, తోటల్లో, సముద్రపు తీరాలలో, కొబ్బరితోటల్లో - యిలా వేరేవేరే ప్రదేశాల్లో వేరే వేరే పద్ధతుల్లో - కోణాల్లో తీసిన ఫోటోలూ వున్నాయి. అవి అన్నీ ఒక క్రమంలో. తీసిన తేదీల ప్రకారం అతికించబడ్డాయి.

నేను ఒక ఆల్బమ్ చూడడం పూర్తిచేసి తృప్తిగా కిందపెట్టాను.

"ఇప్పుడు ఈ ఆల్బం చూడండి" ఆమె రెండవ ఆల్బం తీసి నా చేతుల్లో పెట్టి అంది - "ఈ ఆల్బం ఈ రోజు వరకూ ఎవ్వరికీ చూపించలేదు అంటే నమ్మండి. ఇది చాలా ప్రత్యేకమైనది - చాలా విశేషమైనది" అని అంటూ ఆమె నా కుర్చీ వెనక నిలబడింది.

ఆల్బంలో అన్నీ ఆమె ఫోటోలు - ఒక దానిని మించి మరొకటి! ఇది చూద్దామా అది చూద్దామా అని అయోమయ అవస్థలో నేను పడ్డాను. ఇటువంటి దిగ్భ్రాంతి కలిగించే అందమైన ఫోటోలు నేను ఈ జన్మలో చూడలేదు. ప్రపంచంలోని అత్యంత సుందరీమణులను నేను ప్రత్యక్షంగా చూస్తున్నానని అనిపించింది. ఆమె ప్రతీ అవయవాన్నీ ప్రస్ఫుటంగా చూపిస్తూ, వేరే వేరే ప్రత్యేక ఫోటోలు వున్నాయి. ఒక ఫోటోలో ఆమె పాదాల అరికాలి భాగం చూపిస్తే, మరో ఫోటోలో ఆమె నడుం భాగం 'ఫోకస్' చేసి (ఎక్కువ కాంతిలో) ప్రస్ఫుటంగా చూపించారు. మరోచోట బొడ్డు, కళ్ళు, చేతులూ వగైరా, వగైరా. ఇలా ప్రతి అవయవాన్ని, వాటి అందాల్నీ

'కెమేరా'లో బంధించి ప్రదర్శించే ఫోటోలు నేను ఎప్పుడూ చూడలేదు. ఇదే ప్రథమం. అసలు విషయమేమంటే నాకు మతిపోయింది. తలంతా నిషా ఎక్కి తల తిరగసాగింది. కేవలం ఆ వివిధ కోణాల్లో తీసిన ఆమె అంగాంగపు చిత్రాలు - ఫోజులు - ఆమె దేహం ఆసాంతం - నా శరీరం మీద ప్రవహిస్తున్నట్లు, నన్ను ఆనందతరంగాలలో ముంచెత్తుతున్నట్లూ నాకనిపించింది. మరో ఫోటో చూడగానే నేను ఖిన్నుడనై పూర్తిగా పట్టుతప్పిపోయాను. నా నరనరాల్లో ప్రణయాగ్ని కాంక్షలు రగులుకొని లావాలా ప్రవహించాయి. నా గుండెల్లో సూర్యుడు దయించినట్లయింది - ఆమె - ఆ ఫోటోలోని నవయవ్వన తారుణ్యమూర్తి - నగ్నసుందరి - ఆహ్వానపు మందహాసంతో రక్తసిక్తాలతో నా ముందు ప్రాణం పోసుకునిలబడింది. కళ్ళముందు తలుపు మీది చిరిగిన పరదా కదులుతూ ఎవరో స్త్రీ నెమలి ఈకెతో నన్ను స్పృశించి, కితకితలు పెట్టి కవ్విస్తున్నట్టు అనిపించింది. నెత్తిమీద లోకప్పులో వేళ్ళాడుతున్న గాజుదీపస్తంభాలు, ఒకటి కొకటి తగిలి 'జలతరంగ్' (ఒక వాయిద్యం) వాయించినట్లు శబ్దం వచ్చి ఆ 'మహల్'లాంటి ఇంటినిండా సంగీతం ధ్వనించింది. నేను చూస్తూ, చూస్తూ, ఆలోచిస్తూ వుండగానే, ఆ ఫోటోలోని జవ్వని, మదన మంజరి, సంపూర్ణ యవ్వనంలో మిటమిటలాడుతున్న నారి నా దగ్గరకి రహస్యంగా, నిశ్శబ్దంగా వచ్చింది. నా ఆవేశం ఆపుకోలేకపోయాను. నా మనోవికారం హద్దులు దాటింది! నేనామెని గట్టిగా కౌగలించుకుని, నా సర్వశక్తులూ ధారపోసి ఆమెతో రాసక్రీడలో పాల్గొన్నాను. ప్రణయసౌఖ్యం యిచ్చి, పుచ్చుకున్నాము.

చాలా సేపటికి కామతృష్ణ చల్లారి, మంటలు తగ్గాయి. నీళ్ళగ్లాసు పట్టుకు ఆమె నా ముందు నిలబడింది. ఆమె చేతిలో గ్లాసు కిందపడి ముక్కలవవచ్చనే భయంతో నేను త్వరత్వరగా ఆ గ్లాసు అందుకుని పెదాలకి తగిలించాను. తుఫాను శాంతించింది. నేను చుట్టూ పరిశీలించాను. అన్నీ మొదట వున్నట్టే వున్నాయి. ఆ చిరిగిన కిటికీ తలుపుల పరదాలు ముందున్నట్టే వున్నాయి. నెత్తిమీద లోకప్పుకి వేళ్ళాడుతున్న గాజుదీపస్తంభాలు స్థిరంగా నా కుర్చీ వెనక, పక్కపైన కనిపించాయి. వాటిలోనూ ఏ చలనం లేదు.

నేను చాలా సిగ్గూ, బిడియంలో మునిగిపోయాను. నా మొహం నేనే అద్దంలో చూడడానికి సిగ్గుపడ్డాను. ఈ పెద్ద రాజసౌధంలో ప్రవేశించి ఏదో దొంగతనం చేసినట్టు మనస్సు కొట్టుమిట్టులాడింది. హడావిడిగా చేతిలోని ఆ ఆల్బమ్‌లు అక్కడే పెట్టి,

ఆ బ్యూటిఫుల్ లేడీ (అందమైన స్త్రీ) శృంగార శయనమందిరంలోనించి, ఒక మలయ మారుతంలా బయటపడ్డాను. బయటి ద్వారం చేరుకోగానే అస్పష్టంగా ఆమె గొంతుక వినబడింది; "ఓ బ్రిగాద్, ఓ బ్రిగాద్!" (పోర్చుగీసు భాషలో ధన్యవాదాలు.) అని.



## 12

# అంగవస్త్రం

**- జయమాలా దణాయత్**

"ఈవేళ ఏమయిందీ మీకు? పూర్తిగా విసిగివేసారినట్లు కనిపిస్తున్నారు?"

వాత్సల్యంతో కూడిన మృదుల స్వరంతో 'మోగ' అడిగింది.

"అన్ని సంగతులూ మీ లంజల కెందుకూ?" 'వాసుబాబు' స్వరంలో విషం కలుపుతూ వ్యంగ్యంగా జవాబిచ్చాడు. ఆ మాటల్తో ఆమె నాజూకు మనస్సు చివుక్కుమంది. కళ్ళల్లోంచి రెండు అశ్రువులు చెక్కిళ్ళమీదుగా జారాయి. కానీ క్షణాలలో ఆమె తమాయించుకుంది. 'వాసుబాబు' ముడుచుకు చిన్నబోయిన మొహం చూసి ఆమెకి ఎంతో జాలేసింది.

"నేను ఉబుసుపోకకి అంటున్నానని అనుకోకండి. మీ మనస్థితి ఈవేళ బాగులేదు. నేను ఏం చేస్తే మీరు మళ్ళీ మామూలుగా నవ్వుతూ, సంతోషంగా అవుతారు? చెప్పండి. పాట పాడనా? హార్మణీ వాయించనా? నృత్యం చెయ్యనా?" 'మోగ' వాత్సల్యంతో బుజ్జగిస్తూ, బతిమాలుతూ అడుగుతోంది. 'వాసుబాబు' మౌనంగానే ఆమె సూచనలన్నీ తిరస్కరించి, మళ్ళీ నెత్తిమీద చెయ్యేసుకుని చతికిలబడ్డాడు. 'మోగా'కి అతని అవస్థ చూడబుద్ధికాలేదు. రోజూ నవ్వుతూ, ఉత్సాహంతో ఉరకలు వేసే 'వాసుబాబు' ఈవేళ అదృశ్యం అయిపోయాడు. అతనికేం చేయాలో ఆమెకి బొత్తిగా అర్థమవలేదు. అయినా ధైర్యం తెచ్చుకుని దగ్గరకి వెళ్ళి అడిగింది. "మీకు తలనొప్పిగా వుందా? ఏదైనా మాత్ర యివ్వనా?" నెమ్మదిగా, మృదువుగా అడిగింది.

"నెప్పిగా వుంది. తల బద్దలయ్యేలా వుంది" నెత్తిమీద చెయ్యేసి, నీరసంగా 'వాసుబాబు' అన్నాడు.

"అలా బాధపడకండి. కాస్త యిక్కడ మేను వాల్చి విశ్రమించండి. నే నిప్పుడే

లోపలికెళ్ళి వస్తాను.''

అతన్ని పక్కమీద పడుకోబెట్టి 'మోగా' తొరతొరగా లోపలికెళ్ళింది. 'స్టౌ' (Stove) మీద పాలు కాచి, గూటం రాయిమీద కాస్త శొంఠి గింజెల్ని నూరి, రెండు తలనొప్పి మాత్రలూ, గ్లాసు మంచినీళ్ళూ చేతిలో పట్టుకుని ఆమె గబగబా మళ్ళీ వచ్చింది.

'మోగా' తొరతొరగా అతని తలకి శొంఠి ముద్ద వేసింది. అతనికి ఆ మాత్రలు మింగడానికి యిచ్చి, మంచి నీళ్ళు తాగించింది. అతనికి పాలగ్లాసు యిచ్చి బలవంతాన్న తాగమని చెప్పి, అతని కాళ్ళదగ్గర కూర్చుని, కాళ్ళు వొత్తసాగింది. ఎప్పుడూ 'మోగా' సుందర వదనాన్నే చూసే 'వాసుబాబు'కి ఆమె సుందర మనస్సు ఈవేళ తెలిసొచ్చింది. అతని కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. 'మోగా'కి అతని మీద సూక్ష్మదృష్టి వుంది. లేచి అతని దగ్గరకి వచ్చింది. చీర కొంగుతో అతని కళ్ళు తుడిచి, వాత్సల్యంతో అతని జుత్తు నిమరసాగింది.

'''మోగా' నన్ను క్షమించు. నేను యిందాకా నిన్ను వూరికే ఏదో మాట అన్నాను.''

'మోగా' చేతులు, తన చేతుల్లో తీసుకుని 'వాసుబాబు' ఆర్ద్రంగా అన్నాడు.

''చీ! ఎవర్ని క్షమించమని అడుగుతున్నారు మీరు? నాకు నిజంగా ఏమీ బాధ అనిపించలేదు. నిజం చెప్పినప్పుడు అందులో బాధపడవలసిం దేమిటీ?'' అతని పెదవులమీద తన చెయ్యి వేసి ఆమె అంది.

''కాదమ్మా! 'మోగా', నేను తప్పు చేశాను. నా మనఃస్థితి నిలకడలోలేదు. నాకు దురద ఒకవైపూ, నేను గోక్కుంటున్నది మరోవైపు!''

''ఆ సంగతి యింక వదిలెయ్యండి! అవును - నిజమే. ఈవేళ మీరు మామూలుగా లేరు. అసలు సమస్య ఏమిటో - అభ్యంతరం లేకపోతే - నాకు చెప్పండి చూద్దాం. నాకు వీలైతే నేనూ మీకు తోడ్పడతాను. చెప్పండి.''

'మోగా' మనఃపూర్వకంగా అడిగింది.

''సహాయమా? ఎక్కడ సహాయం దొరుకుతుందని దృఢంగా ఆశించానో అక్కడ చుక్కెదురయింది. మరిప్పుడు నీదగ్గర ఏమని సహాయం అడగనూ?'' నిస్సహాయంగా, నీరసంగా నవ్వుతూ 'వాసుబాబు' అన్నాడు.

''అలా అనకండి! నన్ను తేలిక కట్టకండి. మీకేదైనా మంచి జరగడానికి

నేను ప్రాణాలు కూడా యివ్వడానికి సిద్ధంగా వున్నాను. లంకకి వారధి కట్టడంలో ఒక ఉడత కూడా సహాయం చేసిందని జ్ఞప్తికి వుంచుకోండి'' 'మోగా' మెల్లిగా చెప్పింది.

''మోగా, నా మోగా, నిజంగా ఎంత చక్కగా మాట్లాడతావమ్మా నువ్వు. వింటేనే గుండె నిబ్బరం వస్తుంది. కానీ ఎలా ఎక్కడ నేను యివ్వవలసి వుందో, అక్కడే చెయ్యి చాచి ఎలా అడగనూ?'' వీలవదా పని, నావల్ల ససేమిరా వీలవదు.''

'వాసుబాబు' మళ్ళీ నెత్తిమీదికి చెయ్యి పోనిచ్చాడు.

''అలా ఎందుకు చేస్తారూ? ఇక్కడ - ఇటు చూడండి, 'శాంతదుర్గ' పటం! కుడిచేత్తో మనకి ఆ దేవి ఆశీర్వాదం యిస్తుంది. ఎడమ చేత్తో మనని 'భక్తి, శ్రద్ధలు కోరుతుంది కాబోలు) ఏదో అడుగుతుంది యిమ్మని! ఈవేళ కాదు - ఎప్పుడు నేనీ ఫోటో చూసినా ఈ ఆలోచన నా మనస్సులో వస్తుంది. ఆ దేవికే అడగడానికి బిడియంలేనప్పుడు, మీరు నా సహాయం అడగడాని కెందుకు తటపటాయిస్తారూ? చెప్పండి...చెప్పండి... చెప్పకపోతే వొట్టు నామీద.''

'మోగా' మనఃపూర్వకంగా అన్న ఈ మాటలు విని 'వాసుబాబు' కాసేపు వూరికే మాట్లాడకుండా కూర్చున్నాడు. తరువాత మెల్లిగా లేచి కూర్చున్నాడు. రెండు చేతుల్తోనూ మొహం కప్పుకుని చెప్పడం మొదలెట్టాడు. ''మోగా! ఈవేళ నేను పూర్తిగా దివాలా ఎత్తాను. మరో రెండు రోజుల్లో నేను ఋణం తీర్చకపోతే షావుకారు నా దుకాణంమీద పడి జప్తు చేస్తాడు. అందరికీ 'టాంటాం' చేస్తాడు. నా పరువు పోతుంది. నేను బజారున పడ్తాను. నన్ను మళ్ళీ ఎవ్వరూ నమ్మరు. ఏం చేయాలో గోచరించడంలేదు. నా అన్నవాళ్ళకోసం, వాళ్ళ సుఖంకోసం నేనింత చేశాను. ఇప్పుడు వాళ్ళే నన్ను నట్టేట్లో ముంచి వెళ్ళిపోయారు! తక్కువ కాదు. నా నెత్తిమీద వేలలో అప్పులున్నాయి.''

''కాస్త ఆగండి.''

ఇంతసేపూ ఓపిగ్గా, దీక్షగా అతని మాటలు వింటున్న 'మోగా' గబుక్కున లోపలికి వెళ్ళింది - ఏదో దృఢ నిశ్చయానికి వచ్చినదానిలా. 'వాసుబాబు' అత్యంత ఆశ్చర్యంతో చూస్తున్నాడు. ఆమె 'అల్మారా' దగ్గరకి వెళ్ళింది. నడుందగ్గరి తాళాలగుత్తి తీసి, 'అల్మారా' తెరిచింది. చీర దొంతర్ల మధ్య దాచిన ఒక చందనంపెట్టె తీసి పట్టుకుని, మళ్ళీ తిరిగి వచ్చింది - వాసుబాబు దగ్గరకి.

"ఇది తీసుకోండి" ఆమె ఆ డబ్బా అతనికి అందించింది.

"ఏమిటదీ?" 'వాసుబాబు' ఆశ్చర్యంగా అడిగాడు. 'మోగా' మౌనంగా ఆ పెట్టె తెరిచి, అతని ముందు వుంచింది. ఆ తరువాత చెప్పింది :

"మా అమ్మ నాకోసం వుంచిన నగలు. ఇవిగాక నా దగ్గర కొంత డబ్బు కూడా వుంది. చూడండి మీ అవసరం తీరుతుందేమో."

'వాసుబాబు' తెరిచిననోరు, ఆశ్చర్యంతో అలాగే వుండిపోయింది. దృష్టి చేతిలోని పెట్టెమీద పడగానే నిన్నటి సంగతి గుర్తుకొచ్చింది. నిన్న తప్పక సహాయం లభిస్తుందని అనుకొని వెళ్ళిన ప్రతీచోటా నిరాశ ఎదురై, నీరసంగా ఖిన్నమనస్కుడై యింటికి తిరిగి వచ్చాడు. ఇంటికి రావడంతోనే భార్య ఎవరో సవితి చెల్లెలు పెళ్ళికి వెళ్ళాలిట, అందుకు కొత్త శాలువ కొని తీసుకురమ్మని హఠం చేసింది. ఎప్పుడూ కోపగించుకోని 'వాసుబాబు' మండిపడ్డాడు. అయితే అతని భార్యకి కూడా అతని మీద కోపం వచ్చింది. కారణం రాత్రి అతను ఆమె గదిలోకి వచ్చి దగ్గర కూర్చోబెట్టుకుని తన స్థితిగతులు ఆమెకి వివరించి చెప్పి, చివరికి ఆమె నగలు తాకట్టు పెట్టడానికి కావాలన్నాడు. ఆమె అతని మీద మండిపడి గట్టిగా అరిచింది "ఆఁ ఆఁ బలే అడిగారు - నా నగలు కావాలట! అవి నా స్త్రీధనం. నన్ను బంగారంతో నిండా నగలిచ్చి సింగారించడంపోయి, లంకలో సీతని చేద్దామనా మీ ఉద్దేశ్యం? బాగుంది."

"అరే! అలా అరుస్తావేం? ఈవేళవరకూ నీకేదైనా కావాలంటే కాదన్నానా? అడిగిందల్లా తెచ్చి యిచ్చాను. మరి ఈరోజు ఈ సంకటస్థితిలో నువ్వు నాకు కాస్త సహాయం చేస్తే ఏం? ఈ కష్టాలు యిలాగే వుండిపోతాయా? ముందు ముందు దీనికి రెట్టింపు నగలు చేయిస్తాను" 'వాసుబాబు' ఆమెకి నచ్చచెప్పాలని ప్రయత్నించాడు.

"నాకేం చెప్పకండి. నాకోసమే కదూ మీరు చేసేవన్నీ? మీ చెల్లెల్ని అడిగారా? మీ తమ్ముణ్ణి అడిగారా? నన్నే ఎందుకు దోచుకుంటున్నారూ?" ఆమె భగభగ మండింది.

"ఒసే! అలా అంటావేం? నేను ఎవర్నీ అడగకుండానే నీ దగ్గరకి ముందు వస్తానా? అన్ని ప్రయత్నాలూ చేసి ఫలితం లేకపోతే చివరికి తప్పనిసరై నీ నగలు యిమ్మని అడిగాను. నీ అన్నయ్యకి యిచ్చిన రెండు వేలు కూడా తిరిగి యిమ్మని

బ్రతిమిలాడాను. ఏం లాభంలేకపోయింది. అందరూ ఏవో యిబ్బందులు వచ్చాయని తప్పుకున్నారు. ఏం చేయడం?'' అతను నీరసంతో, నిరాశతో అన్నాడు.

''అవునవును. మా అన్నకిచ్చిన రెండు వేల రూపాయలే మీరు మళ్ళీ మళ్ళీ పైకి తీస్తారు. అయితే మీరు చేస్తున్న వృధా ఖర్చు సంగతేమిటి? ముఖ్యంగా ఆ ఉంపుడుగత్తె మీద పెట్టిన ఖర్చు. అప్పులయ్యాయట! ఎక్కడికి పోయిందీ ఆర్జించిన డబ్బంతా?''

''ఒసేయ్! ఒసేయ్! ఏమంటున్నావే యిలా? దానికి ఎప్పుడయినా పదో, పాతికో మహా అయితే యాభై యిచ్చాను. అంతే. అయినా నేను వెళ్ళడం కూడా చాలా అరుదు - నీకు తెలియదనా? ఊరికే నోరుందని యిష్టం వచ్చినట్లు పేలవద్దు. రేపు, ఎల్లుండిలోగా రుణం తీర్చకపోతే దుకాణం వేలంవేస్తారు. నా పరువు మంటకలుస్తుంది. నా బతుకు బజార్నపడుతుంది. కనక నన్నిప్పుడు ఆదుకొనే శక్తి నీకే వుంది - నీ చేతుల్లోనే వుంది'' వాసుబాబు దీనంగా అన్నాడు.

''పరువుట! పరువు! పరువంటూ వుందంటారా మీకు? కట్టుకున్న భార్యని ఆమె స్త్రీధనం - నగలు యిమ్మని అడిగితే పోదు కాబోలు ఈ పరువు. ఛీ! ఏం మొగుడు దొరికాడురా దేవుడా నాకు! భార్య నగల మీదే కన్నేసేవాడు! ఆ ఉంపుడుకత్తెకి (అంగవస్త్రానికి) అర్పించడానికే కాబోలు ఈ నగలూ - ఈ నాటకం! మోసపోయాను, వంచించబడ్డాను'' అంటూ ఆమె గట్టి గట్టిగా ఏడవసాగింది.

''ఒసే, ఒసే రభస ఎందుకు చేస్తావూ? మెల్లిగా మాట్లాడు. ఏడవవొద్దు. నీకు అసలు విషయం చెప్పాను. ఈ కష్టం నుంచి గట్టెక్కించు. మీకోసమే సంపాదనంతా ఖర్చు చేశాను. మూలధనం (పెట్టుబడి) కూడా తిని కూర్చున్నాం. ఊరికే ఎవర్నో ఎందుకు ఆడిపోసుకుంటావు?''

''అవునవును. దానిపేరెత్తితే చాలు - మీ గుండెల్లో మంటలొస్తాయి. మీ మగవాళ్ళు పెద్ద దుర్మార్గులు. పరస్త్రీకి మెక్కించి, పెళ్ళానికి పెట్టాం అంటారు. అలా ఏం ఒరిగింది లేదు. నేను యివ్వనంటే యివ్వను. మీరేం చేస్తారో చెయ్యండి.'' ఆమె కోపంతో మండిపోతూ అంది.

''అలాగా? అయితే నేనే తీసుకువెళ్తాను మరి'' వాసుబాబు బెట్టుచేసి, బలవంతంగా ఆమె దగ్గరున్న తాళాలగుత్తి గుంజడానికి ఉపక్రమించాడు. ఆమె అతన్ని బయటకి తోసింది. పెద్ద పెద్దగా ఏడుస్తూ, మర్నాడు ప్రొద్దున్నే పుట్టింటికి

వెళ్ళిపోయింది.

పెళ్ళిరోజు అగ్నిసాక్షిగా ఏడు జన్మల వరకూ అనుబంధంతో వుంటామని చేసిన వాగ్దానం మఱచిపోయి, తను సంకటంలో వుండగా వదిలిపోయిన ఆ ధర్మపత్ని ఎక్కడా? కేవలం సరదాకోసం ఉంచుకున్న ఈ 'అంగవస్త్రం' (ఉంపుడుగత్తెకు సంకేతం) ఎక్కడ? 'వాసుబాబు' మనస్సులోనే బేరీజు వేసుకుంటున్నాడు.

అతను నిశ్శబ్దంగా కూర్చుని ఆలోచనల్లో మునగడం 'మోగా'కి నచ్చలేదు. "అంత ఆలోచించడానికేముందనీ? నిజం చెబుతున్నా. ఇందులో ఒక్క కణం కూడా మోసంచేసి ఆర్జించింది కాదు. మీరు నన్ను ఎంత దుర్లక్ష్యం చేసినా, మరోమనిషిని (పురుషుణ్ణి) ఈ ఇంట్లో అడుగుపెట్టనిస్తే ఒట్టు."

"ఛ ఛ! అటువంటి చెడు తలంపు నా మనస్సులో రానేరాలేదు 'మోగా'. నేను ఆలోచిస్తున్నది వేరు. ఒసేయ్ 'మోగా', స్వంత భార్యకే విశ్వాసం లేని భర్తని నేను. ఇంత సొమ్ము పరాయి స్త్రీదగ్గర ఎలా తీసుకోమంటావు? రేపు నేను తిరిగి యివ్వలేక పోతేనో?" 'వాసుబాబు' అన్నాడు.

"ఛీ! ఏంమాట్లాడుతున్నారు మీరు? మళ్ళీ తిరిగి యిమ్మని ఎవరడిగారూ? అలాగని నేనివ్వడంలేదు. మన మధ్య వాటాలెందుకనీ? నా తనువు, మనసూ, ధనం అంతా మీవేనని గ్రహించండి."

'మోగా' మాటలకి అతను నీరైపోయాడు.

"మోగా! మోగా! ఎంత అమాయకురాలివే నువ్వు? కానీ నేను అవి తీసుకోను. ఉంచు నీదగ్గరే. రేపు ప్రయత్నిస్తాను. మరో విధంగా చేస్తే పని అవుతుందేమో!" 'వాసుబాబు' ఆమెకి నచ్చజెప్పడానికి శతవిధాలా ప్రయత్నించాడు.

"ఛ ఛ. ఇవి మళ్ళీ లోపల పెట్టడానికి నేను తియ్యలేదు. కాకపోయినా వీటి ఉపయోగం మాత్రం ఏముందని? ఒంటిమీద వేసుకు మురిసిపోవడానికే కదూ? అలా మురిసిపోవడంకన్నా, మీకు పెద్ద పేరు, ఖ్యాతీ వచ్చి, మీరు ఉంచుకున్న ఉంపుడుకత్తెగా - మీదానిలా వుండి మురిసిపోవడమే ధన్యమని నా భావన. అయినా తెలియ కడుగుతాను. ఈ బంగారానికి సదుపయోగం జరిగే బంగారు అవకాశం యింతకన్నా ఏముంటుందని, చెప్పండి? అలా కాదూ, కూడదూ అంటే ఈ యిల్లు వుంది - తాకట్టు పెట్టడానికి. పంచాయతీకి వెళ్ళి..." మోగా తూచి, తూచి మాట్లాడుతోంది. "ఈ ఇల్లు చనిపోయేముందు మా అమ్మ నాపేరిట

వ్రాసి యిచ్చింది. ఎప్పుడైనా అవసరం వస్తే అప్పుతీసుకోడానికి వీలుగా ఈ నగలు యిచ్చింది."

"మోగా! మోగా! ఎవరమ్మా నీకింత పెద్ద మనస్సు యిచ్చారు? ఇంత ధనం - ఇన్ని నగలు నామీద వదిలేసి నువ్వు మాత్రం ఎక్కడికి పోదామనీ" వాసుబాబు ఆమెని కౌగలించుకుంటూ అన్నాడు.

"మీ పాదాలక్రింద గాక నాకు మరెక్కడ జాగా వుందనీ" మోగా నమ్రతగా జవాబిచ్చింది.

"ఆ సంగతి వదిలేయండి. ఎంత రాత్రయిందో - యిక కాస్త పడుకుని నిద్రపోండి చూద్దాం!" దీపం ఆర్పుతూ 'మోగా' ఆ విషయం అక్కడితో ముగించింది.

'మోగా' యిచ్చిన సొమ్ము 'వాసుబాబు' సదుపయోగం చేసుకున్నాడు. అతను న్యాయవిరుద్ధమైన అడ్డదార్లు తొక్కడంమాని, దుకాణంమీద, వ్యాపారంమీద పూర్తి ధ్యాసతో, లక్ష్యంతో శ్రమించాడు. ఏడాది తిరిగేలోగా శక్తి పుంజుకుని వ్యాపారంలో విజయం, యశస్సు గడించాడు. అటు డబ్బూ, ఇటు పేరూ మార్మోగాయి. ఊళ్ళో అందరినోళ్ళల్లో - పెద్దలనుంచి పిల్లలదాకా - ఈ విషయం - వాసుబాబు - ఇల్లు విడిచి రాత్రింపగళ్ళు 'మోగా' గృహంలోనే వుంటాడని అబ్బురంగా చెప్పుకొంటున్నారు.

"అవును. ఎంతమంది ఉంపుడుకత్తెలని పోషించడంలేదు? అలాగని ఎవరూ కట్టుకున్న భార్యని వదిలి, ఆ బజారుస్త్రీని నెత్తిమీద వేసుకు తిరగరు - సిగ్గూ, లజ్జా మాని."

"నిజమే! ఈ 'వాసుబాబు'కి సిగ్గులేదు. స్వంత యింటి వ్యవహారాలు బొత్తిగా పట్టించుకోడు. డబ్బు యిచ్చినంత మాత్రాన చాలా? ఒక్క రోజు కూడా భార్యతో, పిల్లలతో గడపడం ఎవ్వరూ చూళ్లేదు."

లోకులు పలువిధాల వ్యాఖ్యానిస్తున్నారు.

"అరే వాసూ! నువ్వు భలే మనిషివిరా! అరే మేవేం తక్కువ తిన్నామా? మాకూ వున్నాయి యిటువంటి రహస్య సంబంధాలు. కానీ ఏదో మాంసం తిన్నామని బొమికలు మెడలో హారంలా వేసుకుతిరగాలా నలుగురూ చూసి నవ్వేలా? కావాలంటే, తప్పదనుకొంటే రోజూ వెళ్ళు. కానీ ఎప్పుడూ? రాత్రిపూట - లోకుల కంటబడకుండా! కాకపోతే యిదేమిట్రా - రీతీ రివాజూ పూర్తిగా కాదని." వాసుబాబు ప్రాణమిత్రులు అతనికి నచ్చచెప్పడానికి ప్రయత్నించేవాళ్ళు. కానీ 'వాసుబాబు'

చిన్న చిరునవ్వు విసిరేసి, వాళ్ళ మాటలు విస్మరించేవాడు. అతను మనసులోనే అనుకునేవాడు "ఈ మాటలు, ఈ వ్యాఖ్యలూ 'మోగా' వినలేదు కాబట్టి సరిపోయింది. లేకపోతే ఎప్పుడో భార్యకి విడాకులిచ్చి 'మోగా'ని చట్టరీత్యా పెళ్ళాడేవాడని వాళ్ళకి తెలియదు."

ముందు ముందు 'మోగా' కూడా అనేది - మీరు ఎప్పుడూ నా ఇంట్లోనే వుంటారు - మీ ఇంటికి ఎందుకు వెళ్ళరూ అనీ, అలా అప్పుడప్పుడు వెళ్తే మంచిదనీ నచ్చజెప్పడానికి తంటాలు పడింది. ఏం లాభం లేకపోయింది. 'వాసుబాబు' ఆమె సలహాని కూడా తిరస్కరించాడు. అందుకు బదులు ఆమెకోసం ప్రత్యేకంగా స్థలంకొని పెద్ద బంగళా కట్టించాడు. సినిమాకీ, నాటకాలకీ ఎక్కడికెళ్ళినా యిద్దరూ కలిసి వెళ్ళేవారు. అంతేకాదు, 'మోగా' పిల్లల్ని స్కూలులో చేర్చినప్పుడు తండ్రి పేరుగా తన పేరే వేయించాడు. ఇది తెలిసి లోకులు విస్మయం చెందారు! ఇక మిగిలింది 'మోగా'ని తన పక్కన భార్య స్థానంలో కూర్చోపెట్టుకుని పూజలూ, పునస్కారాలూ చేయించడం మాత్రమేనని నలుగురూ అన్నారు. ఈ సంగతి తన చెవిన పడగానే 'వాసుబాబు' కొత్త బంగళాలో 'మోగా'ని తన భార్య స్థానంలో కూర్చోబెట్టి పెద్ద ఎత్తున శ్రీసత్యనారాయణ మహాపూజ చేయించి లోకుల మాటలని నిజం చేసి చూపించాడు. అతని చేష్టలకి 'మోగా' ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయింది. ఆమె పిల్లలని స్కూలులో చేర్పించి, తండ్రి పేరు తన పేరుగా నమోదు చేయించడం ఆమెని కదిలించింది. గుండెల నిండా కృతజ్ఞతా భావం పెల్లుబికింది.

"ఇదేమి విడ్డూరమండీ? మనం ఈ లోకంలోనే జీవించాలి. ఇలా లోకరీతికి విరుద్ధంగా ఎలా వెళ్ళగలం చెప్పండి?" 'మోగా' అతన్ని అడిగింది.

"అవును. నేనూ మొదట్లో ఈ లేనిపోని భయాలకి బలి అయ్యాను. అదృష్టవశాత్తూ భగవంతుడు నాకు మానవత్వం విలువలు చూపించి నా కళ్ళు తెరిచాడు. నా అన్నవాళ్ళు నిజానికి ఎవరో స్పష్టంగా తెలిసొచ్చింది. 'మోగా' నువ్వు అనవసరంగా ఆలోచించకు. నా ఈ పిల్లలని లోకులు ఉంపుడుకత్తె ('అంగవస్త్రం'పు) పిల్లలని కించపరచి, చిన్నచూపు చూడడం నేను సహించలేను. పాపం ఇందులో వాళ్ళ దోషమేమిటి? నేను వాళ్ళ తండ్రినే కదా? మరి నా పేరు తండ్రిగా వ్రాయడంలో తప్పేముంది?"

"అవుననుకోండి. కానీ అంగవస్త్రానికి ఎప్పుడయినా పంచె స్థానం వస్తుందా?

కొంగ చక్కగా తెల్లగా ఉన్నంతమాత్రాన హంస అని పిలుస్తామా?" 'మోగా' అంది సాలోచనగా.

"చాలు, చాలు నీ ఉపదేశం. నాకు పంచె అక్కరేలేదు. కొందరికి అంగవస్త్రమే సర్వస్వం - అంటే ఎవరేం చేస్తారూ?" 'వాసుబాబు' నవ్వుతూ అన్నాడు.

"సర్లేండి. ఇంక చాలించండి. మీరు మితిమీరి అశ్లీలంగా మాట్లాడతారు."

'మోగా' సిగ్గుతో కొంకర్లుపోతూ జవాబిచ్చింది. ఆమె ముఖకమలం మీద నృత్యం చేస్తున్న యింద్రధనుస్సుని చూస్తూ తన్మయుడైన 'వాసుబాబు' తన సంసారాన్ని, సమాజాన్ని, అఖిల జగాన్నీ మరచిపోయాడు.



## 13

# కుంకుమ ఆధారం

**- హేమా నాయక్**

ముందు, ఎదురుగా వున్న పిండి గిర్నీ మూసేయగానే, అది గుర్తుగా తెలుసుకొని, తనూ భూమిమీద బట్టవేసి అమ్మకానికని పరచిన వస్తువులు - దువ్వెన్నలు, గొలుసులూ అన్నీ సంచీల్లోవేసి, బట్టలు చీరవగైరా సరిచేసుకుని, కుక్కలదగ్గర ఆడుకొంటున్న 'బాబ్లా'ని పిలిచి యిలా అంది.

"బాబ్లా, ఇక నడమ్మా - ఇంటికి వెళ్దాం - చీకటయింది."

"ఆగవే, మరో యిద్దరయినా దొరకకపోరు."

"వద్దులేరా. ఈ రాత్రివేళ ఎవరొస్తార్రా బూట్‌పాలిష్ చేయించుకోడానికి?"

అయినా వాడు వున్నచోటునించి కదలలేదు. మరి నిజంగానే కొంతసేపటికి వాడిదగ్గరకి ఒక సూటూ-బూటూ వేసుకున్న ఆసామి వచ్చి నిలబడ్డాడు. 'బాబ్లా' వాడి బూట్లకి పాలిష్ చేసి, అతడిచ్చిన డబ్బులు జేబులో వేసుకుని, తను అన్నమాట నిజమయినందుకు సంతోషంగా అన్నాడు:

"చూశావా అమ్మా? సరేలే, యిప్పుడు వెళ్దాం యింటికి" అంటూ 'బాబ్లా' తన బూట్ పాలిష్ వగైరా సామాను పెట్టెలో సర్ది, ఆ పెట్టె చేతిలో పట్టుకు నిలబడ్డాడు. ఆమె కూడా తన సంచీ పట్టుకు నడవసాగింది. దారిలో 'బాబ్లా' ఎన్నో విషయాలు చెబుతున్నాడు. కానీ ఆమె మనస్సులోకి ఏ ఒక్క విషయం ఎక్కడంలేదు. ఈవేళ వచ్చిన డబ్బు, అయిన ఖర్చూ ఆమె తలలో తిరుగుతున్నాయి. వాళ్ళు రోజూ వచ్చే చోటు చేరుకున్నారు. ఆ మావిడి చెట్టు మొదట్లో పేర్చిన చదరం రాయిమీద కూర్చుని, ఆ రోజు ఆదాయ, వ్యయాల లెక్కలు చూసుకోవడం వాళ్ళకి మామూలు.

ఇద్దరూ చతికిలబడ్డారు. అతుకుల బొంతలా కుట్టుకున్న చిరిగిన లాగు జేబులోంచి పదీ, ఐదూ కాసుల చిల్లర 'బాబ్లా' కింద పడేశాడు. ఖళ్ళున

చప్పుడయింది. తన బొడ్డు దగ్గర దోపుకున్న చిన్నమూటలోని చిల్లర కూడా దానిలో కలిపేశాడు.

"రోజూకంటే ఈవేళ ఎక్కువ వచ్చింది కదూ అమ్మా?" అలా అంటూ డబ్బులు లెక్కపెట్టసాగాడు. 'బాబ్లా' లెక్కల్లో ఘటికుడు. ఇప్పుడే నాల్గవ క్లాసు ప్యాసయి ఐదవ క్లాసులో ప్రవేశించాడు. వయస్సు పదిదాటి పదకొండు సంవత్సరాలవుతోంది. ఇంటి బాధ్యతల వలన చదువులో ఫస్ట్ ర్యాంక్‌లో రాలేకపోతున్నాడు. అయితే లెక్కలలో మాత్రం ఎప్పుడూ, నూటికి నూరు మార్కులు సంపాదిస్తున్నాడు. డబ్బులు లెక్కపెట్టడంలో అతని తెలివితేటలకి ఆమె మనస్సులోనే గర్వపడుతుంది.

"అమ్మా ఏం ఆలోచిస్తున్నావు? ఈవేళ ఐదు రూపాయలు అయాయి చూడు. నిన్న నాలుగు అయాయి. రేపు పదిరూపాయలు - ఎల్లుండి ఇరవై, ఆ తరువాత క్రమేణా వంద రూపాయలు దొరుకుతాయి. కదమ్మా?"

వాడి మాటలు విని ఆమెకి అతగాడి పసితనం మీద జాలేసింది. డబ్బులన్నీ జేబులో వేసుకుని వాడు బట్టలు సర్దుకొని తల్లితో "ఇక వెళ్దామా?" అని అన్నాడు. నడుస్తూ, ఇంటికి వెళ్తూ ఆమె "బాబ్లా" అని పిలిచి లెక్క అడిగింది :

"ఒక శేరు బియ్యం, కప్పుడు టీపొడరు, కప్పుడు చెక్కెర, ఒక సీసా కిరసిన్ నూనె, అంతా కలిసి ఎంతవుతుందిరా?"

'బాబ్లా' మనస్సులోనే లెక్కవేసి అన్నాడు.

"నాలుగు రూపాయల ముప్పావలా."

"అలాగైతే కిరసిన్ నూనె సగం సీసా చాలు. ఒక రూపాయ అయ్యకి యివ్వాలి. ఇప్పుడెంతా?"

"నాలుగు రూపాయల పావలా?"

"ఇంకాస్త తగ్గించుదాం."

"ఉండనియ్యవే అమ్మా. నాన్నకి నాలుగణాలు తక్కువ యిస్తే మించిపోయేది లేదు."

అప్పులున్న దుకాణంని దాటి, మరో దుకాణానికి వెళ్ళారు. కొంతైనా ఖర్చు తక్కువ అవుతుందని. అన్ని వస్తువులూ కలిపి దుకాణంవాడు కేవలం నాలుగు రూపాయలే చెప్పాడు. ఆమెకి హాయనిపించింది. మనస్సులోనే అతనికి

ధన్యవాదాలర్పించింది. ఇద్దరూ ముందుకు నడిచారు. అప్పుడే 'బాబ్లా' మిత్రులిద్దరు ఎదురొచ్చి పలకరించారు. అప్పుడే ఆమెకి గుర్తుకొచ్చింది. 'బాబ్లా'కి స్కూలు కెళ్ళడానికి చెప్పులే లేవు. ఇదివరకు కొన్నవి పూర్తిగా అరిగిపోయి, తెగిపోయాయి. ఆమె తల్లిగుండె తల్లడిల్లింది. ఆమె అతని జుత్తును తన చేతితో ప్రేమగా నిమిరింది. జుత్తు కూడా కత్తిరించి మూడు నెలలయింది. వచ్చిన డబ్బంతా తిండికే సరిపోతోంది. వేరే అవసరాలకి మిగలడమేలేదు. ఆమె అతగాడితో అంది -

"బాబూ, నీకు చెప్పులు లేవుకదా?"

"ఉండనియ్యి అమ్మా. రేపు పది రూపాయలొచ్చినప్పుడు కొందాంలే. రేపు నేను రోజూ కూర్చునే చోటగాక, బస్సుస్టాండు దగ్గర కూర్చుంటాను. అక్కడ చాలా గిరాకీ ఉంటుంది."

ఇద్దరూ తొరతొరగా లోపలికి వెళ్ళారు. ఆమెకి తన కొడుకు అవగాహనకి, బుద్ధికి ఎంతో సంతోషం కలిగింది. మనస్సులోనే మెచ్చుకుంది. "కానీ...ఏం చేస్తాను? ఈ మొగుడు పచ్చని సంసారంలో నిప్పులు పోస్తున్నాడు. వాడికి - ఆ త్రాగుబోతుకి - సారాబుద్ధి తప్ప మరేం కనిపించదు. పిల్లలూ, భార్యా ఎవ్వరన్నా లక్ష్యంలేదు - ఎవ్వరూ వొద్దు" మొగుడిమీద కోపంతో రుసరుసలాడుతూ లోపలికి వెళ్ళింది.

రాత్రి వంటచేస్తూ, గంజిగిన్నెని మాద్చేశాడు. ఎక్కడికెళ్ళాడో. ఇంతవరకూ పత్తాలేదు.

"వస్తాడు - నెమ్మదిగా పిల్లలందరూ నిద్రపోయాక. నన్ను చావగొట్టడానికి" ఆమె శరీరం వణికింది ఆ ఆలోచన రాగానే. నిన్న కొట్టిన దెబ్బలు యింకా నెప్పిపెడుతున్నాయి. ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండాయి. బట్టతో పీటలు తుడిచి పిల్లలు కూర్చోడానికని వేసింది.

గంజి పొంగువచ్చి ఉడికింతరువాత గరిటతో తీసి బాగా ఉడికిందో లేదో రుచి చూసింది. "చాలు. ఉడికింది" అనుకొని కుంపటి మీద గిన్నెతీసి, పక్కన పెట్టింది. కుంపట్లోని కర్రలూ, బొగ్గులూ తీసి నీళ్ళు చల్లి ఆర్పింది. తరువాత ఉడికిన గంజిలో పైనీళ్ళు తీయగా అడుగునవున్న అన్నం భర్తకోసం పక్కకి తీసి వేరేగా వుంచింది. మిగిలిన గంజినీళ్ళు ముగ్గురు పిల్లలకి ముంతల్లో యిచ్చింది. నాలికకి రుచి తగలాలని ఒక ఆవకాయముక్క తరిగి యిచ్చింది.

"నా ఉపవాసం రోజూ మామూలయింది. ఇప్పుడు అలవాటయిపోయి

ఆకలే వేయడంలేదు'' ఆమె నసుక్కుంది.

చిరిగిన చాపచుట్టలు, అతుకుల బొంతలూ పరచి, చాలీచాలని దుప్పట్లు కప్పి పిల్లల్ని నిద్రపుచ్చింది.

ఆమె నేలమీద మేనువాల్చి విశ్రాంతి తీసుకుంది.

అంతా నిశ్శబ్దం ఆవరించింది. చుట్టూ ప్రాకిన చీకట్లు ఆమెని భయపెడు తున్నాయి. భర్త యింకా రాలేదని ఆమెకి దిగులువేయసాగింది. కిటికీ తెరిచి, ఆమె అక్కడ నిల్చుంది. ఈవేళ పౌర్ణమి. ఆకాశంమీద పూర్ణచంద్రుడు నవ్వుతూ కనిపించాడు. వెండివెన్నెల తివాసీలా బయటంతా పరుచుకుని చీకటిమయమైె రాత్రికి ఎంతో హాయిని, అందాన్ని యిస్తోంది. అయితే ఆ శోభనీ, ఆ ఆనందాన్నీ ఆస్వాదించే పరిస్థితిలో ఆమె లేదు. ఎప్పుడూ సంసారపు బెడదల గురించే బెంగ.

''పౌర్ణమి అయినా, అమావాస్య అయినా నా బతుక్కి ఒక్కటే! నా ఇంట్లో చీకటి ఎప్పుడూ ఉంటుంది. సూర్యుడు ఎన్నిసార్లు ఉదయించి అస్తమించినా, నా యింట్లో వెలుగుల కిరణాలు ప్రవేశించవు ఎప్పుడూ'' - యిలా ఆలోచిస్తూ ఒక పావుగంట ఆమె ఆ కిటికీ దగ్గర నిలబడింది. ఇంతలో 'బాబ్లా' గొంతుక వినబడింది

''అమ్మా! నాన్న యింకా రాలేదా?'' 'బాబ్లా' నిద్రలోనే మరోపక్కకి తిరుగుతూ అడిగాడు.

''లేదురా బాబూ. ఏమయిందోనని బెంగగా వుంది నాకు. నువ్వు పడుకో.'' ఆమె వాళ్ళదగ్గరకి వచ్చి కూర్చుంది. ముగ్గురు పిల్లల స్థితి చూసి ఆమెకి ఏడుపు వచ్చింది.

''ఏమీ ఘోరం జరగలేదు కదా?''

భర్తగురించి జ్ఞాపకం వచ్చి ఆమె గుండెల్లో ఏదో దిగులు పట్టుకుంది. క్షణంసేపు అనుకుంది - 'బాబ్లా'ని బయటకి అతన్ని వెతకటానికి పంపుదామని. కానీ ఆమెకి వాడిని నిద్రనించి లేపడానికి మనస్సు కాలేదు. ''పాపం అలసిపోయి 'బాబ్లా' నిద్రలో మునిగిపోయాడు. వాడికి రోజంతా పని!'' ఆమెకి వాడిమీద జాలి ముంచుకొచ్చింది. 'బాబ్లా'కి యింకా పన్నెండేళ్ళు నిండలేదు. అయినా డబ్బు ఆర్జించడానికి యింత లేతవయస్సులో పనిచేయాల్సివస్తోంది - అటు చదువు సాగిస్తూ. చదువంటే ఎంతో శ్రద్ధవున్నా, వాడికి తగినంత వీలుకుదరడంలేదు పాపం.

''నా పచ్చని కాపురం, భర్త వ్యసనంవల్ల నాశనం అయింది. మొగుడు

వున్నా లేనట్టే, కేవలం కుంకుమకు ఆధారం! పిల్లల్ని పోషించలేడు - పెళ్ళాన్ని సుఖపెట్టలేడు. దొరికిన డబ్బంతా ఆ తాగుడికే పోతోంది. పైగా మేం సంపాదించినది కూడా గుంజుకుని ఖర్చు పెడతాడు. అతని గుండె బండరాయి!'' ఆమెకి మొగుడిమీద కోపం భగ్గుమంది.

''ఇప్పుడొస్తాడు. నన్ను చావబాదుతాడు.''

కూర్చున్నచోటే, ఆమెకి నిద్ర ముంచుకొచ్చింది. ఈ సంసారపు గొడవల్లో, ఆలోచనల్లో ఆమెకి నిద్ర సరిగ్గా పట్టదు. ఏదో బెంగ, ఏదో బాధ ఎప్పుడూ ఆమెని వేధిస్తుంది. ''ప్రాణం విసిగెత్తిపోతోంది. చేదువిషం ఈ జీవఫలం'' ఆమె తల, తలగడ మీద ఆన్చింది. ఇంతలో చిన్నపిల్లాడు - 'మనూ' ఆరు సంవత్సరాలవాడు - నిద్రలో కలవరిస్తున్నాడు. వాడి దగ్గరకి వెళ్ళి వాడిని చేతులతో జోకొట్టి, వాడు నిద్రలో మునిగాక, మళ్ళీ వచ్చి కిటికీ దగ్గర నిలబడింది. రాత్రి బాగా పొద్దుపోయింది. వెన్నెల రాత్రి కావటంవల్ల అంతగా తెలియటంలేదు. కుక్కలు వూరికే అరుస్తున్నాయి. ఎవరో దూరంనుంచి వస్తూ కనబడ్డారు. ''బహుశా మొగుడు కాబోలు'' అని అనుకుంది ఆమె, సునిశితంగా చూస్తూ. కాదు - అతను 'షాణు.'

''షాణూ, 'బాబ్లా' తండ్రిని చూశావా?'' అతను దగ్గరకి రాగానే అడిగింది.

'''బాప్పా' యింకా రాలేదా? నేను యిందాకా - చాలాసేపటి క్రితం చూశాను అతన్ని ఆ 'ఫ్రాంసిస్' దుకాణం ముందు.''

''నాకు ఏదో భయంగావుంది. బాగా తాగేసి, స్పృహతప్పి ఎక్కడైనా పడిపోయాడేమోనని.''

''నువ్వు పడుకోవమ్మా. ఎందుకు ఎదురుచూస్తావూ? నిషా తగ్గగానే లేచివస్తాడులే ప్రొద్దున్నే'' అని 'షాణూ' వెళ్ళిపోయాడు. ఆమెకి ఏం చేయాలో తోచలేదు. ఈ మొగుడు వుండడంకంటే, లేకపోవడమే నయమని ఆమెకి అనిపించింది. ఆమె మనస్సు, ఆమెతో తర్కించింది.

''ఇటువంటి అధ్వాన్నపు మొగుణ్ణి ఎందుకు కట్టుకు కూర్చున్నావు? వొదిలేయ్. రేపు యింటికి వస్తే లోపలికి రానియ్యవద్దు. పొమ్మను ఎక్కడికైనా!''

ఆమె ఒక దృఢ నిశ్చయానికి వచ్చింది. 'రేపట్నించి నేను మొగుడు చెప్పింది వినను. వాడు బలవంతం చేసి కొట్టడానికి వస్తే, నేనూ వూరుకోను - ఎంతకైనా వెనకాడను. పిల్లల్ని పోషించే శక్తి నాకుంది. 'బాబ్లా'ని స్కూలుకి పంపిస్తాను. వాణ్ణి

ఆదర్శంగా పెంచి పెద్ద చేస్తాను. నా బంగారు తండ్రి వాడు."

'బాబ్లా' దగ్గరకి వచ్చి ఆమె వాత్సల్యంగా వాడి శరీరాన్ని నిమిరింది. వాడు తెలివొచ్చి అడిగాడు. "అమ్మా నువ్వింకా నిద్రపోలేదా? నాన్న రాలేదా? నేను వెళ్ళనా వెతకడానికి?"

ఆమె గుండె నిబ్బరంచేసుకుంది.

"ఏం అవసరంలేదు. కావాలంటే ఆయనే వస్తాడు. ఎక్కడో తప్పతాగి పడుంటాడు - మత్తులో. చావనియ్యి అక్కడే - పీడ వదులుతుంది మనకి."

'బాబ్లా' తల్లిని ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఎప్పుడూ తనని నిద్రలో కూడా లేపి తండ్రిని వెతికి తీసుకురమ్మనే 'అమ్మ', ఈవేళ ఎందుకిలా అంటోంది?

"అమ్మా! నువ్వేఁవి టంటున్నావూ?"

"అవును 'బాబ్లా'; అతని గురించి ఎంతని బాధపడతాం? నాశనం అవనియ్యి వాణ్ణి! మిమ్మల్ని పోషించి, పెంచే శక్తి నాకుంది. నేను భయపడేది లేదు."

తొలికోడి కూసింది. తెల్లవారింది. పౌర్ణమి రాత్రి ముగిసింది. 'బాబ్లా' నిద్రలేచి నిలబడ్డాడు.

"అమ్మా! అదిగో చూడు - నాన్న వస్తున్నట్టున్నాడు - 'షాణూ' పట్టుకు తీసుకొస్తున్నాడు. అదిగో చూడు వస్తున్నాడు - తూలుతూ, తూలుతూ."

'బాబ్లా' పళ్ళు తోముకుంటూ అన్నాడు.

"రానియ్యి. సారా మత్తు యింకా వదిలినట్టులేదు. నేను వదిలిస్తాను. రానియ్యి."

అతన్ని యింటి దగ్గర వరకూ తీసుకువచ్చి 'షాణూ' వెళ్ళిపోయాడు. కాళ్ళు తడబడుతూ, అతను ద్వారం దగ్గర తలుపుకానుకుని పడ్డాడు. ఒకే కీలు ఆధారంగా వున్న ఆ పాత తలుపు, ఆ కీలు కూడా విరిగి దభాలున కిందపడింది.

ఆమె లేచి లోపలికి వెళ్ళింది. లోపల గదిలో మూలనున్న పెద్ద, గట్టి వెదురుకొయ్య తీసింది. చీరకొంగు బిగించి, కఱ్ఱ చేతిలో పట్టుకు గుమ్మంమీద నిల్చుని ఉద్వేగంతో అంది.

"స్వాగతం - రండి లోపలికి - ఇప్పుడు చూద్దాం - ఇప్పుడు తేల్చేద్దాం. మనిద్దరిలో ఎవరి కెక్కువ శక్తి వుందో. రండి" - ఆమె పూనకం వచ్చినట్లు మాట్లాడుతోంది.

'బాబ్లా' అవాక్కయిపోయి, ఆశ్చర్యంతో తల్లడిల్లిపోయి యిటు తల్లినీ - అటు తండ్రినీ చూస్తూ వుండిపోయాడు.



## 14

# భాగ్యం

**- ఎడ్విన్ జె. ఎఫ్. డిసౌజా**

అతడు దాదాపు రెండు గంటలుగా, తనున్న జైలుగది పైనున్న చదరాకారపు బొరియ నుంచి గది నేలమీద సూర్యరశ్మి వలన పడుతున్న చదరపు వెలుగుల ఆకారాన్ని చూస్తున్నాడు. ఈ రెండు గంటలూ నిస్తబ్దుడుగా, ఒళ్ళు అణువైనా కదలకుండా కూర్చున్నాడు. జైలుగదిలో పడుతున్న ఆ ఎండ మధ్యాహ్నం మూడున్నర గంటలది. మధ్యాహ్నం మూడున్నర అవడం అతని బ్రతుకులో పెద్ద విశేషం కాదు. అలా ఎండ గదిలో పడి ముగ్గులేయడమూ విశేషం కాదు.

ఎవరో జైలు తలుపులు కుదుపుతున్న శబ్దం వచ్చింది. అతని మొహంమీద పెద్ద మందహాసం వెలిగింది. ఈ శబ్దం కూడా విశేషం కాదు. అతను జైలు తలుపు పక్కన నిలబడ్డ ఒక హవల్దార్ (సిపాయి)ని చూశాడు.

"జైలర్ మిమ్మల్ని పిలుచుకురమ్మన్నారు" అన్న ఆ హవల్దార్ మాటలు శ్రావ్యమైన సంగీతంలా వినబడ్డాయి. ఈ విధమైన ఆహ్వానం నిజంగా విశేషమే! ఈవేళ తనకి మంచిరోజు కాబోలు! విశిష్టమైన కబురు అందింది.

అతడు మెల్లిగా లేచి నిల్చున్నాడు. హవల్దారు తలుపులు తెరిచాడు.

"జైలర్‌దగ్గరికి వెళ్ళేముందు నీ దుస్తులు మార్చుకో. నీ వస్తువులూ, బట్టలూ - ఆ గదిలో వున్నాయి తీసుకో."

ఖైదీ తన మొహంమీద తడుముకున్నాడు. జైలు మంగలి అతడికి క్షవరం చేసి, గెడ్డం గీశాడు. అన్ని ఏర్పాట్లూ జరిగాయి. హవల్దార్ చూపించిన గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకు ముస్తాబయ్యాడు. ఆ తరువాత అతనితోబాటు జైలర్ వుండే ఆఫీసుకి వెళ్ళాడు.

ఈ ఖైదీ ఈ జైలులో వున్న ఐదు సంవత్సరాలలో మారిన మూడవ జైలరు

అతను. ముందు వుండి వెళ్ళిన యిద్దరు జైలర్లూ అతని మనస్సుని ఆకట్టుకున్నారు. వారి మాటలూ, వారిచ్చిన శిక్షణ, గౌరవ ప్రవర్తనా అతని కళ్ళముందు యిప్పటికీ జ్ఞప్తికొస్తాయి. కానీ యిప్పటి జైలరు మాత్రం మితభాషి. చాలా చతురుడు. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టే రకం!

జైలర్ అతన్ని నఖశిఖపర్యంతం పరిశీలించాడు. తన ముందు టేబిల్‌మీద వున్న దస్తావేజు తెరిచాడు. ఖైదీ పేరు చదివాడు.

"వయస్సు 48 సంవత్సరాలు" అతను కావలిసే పైకి చదవసాగాడు. ఖైదీ పేరు చదివాడు. అపరాధం ఆయుధాలు తీసుకు చేసిన దొంగతనం, దోపిడీ. శిక్ష : ఆరు సంవత్సరాలు. తరువాత దస్తావేజు మూశాడు.

తన రెండు చేతుల వ్రేళ్ళూ ఒకటిమీద ఒకటి మడిచి, అతన్ని పరీక్షగా చూస్తూ అడిగాడు. "నీకు తెలుసా ఈ సంగతి? నీ సత్ప్రవర్తన మూలకంగా నీ శిక్ష ఆరు సంవత్సరాల నుంచి ఐదు సంవత్సరాలకి తగ్గించారు." "ఈ వేళే నువ్వు విడుదల అయే రోజు."

ఖైదీ మొహంమీద ఏ విధమైన మార్పూ లేదు. ముఖకవళికలు నిశ్చలంగా వున్నాయి.

"నీమీద బందిపోటుగా లూటీ చేశావనే అభియోగం వేశారు. అయితే యింత వరకూ నువ్వు దొంగిలించిన డబ్బు దొరకలేదని నీ దస్తావేజులో వ్రాశారు."

అతను ఖైదీని అనుమానంతో చూశాడు. "...నీ సత్ప్రవర్తనకి కారణం యిది కాదు కదూ?" జైలర్ భుజం ఆడిస్తూ అన్నాడు. "ఇదిగో యిక్కడ నీ ప్రత్యేక వస్తువు ఉంది తీసుకో" - అంటూ జైలర్ అతనిముందు ఒక చిన్న సంచీ ఉంచాడు. "నిన్ను ఖైదీ చేసినప్పుడు అది నీ దగ్గరుంది. ఇదిగో ఈ ప్యాకెట్టులో నువ్వు ఐదు సంవత్సరాలుగా జైలులో చేసిన పనికి మూల్యం."

ఒక మందమైన కవరు అతనికిచ్చాడు.

అది ఖైదీ తీసుకొని, అందులో కొన్ని కరెన్సీ నోట్లు బయటికి తీశాడు.

"ప్రభుత్వం ఎప్పుడూ నీకు ఋణపడి వుంటుంది" జైలరు వ్యంగ్యం ధ్వనిస్తున్న స్వరంలో అన్నాడు.

ఖైదీ ఆ కవరు (లకోటా)లో వున్న నోట్లు పరీక్షిస్తున్నాడు. కొంతసేపైన తరువాత రాక్షసుడిలా నవ్వుతూ అన్నాడు.

"ఐదేళ్ళలో నోట్లు మారలేదు!"

అతని మొట్టమొదటి వాక్యం చాలా మృదువుగా, సౌమ్యంగా అన్నాడు. ఐదేళ్ళ కఠిన జైలుశిక్ష అతనిలో రాక్షస అంశని అణిచి, ఒక విధమైన కోమలమైన స్వభావాన్ని యిచ్చింది. ఒక విధమైన ప్రేమ, దైన్యం ద్యోతకమవుతున్నాయి అతని మాటల్లో.

నోట్ల కట్టని జేబులో దోపుకున్నాడు.

"ఇంకేమిటీ?" అతను జైలర్ని అడిగాడు.

"నీ అదృష్టం. ప్రకృతి సుందరంగా వున్న సమయంలో నీకు విడుదల కలిగింది" జైలర్ ఖైదీకి జవాబుగా అన్నాడు.

"ఇది డిశంబరు నెల. నువ్వు క్రైస్తవుడివి కదూ? వారంరోజుల్లో క్రిస్మస్ పండగ వస్తోంది."

"క్రిస్మస్ పండగా? ఎన్నో తారీకున?" అతను ఆతృతగా జైలరు మేజామీద వొంగుతూ అడిగాడు.

"నీకు తెలియదా? ఈ నెల యిరవై అయిదో తారీఖున."

"ఆగండి క్షణం. ఈ పండగ సమయంలోనే కదూ బాల ఏసుని గొడ్లపాకలో వుంచిన దృశ్యం, రంగు రంగుల దీపాలు, నక్షత్రాలూ అలంకరించి చక్కటి బొమ్మలు చేసి వేడుకలు చేసుకుంటారు."

"అవునవును" అన్నాడు జైలర్. "నువ్వు బాగా మారిపోయావు. నేను వేరే మతం వాడినే అయినా తెలిసిపోతోంది. నీ భక్తిశ్రద్ధలు."

"ఇంకేమిటి?" ఖైదీ సందేహిస్తూ అడిగాడు.

"ఇంకేముంది? ముందేమైనా వున్నా, అది నీ చేతుల్లోనే వుంది" జైలర్ అర్థోక్తిగా అన్నాడు.

డిశంబరు ఇరవైయవ తేదీ అతను జైలు నుండి విడుదలై బయటపడ్డాడు.

ఐదు సంవత్సరాల సుదీర్ఘ కాలం!

ప్రశాంతమైన సాయంత్రపు గాలి, స్వచ్ఛంగా, స్వేచ్ఛగా వీస్తోంది. ప్రకృతి సౌందర్యాన్ని ఆరాధించాలనిగానీ, జైలు చాకిరీ తప్పిందనిగానీ, భవిష్యత్తు ఎలా రూపొందుతుందనే ఆందోళనగానీ అతనిలో ఏమాత్రం లేవు. జైలు జీవితం అతనికి కొత్తకాదు.

జైలు నుంచి బయటపడి తిన్నగా రైలుస్టేషన్‌కి చేరుకున్నాడు. తన వూరికి టిక్కెట్టు తీసుకున్నాడు. రెండురోజుల ప్రయాణం. అతని మనస్సు మహావేగంగా పనిచేస్తోంది - రైలు డబ్బాలో కూర్చున్నాక కిటికీ నుంచి వెనక్కిపోతున్న చెట్లని చూస్తూ, తన ఐదేళ్ళ జైలు జీవితం నెమరువేసుకుంటున్నాడు. విధి చేతుల్లో తను కీలుబొమ్మలా చేసిన కృత్యాలూ, పొందిన శిక్షలూ గుర్తొచ్చి అతని ముఖంమీద వింత మందహాసం వచ్చింది. ఈ ఆలోచనల్లో ఆకలి గుర్తురాలేదు. రైలు ఎక్కేముందు ఒక భోజనం ప్యాకెట్టు కొన్నాడు. తన దగ్గర జైలర్ యిచ్చిన లకోటా (కవరు) తీసి అందులో నోట్లు తీసి డబ్బు చెల్లించి, చిల్లర అందుకుంటూ ఐదేళ్ళక్రితం అమలులోవున్న నోట్లే యింకా చెల్లుతున్నాయా అని మళ్ళీ అర్థంలేని ఆశ్చర్యంలో మునిగాడు. జ్ఞాపకం రాగానే భోజనం ప్యాకెట్టు తీశాడు. అందులో అన్నం, వొంకాయ వేపుడు కూర, పులుసు, ఆవకాయ ముక్కలతో కలుపుకు తిన్నాడు. తృప్తిగా తేన్చాడు.

అతను చెప్పులు తీసి తన ప్యాంటులో వున్న కాళ్ళు ఒకదానిమీద మరొకటి మడిచి కూర్చున్నాడు. అలా కూర్చుంటున్నప్పుడు తన కుడికాలు చీలమండదగ్గర ఒకప్పుడు కలిగిన గాయం గుర్తు కనిపించింది. అది చూడగానే గతం గుర్తుకొచ్చింది. ఐదు సంవత్సరాల క్రితం ...

అదీ డిశంబరు నెలే!

దేశంలో ఏదో జైలులో శిక్ష పూర్తయి, జైలు బయటకి వచ్చి అతనికి మూడు, నాలుగు నెలలయింది. అతని పనే దొంగతనం. అదే వ్యవసాయం, అదే వృత్తి, అదే వ్యసనం, అందే జీవనశైలి. ఆరునెలలు జైలులో గడిపాడు. ఆరునెలలు సెలవుమీద వుండి తిరిగి ఉద్యోగంలో జేరినట్లు, అతను మళ్ళీ దొంగతనం ఆరంభించాడు. చిన్నా, పెద్దా దొంగతనాలు యిక్కడా, అక్కడా చేస్తూ మూడు, నాలుగు నెలలు గడిచిపోయాయి. ఈ మధ్యకాలంలో ఆ వూరి మార్వాడీవాడి దుకాణం మీద కన్ను వేశాడు. ఆ మార్వాడీవాడి భోషాణంలో ఒక రోజు నోట్లకట్టలు వాడు పెట్టడం చూశాడు. ఎలాంటి భోషాణం పెట్టినైనా తాళాలు లేకుండా తెరవగల ప్రావీణ్యం అతనికుంది - ఆ మార్వాడీని దోచుకోవాలని వ్యూహం పన్నాడు. మనం కథల్లో చదివినట్టు శ్రీమంతులని దోచుకుని బీదవారికి డబ్బు దానంచేసే తత్వం కాదతనిది. తను సుఖంగా, సంతోషంగా వుండాలనే స్వార్థచింతన వొక్కటే అతని నైజం.

ఒక శీతాకాలం, అమావాశ్య మంచు దట్టంగా పడ్డ రాత్రి మార్వాడీ దుకాణానికి కన్నం వేశాడు. మార్వాడీ నిద్రలో గురక పెడుతున్నాడు. లోపలికి పిల్లిలా దూరి, భోషాణంపెట్టె తెరుస్తున్న ప్రయత్నంలో వున్న దొంగ గుండెలో ఇసుమంతయినా భయం లేదు. తన రోజూ వుండే పని చేస్తున్న గుమస్తాలా...

భోషాణం తెరుచుకుంది.

అతగాడి చెయ్యి లోపలకి దూరింది. కానీ అప్పుడే యింటి బెల్లు మ్రోగింది. దుకాణం లైటు ఎవరో వేశారు. తనచుట్టూ ప్రపంచమంతా వొక్కసారి నిద్రలేచినట్లు అతని కనిపించింది. చేతికి అందిన నోట్లకట్టలు తీసుకుని తన లాగులో దోపుకుని, లేచి పారిపోదామని అనుకున్న క్షణంలో ఎదుటి ముఖద్వారం తెరుచుకుంది. లోపలికి చౌకీదారు లాఠీ ఝళిపిస్తూ వచ్చాడు.

ఈ సన్నివేశం దొంగకి కొత్త అనుభవం. అయినా అతగాడు బెదరలేదు. చౌకీదారు లాఠీతో కొట్టిన రెండు దెబ్బలని ఎలాగో తప్పించుకున్నాడు. మూడవది అతని కుడికాలు చీలమండ (Ankle)కి రెండంగుళాలపైన బలంగా తగిలింది. తనకి గాయం తగిలిందని తెలిసినా, ఎంత పెద్దగా తగిలిందో వెంటనే తెలియలేదు. నాల్గవ లాఠీదెబ్బని తన చేతితో అడ్డగించాడు. లాఠీ పట్టుకోగలిగాడు.

చౌకీదారు ముష్టియుద్ధానికి ముందుకొస్తున్నాడు. కాళ్ళనుంచి సహించలేనంత నొప్పి నిప్పులా అంటుకుంది. శరీరమంతా ప్రాకుతోంది. ఆ నొప్పితో కూడిన కోపంతో ఆ చౌకీదారు మీద మెరుపులా లాఠీ ఝళిపించి వాడి నెత్తిమీద ఒక దెబ్బ, చెవిదగ్గర ఒక దెబ్బా బలంగా కొట్టాడు. లాఠీ విసిరేసి పరుగు లంకించుకున్నాడు. బార్లా తెరిచివున్న ముఖద్వారంనుంచే బయటపడ్డాడు. ఇంటి మెట్లు ఎక్కువగా లేవు. కానీ ఎన్నో వున్నట్లు కాలి గాయం వలన అతనికి అనిపించింది. తన కుడికాలికి ఏదో పెద్ద ఇనుప రాయి కట్టినట్టు, ఆ గుదిబండని తను లాగుతున్నట్లు వుంది. ఒకచోట కాస్త ఆగి తన లాగు కుడివైపు కాలుది పైకి లాగి చూశాడు. అరటిచెట్టు బోదెలా వాచింది.

అప్పుడే ఈల శబ్దం వచ్చింది. వెనక్కి తిరిగి చూస్తే ఒక పోలీసువాడు, తన సహచరుణ్ణి పిలవడం కనిపించింది. మళ్ళీ పరుగు లంకించుకున్నాడు.

దుఃఖం మిళితమైన అతను, వూపిరి నోట్లోంచి పీల్చి వదులుతున్నాడు. కొంత దూరం పరిగెత్తి వెనక్కి చూశాడు. ఇద్దరు పోలీసులు అతన్ని వెంబడిస్తూ

పరుగెత్తుతున్నారు. తనకీ వాళ్ళకీ మధ్య అంతరం క్రమేణా తగ్గుతోంది. మళ్ళీ పరుగు సాగించాడు.

కాలు నొప్పి, పరుగువల్ల ఆయాసం మిళితమై అతనికి నీరసం, దుఃఖం ముంచుకొస్తోంది. పోలీసులకి కనుమరుగవాలని తెగించి కుడివైపున వున్న ఒక చీకటి సందులోకి దూరాడు. ఆ సందులో మధ్యతరగతివారూ, క్రిందితరగతివాళ్ళూ చిన్న చిన్న గదుల్లో నివసిస్తారని అతనికి తెలుసు. అలా చీకట్లో తచ్చాడుతూ వెళుతూ, వెళుతూ వుండగా అతనికి ఆయాసం పెరిగింది. దుఃఖం పెల్లుబికింది. కళ్ళముందు మిణుగురు పురుగులు ఎగురుతున్నాయి. అతడు దేనికో ఢీకొన్నాడు. చేతుల్తో తడిమితే అదొక ఇనప ద్వారం. కాస్త తోస్తే అది తెరుచుకుంది.

నిలబడ్డం కష్టమవడం వలన, అతడు తన శరీరాన్ని భూమిమీదే ఈడుస్తూ లోపలికి వెళ్ళాడు. కొంతదూరం వెళ్ళాక, ఒక ఇల్లులా వున్నట్లు చీకట్లోనే అనిపించింది. లోపల చిన్న చిన్న దీపాలు మిణుకు మిణుకు మంటున్నాయి. అతడు కళ్ళు మూసుకుని అతి కష్టంమీద తన దేహాన్ని ఈడ్చుకుంటూ లోపలికి వెళ్ళాడు.

మళ్ళీ ఏదో అడ్డంవచ్చి తగలగానే, కళ్ళు తెరిచాడు. తన పక్కన ఎవరు నిలబడ్డారూ? పోలీసా? కళ్ళు మిటకరించి జాగ్రత్తగా చూశాడు. ఏదో రూపం తనకి దగ్గరలో వొంగొని మోకాళ్ళమీద తలవొంచి క్రింద చూస్తోంది.

క్రమేణా ఆ చీకటికి అలవాటైన కళ్ళు అది ఒక విగ్రహం అనీ, ఒక పురుషుడిదనీ అతనికి తెలిపాయి. నక్షత్రాల కాంతిలో వెండి వెలుగులు మిశ్రితమై, ఒక అపూర్వ దృశ్యం అతడు రెప్పపాటు తన దుఃఖాన్ని విస్మరించిన దృశ్యం గోచరమయింది.

ఆ పురుషుడి విగ్రహం ప్రక్కనే ఒక స్త్రీ విగ్రహం కూడా మోకాళ్ళమీద వొంగొని క్రింద చూస్తోంది. మెడ కాస్త తిప్పి తొంగి చూస్తే ఆ రెండు మూర్తుల మధ్యన ఒక శిశువు నిద్రపోతూ కనిపించాడు.

హఁ! అతనికి అర్థమయింది. ఈ బొమ్మలతోబాటు బంకమన్ను వాసనా ... ఈ గృహం ఎవరో మూర్తి (శిల్ప) కారుడిదని సూచిస్తోంది. అతడికి జ్ఞప్తికి వచ్చింది. తను ఈ దోవన పగలు చాలాసార్లు వెళ్ళాడు. ఎన్నోసార్లు ఈ యింటి ముందు మూర్తికారుడు కొత్త కొత్త బొమ్మలు తయారుచేసి, వాటిని ఎండడానికని, ఇంటి

ముందున్న ఈ ఖాళీప్రదేశంలో వుంచడం చూశాడు.

మరి యిప్పుడు ... అడుగుల చప్పుడు ఏదో దగ్గర, దగ్గరకొన్నా వినబడుతోంది. అతని బుఱ్ఱ తీవ్రంగా ఆలోచిస్తోంది. అతని కాలు నొప్పి సంగతి మరచిపోయాడు.

ఈ బంకమన్నుతో చేసే విగ్రహాలు లోపల డొల్లగా వుంటాయి. అతనికా సంగతి ముందే తెలుసు. పెద్ద పెద్ద విగ్రహాలు లోపల డొల్లగా వుండడమేగాక, వాటి వెనక పట్టుకుని మోయడానికి వాటంగా, చెయ్యి దూరేటంత కన్నం కూడా వుంటుంది. అతడు వెంటనే ఆ ఆలోచన రాగానే తన జేబులో వున్న కరెన్సీ నోట్లకట్టని బయటకి తీశాడు. ఆ సన్నటి వెలుతురులో వందరూపాయల నోట్లని గుర్తుపట్టడం ఏమీ కష్టమనిపించలేదు. ఆ మార్వాడీవాడు వాటిని వొక ప్లాస్టిక్ సంచీలో పెట్టి బైట రబ్బరు తాడు చుట్టాడు. చీకట్లో తడుముతూండగా, తడి బంకమట్టి తగిలింది. దొంగ యిటూ అటూ వెతుకుతూ చూసి ఆఖరికి ఒక పెద్ద విగ్రహాన్ని ఎన్నుకున్నాడు. ఆ విగ్రహం వెనకనున్న పెద్ద రంధ్రం ద్వారా ఆ నోట్లకట్టని లోపలికి పెట్టి, దానిచుట్టూ, మీదా కొంత తడిగా వున్న బంకమట్టిని పల్చటి పొరలా చేసి కప్పాడు. ఆ విగ్రహం చాలా బరువుగా వుండడం వలన, దానిని మెల్లిగా తలక్రిందుగా బోర్లించి ఆ నోట్లకట్టని పెట్టవలసివచ్చింది.

అతను అంచనావేసిన ప్రకారం, ఆ విగ్రహం వెనకన ఒక చెయ్యి, నోట్ల కట్టతోసహా లోపలికి దూరగలంత రంధ్రం ఆ పెద్ద విగ్రహంలో వుంది. అతను తన డబ్బు ఆ బాల ఏసుబొమ్మ పొట్టలో దాచాడు, భద్రంగా. మెత్తగా, తడిగా వున్న బంకమట్టి చుట్టిన ఆ నోట్లకట్టల ప్యాకెట్టు, పొడి పొడిగా వున్న ఆ విగ్రహపు వెలుపలి భాగంలో, ఒక మూల అతుక్కుంది. అలా ఆ 'భాగ్యం' నిక్షిప్తంగా పెట్టి, ఆ విగ్రహాన్ని తిరిగి మామూలు ప్రకారం నిలిపి పెట్టాడు. అప్పుడే తెరిచి వున్న ఆ బాల ఏసుప్రభువు చెయ్యి మెల్లిగా అతడిని తగిలి స్పృశించింది. ఇదంతా ఆ అంధకారంలో అతనికి తెలియలేదు. కళ్ళతో చూడలేనందువల్ల స్పర్శతో పని పూర్తిచేశాడు.

తన 'అదృష్టాన్ని' ఆ విధంగా భద్రపరిచి, దాచిన తరువాత ఆ నివాసం నుంచి బయటపడాలనే వుద్దేశ్యంతో, తన శరీరాన్ని ఎలాగో నేలమీద ఈడ్చుకుంటూ ఆ ఇనపగేటు వరకూ చేరాడు.

బయట నుంచి అడుగుల చప్పుడు, దగ్గరకి వస్తూ వినబడింది. పోలీసులు!

"అతడు యిక్కడే వున్నాడు" ఒక పోలీసు అరిచాడు.

"నువ్వు అటు వెళ్ళు - నేను యిటు వెళ్తాను" మరో పోలీసు అన్నాడు.

ఆ మట్టి విగ్రహాలు చేసే శిల్పకారుడి ఆవరణలో తను పట్టుబడితే తన "ఆస్తి" దాచడానికి పడిన శ్రమంతా వృధా అవుతుందని తెలిసిన అతడు శీఘ్రంగా ఆ గేటు దాటి బయటపడ్డాడు.

ఇప్పుడతని మనస్సు స్థిమితపడింది. ఊపిరిలో వేగం తగ్గింది. చీకట్లో కాసింత దూరం ఆ విరిగిన కాలుని ఈడ్చుకుంటూ ఎలాగో వెళ్ళాడు. ఇంతలో కాలి బాధ అధికమై, తట్టుకోలేక తనకి తెలియకుండానే మూలిగాడు. ఆ మూలుగులు విన్న పోలీసుల టార్చ్‌లైట్ అతని మొహంమీద పడింది. అడుగుల చప్పుడు పరిగెత్తుతున్నట్లు, తనదాకా వచ్చి ఆగింది. రెండు బలిష్టమైన చేతులు అతని చంకక్రింద దూరి అతన్ని బంధించాయి.

అతని వ్యూహం తప్పయింది.

ఆరు సంవత్సరాల ఖైదు పడింది.

లాఠీదెబ్బలు తగిలిన చౌకీదారు జీవితాంతం మతిభ్రష్టుడయ్యాడని, డాక్టర్లు నిర్ధారించడంవలన, అతని శిక్ష రెట్టింపు చేశారు.

ఈ రోజు అతను విడుదల అయ్యాడు.

ఐదు సంవత్సరాలు తాను "తరువాత చూద్దాం, తరువాత చూద్దాం" అని వాయిదా వేసిన సమయం హఠాత్తుగా ముందుకు వచ్చి నిలబడింది, "ఈవేళే చూడాలి" అని.

సుమారు యిరవై, యిరవై అయిదు వేల రూపాయలు విలువుండే నూరు రూపాయల నోట్లకట్టలు, తనకి తప్ప మరెవ్వరికీ తెలియకుండా పొట్టలో పెట్టుకు నిశ్చింతగా నిద్రిస్తున్న ఆ బాల క్రీస్తు విగ్రహంకోసం వేట మొదలుపెట్టాడు. ఆ డబ్బు తనకి తిరిగి దొరికితే ఈ దొంగతనం చేసే వృత్తికి శాశ్వతంగా స్వస్తి చెప్పాలని అతను గట్టిగా నిశ్చయించాడు.

రైలు అతని గమ్యస్థానానికి చేరుకునేసరికి జైలునుండి విడుదలైన పిమ్మట అది మూడవ సాయంత్రం. అతని నెత్తిమీదా, బట్టలమీదా ధారాళంగా బొగ్గుపొడి పడింది. వాళ్ళంతా నల్లులు పట్టి తిరుగుతున్నాయి. "ఎన్ని మార్పులు వచ్చినా, ఈ

రైలు ప్రయాణం యిలాగే వుంటుంది'' అని చాలాసేపైన తరువాత కాస్త తేలికగా, ఆలోచించి తనలో తను నవ్వుకున్నాడు.

ఆ వూరు బాగా మారింది. జనాభా పెరిగిందని, పెరిగిన జనసంచారం తెలుపుతోంది. క్రొత్త యిళ్ళు, క్రొత్త కట్టడాలు, ఎన్నో క్రొత్త వాహనాలు. రాత్రి చీకటిపడ్డా స్త్రీలూ, కన్యలూ నిర్భీతిగా తిరుగుతున్నారు. అయినా అయిదు సంవత్సరాల క్రితపు గుర్తులు పట్టుకుని స్థలాన్ని కనుక్కోవడం కష్టం కాలేదు.

చూడ్డానికి ఆ మార్వాడీవాడి దుకాణం వున్నచోట్లోనే, అలాగే వుంది. రెండు, మూడు క్రొత్త తాళాలు వేశాడు. అలాగే తలుపులకి అడ్డంగా పెద్ద పెద్ద యినప పట్టీలు తగిల్చాడు. దుకాణందగ్గర ఒక నవయువకుడు కూర్చున్నాడు. బహుశా అతని కొడుకు కాబోలు. ఆ చౌకీదారు గురించి ఆలోచన ఒక క్షణం కలిగింది. పాపం ఎలాగున్నాడో?

ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. అతను పూర్తిగా అలసిపోయాడు. ఆకలి కూడా వేయసాగింది. తను అలవాటుగా వెళ్ళే 'మఠం' కోసం వెతికాడు. ఆ హోటల్ వంటి మఠంలో భోజనం, స్నానం, నివాసం తన తాహతుకి తగ్గట్టే, చవకలో లభ్యం అవుతాయి. వేడినీళ్ళతో స్నానం చేసి, భోజనం చేయడానికి కూర్చున్నాడు. రెండు ముద్దలు నోట్లో పడగానే, ఆలోచించాడు. జైలులో పెట్టిన తిండికీ, యిక్కడ భోజనానికీ బొత్తిగా తేడా కనిపించలేదు. వేడి వేడి అన్నం, చాపలు వేసి వొండిన పులుపూ, కారపు పులుసూ, అరటికాయ ముక్కల వేపుడుకూర అతడికి ఆకలితో వుండడం వలన మిగల్చకుండా తినగలిగాడు.

భోజనం కడుపులో పడడంతో, కొత్త శక్తి, కొత్త వుత్సాహం అతడి శరీరానికీ, నరాలకీ వచ్చింది. భోజనం అయాక, పళ్ళని పరిశుభ్రంగా కొబ్బరాకు చీఅతో తోముకుంటూ, మరుసటి రోజు కార్యక్రమం గురించి ఆలోచించసాగాడు.

  

మర్నాడు అతను, అనుకున్నదానికంటే ముందు, తెల్లవారుఝామునే నిద్ర లేచాడు. బాల సూర్యుడి ఉదయ కిరణాలు అతని గదిలోకి వచ్చి స్వాగతం పలికాయి. బయట మంచుపడి బాగా చలిగా వుంది. వేడి వేడి కాఫీ కడుపులో పడగానే, అతనికి హుషారు వచ్చింది. తన పాతకోటు బయటకి తీసి తొడుక్కున్నాడు. మెడకి ఒక 'మఫ్లర్' (ఉన్నిబట్టతో నేసిన ముసుగు) చుట్టుకున్నాడు. ఆ మఫ్లర్‌లో అతని

తల సగం మరుగుపడింది.

అతడు హోటల్ బయటకి వచ్చాడు. చల్లని, మంచుతో నిండిన వాతావరణంలో అతనికి వొణుకు పుట్టింది.

ఆ విగ్రహాలు చేసే శిల్పి యిల్లు మారలేదు. ఉన్న స్థలంలోనే ఎప్పటిలాగ వుంది. ఆ మొత్తం వీధిలో ఏ మార్పూ లేదు. బయట నుండే అతను లోపల ఎలా వుందో జాగ్రత్తగా పరిశీలించాడు. ఎవరూ అనుమానించకూడదని, ఆ వీధిలో కూడా అప్పుడప్పుడు చూస్తున్నాడు. ఆ యింట్లో శిల్పకారుడు వున్న సూచనలు లేవు. అక్కడ ప్రాంగణంలో ఏ మూర్తులూ కనిపించడంలేదు. బహుశా అద్దెకుంటున్న ఆ శిల్పకారుడు యిల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడా? ఐదు సంవత్సరాల సుదీర్ఘకాలంలో ఏదైనా సాధ్యం!

అయినా చూద్దాం...

అనుకుంటూ అతను గేటు తోసుకుని ఆ యింట్లోకి ప్రవేశించాడు. లోపలికి వెళ్తుంటే గదుల బైట ఒకచోట కొన్ని చిన్నసైజు పాతబడిన విగ్రహాలు కనిపించాయి. అలాగే కొన్ని విరిగిన విగ్రహాల తునకలు కూడా కనిపించాయి. హమ్మయ్య అదే శిల్పకారుడు వుంటున్న గది - ఏమీ మారలేదు - అని గొప్ప ఉపశమనంతో నిట్టూరుస్తూ, ముందుకి అడుగు వేశాడు. ఐదు సంవత్సరాల క్రితం జరిగిన మహత్తర దృశ్యం, తను జైలులో సదా స్మరించుకున్న ఘట్టం జరిగిన చోటుకి అతను మామూలుగా, ఏ భావం లేకుండా నడిచాడు.

నీళ్ళచప్పుడు విన్నాడు. ఆ గదులకి కొద్దిగా దూరంగా వున్న బావిలో ఎవరో అమ్మాయి నీళ్ళు తోడుతోంది. అతన్ని చూడలేదు.

బావి దగ్గరకి వెళ్ళాడు. ఆమె బట్టలుతుకుతోంది.

చల్లటినీళ్ళకి ఆమె కాళ్ళూ, చేతులూ కొంకర్లుపోతున్నట్టు వున్నాయి. ఆమె వొంగొని బట్టలు, బక్కెట్టులో పిండుతోంది. ఆమె యవ్వనం, వుబ్బిన స్తనాలూ ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ఆమె పొడుగైన, నల్లని కేశాలు భుజంమీదుగా ఒకవైపుకి జారాయి - నల్లని జలపాతంలా. ఆమెకి అతని ఉనికి తెలియలేదు.

"కాస్త నీళ్ళు యిస్తారా త్రాగడానికి."

అతని గొంతుక విని ఆమె అకస్మాత్తుగా, తత్తరపడి చూసి, తనని సరిచేసుకుని నిలబడింది. ఒక్క వుదుటున తలమీది కేశాలు సరిచేసి వెనక్కి దోపింది.

"హఁ!" అని "నేను హడలిపోయాను. మీ అడుగుల చప్పుడు నేను వినలేదు."

అందమైన చంద్రబింబంలాంటి ఆమె ముఖం, వర్చస్సు, కళ, కళ్ళల్లోని ముగ్ధభావం యివేవీ అతను పట్టించుకున్నట్టులేదు. అతని ఆలోచనలన్నీ అతను దాచిపెట్టిన 'భాగ్యం'మీదనే వున్నాయి.

"నీకు దాహం వేస్తోందా?" అని ఆమె అంటూ క్రీగంట గేటు (ద్వారం) కేసి చూసింది.

"కాస్త వుండు. వేడి వేడి కాఫీ తెస్తాను."

అతను మౌనంగా నిల్చున్నాడు.

"కథ బలేగా ఆరంభమయింది" మనస్సులో అనుకున్నాడు అతడు. "ఎవరైవుంటుందీ ఈ అమ్మాయి? ఆ శిల్పి కూతురా?"

అతను దగ్గర్లోని ఒక రాయిమీద కూర్చున్నాడు. ఐదు నిమిషాలలోగా ఆమె ఒక 'టంబ్లర్' (పెద్ద కాఫీ కప్పు) తీసుకుని బయటకొచ్చింది.

"పాలు కాస్త తక్కువ పడ్డాయి" అని అంటూ ఆమె 'టంబ్లర్' అతనిచేతికి అందించింది.

"నువ్వు?" అడిగాడు.

"నేనిప్పుడే తాగాను" ఆమె అంది.

"నాన్న బయటకి వెళ్లాడా?" అతను ఆమెని చూడకుండా, కాఫీకప్పుకేసి చూస్తూ అడిగాడు. కొన్ని క్షణాలు భరించలేని నిశ్శబ్దం!

"నీకు తెలియదా?" ఆమె విషాదకరమైన గొంతుకతో అడిగింది.

"తెలియదు."

"నువ్వు మా నాన్న స్నేహితుడవా?"

"ఆయన తెలియందెవరికీ? గొప్ప శిల్పకారుడు."

"నాన్న పోయి రెండేళ్ళయింది."

"నీ పేరేమిటీ? నువ్వు నాన్న మిత్రుడివా?"

ఆమె ప్రశ్నలకి జవాబివ్వకుండా అతను కాఫీ త్రాగడం పూర్తిచేశాడు.

"అతని శిల్పకళమీద నాకెంతో అభిమానం," అతను మాటలు జాగ్రత్తగా తూచుతూ అన్నాడు.

"నిన్ను ఎప్పుడూ చూసిన గుర్తులేదు. నేను ఆ శిల్పి కూతురునని నీకెలా తెలుసు?"

"ఐదేళ్ళక్రితం..." అంటూ, ఆమె మాటలూ, వేసిన ప్రశ్నా విస్మరిస్తున్నట్లు, అతను అన్నాడు;

"ఐదేళ్ళక్రితం ఆయన ఒక అపూర్వ అద్భుత శిల్పాన్ని నాకు చూపించాడు. ఆయన ఆ సంవత్సరం క్రిస్మస్‌కి చేసిన బొమ్మలలో అత్యంత ఆకర్షణీయమైనది..."

"ఓ అదా...! గొఱ్ఱెల గోటంలో బాల జీజస్ (క్రీస్తు ప్రభువు) పడుకున్న దృశ్యం, దగ్గర్లో మోకాళ్ళమీద వొంగొని జోసఫ్, మేరీ మాత... అదేనా?"

ఆమె మాటలు అతి జాగ్రత్తగా వింటున్న అతని గుండెలు క్షణంసేపు ఆగినట్టయింది.

"కావచ్చు" అతను తక్షణం అన్నాడు. "దానికంటే మించి బాగున్న బొమ్మలున్నాయి - నా ఉద్దేశ్యంలో" అని, కొంతసేపటివరకూ ఎవరూ మాట్లాడలేదు.

"ఆ సంవత్సరం నాన్న అద్భుతమైన బొమ్మలెన్నో చేశాడు. అప్పుడు నేను పదిహేను సంవత్సరాల వయస్సుదానిని. నాకు ఆ బొమ్మ బాగా జ్ఞాపకం - ఆ బాల జీజస్ బొమ్మ -" ఆమె చెప్పుకుంటూపోతోంది.

"అది యిప్పుడూ ఉందా?"

"ఉంది ముక్కలయి! కానీ..." ఆమె అకస్మాత్తుగా ఆగింది.

"కానీ...అంటే?" అతను ఆతృతని దాచుకుంటూ అడిగాడు - అసలు విషయానికి వస్తోందని గ్రహించి.

"కానీ... ఆ బొమ్మకి ఎందువల్లనో రావలసినంత ప్రశంసలు రాలేదు" అని, ఆమె దృష్టి తప్పించి దూరంగా చూస్తూ, ఏదో ఆలోచనలో వుండి అంది.

"ఇప్పుడు మా చర్చికి క్రొత్త రూపం యిస్తున్నారు. ఎన్నో మార్పులూ, చేర్పులతో. పాత బొమ్మలంటే ఎక్కువ లక్ష్యం చూపడంలేదు. మా చర్చిలో ఏడాదికొకసారి పాత క్రిస్మస్ 'క్రిబ్'లు (పశువుల 'గూటంలో ఏసు జన్మించే దృశ్యం) బొమ్మలు పెట్టి నక్షత్రాలతో, రంగుల తగరం కాగితాలతో, ప్రత్యేక దీపాలతో అలంకరిస్తారు. జనం వచ్చి చూడడానికి. కానీ యిప్పుడు..."

"ఏమిటి, యిప్పుడు...?"

"గత ఏడాది నుంచీ ఆ పెద్ద బొమ్మ మూలపడేశారు."

"ఎక్కడా? మీ చర్చిలోనేనా?" అతని గొంతుకలో కంపన ధ్వనించింది.

"అవును" ఆమె ఖచ్చితంగా అంది.

"మా చర్చికోసమే నాన్న ప్రత్యేకంగా దానిని చేశాడు" ఆమె చెప్పుకుంటూ పోతోంది : "అవును - మా చర్చికోసమే. కానీ ఏంలాభం? ఆ "క్రిబ్" వుంచే ప్రదేశంలో యిప్పుడు ఒక అటక కట్టారు పాత వస్తువులు పడెయ్యడానికి. వరండాలో యిప్పుడు జాగా లేదుట ఆ 'క్రిబ్'కోసం."

"అంటే నువ్వనడం..."

"కాదు - అలా కాదు. ఇప్పుడూ 'క్రిబ్'లు - గోశాలలో ఏసు - దృశ్యం చేస్తున్నారు. కానీ చాలా చిన్న నమూనాలతో.

"మరి ఆ పెద్ద బొమ్మ ఎక్కడుందిట!"

"ఆ బొమ్మ 'సాక్రిస్టీ' (చర్చిలో పాత్రాది సామగ్రి వుంచే గది) వెనకగదిలో వుంది. ఏమైనా అవనియ్యి, ఈ సంవత్సరం ఆ బాల జీసస్‌ని..." ఆమె హఠాత్తుగా ఆగి, గేటువైపు చూసింది. అతనూ ఆమెతోబాటుగా అటువైపు చూశాడు. ఒక మధ్యవయస్సు స్త్రీ గేటు తెరుచుకుని లోపలికొస్తోంది.

"నీలాంటి పరిచయంలేని పరాయి మనిషితో యింతసేపూ ఎందుకు మాట్లాడానో పిచ్చిదాన్ని నాకే తెలీదు."

ఆ స్త్రీని చూడగానే, ఆ అమ్మాయి పూర్తిగా కలవరమయినట్టు కనిపించింది. కాఫీ 'టంబ్లర్' (గిన్నె)ని గబుక్కున దాచేసింది.

"నువ్వింక వెళ్ళడం మంచిది" ఆమె సూచించింది. అతడు రాయిమీద నుంచి లేచి నిలబడ్డాడు.

"నాన్న ప్రేమతో, శ్రమతో చేసిన ఆ బొమ్మమీద నాకు మంచి విశ్వాసం." ఆమె తనలో తను గొణుక్కుంటోంది - బట్టలుతికిన బకెట్టువైపు చూస్తూ. " ఆ బొమ్మమీద శ్రద్ధచూపించావు. నిన్నూ కరుణిస్తుంది. ఈ క్రిస్మస్ మరి రెండురోజులుంది... నా అత్తయ్య వచ్చేలోగా నువ్వు వెళ్ళు - పుణ్యం వుంటుంది."

అతను బయటికి వెళ్ళడానికి తిరిగాడు. వెళ్తూ, వెళ్తూ ఆమె అత్తయ్య తారసబడింది. ఆమె అతన్ని అనుమానంగా, తీక్షణంగా చూసింది.

అతను ఆమెని చూశాడు. ఇద్దరి చూపులూ క్షణంసేపు నిశ్చలంగా వున్నాయి. తరువాత అతనివైపుగా వుమ్మింది. "ఒక యువకుణ్ణి తీపిమాటల్తో, వశపర్చుకుంది

కులత. ఇప్పుడు మరో, మరో ప్రాయంవున్న మగాణ్ణి మచ్చికచేసుకొంటోంది. నంగనాచి లంజ" ఆమె కఠోర శబ్దాలు అతనివెనక వినబడ్డాయి.

ఆ మాటలు అతనికేం ప్రభావం కలిగించలేదు!

"నాకు కావలసిన సమాచారం దొరికింది" అతను తనకు తనే అనుకున్నాడు, మనస్సులో.

"వాళ్ళ వ్యవహారాలు నా కనవసరం."

గేటు బయటకి వస్తూంటే, ముందు స్ఫురించని ఒక విషయం జ్ఞప్తికి వచ్చింది. ఐదు సంవత్సరాలకి పూర్వం రాత్రివేళ చిన్న శిశువు రూపంలోని ఏసుప్రభువు తెరిచిన కరమకలాలు (చేతులు) తన శిరస్సుని తాకాయి. ఇప్పుడు అయిదు సంవత్సరాలే కాదు, మరెన్నో సంవత్సరాల తరువాత తన కాళ్ళు 'చర్చి' ప్రాంగణంలోకి తనని అప్రయత్నంగా తీసుకువెళ్ళాయి. లోపల పగటిపూట ప్రార్థనలూ, పూజలూ జరుగుతున్నాయి.

చర్చి పరిసరప్రాంతంలో ఎన్నో పనులు జరుగుతున్న హడావిడీ, కలకలం చూశాడు. ఏవో ఎదురుగడలు (బొంగులు) భూమిలో గొయ్యి త్రవ్వి నాటుతున్నారు. కొందరు ఆ బొంగులకి రంగులేస్తున్నారు. ఆ చర్చికి సంబంధించిన యువకులు, చర్చి మూల మూలలూ శుభ్రం చేస్తున్నారు. దారిపొడుగునా రంగుకాగితాలతో, ఝుడగలతో, తగరపు నక్షత్రాలతో అలంకరిస్తున్నారు. చర్చి ముఖద్వారపు శిఖరాగ్రాన్న వున్న తోకచుక్క ముందే అమర్చినట్టుంది. అది నిలువెత్తు మనిషి అంత వుంది. వేళ్ళాడుతూ, గాలికి కదులుతోంది - యిటూ, అటూ. పిల్లలు టపాకాయలు కాలుస్తున్నారు. హఠాత్తుగా దగ్గర్లో వచ్చిన చప్పుడుకి జడిసి గెంతాడు. తరువాత నవ్వుకొన్నాడు. అన్నిచోట్లా ఆనందం, ఉల్లాసం, సంగీతం, నాట్యం క్రిస్మస్ వేడుకలు నిండాయి.

ఒకప్పుడు, తను కూడా ఈ క్రిస్మస్ వేడుకలకోసం ఎదురుచూసేవాడు. ఆ వేడుకలలో పాల్గొని నవ్వేవాడు, నృత్యం చేసేవాడు, సంతోషానందాలలో భాగం పంచుకునేవాడు - అందరిలాగే. ఆ తలపులు కట్టిపెట్టి, వర్తమానంవైపు దృష్టి మలిపాడు.

ఒక యువకుడు అతని దగ్గరికి వచ్చాడు. "నువ్విక్కడ వూరికే ఎందుకున్నావు?" అని అడిగి, మళ్ళీ అన్నాడు, "చర్చిని శుభ్రం చేస్తున్నాము. నీకు

కావాలంటే రెండ్రోజులు పని యివ్వగలరు. ఈ భాగం అలంకరిస్తున్నారు. ఈ చర్చిలో క్రిస్‌మస్ చాలా గొప్పగా చేస్తారు.'' అతను ఆగి - హఠాత్తుగా ఆ దొంగని శూన్యంలో చూస్తున్నట్టు, తేరిబార చూశాడు.

''చర్చిలోపల శుభ్రం చేసేపనివుందా?'' దొంగ ఆ యువకుణ్ణి ప్రశ్నించాడు.

''అవును...''

''చర్చిలోపల?''

''అలా ఎందుకడుగుతున్నావు? చర్చిలోపల మైల (అశుభ్రత) వుండదా?'' ఆ యువకుడు ఎదురుప్రశ్న వేశాడు. ''నీకు మజూరీ యిస్తారులే'' అని భరోసా యిచ్చాడు. ''నేను యిక్కడి 'మారియాళ్ సోడెలిటీ ప్రిఫెక్ట్'...''

''ఎక్కడనుంచి ప్రారంభించను?'' దొంగ అడిగాడు - అతన్ని మధ్యలోనే ఆపి.

ఆ ఎముకలు కొరికే చలిలో, వొళ్ళంతా చెమటలు క్రక్కేలా, అతను పనిచేశాడు. అయినా ఆ 'సాక్రిస్టీ' (చర్చిలో పాత్రలూ వగైరా వుంచే కొట్టు) గదిలోకి వెళ్ళి పనిచేసే అవకాశం అతనికి దొరకలేదు. ఆ గది తలుపులు వేసేశారు. ఆ తలుపులు తెరవడం అతనికి పెద్ద పనికాదు. కానీ ఆ గదికి దగ్గర్లో ఒక పాదిరీ రాత్రిం పగళ్ళు కూర్చుని అదేపనిగా ప్రార్థనలు చేస్తున్నాడు. పైగా చర్చిలో వచ్చేపోయే భక్తులతోటీ, పూజా పురస్కారాలతోటీ ఎంతో సందడిగా వుండడం వలన ఎవరికంటికీ పడకుండా, తాళం బ్రద్దలుకొట్టి ఆ గదిలో ప్రవేశించడం అసంభవం అయింది.

ఒక విధంగా చెప్పాలంటే అతని సహాయం, అక్కడ పనిచేస్తున్న యువకులందరికీ బహు ఉపయోగమయింది. ''ఇలారా ... ఇది పట్టుకో ... అది కట్టు ...'' అని పురమాయిస్తూ, ఆ యువకులు అతన్ని పనిలో ముంచేశారు. 'క్రిస్‌మస్' పండగ ఉల్లాసము, ఉత్సాహము, చురుకు అతనిలో అవలీలగా ప్రవేశించింది - అతనికే తెలియకుండా! ఈ ఉత్సాహం ధార్మిక గ్రంథాలలో బోధించిందికాదు.

ఒక యువకుడు తన క్రొత్త 'సూటు' (దుస్తులు) గురించి చెబుతూంటే, మరొకడు తన బట్టలు ఎంత ఆధునిక పద్ధతిలో కుట్టించాడో బడాయిలు చెబుతున్నాడు. కొందరు కుఱ్ఱాళ్ళు అమ్మాయిలవంక చూస్తూ - అది ఎలా సింగారించుకుందో చూడు - ఇది ఏమిటి ప్రదర్శిస్తోందో చూడు - అంటూ ఎగతాళి చేస్తున్నారు. అమ్మాయిలు కూడా ఈ ఆటలో వెనకబడలేదు. ''ఫలానా అబ్బాయి

నాకు రెండు ముద్దులు ఇచ్చాడు" అని ఒక అమ్మాయి, మరో అమ్మాయికి చెప్పడం అతను విన్నాడు. అమ్మాయిలందరూ ఒక గుంపుగానూ, అబ్బాయిలందరూ వేరే గుంపుగానూ ముచ్చటించుకుంటున్నారు. రెండు వర్గాలలోనూ తాత్కాలిక కోరికలూ, కాంక్షలూ ఉబుకుతున్నా వాటిని అణుచు కుంటున్నారు. వారి వారి రహస్య సంభాషణలు - గుసగుసలు సాగుతున్నప్పుడు, అతను అక్కడ వున్నా లేనట్లు, మనస్సు మరేదో పనిమీద నిమగ్నమయినట్లూ నటించేవాడు.

"నాకెందుకీ రంకుమేళం" అని తనలోతను గొణుక్కున్నాడు.

ఈ యువకుల మధ్య వారికి పని పురమాయిస్తూ తిరుగుతున్న చర్చి అధికారి సహాయ ఉద్యోగి ఒకడు గంటక్రితం ఎవరితోనో జరిపిన సంభాషణ అతనికి గుర్తుకొచ్చింది.

"చర్చిని నవీన పద్ధతిలో రూపొందిస్తున్నాం"

"చర్చిలోపల మైల సంగతేం చేస్తున్నారూ?" ఈ ప్రశ్నకి జవాబు వినపళ్లేదు. డిసెంబరు ఇరవై అయిదవ తారీఖున 'క్రిస్మస్' రోజు తను ఏ సమయంలో సురక్షితంగా 'సాంక్రిస్టీ' వెనక నున్న గదిలోకి ఎలా దూరాలో అతను ఖచ్చితంగా వ్యూహం పన్నాడు.

మధ్యరాత్రి ప్రార్థనలు ముగిశాక జనం బయటకొచ్చి, జమకూడి 'హౌసీ' (అంకెల ఆట) ఆడుతున్నప్పుడు; మధ్యరాత్రి ప్రార్థనలు ముగిశాక జనం 'చర్చి' బయటకొచ్చి ముచ్చటిస్తున్నప్పుడు; మధ్యరాత్రి ప్రార్థనలు ముగిశాక యువతీ, యువకులు ఎవరికి, ఎవరితో ఎన్ని ముద్దులు లభ్యం అయ్యాయో పద్దులు వేస్తున్నప్పుడు ...

అన్ని దారులూ 'చర్చి'కే దారితీస్తున్నట్లు, తండోపతండాలుగా జనం వస్తున్నారు. చర్చిలో ప్రార్థన సమయంలో కూర్చోడానికి జాగా దొరకాలనే ఉద్దేశ్యంతో రాత్రి పదిన్నర, పదకొండు గంటలమధ్యనే జనం ఎక్కువమంది వచ్చారు. ఎంతోమంది అమ్మాయిలూ, స్త్రీలూ వేరేగా గుమికూడి నిలబడ్డారు. అలాగే సూటు, బూటూ వేసుకున్న మొగాళ్ళూ, జంటగా వచ్చిన భార్యా, భర్తలూ నిలబడ్డారు.

చర్చి గాయకుల బృందం (Choir) తమ గానం ప్రారంభించారు.

రంగురంగుల విద్యుత్ దీపాలతో, ఇతర అలంకరణలతో శోభాయమానంగా 'చర్చి' ప్రాంగణం భాసిస్తోంది. ఇటూ, అటూ పిల్లలు పరిగెత్తుతున్నారు. జనం

చర్చిలోకి వెళ్ళడంవలన, బయట ఎక్కువమంది లేరు. దారికి కొద్ది దూరంగా ఒక మూల ఎవరో చలిమంటలు వేశారు. అతడు (దొంగ) అక్కడికి చేరి, బీడీ కాలుస్తూ, కాస్త వేరేగా, వొంటరిగా నిలబడ్డాడు.

ఆ చర్చి అధికారులు 'మారియల్ సోడిలిటీ' (మ్యారీ మాత భక్తుల సంఘం) 'ప్రిఫెక్ట్' (నిర్వాహకుడు) అతనికి రెండు రోజుల కూలీ చెల్లించారు. రాత్రి ప్రార్థనలనంతరం చర్చిలోపల వుంచిన అదనపు బెంచీలు, బయటకి తీసిపెట్టడంలో సహాయం చేయమని వినతి కూడా చేశారు.

ఆ తరువాత అతను ఎందుకో నీరసపడ్డాడు. ఒక విధమైన కురూపం అతన్ని ఆవరించింది. నిర్జీవంగా నిలుచున్నాడు.

అకస్మాత్తుగా చలి ఆవరించింది.

మధ్యరాత్రి నిదానంగా వస్తోంది.

ఏడాదిలో ఒక్కసారే వచ్చే ఆ మధుర సమయం ఆసన్నమయింది. ఏడాదికి ఒక్కసారే భావగాంభీర్యంతో వినిపించే సుందరగీతాలు, క్రీస్తుప్రభు జన్మదిన గీతాలు పవిత్రమైన చర్చి ప్రాంగణంలో ప్రతిధ్వనిస్తున్నాయి. క్రిస్మస్ రాత్రి ఆవిర్భవిస్తోంది, వేలాది భక్తుల కంఠాల వైతాళిక గీతాలతో, భక్తితో, ఉద్వేగంతో. ధూపపుపొగలు నెమ్మదిగా లేస్తున్నాయి.

మధ్యరాత్రి నిదానంగా వస్తోంది

మంట శిఖరంలా, అతనూ లేచి నిలబడ్డాడు.

ఒకప్పుడు, ఒక కాలంలో తను...

''ఒద్దు, మళ్ళీ నేను ఆ కాలంలో, ఆ బ్రతుకులో అడుగు వేయను. వెనక్కి వెళ్ళను''. అతను ఏదో సంఘర్షణలో పడ్డాడు. నేలకి పాతుకున్న అతని అడుగులు ముందుకు నడిచాయి - చర్చి దిక్కుగా.

తోసుకొస్తున్న జనసమ్మర్ధంలో అతనూ కలిసిపోయాడు. ఆ ప్రవాహంలో కొట్టుకు ముందుకు పోతూ, తన వర్తన యిక తనచేతిలో లేదని తెలుసుకున్నాడు. ఏదో అదృశ్యశక్తి - బహుశా దైవికశక్తి అతన్ని ఆవహించింది. లోపల భక్తుల దేవదర్శనంకోసం ఏర్పరచిన 'బాల్కనీ' (వసారా)లో ఒక మూల నిలబడ్డాడు.

ఆరాధన (Mass) ప్రారంభమయింది. నలుగురైదుగురు 'బిషప్' (మత గురువులు)లు తమ విధులు నిర్వహిస్తున్నారు. అదంతా అతనికి క్రొత్త. ఆ భాష,

ఆ మాటలూ ఎంత సుమధురంగా, తేటతెల్లగా వున్నాయి! ప్రసాదానికి ముందు కానుకలు అర్పించడం అతనికి విచిత్రంగా తోచింది. ఎవరో భక్తుడు చాలా పెద్ద - మనిషంత 'కేక్' తెచ్చాడు.

ఆరాధనలో పవిత్ర నమయం - 'కుంగార్' (భగవంతుడిని కరుణామయుడిగా కీర్తిస్తూ, తనవంటి అల్పజీవికి, పాపికి శరణు యిమ్మని, కటాక్షించమని నివేదించే ప్రార్థన) వచ్చింది.

ఆ 'కుంగార్' వేళ అతని కాళ్ళు కదిలినా, అతనికి ధైర్యం సన్నగిల్లింది.

"నేను అర్హుణ్ణికాను" అనే మాటలు అతని మనస్సులో అంతర్లీనంగా వున్న భావానికి రూపాన్నిచ్చి, అప్రయత్నంగా నోట్లోంచి రాలాయి!

భక్తులు మూడు, నాలుగు వరసల్లో నిలబడి 'కుంగార్' కోసం, తమ వొంతు ప్రత్యేక దర్శనం కోసం ఎదురు చూస్తున్నారు. అతను వున్న 'బాల్కనీ' ఖాళీ అయింది. అతను తన ఎడమవైపు చూశాడు.

పాత, పనికిరాని వస్తువులు వుంచే అటక క్రింద ఒక నిచ్చెన వుంది. ఆ నిచ్చెనకి ప్రక్కనే ఒక చిన్న ఖాళీ జాగాలో, ఏదో మొక్కుబడికోసం పెట్టినట్టు ఒక చిన్న 'క్రిబ్' వుంది.

ఎవరి దృష్టి ఆ చిన్న 'క్రిబ్' (పశువుల శాలలో క్రీస్తుప్రభువు బాల్యదృశ్యం) మీద వున్నట్లు లేదు.

'కుంగార్' సమాప్తమయింది. యువకులు జట్లు జట్లుగా బయటకి వస్తున్నారు. లోపలి దైవ కార్యపు కలాపాల శబ్దంకి మించి, బయట గుమికూడినవాళ్ళ గలాటా రాను, రానూ పెరుగుతోంది. చివర్న సమూహప్రార్థన (Mass) జరిపారు.

"బాల ఏసుకి ముద్దులిచ్చే ముహూర్తం" 'పాద్రీ' ప్రకటించాడు.

కొంతమంది ఆగారు. మిగిలినవాళ్ళు బయటకి దోవపట్టారు. చర్చిలో ముప్పాతిక భాగం ఖాళీ అయిపోయింది.

అతని భుజాన్ని ఎవరో తాకారు. వెనక్కి తిరిగి చూస్తే, ఆ వ్యక్తి 'మారియల్ సొడెలిటీ' (మేరీ మాత భక్తుల సంఘం) 'ప్రిఫెక్ట్' (కార్యదర్శి).

"ఇప్పుడు బెంచీలు బయటకి తీసుకెళ్ళాలి."

బెంచీలు (బల్లలు) బయటపెట్టే పని ప్రారంభించారు. ఆఖరి బెంచీని బయటకి మోస్తూవుంటే, అతని నుదుట చెమట పట్టింది. బెంచీలన్నీ బయట

పెట్టారు. అంతటితో అందరి దృష్టీ బయట కార్యక్రమాల మీదికి మళ్ళింది. అతను ఒక్కడే మిగిలిపోయాడు.

అలంకరించిన 'చర్చి' ప్రాంగణంలో 'క్రిస్‌మస్' రాత్రి వేడుకలు ఆరంభమయ్యాయి.

మధ్యరాత్రి. ప్రశాంతమైన రాత్రి.

'చర్చి'లోపల చాలా దీపాలు ఆర్పేసారు. కిటికీలూ, తలుపులూ మూసేస్తున్నారు.

"ఇదే మంచి సమయం" దొంగ అనుకొన్నాడు. చీకట్లో చీకటై అతడు లోపలికి దూరాడు. సుమారు పది, పదిహేను మంది మధ్యవయస్కులు లోపల మిగిలారు. అతను ఎవరిమీదా దృష్టివేయకుండా, తన పనిలో నిమగ్నమయ్యాడు. 'చర్చి'లో ఒక తలుపుమాత్రం తెరిచి వుంచి, మిగిలినవన్నీ మూసేశారు. ఒక స్తంభం చాటున అతడు పొంచివున్నాడు. బయట జరుగుతున్న సంబరాలూ, గలాటా అతనికి వినిపిస్తోంది. 'లౌడ్‌స్పీకర్' (Loud-Speaker) మీద ఎవరో, ఏదో అంకెలు అరుస్తూ అంటున్నారు.

నీడలో నీడ అయినట్లు అతడు 'సాక్రిస్టీ' దగ్గరకి చేరాడు. 'సాక్రిస్టీ' వెనక గది తలుపు తాళం వేసివుంది. ఎప్పుడూ అక్కడ దగ్గర్లో కనిపించే 'పాద్రీ' యిప్పుడు లేడు. దగ్గర్లో మరెవ్వరూ వున్న జాగలు లేవు. జేబులోంచి ఏదో చిన్న కత్తివంటి ఆయుధాన్ని తీశాడు. ఆ వస్తువు సహాయంతో, అవలీలగా 'సాక్రిస్టీ' వెనక గది తలుపులు బద్దలుకొట్టాడు.

లోపలికి వెళ్తున్నప్పుడు, ఎంతోకాలంగా మూసివున్న ఆ గదిలో ధూళి వాసన, గబ్బు వాసనా అతని ముక్కుపుటాలకి తగిలింది. గదిలో ఒక చిన్న గుడ్డి దీపం వెలుగుతోంది. ఆ దీపం చుట్టూ సాలెగూడు వుంది. ఆ సాలెగూడు అల్లిక రంగురంగుల సూర్యకిరణాలలా మెరుస్తున్నాయి. పాత సామాన్లు ఆ గదిలో రాసిగా పడివున్నాయి. రెండు, మూడు విరిగిన పాత కుర్చీలూ, ఒక విగ్రహం, ఏవో ఫోటోలు, పాత బల్లలూ, పూర్వం ఉపయోగించిన శిలువలూ, క్రొవ్వొత్తులు పెట్టే చట్రాలూ, గిన్నెలూ, తప్పాలాలూ, పాత పరదా బట్టలూ వగైరా వున్నాయి. వీటిమధ్య అతను వెతుకుతున్న మూడు మూర్తుల విగ్రహం కనిపించింది. అతని ప్రాణం లేచి వచ్చినట్లయింది.

మూడు మూర్తులు!

రెండు పెద్ద మూర్తులు - మోకాళ్ళమీద వొంగొని - వాటి మధ్య శిశువు. ఆ శిశువేనా?

ఐదేళ్ళ క్రితం బాలకుడు?

జాగ్రత్తగా ముందుకెళ్ళాడు. తాను ఐదు సుదీర్ఘ సంవత్సరాలు ఎదురుచూసేలా, చేసిన శిశువు? అతని గుండెల చప్పుడు, అతనికే వినిపిస్తోంది. ఆ శిశువు దగ్గరకి జరిగాడు.

ఇంతలో—

ప్రక్కనున్న 'సాక్రిస్టీ' గదిలో ఏదో అలికిడి. అతనూ స్తబ్ధుడై ఒక మూర్తిలాగ నిలబడిపోయాడు. ఎన్నో నిమిషాలు యుగాలుగా గడిచాయి. ఆ 'సాక్రిస్టీ' గదిలో శబ్దం క్రమక్రమంగా తగ్గుముఖంపట్టింది.

'క్రిస్మస్' రాత్రి వేడుకల శబ్దాలు అతనికి దూరంగా వినబడుతూనే వున్నాయి.

అతను తన ధ్యానం మళ్ళీ ఆ బాలుడిమీద కేంద్రీకరించాడు. ఆ శిశువు దగ్గరకి వెళ్ళే స్థలంలో మధ్యన అడ్డంగా మూడు నాలుగు కుర్చీలు - పాతవి వున్నాయి. వాటిని అతను మెల్లిగా - ఏమాత్రం శబ్దం కలగకుండా ప్రక్కకు జరిపాడు.

ఇప్పుడు—

అతనికీ, బాల ఏసుప్రభువుకీ మధ్య ఏ అడ్డంకులూ లేవు.

అతనికీ, బాల ఏసుప్రభువు లోపల దాచివుంచిన 'భాగ్యం' (డబ్బు)కీ మధ్య ఏ అడ్డంకులూ లేవు. అతను నవ్వాడు. భక్తితో మోకాళ్ళమీద వొంగొని ప్రణామం చేశాడు.

ఆ శిల్పం చేసిన కళాకారుడికి ఋణం ఆ శిశువులో స్పష్టంగా ద్యోతకమవుతోంది. జీవంతో వున్నట్టున్న ఆ మట్టిబొమ్మ కళ్ళల్లో దైవికశక్తి ప్రకాశిస్తోంది. తెఱచివున్న చిట్టిచేతుల్లో గట్టినిశ్చయాలు నిర్లిప్తంగా దాక్కున్నాయి. మరి ఆ బొమ్మ కడుపులో కరెన్సీ నోట్ల కట్టలు (తనపాలిటి 'భాగ్యం') వున్నాయి.

ఆ శిశువుని పైకి ఎత్తి తీసుకున్నాడు. ఆ మూర్తి బహు చల్లగా వుంది. తన చేతుల్తో శిశువు శరీరాన్ని నిమిరాడు.

ఆ బొరియ వున్న చోటుకి చెయ్యి వెళ్ళింది. చెయ్యి కంతలోపలికి దూర్చి

వెతకసాగాడు.

కాదు ... విచిత్రం ... విద్యుత్ శక్తి తగిలినట్లు ... ఆశ్చర్యపోయాడు. డబ్బు దాచిపెట్టిన పొట్లం, పైన పేర్చిన బంకమన్ను సహితంగా ... సురక్షితంగా లోపల్నే వుంది. అది పొట్టలోపలి భాగంకి అతుక్కొని వుంది.

అతను నిట్టూర్చాడు. ఐదు సంవత్సరాలు తన నిరీక్షణ ఫలించింది!

బంకమన్నుతో చుట్టబడిన ఆ పొట్లం, ఆ శిల్పం లోపలి భాగంలో దాదాపు అంతర్భాగంగా వుండిపోయింది. దానిని విడదీయడానికి 'దొంగ' చాలా శ్రమపడ్డాడు. ఎలాగో కష్టపడి చివరికి విడదీశాడు. ఆ బంకమట్టి ముద్దలతో కప్పబడిన 'ప్యాకెట్' (పొట్లాం) వేళ్ళతో స్పృశించి చూశాడు. కరెన్సీ నోట్ల కట్టలున్న ప్యాకెట్ స్పష్టంగా వుందని తెలిసింది. ఆ నోట్లకట్టలు బయటకి తీయబోతూండగా –

ఆ గది తలుపులు తెరుచుకున్నాయి!

అతని వెనకభాగం (నడుం) తలుపువైపు వుంది. అతను ఏమాత్రం బెదిరిపోక తన ప్రాణాన్ని తక్షణం గట్టిరాయిగా చేసుకొన్నాడు. బాల ఏసుమూర్తి చేతుల్లో పెట్టుకుని మోకాళ్ళమీద సగం మాత్రం నిల్చుని వున్న అతని శరీరం మీద ఒక్క అణువైనా కదల్లేదు. కానీ అతనికి తెలియకుండానే, ఆ బంకమన్ను చుట్టిన వుండ (పొట్లాం) పడిపోయింది.

ఆ పొట్లాం చిన్న శబ్దంతో మళ్ళీ ఆ బాల ఏసు పొట్టలో పడి, లోపలికి పోయింది.

"ఎవరూ?" ఒక అమ్మాయి నాజూకు గొంతుక. మరెవ్వరి గొంతుకాలేదు. ఆమె ఒక్కర్తే వుంది. ఆ ముద్దుల బాల ఏసుమూర్తిని నేలమీద పెట్టి, అతను వొట్టి చేతులతో - పూర్తిగా రిక్తహస్తాలతో - నిలిచి - నెమ్మదిగా, నిదానంగా వెనక్కి తిరిగాడు. ఆ వచ్చిన అమ్మాయి అతని ఎదురుగా నిలుచునుంది. ఆ అమ్మాయే - అతని కుమార్తె!

"నువ్వా!" ఆమె ఎంతో ఆశ్చర్యంతో అంది, అతన్ని గుర్తుపట్టి. "ఇక్కడా? ఇక్కడకి ఆ బాల శిశువుని ఆరాధించడానికి వచ్చావా?"

అతను ఏ జవాబ ఇవ్వలేదు.

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఆమె ఉద్వేగంతో అంది :

"నాకు చాలా అభిమానంగా వుంది" రెండడుగులు ముందుకు వేసింది. తన చేతిలో వున్న పెద్ద బ్యాగు (సంచీ) నేలమీద పెట్టింది. "నా తండ్రిమీదా, ఆయన చేసిన కళాఖండంమీదా - యింత ప్రేమా, అభిమానం చూపించినవారు ఒక్కరైనా ఈ విశాల ప్రపంచంలో వున్నారని తెలిసి చాలా ఆనందం కలిగింది." ఆమె ఏకధారగా మాట్లాడింది. కాస్త ఆగి, ఆవేశం తగ్గించుకుని, ప్రియంగా అంది:

"నీకు నా క్రిస్మస్ శుభాకాంక్షలు. భాగ్యంతో, శాంతి సౌఖ్యాలతో నువ్వు వర్థిల్లాలని నా ప్రార్థన" అని ఆప్యాయంగా తన కుడిచేత్తో అతని భుజాన్ని తడుతూ. మళ్ళీ అంది :

"నువ్వు పరాయివాడివి. నీ పేరు కూడా నాకు తెలియదు. అయినా ఏదో అదృశ్యశక్తి మన యిద్దరినీ దగ్గరకి తెచ్చి, సన్నిహితులని చేసిందని నా నమ్మకం. నీలో మా నాన్న రూపాన్ని నేను చూస్తున్నాను."

ఈ మాటలు అన్నాక, ఆమె ముందుకి వెళ్ళి ఆ బాల ఏసు విగ్రహం ముందు, మోకాళ్ళమీద కూర్చుని వొంగింది "నా ముద్దుల బంగారు తండ్రీ, నా ముద్దుల బాల ఏసూ" అని దగ్గరకి తీసుకుని కాళ్ళకి ముద్దిచ్చింది.

"నాన్న చెప్పాడు - ఈ బాలుడిమీద ఎల్లప్పుడూ విశ్వాసం వుంచుకో. జీవితంలో ఎప్పుడు ముఖ్యమయిన అడుగు వేసినా ఈ బాలుణ్ణి తలుచుకో. ఈ బాలుణ్ణి ప్రార్థించు. ఈ వేళ రాత్రి నా జీవితంలో గొప్ప మహత్తరమైన రోజు. అందుకే నిన్ను తీసుకోవడానికని వచ్చాను!"

"...అందుకే నిన్ను తీసుకోవడానికని వచ్చాను."

ఆమె మాటలు 'దొంగ' విన్నాడు; ఖిన్నుడయ్యాడు.

"నువ్వు ఎక్కడికి పోతున్నావ్?"

ఆమె లేచి నిలబడింది. ఆమె మొహం మీద ఏదో వింత కాంతి వుంది.

"మొన్న నువ్వు మా యింటికొచ్చినప్పుడు నిన్ను - హఠాత్తుగా మా అత్త రావడం చూసి వెళ్ళిపొమ్మన్నాను. నన్ను క్షమించు. మా అత్త..."

"ఈ సంగతులన్నీ నువ్వు నాకెందుకు చెబుతున్నావు?" అతడడిగాడు, విసుగ్గా.

"నాకే తెలియదు." ఆమె సిగ్గుపడుతూ అంది. "మన మధ్య ఏదైనా బంధం వుంటే అది మా నాన్న చేసిన 'బాల ఏసు' విగ్రహం మహత్యం అని నాకు తోస్తోంది."

అతనేం అనలేదు.

"మేము ఈ వూరు వదిలి వెళ్ళిపోతున్నాం. రహస్యంగా పలాయనం చేస్తున్నాం" ఆమె నిగూఢరహస్యం చెప్పేసింది.

ఆమె తనతో తెచ్చి, నేలమీద పెట్టిన పెద్ద బ్యాగు (సంచీ) కథ అతనికి అర్థమయింది.

"మేము?" అతను ఆరాతీశాడు.

"నా ప్రేమికుడు" ఆమె క్షణం సిగ్గుపడింది.

"ఒక యువకుణ్ణి తీపిమాటలతో వశపర్చుకుంది కులట..." ఆమె అత్తయ్య మాటలు - అతని చెవుల్లో గింగురుమన్నాయి.

"ఇంకాసేపట్లో అతను యిక్కడికి వస్తాడు" ఆమె మెల్లిగా గొణికింది.

"ఈ బాలుడి బొమ్మని తీసుకుని మేము పారిపోతాం. ఒకానొకప్పుడు తన బాలుణ్ణి తీసుకుని ఆ భాగ్యవంతుడి కుటుంబం ఈజిప్ట్ దేశానికి పారిపోయింది. ఆ కథకీ మా కథకీ పొంతు కుదరదు... అయినా"—

"పొంతు ఎందుకనీ..." అతను తడబడ్డాడు. ఏదో తెలియని అసహాయత, నీరసం అతన్ని కబళిస్తోంది. అయితే ఈ దుర్బలత్వంలో ఏదో ఆధారం వున్నట్టు తోస్తోంది. ఈ విచిత్ర అనుభవం అతనికిది తొలిసారి.

"పరాయివాడా..." ఆమె అతనికి ఏదో చెప్పబోయి ఆగింది. నెమ్మదిగా ఆ బాలుడి విగ్రహాన్ని ఎత్తుకుని, తన భుజంమీదున్న శాలువ కప్పింది. డబ్బు దాచివుంచిన బంకమట్టి పొట్లాం ఆ బాలుడి విగ్రహంలోపల కదిలింది. ఆ శబ్దం అతడి సూక్ష్మపు చెవులకి వినిపించింది. అయితే, ఆమె ఆ ధ్వనిని గమనించలేదు.

"మా దగ్గర డబ్బూ, దస్కంలేదు." ఆమె చెప్పుకుపోతోంది.

"మేము కొత్త వూరికి వెళ్తున్నాం. ఆ కొత్త వూళ్ళో కొత్త జీవితం ప్రారంభించాలి. నాన్న ప్రేమాశీస్సులూ, నిజాయితీకీ గుర్తు ఈ శిశువు. ఇప్పటి 'చర్చి' ఆధునీకరణం వలన ఈ శిశువుకి స్థలంలేకపోయింది. అందువలన..."

ఆ గది తలుపు మళ్ళీ తెరుచుకుంది. ఒక యువకుడు గుమ్మందగ్గర నిలబడ్డాడు.

ప్రియా?

అవును. అతనే 'మరియాళ్ సొడెలిటీ' 'ప్రిఫెక్ట్'!

"దేవుడా!" అప్రయత్నంగా ఆశ్చర్యంతో పలికాడు దొంగ. ఎన్నో ఏళ్ళ తరువాత అతని నాలికమీద 'దేవుడ'నే పవిత్ర శబ్దం వచ్చింది.

"దేవుడా నువ్వు నన్ను పరీక్షిస్తున్నావా?" అంటూ అతను నేలమీద చతికిల పడ్డాడు.

"నువ్విక్కడ ఏం చేస్తున్నావ్?" 'ప్రిఫెక్ట్' గొంతుక తగ్గించి మెల్లిగా అడిగాడు.

"నీ మజూరీ (కూలీ డబ్బులు) నీకు ముట్టలేదా?"

"మజూరీ కంటే ఎన్నో రెట్లు ఎక్కువ నాకు ముట్టింది" అని అతనన్నాడు. నిజానికి ఈ మాటలు అతనివి కావు. అతనిలోని ఒక అజ్ఞాతశక్తి జాగృతమై అలా అనిపించింది.

"నీకు అతని పరిచయముందా?" ఆమె తన ప్రియుడి దగ్గరకి వెళ్తూ, అడిగింది.

"అతడు రెండు మూడురోజులు చర్చి అలంకరణలు చేస్తున్నప్పుడు సహాయం చేశాడు. ఇప్పుడు మనం తొందరపడాలి వెళ్ళడానికి."

ఆమె తన చెంపమీది కన్నీళ్ళ తడి తుడుచుకుంది. "నేను ఈ గదిలోకి వచ్చినప్పుడు అతను ఈ శిశువుని ప్రార్థిస్తున్నాడు వినయంగా మోకాళ్ళు మడిచి. నాన్న గురించి అతనికి తెలుసుట, మరి..."

"ఈ శిశువు నీకు కావాలా?"

ఆమె ప్రియుడు మధ్యనే అన్నాడు, ఆమెవైపు చూసి.

"అవును" ఆమె అంది, "కారణాలు తరవాత చెబుతాను."

"కానీ..."

"ఆ శిశువుని, ఆమెని తీసుకోనివ్వండి" అతను అకస్మాత్తుగా అన్నాడు. ఆమె, ప్రిఫెక్ట్ - యిద్దరి దృష్టి అతనిమీద పడింది.

"నీకు అంతా తెలుసా?" ప్రిఫెక్ట్ దొంగని సూక్ష్మదృష్టితో చూశాడు.

తరువాత ఆమెవైపు తిరిగి –

"నువ్వతనికి అంతా చెప్పావా?" అని వెంటనే - "అసలీ మనిషి ఎవరనీ?" అని మరో ప్రశ్న జోడించాడు.

"అది నీకవసరంలేదు" దొంగ అన్నాడు. "తెలుసుకోవలసిన విషయాలన్నీ తెలుసుకున్నాను. ఇప్పుడు మీరు తొందరపడండి. మీ క్రొత్త జీవితం ఆరంభించండి".

అప్పుడే ఏదో చప్పుడు వేసింది.

వాళ్ళిద్దరి మొహాలమీదా సంభ్రమాశ్చర్యాలు ఉదయించాయి. ఆమె ఆ బాలుణ్ణి తన గుండెల దగ్గరకి వొత్తిపట్టుకుంది. అలా పట్టుకుంటున్నప్పుడు ఉత్పన్నమైన చప్పుడు అది.

''ఈ బాలుడి పొట్టలో ఏదో వస్తువు వుంది'' ఆమె గట్టిగా ఆశ్చర్యపడి అరిచింది.

దొంగ అది చూడలేక కళ్ళు మూసుకున్నాడు. తన వ్యూహం ఫలించి, తన కలలు నిజమయి, తను తన లక్ష్యాన్ని సాధించబోయే, ఈ శుభసమయంలో ఏదో హంసపాదులా, ఏదో విపత్తు జరుగుతుందేమోనని హడలిపోయాడు.

''అవన్నీ చూసుకోడానికి తరువాత మీకు వేళదొరుకుతుంది. ఇప్పుడు మీరు తొందరపడండి'' అని సలహా యిచ్చాడు గబగబా.

ఆమె తయారయింది వెళ్ళడానికి.

''నువ్వు దయచేసి మా గుట్టు దాచివుంచు. నాకు వాగుడు అలవాటైంది!'' ఆమె అంది.

అతను జవాబుగా అన్నాడు.

''నీకు క్రిస్మస్ శుభాకాంక్షలు.''

''నీకూను.''

అంటూ ఆమె దగ్గరకి వచ్చింది.

''వెళ్ళేముందు ఈ శిశువుని ముద్దుపెట్టుకో'' అని ఆమె అంది, ఆ బాలుడిని నిలువుగా పట్టుకుని అతనికి దగ్గరగా చూపించి.

దొంగ వొంగుతూ ఆ బాలుడిని ముంచుకొస్తున్న దుఃఖంతో ముద్దు పెట్టుకున్నాడు. అతని కన్నీళ్ళు ఆ శిశువు బుగ్గలమీద రాలాయి. తల ఎత్తుతున్నప్పుడు, ఆ బాలుడి తెరిచిన హస్తం, అతని ముఖానికి తగిలింది - ఇది రెండవసారి...

ఆ హస్తపు స్పర్శ, ఒక వెచ్చని ప్రేమపూరితమైన అమృతగుళిక! ఆ రెండవ స్పర్శ అతని పాలిట శాశ్వత జ్ఞానస్నానం (Baptism).

ఆమె నిష్క్రమించింది - తన ప్రేమికుడితోబాటు - తన జీవితంలో క్రొత్త ఉత్సాహంతో, క్రొత్త శక్తితో క్రొత్త ప్రపంచం నిర్మించడానికి. ఆమెతోబాటు ఆ బాలుడి

మూర్తి, క్రిస్మస్ పండగ శుభాకాంక్షలూ, శాంతి తోడుగా వున్నాయి.

అయితే ఆమె, ఆ శిశువూ అతనికోసం, వెనక విడిచిపెట్టి వెళ్ళిన 'భాగ్యం' అమూల్యం, శాశ్వతం అని అతను తెలుసుకున్నాడు.



15

# లోతైన మడుగు

**- గజానన్ జోగ్**

అప్పుడే భోజనం చేసి అతను మంచంమీద పడ్డాడు. సాయంత్రం ఆఫీసు బెడదలేదు. (బ్యాంక్ ఉద్యోగి - శనివారం సగంరోజేపని) మర్నాడు ఆదివారం. రెండురోజులు కాస్త విశ్రాంతి అని అనుకొని చదువుతున్న డిటెక్టివ్ పుస్తకాన్ని టేబిల్‌మీద పెట్టాడు. బయట వర్షం కురుస్తోంది. ఇటువంటి సమయంలో కంబళీ కప్పుకొని పడుకొంటే హాయిగా వుంది.

ఇంతలో తలుపు చప్పుడైతే, అతను లేచి తలుపు తీశాడు. గుమ్మందగ్గర 'రంగా' నిలబడ్డాడు. 'రంగా' తన యిష్టమిత్రుడు - 'రానా' (ఒకవూరు) గ్రామం నివాసి - ప్రస్తుతం 'ఎల్.ఐ.సి.' (జీవిత బీమా) ఆఫీసులో వుద్యోగం చేస్తున్నాడు. 'రంగా'ని చూసి చాలా సంతోషించాడు. చిన్ననాటి మిత్రుడు. ఆ వూళ్ళో యిద్దరూ పక్క పక్కన యిళ్ళలో నివసించేవారు. తరువాత ఒకే స్కూల్లో, హైస్కూల్లో చదువు సాగించారు. మళ్ళీ ఎన్నాళ్ళకో...

"అరే, అలా గుమ్మం దగ్గరే నిలబడ్డావ్, లోపలికిరారా రంగా!"

"ఒద్దు లోపలికి రాలేను. ఆఫీసుకి వెళ్ళాలి. కాస్త ముఖ్యపని వుంది. చెప్పడానికి వచ్చాను."

"ఏమిటా ముఖ్యపని? కాస్త కూర్చో ముందు" అని, 'రంగా'ని లోపలికి పిలిచి మంచంమీద కూర్చోబెట్టాడు.

"మీ అత్తయ్య - అదే 'రానా' గ్రామవాసికి - ఒంట్లో బొత్తిగా బాగుళ్లేదని విన్నాను. మొన్న నేను ఆ వూరెళ్లాను. ఏదో పొలంపనిమీద. అక్కడ విన్నాను."

"నువ్వు వెళ్ళావా మా మా(వ ఇంటికి?"

"లేదు - వెళ్ళలేదు. మీ మావయ్య యింటికి వెళ్ళాలంటే నాకు సింహస్వప్నం.

నువ్వు అక్కడ వుంటున్నప్పుడు కూడా మరీ తప్పనిసరైతే నే వొచ్చేవాడిని - నీకా సంగతి తెలుసు'' అతను నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నానా? నిజం. ఆ యిల్లూ ఆ మాటకొస్తే, ఆ దారి అంటేనే నాకు వల్లమాలిన భయం. ఆ దారి - గోదారి - దాని చరిత్రే బహు గొప్పది - నీకు తెలియదనా? - ఆ సంగతి సరేగానీ, నేను వెళ్ళివస్తా. ఎందుకైనా మంచిది నీకు తెలియజేయాలని వచ్చాను. ఇప్పటికే ఆలశ్యం చేశాను. పన్ల హడావిడిలో జ్ఞాపకంరాలేదు.

"సీరియస్‌గా వుందా?... ఆమె అలా చాలాసార్లు అనారోగ్యంతో బాధపడేది.''

"అవును సీరియసే! అలా అని ఆ రోజు చెప్పారు ... సరే నే వెళ్లొస్తా!''

"అరే రంగా! ఆగు టీ చేస్తాను.''

"వద్దు. ఈసారి'' అంటూ అతను లేచాడు.

"సరే - అలాగే - నేను వెళ్ళివస్తే మంచిదనిపిస్తోంది. సి.ఎల్. (సెలవు) దరఖాస్తు రాసిస్తాను - కాస్త వెళ్తూ, వెళ్తూ మా ఆఫీసులో పడేయ్.''

"తొరగా రాయి మరి. సెలవుకి ముందే దరఖాస్తు ఎందుకురా? ముందే సెలవు తీసుకు తరువాత దరఖాస్తు అడిగితే ఆఫీసరు - మొహంమీద పడెయ్యడం - పెద్ద ఉపకారం చేసినట్లు - ఈ రోజుల్లో రివాజు...''

'రంగా' వెళ్ళాక, మరికొంతసేపు అతను కూర్చున్నాడు. మధ్యాహ్నం రెండున్నర అయింది. అత్తయ్య వూరుకి వెళ్ళాలా, వద్దా అని ఆలోచనలో పడ్డాడు. 'రానా' గ్రామంకి వెళ్ళాలంటే మూడు బస్సులు మారి ప్రయాణం చేయాల్సివుంటుంది. పైగా, ఆ మూడవ బస్సు దిగాక, అడవుల వెంబడి కాలిబాటమీద గంటా, గంటన్నర నడవాలి ... మరిప్పుడు తిన్నగా రోడ్డు వేశారు కాబోలు. రోడ్డు వేసినా బస్సు మాత్రం అక్కడికి ఎప్పుడూ వెళ్ళదు. ఉన్నవి మూడున్నర యిళ్ళు. చుట్టూ దట్టమైన అడవి. అక్కడ మనుష్యులు నివసించడమే విడ్డూరం. అతననుకున్నాడు. ఎందుకెళ్ళడం ఆ అడవి ప్రాంతానికి అని. కానీ తనకి ఈ అత్త, మాఁవలే దగ్గర బంధువులు. వాళ్ళ యింట్లోనే తను పెరిగాడు, చదువుకున్నాడు. అతనికి అత్తమీద ఎంతో అభిమానం. మాఁవ విచిత్ర మనస్తత్వం, అందరిలాగే అతనికీ నచ్చదు. మాఁవ ఎవ్వరికీ ఏ సహాయం చేయడు; ఎవ్వరితోనూ మనస్సు విప్పి మాట్లాడడు. నిజానికి అత్తయ్యతోటీ అతగాడి ధోరణి అంతే. ఆశ్చర్యం

ఏమిటంటే అత్తయ్య స్వయానా అతని చెల్లెలు కూతురు! కానీ అత్తయ్య అంటే అతనికి ఎంతో వాత్సల్యం వుండేది. గంటకి పైగా దూరమున్న స్కూలునుంచి, అడవులవెంట నడిచి కాలినడకన వచ్చింతరువాత, గుమ్మందగ్గర ఎదురుచూస్తూ నిల్చునేది. ఇంటికి సమీపంలోకి రాగానే దగ్గరే మోకాలి లోతున ప్రవహిస్తున్న చిన్న నదికేసి వేలుచూపించి, కాళ్ళూ చేతులూ శుభ్రం చేసుకుని యింట్లో అడుగుపెట్టమని పురమాయించేది. ఆమె అంతర్భావం, అలసి వచ్చిన నాకు ఏ మాత్రం ఆలశ్యం కాకుండా వేడి వేడి భోజనం వడ్డించడమే! మండే బొగ్గులమీద పెనంపెట్టి తాజాగా తయారుచేసిన "బాక్రీ" రొట్టెలు (జొన్న, గోధుమ, రాగి వగైరా దినుసులు రుబ్బి, ఆ పిండితో చేసే ఒక విధమైన దళసరి రొట్టె ఈ ప్రాంతంలోనూ, మహారాష్ట్రంలోనూ ప్రసిద్ధి) ఒక చేత్తో కాలుస్తూ, మరో చేత్తో వడ్డించేది. దానిమీద ('బాక్రీ' రొట్టె) ఒక పోకచెక్కంత వెన్నముద్ద తప్పనిసరిగా పడేది. వడ్డన అయ్యాక, నా విస్తరి ముందే నాకు చిరాకు వేసేలా నిల్చుని, నే నెలా తింటున్నానో పర్యవేక్షణచేసేది. నిజం చెప్పాలంటే కడుపులో కరకరా ఆకలేస్తున్నా, ఆవిడ అలా ఎదుట నిలబడితే భయంవేసి, ఆకలి పోయేది.

అతడు ప్యాంటూ, షర్టూ చేతికి దొరికినవి వేసుకుని, టెబిల్‌మీదున్న డిటెక్టివ్ నవల, తనకి అవసరమయే చిల్లర వస్తువులూ 'బ్యాగ్'లో దోపుకుని (వాటిలో ముఖ్యమయినది టార్చ్‌లైటు, గొడుగు అతనికి బాగా తెలుసు అవెంత అవసరమో!) బయల్దేరాడు. కొంత డబ్బు జేబులో వేసుకున్నాడు. మంచం సందులో పడేసిన తోలుచెప్పులు తీసి, దులిపి తొడుక్కున్నాడు. తలుపులు తాళంకప్పతో భద్రంగా వేసి, ప్రయాణమయ్యాడు.

బస్సుస్టాండ్‌కి వెడుతూ, దారిలో మార్కెట్ దగ్గర ఒక మిఠాయి కొట్టుని చూడగానే ఠక్కున గుర్తుకొచ్చింది. అత్తయ్యకి 'శ్రీఖండ్' (పుల్లపెరుగుతో చేసే ఒక తీపి వంటకం) అంటే బహు యిష్టమని. దుకాణంలో దూరాడు. అత్త యింట్లోని గోడలోని అల్మరాలో పనసపళ్ళ మురబ్బాలు, మామిడితాండ్ర, తీపిదుంపలతో చేసిన చెక్కులూ, చెగోడీలూ, జంతికలూ ఏవేవో వొడియాలూ వుండేవి. అప్పుడప్పుడు ఆ అల్మరా తెరిచి రెండు మూడు తినుబండారాలు చేతికిచ్చేది. తను కూడా చిన్నపిల్లలా, ఆ తాయిలాలని చప్పరిస్తూ, లొట్టలేస్తూ తినేది. అయితే ఈ వాంఛ, భోజనం విషయంలో వుండేది కాదు. ఏదో సమయానికి రెండు మెతుకులు గతికేది.

చిరుతిండ్లంటేనే బహు యిష్టం, పిల్లల్లాగ. దుకాణంలో శ్రీఖండ్ లభించలేదు. దగ్గర్లో మరే మిఠాయి దుకాణం కనిపించలేదు. బస్సుకి ఆలశ్యమవుతోందని, ఆ వేట వదిలిపెట్టాడు. ఏదో కనిపించిన మిఠాయి తీసుకుని, బస్సు సరిగ్గా బయల్దేరే సమయానికి పట్టుకున్నాడు. ఖాళీ సీటు కూడా దొరికింది. హమ్మయ్య అని నిట్టూర్చి కూర్చున్నాడు. మూడు బస్సులూ, వొకటి తర్వాత ఒకటి సమయానికి దొరికితే చీకటి పడేలోగా 'రానా' గ్రామం చేరుకోవచ్చని అంచనా వేశాడు.

...గత జీవితపు తీపి, కారం గుర్తులు ఒక్కొక్కటే గుర్తుకి వస్తున్నాయి, బస్సు వెడుతూ వుంటే. వివిధ వ్యక్తులు - స్నేహితులు, బంధువులూ, పరిచయస్తులూ - వారి ప్రవర్తనలూ, మనస్తత్వాలూ జ్ఞాపకం వస్తున్నాయి. దోవలో వర్షం కురవసాగింది. ముందు జల్లులుగా ఆరంభమయి కుండపోతగా మారింది. బస్సు కిటికీలు మూసినా లోపల చెమ్మ తప్పలేదు.

అంచెలంచెల బస్సు ప్రయాణం చీకటిపడేసరికి ముగిసింది. "మధ్యలో బస్సు ట్రబుల్ యివ్వకపోతే అరగంట ముందే మీరు చేరుకొనేవారు" అని కండక్టరు - అతని పరిచయస్తుడు - వీడ్కోలు చెబుతూ అన్నాడు. అతన్ని ఆ అడవిదోవ దగ్గర వదిలి, ఆ పాతకాలం బస్సు - లంఖణాల బండిలా - ఎంతో పొగ కక్కుతూ కొండమీదికి రోడ్డు - ఎత్తైన మార్గంమీద వెళ్ళిపోయింది. 'కండక్టరు' తెలిసిన వ్యక్తే అయినా అతని పేరు నాలికమీద . కుతున్నట్లే వున్నా గుర్తు రావడంలేదు. దారిలో పక్షుల వివిధ ధ్వనులు, సంధ్యారాగాల్ని సూచిస్తున్నాయి. గిర్నీ (గోధుమలు, జొన్నా, పిండిచేసే మిల్లు) కొట్టువాడు తలుపులేస్తున్నాడు. పక్కనే కిరాణా కొట్టువాడు కూడా దుకాణం మూయబోతూ వుండగా, యితను పరుగెత్తి వెళ్ళి 'బ్యాటరీసెల్స్' అడిగాడు. అతను అయిపోయాయని చెప్పి 'ఈ సమయంలో, ఈ వూళ్ళో ఈ కొత్త మొహం ఎవరిది' అని సందేహంతో చూడసాగాడు. ఆ దుకాణంవాడిని తను గుర్తుపట్టినా, వాడు తనని గుర్తించనందుకు సంతోషించాడు. గుర్తిస్తే ఎన్నో ప్రశ్నలేసి, ఎన్నో కూపీలు తీసి తన టైము వృధా చేసేవాడు! అక్కడున్న రెండున్నర కొట్లలో 'పెట్రోమాక్స్' లైట్లు ఒక్కొక్కటే ఆర్పేసి, తలుపులు మూసేస్తున్నారు. ఆఖరి బస్సు వెళ్ళిపోవడం వీళ్ళకి సంకేతం కాబోలు! 'బ్యాటరీ' పొదుపుగా వాడుతూ, అతను నడక సాగించాడు. అదృష్టం బాగుంది. ఇప్పుడు చెట్లు తీసేసి, బాట వెడల్పు చేశారు. కాకపోతే యిదివరకటి మార్గం ఎలా వుండేదనీ! తలుచుకుంటే వణుకు

పుట్తోంది! అప్పుడు చాలా సన్నగా, యిరుగ్గా మలుపులు తిరిగి వుండేది. చీకట్లో నడుస్తూ వుంటే కాలికింద ఏముందోనని భయం, కాలు జారి లేదా మరేదైనా అయి పడిపోతే, అంతే సంగతులు! అడిగే నాధుడుండడు.

'రానా' చిన్న పల్లె, పల్లంలో వుంది. దిగుతూ, దిగుతూ వస్తూవుంటే, అంత వర్షం పడుతున్నా చమటలు పట్టాయి. అంతులేని నడక, అంతు తెలియని దారి. చెట్లు గుర్తురావడంలేదు. ఒక మలుపు దగ్గర వున్న పెద్ద వటవృక్షం గుర్తుమాత్రం తెలిసింది. ఆ చెట్టు యిప్పుడు మరింత పెరిగింది - శాఖలతో ఉపశాఖలతో అంత చీకట్లోనూ, అతనికి తెలిసింది. ఆ తరువాత పెద్ద పళ్ళచెట్లతో నిండిన తోట - తోట దాటింతరువాత ఒక చిన్న ఏఱు ప్రవహిస్తోంది. ఆ ఏటికి అడ్డంగా కొబ్బరిచెట్ల బోదెలు పరచి చేసిన చిన్న వంతెనని (Foot Bridge) దాటాడు. ఆ తరువాత దారికి రెండువైపులా నల్లబండలతో కొండలు, అవి దాటాక పెద్ద లోతైన మడుగు - ఏవీ మారలేదు - అన్నీ అలాగే వున్నాయి. దూరంగా లాంతరు కాంతి కనిపించింది. అత్తయ్య ఇల్లు. ఇంటి బయట గుమ్మందగ్గర చూరుకి వేళ్ళాడుతున్న ఆ దీపం చూసి, నిన్ననే ఎక్కడికో వెళ్ళి ఈవేళ తిరిగి వస్తున్నట్లు తోచింది. ఏదీ మారలేదు. అంతా మునుపటిలాగే వుంది. మెట్లు ఎక్కి, వర్షంలో ముద్దయిన గొడుగు్కొంకలో వ్రేళ్ళాడుతున్న సంచీ (బ్యాగు), మరో చేతిలో టార్చ్‌లైటూ - వీటితో గడప ముందు నిలబడ్డాను - బిడియంగా, బెదురుగా.

"రా లోపలికి రా! 'వినూ' నువ్వేకదూ?" చీకట్లోంచి ఆ గొంతుక పాతాళం లోతుల్లోంచి వస్తున్నట్లు ధ్వనించింది. అతను వులిక్కిపడ్డాడు. ఆ కర్ణకఠోరం, కర్కశం అయిన గొంతుక మాఁవదేనని తెలిసి సర్దుకున్నాడు. "హమ్మయ్య గమ్యం చేరాను" అని వూపిరి పీల్చాడు.

పూర్వకాలపు యింటి వరండాలో నెత్తిమీద చెయ్యేసుకుని వాలుకుర్చీలో 'మాఁవ' కూర్చునున్నాడు. అతనొచ్చాడని లేవనైనా, లేవలేదు.

"కూర్చో, విశేషాలేమిటి?" మాఁవ ఎదురుగ్గావున్న సిమెంటు కుర్చీకేసి వేలు చూపించి, అడిగాడు. తడిసిన దుస్తులతో, యిబ్బందిగా అతను కూర్చున్నాడు.

"మాఁవ ఎలాగున్నావు?" అతను సంభాషణ ప్రారంభించాడు.

"ఇంకా బతికేవున్నానురా" అతనికి మాఁవ బొంగురుగొంతుకతో యిచ్చిన సమాధానం కదిలించింది.

"అలా అంటావేమిటి మా(వా" అతను కొంత విసుగ్గా అన్నాడు. మా(వ ఏమీ అనలేదు. ఇంక వుండలేక లేచి, తన కథ చూసుకున్నాడు.

తన తడిబట్టలతో, బరువుగా అడుగులేస్తూ, లోపలికి వెళ్ళాడు. లోపలి గదిలో అడుగు వేస్తున్నప్పుడు గుర్తొచ్చింది. ఆ గది ఒక అడుగు లోతున వుండేదని. చీకట్లో జాగ్రత్తగా పాదం మోపుతూ, లోపలికి చూశాడు. గుడ్డి దీపంకి కాస్త దూరంగా గోడ కానుకుని ఒక మనిషి రూపం కనిపించింది. ఎవరూ? అత్తయ్యా! వొళ్లంతా రోమాలు ముళ్ళల్లా నిలబడ్డాయి. తెల్లటి శరీరకాంతితో, ఎప్పుడూ చలాకీగా తిరుగుతూ, కాళ్ళూ చేతులూ విశ్రాంతి ఎరగక, యింటి పనులన్నీ తనే స్వయంగా చక్కబెట్టే అత్తయ్యేనా అలా జీవచ్ఛవంలా దీపందగ్గర కూర్చునుంది? ఆమె కళ్ళు తెరిచే వున్నాయి. కానీ కనుబొమ్మలు కదల్చకుండా ఎదుటి గోడకేసి నిశ్చలంగా చూస్తోంది. గుడ్డిదీపపు వెలుగు ఆమె కళ్ళల్లో ప్రతిఫలించి, ఆమె యింకా బ్రతికేవుందని సూచిస్తున్నట్లు మెరుస్తున్నాయి.

"ఎవరు? ఎవరొచ్చారూ?" ఆమె స్పృహలోకి వచ్చినట్టు, అలికిడి విని అడిగింది. ఆమె చెవిలో నగలు గాజుల్లా చిన్నశబ్దం చేశాయి. ఆమె సన్నని వీణ తీగె మీటినట్లుండే మాటలు, అతని బాల్యస్మృతులని మీటాయి.

"అత్తయ్యా! నేను 'పీనూ'ని వచ్చాను - నీ తమ్ముడి కొడుకుని."

ఆమె సర్దుకుని కూర్చుని, అతన్ని కూర్చోమని పీటకోసం చెయ్యి చాపింది. అతనే ఆ పీటని అందుకుని కూర్చున్నాడు. కాళ్ళు ముడుచుకుని ఆమె ఎదురుగా పీటమీద కూర్చున్నాడు. ఆమె చెయ్యి, నూనె దీపానికి మరీ దగ్గరగా వుండడం చూసి ఆ దీపాన్ని వెనక్కి దూరంగా జరిపాను. ఆమె సన్నగా నవ్వింది.

"ఎలాగున్నావురా తండ్రీ! చూశావుగా నా అవస్థ ... నడు లేచి ఆ బట్టలు మార్చుకో - బాగా తడిసిపోయావు." ఆమెకి తెరలు తెరలుగా దగ్గు వచ్చింది. ఆమె ఖంగుఖంగున దగ్గుతూవుంటే, తన గుండెల్నే ఎవరో దొలుస్తున్నట్టనిపించింది.

అత్తకోసం తెచ్చిన తినుబండారాలు అతను ఆమె దగ్గర ఉంచాడు. "ఎందుకిన్ని తీసుకొచ్చావురా పీనూ?" అని ఆమె అనగానే అతని మనస్సు చివుక్కుమంది. ఆమెకి బహు యిష్టమైన శ్రీఖండ్ తెచ్చివుంటే నీకోసరం వెతికి, వెతికి తెచ్చాను అని గర్వంగా చెప్పివుండేవాడు. ఆమెమీద అతనికున్న ఆప్యాయతకి ఆమె ఉప్పొంగిపోయేది. తనమీదే తనకి కోపంవచ్చి మనస్సులోనే చేసిన తప్పుకి

తెంపలేసుకున్నాడు ... తనెందుకింత నిష్ఠూరంగా ప్రవర్తించాడు? ... రెండేళ్ళ కొక్కసారైనా, మామూలు పరామర్శకైనా యిటువైపు రాలేదు. తనని చిన్నతనంలో ఎంత శ్రమపడి పెంచిందీ! తన బాగోగులు కంటికి రెప్పలా చూసుకొనేది. ఆమె కఠినంగా తనతో వర్తించినా, ఆ శిక్ష తన మంచికోసమే కదా? ఆమె జీవితంలో కాస్త తృప్తి, ఆనందం యివ్వగల తాహతు అతనికి మాత్రమే ఉంది. ఆమెకి సంతానం లేదు. కుశలం అడిగే బంధువులూ లేరు. మొగుడు వున్నాడు కానీ, యిదీ వరస! 'ఏడుజన్మల బద్ధవైరం' అనొచ్చు!

అత్తకి దగ్గర కూర్చుని, గుడ్డినూనెదీపం రెపరెపమని మండుతూంటే, ఆమె కన్నీటిగాథ విన్నాడు. శతృసమానమైన ఆమె మొగుడు, ఆమె ఆరోగ్యం క్షీణించిన దగ్గర్నించీ మాట్లాడటమే మానేశాడుట! అసలు పెళ్ళైనదగ్గరనుంచే వాళ్ళ సంబంధం బెడిసింది. బహుశా అతనికి ఆమెతో పెళ్ళి నచ్చలేదేమో! మరెవ్వరిమీదో ప్రేమ వుందికాబోలు! ఆమెకి ఏమీ అర్థం అవలేదు. ఆమెకి కేవలం అతని విచిత్ర వర్తన, విచిత్ర మనస్తత్వం అనిమాత్రం తెలిసింది. అది ఆమెకే కాదు, అందరికీ తెలిసిన నిజం! ఒక్కొక్కసారి వారంరోజులకిపైగా ఎక్కడికో అదృశ్యమైపోయేవాడు. ఏదైనా పనిలో నిమగ్నమైతే, అదేపనిగా రాత్రింపగళ్ళు నిద్రాహారాలు మాని ఆ పనిచెయ్యడం; బద్ధకం, నిద్ర అప్పుడప్పుడు వ్యాధిలా వచ్చి అదేపనిగా తిండం, నిద్రపోవడం - లేచి మళ్ళీ తినడం, నిద్రపోవడం...

ఒకసారి దారితప్పివచ్చిన ఒక దూరపు బంధువు - వయోవృద్ధుడు - మిట్టమధ్యాహ్నం మండుటెండలో, యింటికి వస్తే, వచ్చి మంచినీళ్ళైనా యివ్వకుండా, కసిరిగొట్టి బయటకి నెట్టేశాడు!

ఒకసారి పొలంలో బాగా ఎదిగి కోతకి సిద్ధంగా వున్న గుత్తివెంకాయలని, చెట్లకి కాసి వున్నపళంగానే గొడ్లనీ, గేదెలనీ పిలిచి విందు చేశాడు

ఒకసారి శుభ్రంగా స్నానంచేసి, ఆ తడిబట్టలతోనే ఎక్కడో నడిరోడ్డుమీద కూర్చుని అదేపనిగా "గురుచరిత్ర" (ఒక భక్తికావ్యం - మరాఠీ భాషలో) చదివాడు. ఆ అఖండ పఠనం రెండురోజులు నిరాఘాటంగా, నిద్రాహారాలు మాని చేశాడు. మూడవ రోజు అతని జాడ తెలుసుకుని వచ్చిన అత్త అతడు స్పృహతప్పి దారిప్రక్కన పడివుండడం చూసింది! ఇత్తడి చెంబుతో ముఖంమీద నీళ్ళు చల్లి లేపితే ఉగ్రుడయ్యాడు. ఆ చెంబు ఆమె నెత్తిమీద కొట్టి "భ్రష్టుడ్ని అయ్యాను - భ్రష్టుణ్ణి

అయ్యాను" అని అరుస్తూ యింటికివచ్చి, మళ్ళీ స్నానం చేసి, మళ్ళీ తడిబట్టలతో, మళ్ళీ అదే స్థలంలో 'గురుచరిత్ర' అఖండ పఠనం ... ఇదీ వరస!

"ఓరేయ్ 'వీనూ' చాలా చీకటయింది ... నీ భోజనం సంగతి ... ఎలా చెప్పనురా ... ఏదైనా హోండుకు తినమని...? నా ఖర్మ! ఇన్నాళ్ళకి వచ్చావు ... రెండు ముద్దలు కంచంలో వడ్డించడానికి శక్తిలేదు నాకు..." ఆమెకి దుఃఖం ముంచుకొచ్చింది. ఏదో బాధ శరీరంలో వుప్పెనలా వచ్చి, ఆమె అతి కష్టంమీద లేచి గదిలో యిటూ, అటూ బోనులో పులిలా పచార్లు చేయసాగింది.

ఇంతలో ఏదో అలజడి వినిపించి, అతను బయటకొచ్చి చూశాడు. కఱ్ఱకి తగిలించిన ఒక చిన్న నూనెదీపం పట్టుకుని, ఒక మధ్యవయస్కుడు - పంచె కట్టుకుని వున్నవాడు లోపలికి వచ్చాడు. అతని వెంబడే గాభరాగా మాఁవ ఏదో ఆందోళనతో లోపలి గదిలోకి వచ్చాడు.

"పార్వతీ ఎలాగున్నావమ్మా?" అంటూ 'వినూ' ఖాళీచేసిన పీటమీద గోడకాను కుని కూర్చున్నాడు. అత్తయ్య చల్లగా నవ్వి 'భగవంతుణ్ణి జపించండి' అని చేతులూ, తలా ఆడించి సంజ్ఞలతో సూచించింది.

"మొన్న యిచ్చిన మూలికలు వుడికించి తీసుకొన్నావా?" అని ఆమెని అడిగి, అతనికేసి చూశాడు 'ఎవరీ బంధువూ?' అన్నట్లు. అలా చూస్తూనే ...

"నీ మాత్రలు పొయ్యిలో విసిరేయ్! నువ్వూ వెళ్ళు శ్మశానానికి దానితోబాటు" మాఁవ హఠాత్తుగా చిరాకుగా బయట్పించి అరిచాడు. ఏమాత్రం చలించకుండా ఆ పెద్దమనిషి నిదానంగా అన్నాడు;

"ఇప్పుడు శ్మశానం ఎంతో దూరంలో లేదు! అందరం కలిసే వెళ్దాం కాటికి! ఏ లంజకొడుక్కి కావాలి ఈ బ్రతుకూ - ఈ జీవితం?"

ఇంతలో మాఁవ ఒక పళ్ళెంలో నాలుగు ముద్దల అన్నం మెతుకులు వడ్డించి, అత్తయ్య ముందు వుంచాడు. ఉంచి అత్తయ్యవైపు చూడనైనా, చూడకుండా నన్నడిగాడు

"వినూ, నువ్వు లోపలికిరా భోంచేద్దువుగాని."

"నీ తిండి పొయ్యిలో వెయ్యి" అని కసిరికొడ్దామని, అతని కనిపించింది. కానీ కడుపు ఆకలితో మండిపోతోంది. మౌనంగా వంటింట్లోకి వెళ్ళాడు.

"తిను నీకేది యిష్టమైతే అదే. ఏదో పొట్టనింపుకోడానికి, నాకు వీలైంది

చేశాను.''

''అత్తయ్యకి ఎప్పట్నించి బాగులేదు?''

''అయింది మూడు, నాలుగు నెలలు.''

''ఏమయిందిట? ఏ రోగం?''

''ఖర్మ.''

''మందులివ్వడంలేదా?''

''వాడు చూస్తున్నాడుగా, అది చాలు.''

''ఎవరూ?...'' అతని గొంతుకలో పచ్చి వెలక్కాయపడినట్లయింది.

''అదే లోపల వచ్చి కూర్చున్నాడు, వాడే.''

''ఓ అతనా? అతన్ని చూసినట్లు గుర్తు. కానీ ఎవరో జ్ఞాపకం రావడంలేదు.''

''ఆ క్రింద యింట్లో వుంటాడు...''

''ఓ అతనా? 'విసూ' మావయ్యకదూ? నేనిక్కడ వున్నప్పుడు వస్తూ, పోతూ వుండేవాడు. ఇప్పుడు తెలిసింది.''

''ఆ విషయం వదిలేయ్. నువ్వు కడుపునిండా తిను. లేకపోతే రాత్రి సరిగ్గా నిద్రపట్టదు.'' అలా హెచ్చరించి మాఁవ లేచాడు.

వెంటనే లేచి యింటికి తిరిగి వెళ్ళిపోదామని అతనికి అనిపించింది. కానీ బయట కుంభవృష్టిగా వర్షం పడుతోంది. చుట్టూ దట్టంగా ఉన్న అడవిలో అక్కడక్కడ మిణుగురు పురుగులు ఎగురుతున్నాయి. ఉరుములూ, మెరుపుల కాంతిలో చెట్లు అప్పుడప్పుడు కనిపిస్తున్నాయి.

అతనికోసం మాఁవ పక్కచుట్ట, దిండు తెచ్చి వసారాలో పెట్టి, తన మామూలు బెంచీమీద పడకేశాడు.

అతను 'విసూ మాఁవ' కబుర్లు వింటూ కూర్చున్నాడు. ఈ అత్త అనారోగ్యంలో, మాఁవ క్షేమసమాచారాలు అడిగే ఏకైక వ్యక్తి 'విసూ' మాఁవే! ఏవేవో ఓషధులూ, మూలికల మందులు 'విసూ' మాఁవ రోజూరోజూ తెచ్చియిస్తున్నాడు. ''ఆమెకి ఈమధ్య కొంత నయమయింది. మరో నాలుగు రోజుల్లో పూర్తిగా కోలుకుంటుంది'' అలా అని అతను 'విసూ'కి ధైర్యం చెప్పి, ''వర్షం కాస్త జోరు తగ్గగానే వెళ్తాను'' అని, తన లాంతరు తీసుకుని బయటకి చూస్తూ కొంతసేపు నిలబడ్డాడు. వర్షం తగ్గగానే, జాగ్రత్తగా అడుగులు వేస్తూ, 'విసూ' సాగనంపుతూ

వుంటే వద్దని, మెల్లిగా చీకట్లో అదృశ్యమయ్యాడు. 'వినూ'కి చాలా ఆశ్చర్యం వేసింది. 'వినూ' మాఁవ యిల్లు అరగంట కాలినడకన వెళ్ళాలి! ఇంత దూరం, యింత వర్షంలో, ఇంత చీకట్లో వచ్చి వెళ్ళాడు! అయినా మాఁవయ్య ఏమాత్రం మంచీ, మర్యాదా లేకుండా 'అత్తయ్య' - యోగక్షేమాలు తెలుసుకోడానికని, మందులు తీసుకు నిత్యం వస్తున్న ఏకైక హితుడిని ఈ విధంగా కించపరచడం నాకు మహాచెడ్డ బాధనిపించింది. అత్తయ్య మొగుడుగా తన కనీస బాధ్యతగా రెండు పూటలా నాలుగు అన్నం వుండలు వండి కంచంలో పడేసి వెళ్ళిపోతాడు మాఁవయ్య.

అత్తయ్య చాలాసేపు, ఏవేవో చెప్పింది. ఆమె అతిగా మాట్లాడితే మంచిది కాదని, ఎలాగో నచ్చచెప్పి ఆమెని నిద్రపుచ్చాడు 'వినూ'. తన పక్కచుట్ట పరుచుకుని, తనూ నిద్రకి ఉపక్రమించాడు. నిద్రకి ముందు, రోజూ చేసే ప్రార్థన చేశాడు.

మిణుకు మిణుకుమని వెలుగుతున్న ఆ నూనె దీపపు కాంతిలో, చీకట్లు క్రమ్మి రాత్రి మరింత భయంకరమవుతోంది. ఆ గదిలో ఏదో విచిత్ర దుర్గంధపు వాసన వస్తోంది. ఆ వాతావరణంలో ఆ దుర్వాసన మిళితమై, అతనికి నిద్రపట్టలేదు. విప్పారిన కళ్ళతో కునుకుపట్టక, చాలాసేపు అలా పక్కమీద యిటూ అటూ దొర్లాడు. అత్తయ్య మూలుగులు వినిపిస్తున్నాయి. దగ్గరకి వెళ్ళి చూశాడు. ఆమె నిద్రలోనే, మూలుగుతోంది ఏదో బాధతో. అతను లేచి మాఁవయ్య పడుకున్న బెంచీ (బల్ల) దగ్గరకి వెళ్ళి చూశాడు. మాఁవ నిద్రపోతున్నాడు - నిశ్చింతగా గురకనిద్రలో వున్నాడు. ఇల్లు అంతా నిశ్శబ్దంగా, శాంతంగా వుంది - ఆ కటిక చీకటి రాత్రి - బయట కుండపోతగా వర్షం. నన్నొక నిగూఢ ప్రశ్న వేధిస్తోంది. దానికి జవాబు నాదగ్గర లేదు సరికదా ఆ ప్రశ్న స్వరూపమే తెలియడంలేదు.

కాకుల 'కావ్ కావ్' ధ్వనులతో అతనికి తెలివివచ్చి, కళ్ళు తెరిచి బయట చూశాడు. అప్పుడే సూర్యోదయం అయి, తొలి వెలుగు కిరణాలు ప్రసరిస్తున్నాయి. అత్తయ్య మందమందంగా చేస్తున్న 'మూలుగుల' ధ్వని అతన్ని తృప్తిపరిచింది. కంబళి కప్పుకొని వున్న అతనికి మరికొంతసేపు నిద్రపోవాలని అనిపించింది. కానీ బయట మేడమీద ఏదో సుత్తి చప్పుడులా వినబడింది. కాస్త వులిక్కిపడి కళ్ళు తెరిచాడు. ఇంత తెల్లారు ఝామున ఎవరు చప్పుడు చేస్తున్నారూ? లేచి చూద్దామనిపించింది. కానీ భయంవేసింది. కొంతసేపటికి ఎవరో మేడ తలుపులు తెరిచినట్లు, భళ్ళున గదిలోకి వచ్చిన వెలుగు తెలిపింది. మేడమెట్లమీద నుంచి

ఒక పెద్ద నీడ, ఆ వెనక ఒక శాల్తీ ఒక చేత్తో లాంతరూ, మరోచేత్తో ఏదో బరువైన వస్తువూ తీసుకుని మెట్లుదిగడం చూశాడు. మాంవ! అతని కళ్ళు ఆశ్చర్యంతో, తెరిచినవి తెరిచినట్లే వున్నాయి. ఒక విచిత్ర, అనూహ్య భయంతో అతని గుండెలు కొట్టుకుంటున్నాయి. కానీ, అతని ఉత్సుకత అతన్ని వూరికే వుండనివ్వలేదు. లేచి, ఆ లాంతరు వెలుగు వస్తున్న గదిలోకి ప్రవేశించాడు.

లాంతరు వెలుగులో మావయ్య ఏదో పని చేస్తున్నాడు. మధ్య గుమ్మం దాటుతూ ఆ గదిలోకి వెళ్తూ వుంటే, అతని కాలు గుమ్మానికి తగిలి తడబడిన చప్పుడయింది. మాంవ వెనక్కి చూశాడు. అతను సర్దుకుని, లోపలికి వెళ్ళి మాంవ దగ్గర నిలబడ్డాడు. 'మాంవ' యింత ప్రొద్దున్న, అంత హడావిడిగా ఏంచేస్తున్నాడో అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాడు.

"మాంవా, ఏం చేస్తున్నావు?"

"కనబడ్డంలేదూ? ఈ దీపపుసెమ్మెని కడుగుతున్నాను" అని చేతిలో యిత్తడి సెమ్మెని మాంవ చూపించాడు.

"దీని అర్థమేంవిటి మాంవా? ఇంత ప్రొద్దున్న లేచి ఈ దీపపు సెమ్మెని ఎందుకు తోముతూ, కడుగుతున్నారు? మీకేం మతిపోలేదు కదూ?" అతను నిర్మొహమాటంగా అడిగాడు. మాంవ చేస్తున్న పనికి కారణం వెతకడం అతనికి దుర్భరం అయింది.

"అర్థమవలేదా? సరే చెబుతా విను. నాకిప్పుడే తెలిసింది. అది ఈవేళ పోతుంది. తెల్లవారు ఝామున వచ్చే కలలు నిజమవుతాయంటారు. అందుకనే ఈ దీపపుసెమ్మెని సిద్ధం చేస్తున్నాను. తెలిసిందా?" అని మాంవ నవ్వాడు. ఆ మాటలు విని అతని అంగాంగమూ కంపించింది. అవాక్కయిపోయాడు.

"నీకు తెలియదు కాబోలు. మనిషి చనిపోయిం తరువాత, ఆ శవం శిరస్సు దగ్గర దీపం వెలిగించి వుంచుతారు. అది ఆచారం .." అని, 'మాంవ' తన వెకిలినవ్వు మళ్ళీ నవ్వాడు; నవ్వి ఎండుగడ్డితో ఆ సెమ్మెని తోమసాగాడు. ఇక వుండబట్టలేక 'వినూ' అక్కణ్ణించి తప్పుకుని, వరండాలోకి వచ్చాడు. బయట ఉదయిస్తున్న సూర్యుణ్ణి చూస్తూ నిలబడ్డాడు.



## 16

# శవాల మిత్రుడు

**- కె.ఆర్. వశంతమణి**

ఊళ్ళో 'మోర్త్యా'ని ఎరిగినవాళ్ళు వుండరు. అయితే 'శవాల మోర్త్యా' అని అంటే 'ఎరగని'వాళ్ళూ వుండరు. 'మోర్త్యా' ఏ వూరివాడు? అతని తల్లిదండ్రులు ఎవరూ? అతని వయస్సెంతా? ఈ విషయాలు ఎవరికీ తెలియవు. అతనికి బంధువులెవరూ లేరు. మరి అతనికేంవుందనీ? ఒక పాత యినుప ట్రంకుపెట్టె, అందులో రెండు చిరిగిన లుంగీలూ, ఒక నల్లకుక్క వున్నాయి. 'మోర్త్యా' ఎక్కడికెళ్ళినా అతడివెంట కుక్క ఉంటుంది. నెత్తిమీద పెట్టె, కాళ్ళదగ్గర తచ్చాడుతూ కుక్క. అతడు నిద్రపోతున్నప్పుడు తలదగ్గర ట్రంకుపెట్టె, కాళ్ళదగ్గర కుక్క. ఒక మహారాజు యుద్ధంలో విజయం సాధించి విశ్రమిస్తున్నట్లు నిద్రపోతాడు.

'మోదే మోర్తే' మా వూరికెప్పుడొచ్చాడూ?

★ ★ ★

ఊరంతా 'ప్లేగు' అంటువ్యాధి వ్యాపించింది. జనం పురుగుల్లా మరణిస్తున్నారు. 'రాంమా(వ' ఆ అంటువ్యాధికి బలయ్యాడు. శవాన్ని ఎత్తి శ్మశానానికి తీసుకెళ్ళడానికి ఎవరూ ముందుకి రావడంలేదు. కాలం గడిచిపోతోంది. జనం బితుకుబితుకున వున్నారు. సాయంత్రం అవుతోంది. చీకటి పడుతోంది. ఏం చేయాలో తోచక దిక్కులు చూస్తూ అతడి కొడుకు నిలుచున్నాడు. అప్పుడే ఒక యువకుడు వచ్చాడు. "ఏమిటీ శవంని మోయాలా" అంటూ వొక తుండుగుడ్డ నడుంకి చుట్టుకొని అతడు ముందుకి వచ్చాడు.

"నేను భుజంపడ్తాను. రండి. శవాన్ని అలా వుంచడం పాపం" అంటూ అతడు శవం దగ్గరకి వెళ్ళాడు. అతడెవరు, ఎక్కడివాడు ఎవ్వరికీ తెలియదు. వాళ్ళ అంగీకారంకోసం ఎదురుచూసి, జవాబు రాకపోతే అతడే అన్నాడు "నేనొక మనిషిని.

నా పేరు 'మోర్తే'. నేను ఈ శవం మోయడం మీ కిష్టంలేకపోతే చెప్పండి. నేను వెళ్ళిపోతాను". ఎవరూ ఏమీ అననందువల్ల కొడుకుతోపాటు అతడు ఆ శవాన్ని మోసుకుని శ్మశానభూమిలో దహనం చేసి, అంత్యక్రియల తరువాత తిన్నగా గుడిదగ్గరి తటాకంలో స్నానం చేశాడు. స్నానం తరువాత ఆ తటాకం కట్టమీదే నిద్రపోయాడు. మర్నాడు నిద్రలేచి మళ్ళీ స్నానం చేసి, దేవాలయంలోకి వెళ్ళాడు. మధ్యాహ్నం గుడిలోనే భోజనం చేశాడు. తిన్నగా తటాకం వొడ్డుదగ్గరకి వెళ్ళి, తనతో తెచ్చిన అన్నం అక్కడున్న ఒక కుక్కపిల్లకి పెట్టాడు. తరువాత, అతడూ, ఆ కుక్కపిల్లా పక్కపక్కనే ఆ తటాకం కట్టమీద నిద్రపోయారు. ఎవ్వరితోనూ అతను మాట్లాడలేదు. ఎవ్వరూ అతని జోలికి పోలేదు. 'రాంమూ(వ' పదమూడవరోజు అతడికి ఒక చాప, దిండు, ఒక లుంగీ దానం చేసాడు. రోజులు గడుస్తూ క్రమేణా జనంకి అతడు పరిచయం అయాడు.

అంటువ్యాధివలన జనం ఎందరో చనిపోతున్నారు. ఒకరి తరువాత ఒకరు మరణిస్తున్నారు. కనీసం ఒకటీ, రెండు మరణాలు లేని రోజులేదు. 'మోర్తే'కి చేతినిండా పని. అతడు చకచకా రాత్రింపగళ్ళు శ్రమపడి శవాల్ని మోసి, దహనక్రియ చేయంచాడు. ఎలాంటి శవాన్నైనా ఏమాత్రం, భీతీ, జుగుప్స లేకుండా కాల్చేసేవాడు. శవాన్ని మోస్తున్నప్పుడు అతడు మౌనంగా వుంటాడు. అప్పుడు ఎవరూ మాట్లాడకూడదు. శవాన్ని చితిపేర్చి పెట్టినప్పుడు - చితిమంటలు రగులుకోగానే అతడు గొంతుక విప్పేవాడు. చితి కాలుతున్నప్పుడు ఒక్కొక్క అంగం కాలుతోందని ఆ అంగాన్ని పేర్కొంటూ చెప్పేవాడు, వర్ణించేవాడు - "అదిగో అవి గుండె కాలే మంటలు, నిజమైన గుండె మంటలు" వగైరా.

అతడు శవాలని భుజంమీద మోస్తున్నప్పుడూ, శవాలని దహనం చేస్తున్నప్పుడూ సాక్షాత్తు యమధర్మరాజే యితడని అనిపిస్తుంది జనంకి. శ్మశానభూమిలో శవదహనం అయినాక అతడు తటాకంలో స్నానం చేసి, అక్కడే కట్టమీద నిద్రపోవడం అతడి నిత్యకృత్యం అయిపోయింది - ఆ అంటురోగం ప్రబలిన రోజుల్లో. అప్పుడే అతడికి శవాల మిత్రుడనీ 'శవాల మోర్తే' అని సార్థకనామం లభించింది.

దహన సంస్కారం చేసినందుకు ఎవరైనా 'మోర్తే'కి డబ్బులిస్తే తీసుకోడు సరికదా కోపంతో వాళ్ళ ముఖంకూడా చూడకుండా తిరస్కారంగా వెళ్ళిపోతాడు. ఇది అందరికీ క్రమేణా తెలిసింది. అతను డబ్బు తీసుకుని శవాన్ని మోసేవాడు

కాదని జనం తెలుసుకున్నారు.

అతనికి డబ్బెందుకు? దేవుడు తిండి పెడ్తాడు దేవాలయంలో. నిద్రపోవడానికి ఆ తటాకం కట్ట వుంది. కట్టుకోవడానికి కావలసినన్ని బట్టలున్నాయి - వీళ్ళూ, వాళ్ళూ యిచ్చింది. శవాల్ని కూలీడబ్బులకోసం మోసేవాడని అతడిగురించి ఎవరూ అనుకోకూడదు.

"ఎవ్వరికీ శవం అక్కరలేదు. అందరికీ డబ్బు కావాలి. నాకు శవం కావాలి. డబ్బు అక్కరలేదు" అంటాడు నవ్వుతూ. ఇదీ అతడి వేదాంతం. ఈనాటి మనిషే, రేపటి శవం. నేను యమరాజు దూతని. యమరాజుకి డబ్బెందుకూ? డబ్బు తీసుకున్నా ఎవరికోసం? డబ్బు వుంటే నిద్రపట్టదు - దొంగల భయంతో. ఇప్పుడు సుఖంగా నిద్రపోతున్నాడు. ఎవరింటికి వెళ్ళినా నిండైన గౌరవం లభిస్తుంది. ఇంతకంటే అతనికి కావలసిందేమిటి?

అతడు కేవలం పడుకోడానికి సరిపోయే జాగా వున్న ఒక గుడిసె అంత కొంప దేవాలయం వాళ్ళు కట్టిచ్చారు. అతడూ, కుక్కా అందులో పడుకుంటారు. శ్మశానభూమిలో కట్టెల కొట్టూ, వసారా వగైరాలుండే యింటి తాళాలు అతడి దగ్గరే వుంచారు. ఒకరోజు అతడు లేనిసమయంలో అతడి కుక్కని ఎవరో చావబాదారు కర్రలతో, రాళ్ళతో. అడిగితే దానికి పిచ్చిపట్టిందనీ, తమని కరిచేయడానికి యత్నించిందనీ సాకు చెప్పారు. 'మోర్తే'కి దాని మూలుగులు, దాని దెబ్బలూ భరించలేని దుఃఖం కలిగించాయి. రెండురోజులు అతడి కొంపలో అతడి కన్నీటిసేవలో యమబాధపడి కన్నుమూసింది. ఆ కుక్క కళేబరం చూసి 'మోర్తే' భయపడ్డాడు. ఎప్పుడూ ఏ శవం చూసి భయపడని, ఏడవని 'మోర్తే' ఆ కుక్క 'శవం' చూసి చలించిపోయాడు. పట్టరాని దుఃఖంతో దాని మృతదేహాన్ని తన గుడిసె వెనకనే గొయ్యి త్రవ్వి పూడ్చాడు. కొన్ని ఏళ్ళుగా ఆ కుక్కతో అతడు గడిపాడు. అతడికి తోడు నీడలా వుండేది. అతడికి 'నా' అన్న శబ్దం వర్తించే ఏకైక జీవి ఈ ప్రపంచంలో ఆ కుక్క ఒక్కటే. అది చచ్చిపోయాక, అతడి బ్రతుకు పూర్తిగా నిరర్థకమయింది. రాత్రి నిద్రపట్టడంలేదు. తన కొంపలోనే, భయమంటే ఎరగని మనిషికి భయం వేసేది. రెండు, మూడు రోజులు (ఆ కుక్క పోయాక) అతడు యింటి బయటకి రావడమే మానేశాడు. దుఃఖంతో క్రుగ్గుతున్న అతణ్ణి చూసి అతడి మిత్రులు వ్యాఖ్యానించారు "మోర్తేకి పెళ్ళిచేయాలి" అని.

చాలారోజులు దొర్లాయి. క్రమంగా 'మోర్తే' దుఃఖం తగ్గిపోయింది. పెళ్ళి చేసుకుందామనే ఆలోచన అతడికి కూడా వచ్చింది. ఊళ్ళో పెళ్ళికావల్సిన అమ్మాయిలు చాలామంది వున్నారు. కానీ, ఈ శవాలు మోసే 'పరదేశి'కి పిల్లనెవరు యిస్తారూ? పిల్లకోసం మిత్రులు వెతికారు. రెండు మూడు సంవత్సరాలు దాటిపోయాయి. ఫలితం లేకపోయింది. అయినా అతడికీ అంత అపేక్షలేదు, పెళ్ళి చేసుకుందామని. అతడికి తెలుసు. చుట్టూ చూస్తూనే వున్నాడు సంసారుల బాదరా బందీలు. ఒంటరి జీవితం, తంటాలులేని ప్రయాణం! సాంబశివుడిలా సదా శ్మశానాలకి వెళ్తూ, వస్తూ ఐహికసుఖాలకి దూరంగా ఆధ్యాత్మిక చింతనతో జీవించినంతకాలం బ్రతుకుబండిని లాగడమే ఉత్తమమని నిర్ణయించాడు. నేను వొంటరిగా యీ ప్రపంచంలోకి వచ్చాను. ఒంటరిగానే వెళ్ళిపోతాను.

ఒకరోజు 'మోర్తే' పెట్టెని నెత్తిమీద పెట్టుకుని ఆ దేవాలయపు 'తటాకం' కట్టె దగ్గరకి చేరాడు. ఆ కొంపవల్లనే, కుక్క చచ్చిపోయింది. ఆ కొంపవల్లనే తనకి పెళ్ళి అవలేదు. "తనకా 'కొంప' - ఆ గుడిసెలాంటి యిల్లు - ఆ దేవాలయం వాళ్ళు కట్టించి యిచ్చిన ఇల్లు తనకి అక్కరలేదు. ఇలా ఈ తటాకం వొడ్డునే గడుపుతాను. వర్షం వస్తే దేవాలయపు ప్రాంగణం వుండనే వుంది. పెళ్ళాం, పిల్లలూ, ఏ లంపటం లేని తనకా కొంప అనవసరం. ఆ గుడిసెలో గాలి వేయదు. ఇక్కడ కావలసినంత గాలి. పడుకుని ఆకాశంలో నక్షత్రాలు చూస్తూవుంటే వచ్చే ఆ ఆనందం వర్ణించలేనిది. ఆ గుడిసె తీసుకుని పెద్ద పొరబాటు చేశాను. ఈ కట్ట ఆ కొంపకంటే చాలా మేలు."

'మోర్తే' ఒక కుక్కని చేరదీశాడు. ఆ కుక్క మునుపటి కుక్కలాగే వుంది. అతడికి చాలా ఆనందమయింది. 'మోర్తే' తన పని - శవాల దహనం - ఉత్సాహంతో చేస్తున్నాడు. అతడు తీరిక సమయంలో ఆ తటాకం ప్రక్కన దేవాలయపు స్థలంలో అరటితోట వేశాడు. అలాగే తులసి చెట్లు పెంచాడు. తులసీదళాలు దేవాలయానికి రోజూ తాజాగా కోసి సమర్పించేవాడు. అలాగే పూలచెట్లు పెంచాడు. అతడేం చేస్తున్నా, అతడివెంట అతడి కుక్క నీడలా వస్తుంది.

ఎవరింట్లో ఏ శుభ, అశుభ కార్యం జరిగినా అతడు హాజరు. అతడికే కబురు పంపి ముందు పిలుస్తారు. తను చేయగలిగిన పనులు వొళ్ళు దాచుకోకుండా చకచకా చేస్తాడు.

'మోర్తే'వంటి మనిషిని ఎవ్వరూ చూడలేదు.

ఏళ్ళు కాలగమనంలో జారిపోయాయి. 'మోర్తే'లో ముసలితనం వచ్చింది. నడవడానికి కఱ్ఱ అవసరమయింది. ఇరుగు, పొరుగున వున్నవాళ్ళు అతడికి తిండి పెట్టేవారు. అందువల్ల కూటికోసం అతడికీ, అతడి కుక్కకీ బాధలేదు - ఉపవాసం లేదు. ఇప్పుడు శవాలు మోసే శక్తి అతనిలో లేదు. అదే అతడి బాధ. అలాగయినా దహనకాండలో అతనుండకతప్పదు. శ్మశానం దగ్గరి కట్టెల కొట్టు, వసారాలున్న యింటి తాళంచేతులు దశాబ్దాల తరువాత దేవాలయం అధికారులకి అప్పగించాడు, కళ్ళనీళ్ళతో. "నేనిప్పుడు యింక ఈ బాధ్యత తీసుకోలేను. కానీ నేను ఆఖరి క్షణం వరకూ, బ్రతికినంతకాలం శవాల దహనక్రియలో తోడ్పడతాను" అని అన్నాడు.

మూడు వేలకిపైగా శవాల దహనం చేసిన 'మోర్తే' ఈ రోజు ఒక్క శవాన్ని మోయడంలో కూడా పనికిరాడు. అదే అతడి విచారం. అయితే అతడికి ఒక విషయంలో తృప్తి. అదేమిటంటే యిప్పటి యువతరం శవాలు ముట్టుకోవడానికీ, మోయడానికీ, దహనం చేయడానికీ వెనకాడరు. తను ఈ పనికి ఎనలేని గౌరవాన్ని, ఒక పవిత్రతనీ యిచ్చి ఒక ఆదర్శవృత్తిగా మలిచాడు. "ఇప్పుడు నేను సంతృప్తిగా మరణిస్తాను. నా మరణానంతరం నా శరీరాన్ని దహనం చేయడానికి ఎందరో ముందుకి వస్తారు. మోయడానికీ ముందుకి ఎందరో వస్తారు. నాకేం చింతలేదు" అని 'మోర్తే' అనేవాడు. ఒకరోజు, 'మోర్తే' శ్మశానం నుంచి తిరిగి, 'తటాకం' కట్ట దగ్గరకి తిరిగి నీరసంగా, అలసటతో వచ్చాడు. అతని కుక్కతో అన్నాడు జాలిగా "కొడుకా, ఈవేళ తిండి తెచ్చేశక్తి నాకులేదు. మనం ఉపవాసం వుండాలి. అరవకుండా పడుకో."

రాత్రి 'మోర్తే' కుక్క అదేపనిగా అరుస్తోంది. విచిత్రంగా శబ్దం చేస్తోంది. ఎవరికీ అర్థమవలేదు ఎందువల్ల అలా అరుస్తోందో!

మర్నాడు ప్రొద్దున్నే ఆ తటాకందగ్గరకి వచ్చిన జనం, స్నానం చేయడానికి నీళ్ళల్లో దిగుతూ, 'మోర్తే' యింకా పడుకునే వుండడం చూశారు. అతడి కుక్క కాళ్ళదగ్గర పడుంది ఏ కదలికాలేక. దగ్గరకెళ్ళి చూస్తే తెలిసింది. 'మోర్తే' మరణించాడు! అతని కుక్క కూడా చచ్చిపోయింది! 'మోర్తే' మరణవార్త గుప్పుమని వూరంతా ప్రసరించింది. జనం తండోపతండాలుగా ఆ తటాకం కట్టమీదికి వచ్చారు. అతడి అంతిమ దర్శనంకోసం!

ఏ ఆప్తులూలేని, ఏ బంధువులూలేని 'శవాల మోర్తే' చనిపోయాడు. ఊరంతా ఒక్క మనిషిలా అతడి దహనకాండకి వచ్చింది. అతడు ఎవరికీ ఆప్తుడు కాదు. అందరికీ ఆప్తుడు!

అతడు ఎవరికీ బంధువు కాదు. అందరికీ బంధువు!

'మోర్తే' అంతిమ దర్శనంకోసం శ్మశానంలో కూడిన జనం, యిసుకవేస్తే రాలని జనం! దహనకాండ తరువాత అస్థికలు రాజవైభవంతో నిమజ్జనం చేశారు. అతడి సమాధి దగ్గరే, కుక్క కళేబరం భూస్థాపితం చేశారు.

అతడిని కాల్చి, భూస్థాపితం చేసిన సమాధిమీద ఈ విధంగా వ్రాశారు.

''సమాజ సేవకుడు 'మోర్తే'

మా(ప - శవాల మోర్తే -

ఇక్కడ విశ్రాంతిగా

నిద్రపోతున్నాడు''

అని వ్రాసిన శిలాఫలకం వుంచి జనులు అతనికి నివాళులర్పించారు.

ధన్యజీవి 'శవాల మోర్తే' యిలా అమరుడయ్యాడు.



17

# అనీతా

**- తోమాజిన్యు కార్డోజ్**

సాయంత్రం సుమారు ఐదు గంటలయింది. 'జూజే' ఇంటి దగ్గర ఎంతోమంది జనం మూగారు. కొందరు ఏడుస్తున్నారు, కొందరు రోదిస్తున్నారు, మరికొందరు ఖిన్నులై కూర్చున్నారు. 'జూజే' భార్య 'లూయిజా' చిన్న వయస్సులోనే విధవ అయింది. 'జూజే' ఆ రోజు మరణించాడు! ఆమె దుఃఖం, ఆమె ఆక్రందన చూస్తే ఒక బండరాయి కూడా కరిగి నీరైపోతుంది. ఆమె ఏకైక పుత్రుడు 'రిచర్డ్'కి సుమారు ఆరేళ్ళ ప్రాయం. అతడు తల్లి ఏడవడం చూసి, తనుకూడా ఏడుస్తున్నాడు. శవపేటికలో పెట్టిన 'జూజే' శవం చూస్తే వొళ్ళు జలదరిస్తుంది. 'అఖే' (గోవాలో ఒక వూరు)లోని చర్చి పాదిరీ వచ్చాడు - అంతిమ ప్రార్థనలు చేయడానికి. ఏడుపులతో, ఆక్రందనలతో అందరి దుఃఖం కట్టలుతెంచుకుని వరదలా వస్తూవుంటే 'జూజే' శవపేటిక బయటకి తెచ్చారు.

నిజంగానే చాలా ఘోరం జరిగింది. 'లూయిజా' తన ప్రియమైన భర్తని పోగొట్టుకుంది. కొడుకు 'రిచర్డ్' అంత చిన్నవయసులోనే తండ్రిలేనివాడయ్యాడు.

'జూజే', 'లూయిజా', 'రిచర్డ్'- తండ్రీ, తల్లీ, కొడుకులు బీదవారే, అయినా సుఖసంతోషాలతో ఆనందంగా జీవించేవారు. ఒకరిమీద ఒకరు ప్రేమానురాగాలు కురిపించేవారు. వాళ్ళదగ్గర డబ్బూ, ఐస్కం, తోటలూ, పొలాలూ వుండకపోవచ్చు. కానీ వాళ్ళదగ్గర సమృద్ధిగా ప్రేమానురాగాలు వున్నాయి. ఒకరి నొకరు అర్థంచేసుకుని, అనుగుణంగా వర్తిస్తారు. ఆ యింట్లో పొత్తు, సఖ్యత, శాంతి సౌఖ్యాలూ వున్నాయి. వారిలో ధైర్య సాహసాలు వున్నాయి. ఈ ఆదర్శ వాతావరణానికి మూలపురుషుడు, దీపస్తంభం 'జూజే'. అతను హఠాత్తుగా ఆ ప్రమాదంలో మరణించడంతో ఆ సుఖసంసారం తుఫానులో చిక్కుకున్న నావలాగయింది. హఠాత్తుగా చీకటి క్రమ్మింది.

'జూజే' ప్రమాదంలో మరణించాడు. నిజం చెప్పాలంటే, అది వీరమరణం. అతను మరొకరి ప్రాణాలు కాపాడడానికి, తన ప్రాణాలు అర్పించాడు.

హఠాత్తుగా జమిందారు 'బ్రగంజా' యింటికి నిప్పంటుకుంది. అతని పెద్ద మహల్‌వంటి యిల్లు, నిలువెత్తు మంటల వలల్లో తల్లడిల్లింది. క్రమేణా మంటలు ద్విగుణీకృతమై, అతని చరాస్తి సమస్తం బూడిదయింది. 'బ్రగంజా', అతని భార్య, నౌకర్లూ రోడ్డుమీదపడి అరవసాగారు; ఏడవసాగారు. అది రాత్రి సమయం. జనం యిళ్ళల్లోంచి వచ్చి, అక్కడ గుమికూడారు. 'బ్రగంజా', అతని భార్య చాలా దీనంగా ప్రతి ఒక్కరినీ బ్రతిమిలాడుతున్నారు. కాళ్ళుపట్టుకుని బోరున విలపిస్తూ అర్థిస్తున్నారు. తమ ఏకైక పుత్రిక, మూడు సంవత్సరాలున్న పాప 'అనీతా' ఆ మంటల్లో, ఆ యింట్లో చిక్కుకుని వుంది. 'అనీతా' 'బ్రగంజా' జమిందారుకి దైవానుగ్రహం వలన వరప్రసాదంలా జన్మించిన ముద్దులకూతురు. పెళ్ళి అయిన పన్నెండు సంవత్సరాలకి కలిగింది - ఎన్నో మొక్కులూ, పూజలూ చేశాడు. ఆమె జన్మదినం, వారి పెళ్ళిరోజును మించింది సంతోషానందాలలో! 'బ్రగంజా' ఆ పిల్లని ఎంతో గారాబంగా, ప్రేమానురాగాలతో, కంటికి రెప్పలా కాపాడి పెంచుతున్నాడు. ఈ రోజు తన ప్రాణం, తన కళ్ళల్లో జ్యోతి, తన సర్వస్వం అయిన 'అనీతా' తన యింట్లోనే భీకరదావాగ్నికి బలౌతోంది! తన కళ్ళముందే హతమవుతోంది! ఆమెని ఎలాగైనా, కాపాడమని, తమకి తిరిగి తమ ప్రాణాలనివ్వమని భార్యా, భర్తలు అందరినీ ప్రాధేయపడుతున్నారు. గట్టిగా ఏడుస్తూ, అరుస్తూ గుండెలు బాదుకుంటున్నారు. జుత్తు పీక్కుంటున్నారు. వాళ్ళు పూర్తిగా నిస్సహాయులై రోడ్డుమీద పడ్డారు!

అలా వాళ్ళు ఆక్రోశిస్తూవుంటే, గుమికూడిన జనంలో 'జూజే' కూడా వున్నాడు. 'జూజే' 'బ్రగంజా' భూములు - తోటలూ, పొలాలూ చూసుకునే వందలాది పనివాళ్ళల్లో వొకడు. 'బ్రగంజా' తన క్రింద పనిచేసే ప్రతీవ్యక్తితోనూ - నౌకర్లూ, కూలీలు, తోటపనివాళ్ళూ, పొలం కాపులూ - అందరితోను బహు ప్రేమ, వాత్సల్యాలతో వుండి కష్టాలు వొస్తే ఉదారంగా సహాయం చేసేవాడు అందుకే అతనంటే, అందరిలాగే 'జూజే' కూడా అభిమానం, గౌరవం చూపిస్తాడు. అటువంటి ఉత్తమ మనిషి, దయామయుడు, నిస్వార్థి తన ఏకైక పుత్రిక ప్రాణాలు కాపాడమని, భిక్షం అడుగుతూవుంటే 'జూజే' గుండె కరిగిపోయింది. గుమికూడినజనం

నిర్వీర్యంగా నిలబడ్డారు. ఎవ్వరూ ముందుకు రావడంలేదు. సహాయం చేస్తానని ముందుకి వచ్చిన 'జూజే'ని, వెళ్ళొద్దని వారించారు. ఆ మంటల్లో పడితే నీ ప్రాణాలు దక్కవు అని హెచ్చరించారు - పదే, పదే. "కాదు, నేను వెళ్తాను, ఏమైనాసరే" అని 'జూజే' నిశ్చయించాడు. అతను అక్కడ పడివున్న రెండు ఖాళీ (గోనె) జనపనార (Jute Bags) బస్తాలు తీసుకుని, ఆ భీకర అగ్నికుండంలోకి తన ప్రాణాలు తెగించి పరుగెత్తాడు. ఆ మంటల్లో ఆ యిల్లు దూదిపింజల్లా తగలడిపోతోంది. ఇంటి బయట గుమికూడిన జనం నిశ్చేష్టులయ్యారు! బొమ్మల్లా ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డారు.

లోపలికి దూసుకుపోయాడు 'జూజే' - 'అనీతా'ని అన్వేషిస్తూ. తనని చుట్టుకున్న మంటలని, ఆ గోనెసంచుల ఆధారంతో ఆర్పుతున్నాడు. 'అనీతా' ఒక గదిలో నేలమీద పడి - స్పృహ లేకుండా వుండడం చూశాడు. 'జూజే' ఏమాత్రం ఆలస్యం చేయకుండా ఆమె బ్రతికివుందో, లేదో చూడకుండా ఆమెని ఎత్తి తను తెచ్చిన గోనెబస్తాలో వేశాడు. తన రెండు చేతుల్తో, ఆ బస్తాని మోస్తూ, మంటలని తప్పించుకుని బయట పడడానికి ప్రయత్నించాడు. ఇంతలో మంటలు మరింత విజృంభించి, ఇంటి చూరు, వాసాలూ, పైన పెంకులూ ఒకొక్కటే కూలసాగాయి. బయట నిల్చున్న జనం కేకలూ, హాహాకారాలూ మిన్నంటాయి. 'బ్రగంజా' జమీందారి భార్య దుఃఖం తట్టుకోలేక మూర్ఛపోయింది. నేలమీద కుప్పలా కూలిపోయింది.

తనకి బయటపడే మార్గంలేదని తెలుసుకున్న 'జూజే' కాస్త గాభరాపడ్డాడు. తన వొంటికి అంటుకున్న మంటలు క్షణ, క్షణం పెరుగుతూ వుండడం చూసి నిరాశపడ్డాడు. ఇంటి పైకప్పు దూలాలూ, వాసాలూ ఒక్కొక్కటే కూలి పడుతూండడం అతను చూశాడు. 'అనీతా'ని తీసుకుని ఈ మంటల మధ్యనించే వెళ్ళక తప్పదనీ, మరోమార్గం లేదనీ నిశ్చయించాడు. అంతే, అతడు క్షణం ఆలశ్యం చేయకుండా, తనని కాలుస్తున్న అగ్నిజ్వాలలని లెఖ్ఖచేయకుండా, ఆ గోనెసంచీలోనున్న 'అనీతా'ని మోసుకుని బడబాగ్నిలోకి దూసుకుపోయాడు. అంతా పొగ, ఆవిర్లూ, మంటలూ! కొన్ని నిమిషాల తరువాత, వొళ్ళంతా మంటలు అంటుకుని అగ్నిగోళంలా కనిపిస్తూన్న 'జూజే' 'అనీతా' వున్న గోనెసంచీతో కాలుతున్న కాష్టంలాంటి ఆ ఇంటి బయటకొచ్చాడు, పరుగెత్తుతూ. జనం అంతా 'జూజే' దగ్గరకి పరుగున వెళ్ళారు. 'జూజే' 'అనీతా'ని, ఆ గోనెసంచీతోబాటు జమిందారు 'బ్రగాంజా' చేతుల్లో వుంచాడు. అలా వుంచి క్రింద నేలమీద పడిపోయాడు. జనం అతని వొంటిమీది మంటలని

ఆర్పేసారు.

'బ్రగంజా' తన మోటారుకారు బయటకి తీశాడు. అందులో 'జూజే'నీ, 'అనీతా'నీ ఎక్కించి హాస్పిటల్‌కి చేరేశాడు. ఇద్దరూ స్పృహలోలేరు.

ఇద్దరూ - 'జూజే', 'అనీతా' అగ్నిబాధితులే అయినా, 'అనీతా' విషయం ఏం భయపడనవసరంలేదనీ, ఆమె త్వరగా పూర్తిగా నయమవుతుందని డాక్టర్లు భరోసా యిచ్చారు. 'జూజే' విషయం వేరు. దాదాపు శరీరంలో ముప్పాతిక భాగానికిపైగా వొళ్ళు కాలి, అతను చాలా అపాయస్థితిలో వున్నాడనీ, బ్రతికే అవకాశాలు తక్కువనీ తేల్చారు. రోజు, రోజుకీ అతని పరిస్థితి దిగజారింది. ఆఖరికి ఒకరోజు అతను దివంగతుడయ్యాడు; తన కుటుంబాన్ని అనాధులను చేశాడు. 'అనీతా'కి మరో జన్మ యిచ్చాడు!

'జూజే' భార్య 'లూయిజా' జీవితం పెద్ద సంకటావస్థలో పడింది. తన ఏకైక సంతానం, కొడుకు 'రిచర్డ్' పెరిగి, పెద్దవాడై ప్రయోజకుడవ్వాలని అతనెప్పుడూ తన భార్యతో అనేవాడు. "నేను పొలంలో పనిచేసే కూలివాణ్ణే కావచ్చు, కానీ నేను నా కొడుకుని మాత్రం పెద్ద ఎడ్వకేట్నో, డాక్టర్నో చేస్తాను". ఈ తన భర్త మాటలు మళ్ళీ మళ్ళీ 'లూయిజా' మనస్సులో మెదులుతున్నాయి.

ఒకరోజు ఉదయం 'బ్రగంజా' తన కుమార్తె 'అనీతా'ని తీసుకుని, 'లూయిజా' ఇంట్లోకి వచ్చాడు. 'లూయిజా' ఏడుస్తూ, రోదిస్తూ వాళ్ళకి స్వాగతం పలికింది. 'బ్రగంజా' జమిందారు యిలా అన్నాడు.

"నాకు తెలుసు నీ 'జూజే'ని నీకు మళ్ళీ నేనివ్వలేను. అయితే నీ ఇంట్లో ఏ విధమైన అవసరం వున్నా నేను సహాయం చేయడానికి సిద్ధంగా వున్నాను. డబ్బు విషయమేకాదు మరే విధమైన యిబ్బంది కలిగినా నేను నీకు ఆధారంగా వున్నానని, నీ అవసరాలన్నీ తీరుస్తాననీ ప్రమాణం చేసి చెబుతున్నాను." రిచర్డ్ చదువు గురించి నేను చూసుకుంటాను. నువ్వేమీ బెంగపెట్టుకోనవసరంలేదు. నీకు కావలసినవన్నీ నేను ఇస్తాను. నా ముద్దుల కూతురి ప్రాణాలు కాపాడి అతను వెళ్ళిపోయాడు. అతను అమరుడు."

'బ్రగంజా' జమిందారు కళ్ళల్లోంచి నీళ్ళు బొటబొటా రాలాయి.

'బ్రగాంజా' జమిందారు మాటలు, 'లూయిజా' గుండెల్లో అమృతవర్షం కురిపించాయి. ఆమె ఆత్మవిశ్వాసం వేయిరెట్లు పెరిగింది. ఆమెకి వెయ్యి ఏనుగుల

బలం సమకూరింది. గద్గదకంఠంతో 'లూయిజా' అంది :

"పెద్దదొరా! నిన్ను దేవుడు కాపాడాలి, నీకు అన్ని విధాలా మేలు చెయ్యాలి."

ఈ విధంగా రోజులూ, నెలలూ దొర్లిపోయాయి. 'బ్రగాంజా' జమిందారు యింటికీ, లూయిజా యింటికీ మధ్య సంబంధాలు పెరుగుతున్నాయి. చిన్నపిల్ల 'అనీతా' రిచర్డ్ యింటికి తరుచూ వస్తూపోతూ వుండేది. మొదట్లో 'అనీతా'ని చూస్తే 'రిచర్డ్'కి వొళ్ళుమండే కోపం వచ్చేది. ఈ 'అనీతా' కోసమే కదా తన తండ్రి ప్రాణం యిచ్చాడు; ఈ 'అనీతా' వల్లనే కదా తనూ, తల్లీ అనాధలయ్యారు. ఈ 'అనీతా' వల్లనే కదా తన తండ్రి తనకి లేకుండా పోయాడు. కానీ క్రమేణా 'అనీతా' రాకపోకలు ఎక్కువై, యిద్దరూ ఆటపాటల్లో తేలి అప్యాయత, స్నేహం పెరిగాక, ఈ అర్థంలేని కోపం తగ్గి - తగ్గి అదృశ్యమయింది. అతడు నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ తన బాల్యదశ హాయిగా గడిపాడు. 'రిచర్డ్', 'బ్రగంజా' సహాయాన్ని సద్వినియోగం అయేలా బాగా చదివి, మెడికల్ కాలేజీలో డాక్టర్ విద్యకి సీటు సంపాదించాడు. అతని వైద్య విద్య సాగుతూవుండగా, యిటు 'అనీతా' కాలేజీ చదువులు పూర్తిచేసి తన వూళ్ళోనే ఇంగ్లీషు స్కూలులో టీచర్‌గా పనిచేస్తోంది.

'లూయిజా' క్రమేణా మెల్లమెల్లగా తన గత కష్టాలనీ, దుఃఖాన్నీ మరచిపోసాగింది. అప్పుడప్పుడు ఆమె మొహంలో నవ్వు కూడా తొణికిసలాడసాగింది. తన కొడుకు డాక్టరవుతాడని ఆమె చాలా ఆనందించింది. తన భర్త కలలు నిజమవుతున్నాయని తృప్తిపడింది.

'లూయిజా' 'అనీతా'ని తన స్వంత కూతురులా చూసుకొంటోంది. 'అనీతా'కూడా ఆమెకి అన్ని విధాలా తోడ్పడుతోంది. ఆమెని సంతోషపెట్టడానికి, ఆమె మొహంలో ఆనందపు కాంతులు ప్రకాశించాలని 'అనీతా' సర్వదా ప్రయత్నిస్తోంది.

'రిచర్డ్'కీ అతని తల్లికీ మధ్య ఏవైనా పేచీలూ, లొసుగులూ వస్తే, 'అనీతా' మధ్యవర్తిలా వ్యవహరించి తల్లికీ, రిచర్డ్‌కీ నచ్చచెప్పేది. తల్లిమనస్సు నొప్పించినందుకు 'రిచర్డ్'చేత 'లూయిజా'కి క్షమాపణలు చెప్పించేది. 'లూయిజా' కళ్ళనీళ్ళు పెట్టుకు దుఃఖపడటం 'అనీతా' సహించలేకపోయేది.

'అనీతా' ఎన్నోసార్లు 'లూయిజా'తో అనేది "ఆంటీ (అత్తయ్యా) నావల్లనేకదా నీ మొహంమీద నవ్వు చెరిగిపోయింది. ఆ నవ్వు, ఆ సంతోషానందాలు నీకు

మళ్ళీ తిరిగి యివ్వడం నా కర్తవ్యం కదూ?''

'రిచర్డ్' పరీక్షల ఫలితాలు వచ్చాయి. అతడు ఫస్టుక్లాసులో డాక్టరు పరీక్ష ప్యాసయ్యాడు. ఊరు ప్రజలందరూ ఎంతో ఆనందించారు. ఎంతోమంది యింటికి వచ్చి అభినందనలు తెలియజేశారు. 'బ్రగాంజా' జమిందారు ఆనందానికి ఎల్లలులేవు. ఎంతో ఉప్పొంగిపోయాడు, కారణం 'జూజే' కొడుకుకి తను చేసిన సహాయం ఫలించిందనీ, లాభించిందనీ. 'లూయిజా', 'రిచర్డ్' తల్లీ, కొడుకులూ ప్రత్యేకంగా 'బ్రగాంజా' యింటికి వెళ్ళి తమ కృతజ్ఞతలు తెలుపుకున్నారు.

'లూయిజా' సవినయంగా అంది ''ఈ రోజు మా వంశంలో బహు సుదినం. ఈ శుభపరిణామం మీ దయ, మీ సంపూర్ణ సహాయ, సహకారాలవల్లనే వీలయింది. మీకు కృతజ్ఞతలు చెప్పడం మా విధి.''

''కాదు. ఈ విజయానికి మూలకారకుడు 'జూజే'. నీ భర్తకే ఈ కీర్తి దక్కాలి.''

'బ్రగాంజా' ఇంకా యిలా అన్నాడు, రిచర్డ్ కేసి చూస్తూ ''రిచర్డ్ నీ తల్లికి వయస్సు దాటుతోంది. ఇప్పుడామెకి యింటిపనుల్లో సహాయపడేవాళ్ళు కావాలి. అందుకని నువ్వు నీ పెళ్ళి గురించి ఆలోచించాలి'' 'రిచర్డ్' నవ్వాడు. నవ్వుతూనే జవాబు చెప్పాడు ''అంకుల్ (మావయ్యా) ఆ సంగతి తరువాత ఆలోచిద్దాం ముందు నాకు ఉద్యోగం లభించి, నా కాళ్ళమీద నేను నిలబడనివ్వండి. ఈ రోజువరకూ మీ ఆధారంతోనే నేను ముందుకి వెళ్ళాను.''

'బ్రగాంజా' జమిందారు 'రిచర్డ్' పెళ్ళి ప్రస్తావన తెచ్చి, ఆ విషయం తన కొడుకుతో చర్చించడం విన్న 'లూయిజా' మనస్సులో సతమతమయింది. ఒక కోరిక, తన మనస్సులోనే యిన్నాళ్ళూ దాచిపెట్టుకొన్న కోరిక బయటపడింది. ఆ విషయం గుర్తుకొచ్చినప్పుడల్లా ఆమె కళ్ళముందు ఒకే అమ్మాయి రూపం కనిపిస్తుంది. ఆ అమ్మాయే 'అనీతా'. 'అనీతా' తన కోడలయితే, తన సంసారం సవ్యంగా సాగుతుందనీ, తన కొడుకు భవిష్యత్తు బంగారుబాట అవుతుందనీ ఆమెకి ఖచ్చితమైన నమ్మకం వుంది. అయితే తననుకొన్నట్లు జరుగుతుందో, లేదోనని ఆమెకి అనుమానం. 'అనీతా' శ్రీమంతుల బిడ్డ. ఆమెని తనలాంటిపేదల యింట్లోకి కోడలుగా పంపడం వాళ్ళకి యిష్టముండకపోవచ్చును.

రోజూలాగే 'అనీతా' ఆమె యింటికి, యింటి పనుల్లో సహాయం చేయడానికి వచ్చినప్పుడు 'లూయిజా' అంది :

"అనీతా నిన్ను నేనొక విషయం అడగాలనుకుంటున్నాను." 'లూయిజా' గొంగుకలో ఏదో గాభరా ధ్వనించింది. ఆమెకి చెమటపట్టింది. ఇది గమనించిన 'అనీతా' అడిగింది. "అంటీ (అత్తయ్య) నువ్వెందుకు వూరికే గాభరాపడుతున్నావు? ఏం అడగాలో నిస్సందేహంగా అడుగు."

'లూయిజా' ధైర్యం తెచ్చుకుని అడిగేసింది.

"చూడమ్మా 'అనీతా'! గత పదిహేడు, పద్దెనిమిది సంవత్సరాలుగా నువ్వు నన్ను నీ తల్లితో సమానంగా చూసావు. నువ్వు నా ముఖంమీద నవ్వుని తిరిగి తెచ్చావు. అందుకని నాకనిపించింది. నువ్వెప్పుడూ నాదగ్గర, నా కళ్ళముందు వుండాలని. అలా అయితే నా జీవితం శాశ్వతంగా సుఖమయమవుతుందని. 'అనీతా' యిప్పుడు చెప్పు. నేను నిన్ను కోడలుగా ఈ యింట్లో వుండమని కోరితే, నువ్వు వొప్పుకుంటావా?"

'లూయిజా' మాటల్ని 'అనీతా' విని ఉప్పొంగిపోయింది. ఆనందంతో ఉక్కిరిబిక్కిరై మాటలు పెగల్లేదు. "అంటీ, నువ్వు నిజంగానే అంటున్నావా?"

'అనీతా' పరుగు పరుగున ఇల్లు చేరుకుని, తండ్రిని గట్టిగా కౌగలించుకుంది.

"అనీతా, ఏమయిందే నీకు? నువ్వు యింత సంతోషంగా గెంతులేయడం నేనెప్పుడూ ఎరగను" 'బ్రగాంజా' కూతుర్ని అడిగాడు.

"నాన్నా, నా మనస్సు శాంతపడింది. నేను 'లూయిజా' అత్తయ్య కోడలునై, ఆమెకి కూతురు లేనిలోటు తీరుస్తాను. నాకోసం ఆమె సహించిన దుఃఖం కంటే ఎక్కువ సుఖాన్ని ఆమెకి యిచ్చి, నా ఋణం తీర్చుకొంటాను."

'అనీతా' ఖుషీగా మాట్లాడుతూనే వుంది. 'బ్రగాంజా' జమిందారు కూడా సంతోషించాడు అది విని. ఆమెని తన చేతుల్తో గట్టిగా వొత్తుతూ అన్నాడు "అనీతా, నీ ఉద్దేశం గొప్పగా వుంది. నీ యిష్టప్రకారమే జరుగుతున్నందుకు నాకూ చాలా సంతోషంగా వుంది."

సాయంత్రంవేళ 'రిచర్డ్' యింటికి తిరిగి వచ్చాక 'లూయిజా' ఈ విషయం అతనికి చెప్పింది.

"ఇదిగో చూడు 'రిచర్డ్'. నీకు గవర్నమెంట్ హాస్పిటల్‌లో ఉద్యోగం దొరికింది - డాక్టరుగా. ఇప్పుడు మన సంసారం గట్టి పునాదిమీద నిలబడింది. మరోపక్క చూస్తే నేనూ క్రమేణా ముసలిదానిని అవుతున్నాను - వయస్సొచ్చి. అందువల్ల నే

ననేదేమిటంటే, నువ్వు హాయిగా పెళ్ళిచేసుకుని ఒక చక్కని కోడలుని తేవాలి.''

తల్లి అకస్మాత్తుగా అన్న ఈ మాటలు విని 'రిచర్డ్' మందహాసంగా నవ్వాడు "అమ్మా! నాకిదంతా తెలుసు. నీ శ్రమ తగ్గించడం విషయమే నేనూ ఆలోచిస్తున్నాను'' కొడుకు మాటలు విన్న తల్లి ఎంత సంతోషపడిందంటే, అతను మాటలు పూర్తిచేయక ముందే యిలా అంది :

''బాబూ, మన 'అనీతా'ని ఈ యింటికి కోడలుగా చేస్తే నీ జీవితం, నా జీవితం సుఖసంతోషాలతో వర్ధిల్లుతాయి. నీకెలాగనిపిస్తోంది?''

'రిచర్డ్' ఆలోచిస్తున్నాడు. ఏం మాట్లాడలేదు. తల్లి అతన్నే తదేకంగా చూస్తోంది. చాలాసేపు గడిచింతరువాత 'రిచర్డ్' మాటలు వెతుక్కుంటూ అన్నాడు.

''అమ్మా, ఈ 'అనీతా'తోటి నేను పెళ్ళిచేసుకోవడం సాధ్యంకాదు. చిన్నతనం నుంచీ మేమిద్దరం గారాబంగా నీ చేతుల్లోనే పెరిగాం - నీ ప్రేమని పంచుకున్నాం. మా ప్రేమ అన్నా చెల్లెళ్ళ ప్రేమ వంటిది. ఆమెనే పెళ్ళి చేసుకోవాలన్న భావన నాకెప్పుడూ కలగలేదు. ఆ దృష్టితో నే నెప్పుడూ ఆమెని చూడలేదు. కానీ అమ్మా, నువ్వేమీ బెంగపెట్టుకోవద్దు. నా మనస్సులో ఒక అమ్మాయి ఉంది.''

తల్లి ఆశాభంగంతో కృంగిపోయింది. ఒక క్షణంలో ఆమె కలలమేడ కూలిపోయింది. వెయ్యి ప్రశ్నలు ఆమెలో మొలకెత్తాయి.

ఆ రాత్రి 'లూయిజా'కి నిద్రపట్టలేదు. ప్రొద్దున్నే లేచి 'అనీతా'కి ఈ విచార సమాచారం తెల్పాలని నిశ్చయించింది. పగలు ఆమె ఆ సమయంలో స్కూలుకి వెళ్ళే హడావిడిలో వుంటుందని జ్ఞాపకం వచ్చింది.

ఆరోజు సాయంకాలం 'అనీతా' ఇంటికి 'లూయిజా' వెళ్ళింది 'అనీతా' ఎంతో ఆనందంతో స్వాగతమిచ్చింది. 'బ్రగాంజా' జమిందారు కూడా చాలా సంతోషంగా లోపలికి ఆహ్వానించాడు. కానీ 'లూయిజా' మొహంమీద చిఱునవ్వులేక ఆమె ముభావంగా వుండడంచూసి 'అనీతా' అడిగింది ''ఆంటీ, ఏమయింది? నువ్వు మామూలు రోజులాగ లేవు''. 'లూయిజా' మొహంమీద ఏడుపు ముంచుకొచ్చింది. ఆమె సవిస్తారంగా తనకీ, కొడుకు 'రిచర్డ్'కీ మధ్య జరిగిన సంభాషణ వాళ్ళకి చెప్పింది. 'రిచర్డ్' మనస్సులో మరో అమ్మాయి వున్న సంగతీ తేల్చింది.

'అనీతా' చాలా నిరాశపడి, దుఃఖించింది. 'రిచర్డ్' మరో అమ్మాయిని

వివాహం చేసుకోబోతున్నాడని విని, ఆమెకి తట్టుకోలేనంత దెబ్బతగిలింది. అయితే మరో విధంగా ఆమె సమాధానపడింది. 'రిచర్డ్' తనని స్వంత చెల్లెలుగా భావించి, ప్రేమిస్తున్నందుకు. 'అనీతా' - 'లూయీజా'తో అంది :

''ఆంటీ, నువ్వు బాధపడకు. నాకు బాగా నమ్మకం ఉంది - 'రిచర్డ్' ప్రేమించిన ఆ అమ్మాయి మంచి గుణవంతురాలై వుంటుంది. ఆంటీ, నేను నీకు కోడలుగా సేవలు చేయలేకపోయినా నీ కూతురుగా చేస్తాను''. 'అనీతా' యొక్క ఈ చల్లని మాటలు విని 'లూయీజా' కళ్ళల్లో నీళ్ళొచ్చాయి. జమిందారు 'బ్రగాంజా' అన్నారు –

''నీ కొడుకు బుద్ధిమంతుడు, తెలివైనవాడు. అతను తీసుకున్న నిర్ణయం, బాగా ఆలోచించే చేసి వుంటాడు. ఆఖరికి పెళ్ళిళ్ళు నిశ్చయించేది భగవంతుడేకదా!''

'రిచర్డ్' 'రీటా' అనే అమ్మాయిని పెళ్ళిచేసుకోవాలని నిర్ణయించాడు. ఒక రోజు 'రీటా'ని తీసుకొని, తన యింటికి వచ్చాడు, తల్లికి చూపించడానికి. 'రీటా'ని చూసి 'లూయీజా' సంతోషించింది.

'రీటా' సౌందర్యవతి. ఆమె ప్రవర్తన వలన మంచి గుణవతి అని తెలుస్తోంది.

'రీటా' తన తండ్రి 'మెర్‌గ్యుల్యాప్', తల్లి 'హోటెన్షియా'లకి ఏకైక కుమార్తె. వారికి ఒక కొడుకు - పేరు 'లుకాస్'. వాళ్ళది శ్రీమంతుల కుటుంబం. బోలెడంత డబ్బూ, బంగారం, తోటలూ, పొలాలూ, ఇళ్ళూ వున్నాయి. 'మెర్‌గ్యుల్యాప్' ఒక రిటైరైన సైనిక అధికారి. సైన్యంలో గొప్ప పని చేసి మంచి పేరు, కీర్తి ప్రతిష్టలు ఆర్జించాడు. అతని కాలంలో అతను గొప్ప సాహసం, ధైర్యం గల సైనికాధికారిగా పేరు గడించాడు. ఎవరికీ భయపడేవాడు కాదు. లెఖ్ఖచేసేవాడు కాదు. ఏ సంకటం వచ్చినా ముందుకుపోయి, ఎదుర్కొని విజయం సాధించేవాడు. అయితే ఒకేచోట, అతను చిత్తుగా ఓడిపోయేవాడు. అదే, అతడి భార్యముందు! ఇంట్లో ఆమె మాటే చెల్లుతుంది. ఆమెదే ఆఖరి ఆజ్ఞ. ఇంట్లో ఆమె యిష్టంవినా, పూచికపుల్ల కదలదు. ఆమె ఒక్క అరుపుతో యింట్లో అందర్నీ నోరు మూసుకునేలా చేస్తుంది. తండ్రి 'మెర్‌గ్యుల్యాప్' సరదాగా వేటకి వెళ్ళి పులుల్నీ, సింహాల్నీ కూడా చంపాడు. కానీ ఆమెముందు మాత్రం మైనంలా కరిగిపోతాడు. సైనికాధికారిగా ఎందర్నో శత్రువులని ఎదుర్కొని, విజయం సాధించి, పతకాలు (Medals)గెలుచుకున్నాడు. కానీ ఆమె ముందు, ఈ పతి పతకాలు ...

ఇటువంటి వాతావరణంలో, 'రీటా', 'లుకాస్'లు పెరిగి పెద్దవారయ్యారు.

'రిచర్డ్'తో 'రీటా' పెళ్ళి జరగాలని నిశ్చయించిం తరువాత, 'రీటా' తల్లి యిలా ఉపదేశించింది.

"'రీటా', నా కూతురా, కొద్దిరోజుల్లో నీ పెళ్ళి అవుతుంది. మరో యింట్లో నీ జీవనం ప్రారంభమవుతుంది. ఆ క్రొత్త జీవితంలో మొదట్నుంచే నువ్వు చాలా చాతుర్యంగా మసలాలి. నేను మీ నాన్నని పెళ్ళి చేసుకొన్నప్పుడు, మొదటి రోజు నుంచే నేను ఈ విధంగా నిష్ఠతో వ్యవహరించాను గనక నా వివాహ జీవితం దిగ్విజయంగా సాగింది.

'రీటా' తల్లి మాటలకి యిలా జవాబిచ్చింది.

"అమ్మా! నువ్వేం దిగులుపడవొద్దు. తల్లి ఏం చేసిందో, అదే పిల్ల చేస్తుంది. ఎంతైనా నేను ఆ తల్లి బిడ్డనేకదా?"

"షాభాస్, నా బంగారు కూతురా! దేవుడి ఆశీర్వాదం నీకు లభించుగాక". 'హోటెన్సియా' అమ్మాయిని కౌగలించుకుంది. పెద్ద భారం తీరినట్లు నిట్టూర్చింది.

'రిచర్డ్', 'రీటా'ల పెళ్ళి చాలా ఘనంగా, పెద్ద ఆర్భాటంతో జరిగింది. వేలాది జనం పెళ్ళికి వచ్చారు. 'అనీతా' ఒక చెల్లెలులా 'రిచర్డ్' పెళ్ళిలో ముఖ్యపాత్ర తీసుకుంది. ఇంటికి కోడలు వచ్చిందని 'లూయిజా' ఆనందంతో ఉప్పొంగి పోయింది.

పెళ్ళి అయిపోయాక, నిజజీవితం మొదలయింది. అది మొదటి రోజు. అదే నెలలో కూడా 'ఫస్ట్' తారీకు - 'రిచర్డ్' జీతం అందింది. అతడు మామూలు ఆనవాయితీ ప్రకారం డబ్బులు తల్లికి యివ్వడానికి వెళ్తున్నాడు. 'రీటా' అతన్ని ఆపి, ఆ జీతం డబ్బులు తను తీసుకుంది. తీసుకుని —

"రిచీ డార్లింగ్ - యిప్పుడు నీ జీవిత భాగస్వామి - భార్య వుంది. ఇకపై ఈ యింటి బాధ్యతలన్నీ నాకు వొదిలెయ్యి. నేను ఈ వేళనుంచీ ఈ యింటి వ్యవహారాలన్నీ చూసుకుంటాను. నువ్వూ, అత్తగారూ శ్రమపడనక్కరలేదు."

"కానీ 'రీటా'..." రిచర్డ్ ఏదో అనబోతూ వుంటే 'రీటా' అడ్డగించింది.

"కానీలూ, అర్ధణాలూ తీసేయ్. ఈవేళ నుంచీ యింటి విషయాలన్నీ నేనే నిర్వహిస్తాను. ఇది ఖాయం."

అలా ఖండితంగా 'రిచర్డ్'తో చెప్పి, 'రీటా' తన అత్తదగ్గరకి వెళ్ళింది, యిదే

విషయం స్పష్టంచేయడానికి.

"అత్తా, యిదిగో చూడు. ఈరోజు నుంచీ యింటి బాధ్యతలన్నీ నావి. నేను చూసుకుంటాను. ఏ ఏ వస్తువులు కొనడానికి డబ్బు కావాలో అది నేనిస్తాను. ఇక నువ్వు ఏం శ్రమతీసుకోవద్దు. ఇకపై అన్ని ఖర్చులూ పద్దులూ నేనే చూసుకుంటాను. నేను నీకు ఏ పనులు చెబుతానో అవే చెయ్యి"

'రిచర్డ్' పరుగున వచ్చాడు - ఏదో చెప్పాలని. 'రీటా' గంభీర స్వరంతో అంది "రిచర్డ్ నువ్వు నోరుమూసుకో. నేను మాట్లాడుతున్నప్పుడు నువ్వు అడ్డుచెప్పకు" రిచర్డ్ మౌనంగా వూరుకున్నాడు.

'లూయిజా'కి తనేదో నిద్రలో వున్నట్లూ, ఏదో పీడకల చూస్తున్నట్లూ అనిపించింది. 'రిచర్డ్' భార్య హెచ్చరికకి భయపడి కుక్కినపేనులా మౌనంగా వుండడం చూసి ఆమె నిర్ఘాంతపోయింది. 'లూయిజా' తన మనస్సులోని భావాలని నొక్కిపెట్టి 'రీటా'తో "అవును తల్లీ - యికముందు ఈ యిల్లు - నువ్వే చక్కబెట్టుకో" క్లుప్తంగా అని, లోపలికి వెళ్ళిపోయింది.

'రిచర్డ్' చాలాసార్లు ప్రయత్నించాడు 'రీటా'కి నచ్చచెప్పడానికి. లాభంలేకపోయింది. ఆమె వినలేదు. ఒకరోజు ఖండితంగా యిలా అనేసింది :

"రిచర్డ్ నువ్వూ, నేనూ భార్యాభర్తలం కలిసి ఈ సంసారం చేయాలి. ఈ సంసారం మనది. నీ అమ్మది కాదు. అందుకోసం నేను చేస్తున్నది నీకు నచ్చకపోతే, నువ్వు నీ తల్లితోనే వుండు. నేను మా పుట్టింటికి వెళ్ళిపోతా."

ఈ మాటలు విని 'రిచర్డ్' అవాక్కయిపోయి, మౌనంగా నిలబడి పోయాడు. రోజులు వెళ్ళినకొద్దీ, 'లూయిజా' దుఃఖం పెరుగుతోంది, వటవృక్షంలా. 'రీటా' 'లూయిజా'ని - తన అత్తని - యింట్లో నౌకరుకన్నా హీనంగా పనులు చేయించి, సతాయిస్తోంది. 'లూయిజా' రోజు, రోజుకీ కృశించిపోతోంది - అయినా పాపం అంతా సహిస్తోంది.

'అనీతా' చాలాసార్లు 'లూయిజా' ఆంటీని కలుసుకోవడానికి 'రిచర్డ్' ఇంటికి వచ్చేది. కానీ 'లూయిజా' ఆమెకి ఏ విషయమూ చెప్పేది కాదు. అయినా 'అనీతా' గ్రహించింది. 'లూయిజా' ఆంటీ యిదివరకటిలా ఉల్లాసంగా, నవ్వుతూ వుండడం లేదనీ, ఏదో బాధ ఆమెని వేధిస్తోందనీ, అసలు నిజం తెలుసుకుందామని ఒక రోజు 'రిచర్డ్' - 'రీటా' యిద్దరూ లేని సమయం చూసి, 'లూయిజా' యింటికి

వెళ్ళింది. ఆ ప్రసంగం తీసుకువచ్చి ఆమెని అన్ని విధాలా వొత్తిడి చేసి అడిగింది. గుచ్చి గుచ్చి అలా ప్రశ్నలతో వేధిస్తున్న 'అనీతా' ముందు, దుఃఖాన్ని ఆపుకోలేక బోరున ఏడుస్తూ, అంతా చెప్పేసింది. 'అనీతా' అనుమానం ధృఢీ అయింది—

ఇంతలోనే 'రిచర్డ్', 'రీటా' యింటికి తిరిగి వచ్చారు. 'అనీతా' తన అత్తకి దగ్గరగా కూర్చుని ఏవో రహస్యమంతనాలు చేస్తున్నట్లుగా చూసి, తన మొహం నల్లబొగ్గులా మార్చుకుంది. 'అనీతా' 'రిచర్డ్'తో ఈ ప్రసంగం అతి నాజూకు మాటలతో, ఎంతో నమ్రతగా తెచ్చింది. ఎవరి మనస్సూ నొప్పించక, ఈ సమస్యని పరిష్కరించాలని భావించింది. అయితే అహంకారంతో నిండిన 'రీటా' ముందు, ఆమె ఉద్దేశ్యం బెడిసికొట్టింది. 'రీటా' మరి తాత్సారం చేయలేదు. కుండబ్రద్దలు కొట్టినట్లు అంది.

"అనీతా, మా యింట వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడానికి నీకేం హక్కులేదు. నీకు నీ మర్యాద దక్కాలని ఆశవుంటే నువ్వు తక్షణం మా యింట్లోంచి వెళ్ళిపో."

ఈ కఠోర మాటలు విన్నాక, 'అనీతా' కొద్ది క్షణాలు ఆగింది. ఆగి 'రిచర్డ్'కేసి చూసింది. అతడు కలగజేసుకుని 'అనీతా'తో అలా నిష్ఠూరంగా, అవమానకరంగా మాట్లాడినందుకు 'భార్య'ని మందలిస్తాడని ఆశించింది. ఆనీ 'రిచర్డ్' వులుకూ, పలుకూ లేకుండా స్తంభంలా నిలబడ్డాడు - తనకేం పట్టనట్టు. అది గమనించి 'అనీతా' అంది—

"రీటా, నా తప్పయింది. నేను బుద్ధిలేక మీ యింటి వ్యవహారాల్లో జోక్యం చేసుకున్నాను. నన్ను క్షమించు". ఈ మాటలు పూర్తిచేసి, వెంటనే గబగబా బయటకి వెళ్ళిపోయింది.

'అనీతా' చాలా విచారించింది. తనని అంత అవమానంగా మాట్లాడి, బయటకి పొమ్మన్నందుకు కాదు. తన తల్లిలాంటి ఆంటీని అలా హీనంగా, పరమ నికృష్టంగా కష్టపెడుతున్నందుకు. ఇది ఆమెకి భరించలేని బాధ అనిపించింది. తను ఎలాగైనా లూయీజా ఆంటీని ఈ నరకబాధ నుంచి విముక్తురాలిని చేయాలని నిశ్చయించింది. కానీ తను అందుకు ఏం చేయాలో ఆమెకి తోచలేదు. ఆమె దీర్ఘంగా ఆలోచించింది. ఆమెకేం ఉపాయం వెంటనే కలగలేదు. ఇలా చాలా ఆలోచించగా, ఒకరోజు ఒక మంచి ఉపాయం తట్టింది. ఎవరికీ తెలపకుండా,

తన వ్యూహం అమల్లోకి తెచ్చింది.

'అనీతా' స్కూలూ, ఇల్లూ తప్ప మరెక్కడికీ వెళ్ళేది కాదు. ఇప్పుడు డ్యాన్సులకీ, సినిమాలకీ, నాటకాలకీ భేషుగ్గా వెళ్తోంది. 'అనీతా' మొగపిల్లలతో మాట్లాడటమే అరుదు. ఇప్పుడామె ఒక యువకుడితో స్నేహం చేసి అతడితోనే అన్నిచోట్లా తిరుగుతోంది. ఆమె వరించి, మచ్చిక చేసుకుంటున్న రాకుమారుడు మరెవ్వరో కాదు - అతనే 'లుకాస్' 'రీటా' సోదరుడు. 'మెర్‌గ్యుల్యావ్', 'హోటెన్సియా'ల కొడుకు! నిజంగానే 'అనీతా', 'లుకాస్'ల స్నేహం ప్రేమగా పుష్పించింది. అసలు కిటుకేమిటంటే 'అనీతా' తన వ్యూహం ప్రకారం లుకాస్‌తో స్నేహం ఆరంభించింది. ఆ స్నేహం తన పథకం ప్రకారమే అయినా నిజమైన ప్రణయంగా మారింది. 'లుకాస్'కి 'అనీతా' మీద మొదట్లో ఒక విధమైన ఆకర్షణగా ప్రారంభమయిన చెలిమి, గాఢప్రేమగా మారింది. ఇదంతా అనతికాలంలో సినిమా కథల్లా జరిగిపోయింది. ఇద్దరూ పెళ్ళిచేసుకోవాలని తీర్మానించుకున్నారు.

వాళ్ళ ప్రేమ ప్రకరణం అలా సాగుతూ వుండగానే, తమ తమ కుటుంబాల గురించీ, రక్త బంధువుల గురించీ, పూర్వీకుల గురించీ, సాంప్రదాయాల గురించీ క్షుణ్ణంగా తెలుసుకున్నారు.

ఇలా కబుర్లాడుతూన్నప్పుడు, ఒకరోజు 'అనీతా' 'లుకాస్'ని అడిగింది :

"లుకాస్, మీ అమ్మ మీ యింట్లో ప్రవర్తిస్తున్న తీరు నీకెలా అనిపిస్తుంది? మీ నాన్న ఆమె అంటే భయపడతాడుట, నువ్వూ ఆమెకి ఎప్పుడూ ఎదురు చెప్పవుట. అందరూ ఆమెకి భయపడుతారట. ఇంట్లో యిటువంటి వాతావరణం మంచిదా? నీకేమనిపిస్తోంది?"

'లుకాస్' అన్నాడు "మా నాన్న మొదట్నించీ తప్పటడుగు వేశాడు. అతని వల్లనే, అతని మెతకతనం వల్లనే మా అమ్మ నిరంకుశంగా రాజ్యం ఏలుతోంది. మా నాన్నకే ఆమెని ఎదుర్కొనే గుండెలు లేకపోతే నేను మాత్రం ఏంచేయగలను?

అనీతా, లుకాస్‌ని మళ్ళీ అడిగింది. "లుకాస్, తల్లి ప్రోత్సాహంతో, తప్పుడు దోవ తొక్కి రీటా, రిచార్డ్ తల్లితో అంటే తన అత్తతో వ్యవహరించిన తీరు గురించి ఏమంటావు?"

"నిజం చెప్పనా?" లుకాస్ చెప్పసాగాడు, "నా సోదరి రీటా తన అత్తతో - అంటే భర్త రిచర్డ్ తల్లి లూయిజాతో వ్యవహరించిన తీరు చాలా దారుణం,

అన్యాయం. బంగారం లాంటి మనిషి లూయిజా జీవితం నరకకూపం చేసింది. కేవలం తన భర్తకి తల్లీ, తనకి అత్త అయిన కారణాన, ఆ నేరానికి జన్మఖైదీగా ఆ యింట్లో దుఃఖిస్తోంది. ఇటువంటి కోడలూ, కొడుకూ లభించినందుకు విలపిస్తోంది."
అనీతా చాలా సంతోషించింది; అయితే ఆమెకి ఆశ్చర్యం కూడా వేసింది. సంతోషించడానికి కారణం తన కాబోయే భర్త లుకాస్ మంచి వర్తన, మంచి గుణం, నరైన న్యాయబుద్ధి గల మనస్తత్వం కలవాడు. అతని ఆలోచనావరళి ఆరోగ్యకరమైంది. ఆమె ఆశ్చర్యపోవడానికి కారణం పెద్ద సైనికాధికారిగా పనిచేసిన అతని తండ్రి, ధైర్యసాహసాలకి విఖ్యాతిగాంచి ఎన్నో రజతపతకాలూ, గౌరవచిహ్నాలూ గడించిన ధీరుడు, వేటలో పులులనీ, సింహాలనీ చంపాడని పేరు పొందిన గజవేటగాడు పెళ్ళాంముందు పిల్లిలా ఎలా మారాడు? పెళ్ళి మర్నాడే నల్లిలా నలిపేయవలసిన ఆమె గయ్యాళి మనస్తత్వాన్ని యిలా ఎందుకు అందరి ఆనందాన్నీ, స్వాతంత్ర్యాన్నీ హరించే బదబాగ్నిలా పెరగనిచ్చాడూ?

లుకాస్, అనీతా గురించి తన తల్లిదండ్రులకి చెప్పాడు. తను ఆమెని పెళ్ళి చేసుకోదలిచానని కూడా చెప్పాడు. తల్లి అంది : "లుకాస్ నీకు పెళ్ళి చేయాలని మేమూ ఆలోచిస్తున్నాం. నువ్వు నీకు నచ్చిన అమ్మాయిని వెతికావు. చాలా సంతోషం. కానీ ఈ అమ్మాయి మన హోదాకి తగినదేనా?"

"అమ్మా, తినబోతూ రుచెందుకు అడుగుతావూ?" లుకాస్ జవాబిచ్చాడు.

"అనీతా ఒక స్కూలులో టీచరుగా పనిచేస్తోంది. నువ్వు ఎక్కడికైనా వెళ్ళు, ఎవరితోనైనా వాకబు చెయ్యి. ఇంత మంచి కోడలు మన గృహంలో ప్రవేశించడం మన అదృష్టం."

లుకాస్ పెళ్ళి కబురు రీటా చెవుల్లో పడింది. ఆమె పరుగు పరుగున వచ్చి తల్లిని కలుసుకుంది. అనీతా తన వదిన అవబోతోందని తెలిసి ఆమె ప్రాణం తల్లడిల్లింది. శరీరం మంటల్లో పడినట్లు భగభగమండింది.

ఆఖరికి ఎలాగైతేనేం, పెద్ద ఆర్భాటంతో, గొప్ప ఏర్పాట్లతో లుకాస్, అనీతాల వివాహం ఘనంగా జరిగింది. ఊళ్ళోవాళ్ళూ, ఊరి బయటవాళ్ళూ వేలాది సంఖ్యలో పెళ్ళికి వచ్చారు. పెళ్ళయిన మర్నాడే యిద్దరూ 'హనీమూన్' (ప్రేమయాత్ర)కి 'బెంగుళూరు' వెళ్ళారు. సుమారు పక్షంరోజులు హాయిగా, విలాసంగా తిరిగి 'గోవా'కి తిరిగి వచ్చారు.

అనీతా అత్తవారింట్లో ప్రతీ చిన్నా, పెద్దా విషయాలను పరిశీలించి, సూక్ష్మంగా చూసి అవలోకనం చేసుకుంది. లుకాస్ తండ్రి (అనితా మా(వ) అనీతాని అపురూపంగా చూసుకుంటున్నాడు. అంతకంటే ఎక్కువ గౌరవం, అభిమానం అనీతా తన మా(వమీద చూపిస్తోంది. మరోవైపు ఆమె అత్త హోటెన్షియా, అనీతాతో చాలా ముభావంగా ఉండి, ఎక్కువ చనువు చూపించకుండా వుండేలా జాగ్రత్తపడుతోంది. ఎవరికీ తెలియకుండా, అనీతాని తన పెత్తనం క్రింద అణిగి మణిగి వుంచేలా చేయడానికి విశ్వప్రయత్నం చేస్తోంది. అనీతాకి ఆమె ధోరణి ముందే తెలిసినందువల్ల, ఆమెకి దూరంగా, అంటీ అంటనట్లు మసులుకొంటోంది.

హఠాత్తుగా ఇంట్లోని నౌకరు తన తల్లికి బాగా జబ్బు చేసిందని తెలిసి, సెలవు పెట్టి తన వూరు వెళ్ళాడు. తన తల్లికి నయమయినాక తిరిగి పనిలో జేరతానని చెప్పి వెళ్ళిపోయాడు. మర్నాడు ప్రొద్దున్న హోటెన్షియా, అనీతాని పిలిచింది. పిలిచి ఆమెతో "నువ్వు వొంటింట్లోకి వెళ్ళు. నాకు ఒక కప్పు టీ చేసి తీసుకురా". అనీతా చిరాకూ, కోపం మొహంమీద చూపిస్తూ అంది: "అత్తా, నీకు కావాలంటే వొంటింట్లోకి నువ్వే వెళ్ళి టీ పెట్టుకు తాగు. ఈ యింట్లో ఎవ్వరూ మరొకరి నౌకరు కాదు. తెలిసిందా?" తన కోడలి జవాబు విని, ఆమె రక్తం సలసలా కాగింది. కోపం ఉధృతంగా వచ్చి అంది, "అనీతా, ఎవ్వరితో మాట్లాడుతున్నావో తెలుసా?" అనీతా చలించకుండా సావకాశంగా జవాబు చెప్పింది "ఆ(" అని. హోటెన్షియా కోపం మస్తిష్కానికి ఎక్కింది. ఈ గలాటా వినిపించి, లూకాస్, మెర్గ్యుల్యావ్ తమ గదుల్లోంచి బయటకొచ్చారు. హోటెన్షియా కోపంతో అంది, "అనీతా, నేను నీ నాలిక కోసేస్తాను - జాగ్రత్త. ఈ యింట్లో నామాటే చెల్లుతుంది. తెలుసుకో".

అనీతా ఆమెని యింకా రెచ్చకొట్టాలని, ఫక్కున నవ్వింది. నవ్వి అంది "ఒసే మా అత్తా! నువ్వు పప్పులో కాలేశావ్. ఈ యింట్లో నీ అధికారం చెల్లేరోజులు వెళ్ళిపోయాయి. ఈరోజు నుంచీ నావంటి బానిసలదే రాజ్యం. చెవులు విప్పి బాగా విను. ఈ రోజు నుంచీ నేను చెప్పిందే నువ్వు చెయ్యాలి. నేను లేవమన్నప్పుడు లేవాలి. నేను కూర్చోమన్నప్పుడు కూర్చోవాలి. తెలిసిందా? ఇంక నాకు నీ జవాబు అఖ్ఖర్లేదు."

'హోటెన్షియా,' 'అనీతా' మాటలు తూటాల్లా తగిలి, నిర్ఘాంతపోయింది. ఆమె వొంటి రక్తం గడ్డకట్టి, అగ్నిగోళం అయినట్లయింది. మరో చెంప, తన భర్త,

తన కొడుకూ ఈ నాటకం చూడడం, చూస్తూ ఏమీ అనకపోవడం ఆమెకి చచ్చేటంత సిగ్గూ, అవమానం కలిగాయి. ఆమె నిస్సహాయతకీ, ఆమెమీద ఆమెకే జాలివేసింది. మరి గత్యంతరంలేక కొడుకు లుకాస్‌తో దీనస్వరంతో అంది :

''లుకాస్, చూశావుకదురా నీ పెళ్ళాం చేష్టలు? నువ్వు దాని మొగుడివి కదురా? మరి నీ తల్లిని అలా అవమానం చేస్తుంటే చూసి వూరుకున్నావేం?'' అని అడిగింది.

లుకాస్ అంతకంటే దీనంగా ''అమ్మా నేనేం చేయగలను చెప్పు? మా నాన్నే నీ నోరు మూయలేకపోయాడు అప్పుడు. ఇప్పుడు నా పెళ్ళాం నోరు నే నెలా మూయ గలను?''

మెర్‌గ్యుల్యాప్, అతని తండ్రి, మధ్యలో కలుగజేసుకుని అన్నాడు ''హోటెన్స్, నిజంగా యిది మాకు అభిమానం కలిగించే విషయం - అవమానం కాదు. చూడు. 'లుకాసి' అచ్చంగా నావంటి మొగుడే అయ్యాడు. అనీతా అచ్చంగా నీలాంటి కోడలే అయింది''. ఇది విని హోటెన్సియా మరీ రెచ్చిపోయింది. ''నేను చూస్తాను దాని అంతు'' అలా అని ఆమె టీ తయారుచేయడానికి వొంటింట్లోకి దారితీసింది.

మెర్‌గ్యుల్యాప్ తన కోడలు దగ్గరకి వెళ్ళి అన్నాడు ''అనీతా, నీకు నా హృదయపూర్వక అభినందనలు. షెబ్బాస్! బాగా బుద్ధి చెప్పావు. ఏ పనైతే నేను గత ఇరవై ఎనిమిది సంవత్సరాలుగా చేయలేకపోయానో, ఆ పని నువ్వు యిరవై ఎనిమిది గంటల్లో చేసేశావు.''

ఈ విధంగా, అత్తా కోడళ్ళ మధ్య ఆ యింట్లో ఒక యుద్ధం ఆరంభమయింది. అనీతా మనస్సులో ఒక కృతనిశ్చయానికి వచ్చి, వీలుదొరికినప్పుడల్లా తన అత్తని యిబ్బంది పెట్టసాగింది. ఇంట్లో నౌకరు లేనందువల్ల, ఇంటిపనంతా అత్తకి పురమాయించి, చేయించుకోసాగింది. వంట చేయడం, బట్టలుతకడం యివే కాక తడిగుడ్డతో నేల శుభ్రం చేయడం, ఇంట్లో బూజులు దులపడం యిత్యాది పనులన్నీ పురమాయించ సాగింది. ఏ పనైనా చేయడానికి తన అత్త వొప్పుకోకపోతే, ఖండితంగా ఆమెతో అనేది : ''అత్తా, నీకు ఈ పనులు చేయడం అలవాటులేకపోతే యిప్పుడు నేర్చుకో. మించిపోయింది లేదు. లేక పనిచెయ్యాలని యిష్టంలేకపోతే, ఈ యిల్లు విడిచి నీకిష్టమైన చోటుకి పోయి వుండు.''

జనం నోళ్ళల్లో పడి యింటిగుట్టుని రచ్చకి చేర్చడం హోటెన్సియాకి ఏమాత్రం

కిట్టదు. ఇంట్లో ఒక నౌకరులా తను పనులు చేయవలసివస్తోంది. అనీతా హాయిగా కుర్చీలో కూర్చుని ఆమె పనిని గమనిస్తోంది. ఒకరోజు రీటా పుట్టింటికి వచ్చింది. తన తల్లి తడిగుడ్డతో నేల తుడుస్తూ, శుభ్రం చేయడం చూసింది. పెద్ద షాకు తగిలినట్లు విస్మయం అయింది.

రీటాకి వెర్రి కోపం వచ్చింది. అనీతా జుట్టుపట్టుకు ఈడ్చుకొని, తన తల్లి కాళ్ళదగ్గర పడేసి క్షమాపణ కోరమందామనుకుంది. అప్పుడే అనీతా బయట వసారాలోకి వచ్చింది. "ఎవరూ రీటావా? ఎప్పుడొచ్చావూ? బాగున్నారా?" అని సహజంగా అడిగింది. రీటా కోపం అణుచుకోలేక ఆవేశంతో అంది "మా అమ్మ విషయం నువ్వేం చూస్తున్నావ్? నీకు ఇంగితజ్ఞానం వుందా?" రీటా, యింకా ఏదో అని నోరుపారేసుకోకుండా, అనీతా తగిన జవాబిచ్చింది.

"రీటా, మా యింటి వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడానికి నీకేం హక్కులేదు. నీకు నీ గౌరవం దక్కాలని వుంటే నువ్వు వెంటనే యిక్కణ్ణించి వెళ్ళిపోవడం మంచిది. లేకపోతే, నీ రెక్కలు పట్టుకుని బయటకి వెళ్ళగొడతాను. నాకింక నీతో మాట్లాడడం యిష్టంలేదు." ఈ మాటలు విని రీటా ఎండిన మ్రానులా వుండిపోయింది. తను అనీతాతో గతంలో అన్న మాటలే యివి. మరింక ఏమీ పలక్కుండా ఆమె నిష్క్రమించింది.

హోటెన్సియాకి జ్ఞానోదయం అయింది. తను పాడుబుద్ధితో చేసిన పాడుపనులు, యిప్పుడు తిరిగి తిరిగి తనకే కీడు చేస్తున్నాయి. తన పొరపాటు గ్రహించింది. అహంకారంతో యితరులని వేధిస్తే, ఆ వేదన ద్విగుణీకృతశక్తితో ఒకరోజు తననే దెబ్బకొడుతుందని తెలుసుకుంది. ఆలశ్యం చేయకుండా, కూతురు యింటికి వెళ్ళింది. విషయాలన్నీ 'రీటా'కి చెప్పింది.

'రీటా'కి కూడా తెలిసొచ్చింది. తన ప్రవర్తనలో గొప్ప లోపం గోచరమైంది. తన తల్లే స్వయానా తన తప్పులు గ్రహించి, పశ్చాత్తాపం పడుతున్నప్పుడు, రీటాకి మరో మార్గం లేకపోయింది.

'రీటా', 'రిచర్డ్' యింటికి రాగానే ఈ సంగతులన్నీ వివరించింది. తనూ, తన తల్లీ రిచర్డ్ తల్లి లూయిజాకి యిచ్చిన దుఃఖానికి, కలిగించిన కష్టాలకీ క్షమాపణలు యివ్వదలిచామనీ, యికపై తమ ప్రవర్తన మంచి మార్గంలోనే వర్తిస్తుందని హామీ యిచ్చింది. రిచర్డ్ ఆశ్చర్య, ఆనందాలకి ఎల్లలు లేవు. ఇంత

పెద్ద పరివర్తన, యింత హఠాత్తుగా జరిగిందని విస్మయం పొందాడు. ఆ సమయంలో రిచర్డ్ తల్లి వొంటింట్లో వంట చేస్తోంది. అక్కడికి తల్లీ, కూతుళ్ళు (హోటెన్షియా, రీటా) యిద్దరూ వెళ్ళి 'లూయిజా'ని కలిసి, తమ క్షమాపణలు చెప్పారు. గతంలో ఆమెకి రీటా చేసిన అవమానం, యిచ్చిన దుఃఖం మరిచిపొమ్మనమని అర్థించారు. లూయీజా కళ్ళల్లో ఆనంద అశ్రువులు నిండాయి.

'రిచర్డ్', 'లూయీజా ఆంటీ', రీటా మరియూ హోటెన్షియా వీళ్ళు నలుగురూ ఒక్కుమ్మడిగా కలిసి నవ్వుతూ, ఆనందంగా తన యింట్లోకి వస్తూంటే చూసి అనీతా ఉప్పొంగిపోయింది. అపోహలూ, పొరపొచ్చాలూ పోయాయి. 'లుకాస్', 'మెర్‌గ్యుల్యావ్' లు కూడా సంతోషించారు. లూయిజా లోపలికి వచ్చి 'అనీతా'ని కౌగలించుకుంది. ఆమె తనకి చేసిన ఉపకారంకి కృతజ్ఞతలు చెప్పడానికి తన దగ్గర మాటలు లేవంది. 'అనీతా', లూయీజా ఆంటీని బుగ్గమీద ముద్దుపెట్టుకుని, ఆప్యాయంగా కూర్చోబెట్టింది.

'అనీతా' తన కళ్ళల్లో అశ్రువులు బొటబొటా రాలుతూవుంటే, గౌరవంతో తన అత్త 'హోటెన్షియా' చరణాలకి ప్రణామం చేసి తనని క్షమించమని అర్థించింది. ''అత్తా ఈ నా వింత ప్రవర్తన కేవలం ఒక నాటకం. మీ తప్పుడు విచారశైలిని మార్చడానికి, మీరు కూడా అందరికీ గౌరవ మర్యాదలిచ్చి, మన కుటుంబాలలో శాంతి, సద్భావం, సుఖ సంతోషాలూ, స్వాతంత్ర్య వాతావరణం వర్థిల్లాలని ఈ నాటకం ఆడాను. నన్ను క్షమించు.''

మెర్‌గ్యుల్యావ్ (మాఁవ) అన్నాడు - ''షాభాస్! కోడలంటే యిలాగుండాలి. మన అనీతాలాగ!''



# 18

# తెప్ప ఉత్సవం

**- గోకుల్ దాస్ ప్రభూ**

'రామచంద్ర' ఎంతో శ్రద్ధగా ఆ పని చేస్తున్నాడు. ఖాళీ సిగరెట్ ప్యాకెట్లు ఒకదాని వెనక ఒకటి పెట్టి 'కోట'లా కడుతున్నాడు. సినిమా థియేటర్ ముందు టిక్కెట్లకోసం నిలబడే జనంలా, సిగరెట్ ప్యాకెట్ల 'క్యూ' పెరుగుతూ పోతోంది. దాని వరస పాములాగ మొదలయి కొండచిలవలా మారింది. ఆ వరసలో వున్న ప్యాకెట్లు ఒకదాని కొకటి తగిలి పడిపోకుండా జాగ్రత్తగా పేర్చుతున్నాడు.

కానీ అలా కుదరలేదు. ఒక పాకెట్టు దాని ముందు ప్యాకెట్‌కి పొరబాటున తగిలింది. అది దానిముందు ప్యాకెట్‌ని ఢీకొట్టింది. ఇలా ఒకదాన్ని మరొకటి తగులుకొంటూ మొత్తం వరసంతా చెడిపోయింది. ఆ ప్యాకెట్ల వరస, కోట ప్రహరీ గోడలాంటి వరస కూలిపోతూంటే, పొలాల్లో గాలి వీస్తున్నప్పుడు పంటచేలల్లో, పంట కోతకొచ్చినప్పుడు వొంగుతూ వచ్చే కెరటాలవంటివే ఈ 'కోట'గోడ కూలుతున్నప్పుడు కలుగుతుంది. అది చూడడం 'రామచంద్ర'కి బలే తమాషా అనిపిస్తుంది. అందుకే ప్యాకెట్లన్నీ వరసలో పేర్చాక, బుద్ధిపూర్వకంగా చేత్తో తోసి ఆనందిస్తాడు. అందుకని 'రామచంద్ర' ఆ ప్యాకెట్లని మళ్ళీ మొదటిసారిలాగే పేర్చడం ఆరంభించాడు.

అప్పుడే బయట డోలు, డప్పుల చప్పుడు వినిపించింది. 'డమ్-ఎ-డమ్' అని. ఆ శబ్దంలో లయ, తాళం ఏదీ లేదు. ఆ శబ్దం దప్పుమీద అకస్మాత్తుగా దండెం పడినట్లు వుంది. 'రామచంద్ర'కి అర్థమయింది. దాని భావం అతడికి స్ఫురించింది. దాని అర్థం ఈ రోజు గుడిలో తెప్ప ఉత్సవం! వెంటనే లేచి నిల్చున్నాడు ఉషారుగా.

'రామచంద్రా'కి ఆ విషయం తెలుసుకోవాలని కుతూహలం కలిగింది.

అందుకనే ఆ సిగరెట్ ప్యాకెట్లు పేర్చి, కెరటాలు చూడాలనే ఉద్దేశ్యం మార్చుకొన్నాడు. అతడి మనస్సు ఆ వూరిలోని ఒకవైపు ప్రదేశానికి మళ్ళింది.

అతడు పరుగు పరుగున రోడ్డు మీదకొచ్చి చూశాడు. నలుగురైదుగురు వ్యక్తులు డోలు, డప్పులతో వెడుతున్నారు. ఇప్పుడు వాళ్ళు 'షష్టీ పర్మా' (ఒకచోటు పేరు) దగ్గరకి వెళ్తారు. అక్కడ యింకా చాలామంది గుమికూడుతారు. ఏనుగులు కూడా తెస్తారు. రెండు దోనెలు (చిన్న పడవలు) కూడా మోసుకొస్తారు - నెత్తిమీద పెట్టుకుని. అంతా అక్కడ జయ అయాక దేవాలయం దిక్కుగా వెళ్ళారు పెద్ద వూరేగింపుతో.

'రామచంద్ర' కళ్ళముందు ఆ దృశ్యం తొణికిసలాడింది. ఊరేగింపుకి ముందు డప్పులూ, డోళ్ళూ మ్రోగించేవాళ్ళూ, బాకాలు వూదేవాళ్ళూ, వాళ్ళ వెనక గుంపులుగా జనం, చివర్న రెండు బోర్లించిన 'దోనె'లు నెత్తిమీద పెట్టుకుని 'కుణ్‌బీ' (గోవాలోని ఒక శ్రామిక వర్గం)లూ వస్తారు. వీరందరి వెనకా పెద్ద ఏనుగులూ, ఆ ఏనుగుల మీద అరటి గెలలు పట్టుకుని కూర్చున్న పిల్లలూ, అంతా ముందుకు వెళ్తారు.

ఆ దృశ్యం మనఃఫలకంమీద చూడడంతోటే 'రామచంద్ర' ఉత్సాహం ఎన్నో రెట్లు పెరిగింది. అతడు పరుగున యింట్లోకి వెళ్ళాడు. నేలమీద చెల్లాచెదురుగా పడున్న సిగరెట్ ప్యాకెట్లు తీసి, దొంతర్లు చేసి దాచుకున్నాడు.

తల్లి యింటి వెనక, దొడ్డిదారి గుమ్మందగ్గర కూర్చుని బియ్యం ఏరుతోంది. తల్లితో చెప్పాడు :

"అమ్మా నేను బయటకెళ్తున్నాను."

"ఎక్కడికిరా?"

"'షష్టీ పర్మా' దగ్గరకి."

'షష్టీపర్మా' దగ్గరకు యిప్పుడెందుకెళ్తున్నానంటున్నాడో 'రామచంద్ర' తల్లికి తెలుసు. కానీ ఆమె అంది –

"ఇప్పుడు వెళ్లొద్దు. ఇంకా వేళకాలేదులే!"

"అయిందమ్మా. ఇప్పుడు వాళ్ళు వెళ్ళలేదా - డప్పు వాయించుకుంటూ?"

"వెళ్ళుగానిలేరా, ఇంకా టైముందిలె."

'రామచంద్ర'కి సమయంతో పనిలేదు. అతడికి కావల్సింది, అక్కడికి వెంటనే

వెళ్ళడం - అక్కడ 'షష్ఠీపార్మా'లో తెప్ప ఉత్సవానికి చేస్తున్న సన్నాహాలు చూడడం. అందుకని తల్లికి తెలియకుండానే, అక్కడికి పరుగుతీద్దామని యోచించాడు. కానీ తిరిగొచ్చిన తరువాత అతడిని చావబాదడం ఖాయం. అందువల్ల తన ఆతృతనీ, జోరునీ అదుపులో వుంచుకున్నాడు. ఊరికే రోడ్డుదగ్గర నిలబడి వచ్చే, పోయే జనాన్ని చూడసాగాడు.

దూరంనుంచి డప్పుల చప్పుడు వినిపించసాగింది. మధ్య, మధ్య సన్నాయీ, బాకా ధ్వనులు వినిపిస్తున్నాయి. అంతా ప్రశాంతంగా వుంది. ఆ వాతావరణంలో అతడి జిజ్ఞాస పెరగసాగింది. ఆ డప్పుల చప్పుడుకోసం అతడు చెవులు నిక్కబర్చుకుని ఎదురుచూస్తున్నాడు. కాలం కదలడంలేదు. అతడికి సహనం పోయింది. ఊరికే కూర్చోవడం విసుగెత్తింది. అతడి మనస్సు 'షష్ఠిపార్మా'లో జమకూడిన జనంమధ్యనే లగ్నమయింది. అతడికి రెక్కలొచ్చి అక్కడికి ఎగిరిపోవాలనిపించింది. అతడి ఆతృత మరీ పెరిగిపోయి, తల్లి దగ్గరకి పరిగెత్తాడు.

"అమ్మా! వేళ అయింది. నేను వెళ్తాను - ఆఁ"

ఆమెకి అతడి స్వభావం బాగా తెలుసు. అందుకని కాదనలేక 'ఆఁ' అని సమ్మతి తెలిపింది. 'రామచంద్ర' చొక్కా వేసుకు, బయటకి పరుగు పరుగున వెళ్ళిపోయాడు. రోడ్డుమీద పడ్డాకే, అతడి వేగం కొద్దిగా తగ్గింది త్వరత్వరగా నడవసాగాడు.

  

దోవ కొంతదూరం వెళ్ళాక కుడివైపు తిరిగింది. ఆ తరువాత కొద్దిగా నడిస్తే 'షష్ఠిపార్మా' చేరుకుంటుంది. ఇప్పుడు 'రామచంద్ర'కి డప్పుల శబ్దం దగ్గరగా వినిపిస్తోంది. 'రామచంద్ర' ఆ శబ్దం విని మరింత ఉత్సాహంతో నడవసాగాడు. రోడ్డుకి కొంతదూరంలో కనిపిస్తున్న 'శ్రీ దామోదర్ దేవాలయం' దగ్గర జనం గుమికూడారు. అక్కడే కొట్టొచ్చినట్టుగా రెండు పెద్ద ఏనుగులు కనిపించాయి. ఒక ఏనుగుమీద ఒక అబ్బాయి కూర్చున్నాడు.

'రామచంద్రా'కి జిజ్ఞాస కలిగింది. డోలు ఎవరు వాయిస్తున్నారు? మరి సన్నాయి? అతడు ముందు మెల్లిగా నడుస్తున్న ముసలి వ్యక్తిని తోసుకుంటూ, పరిగెత్తాడు. ఆ డోలు, డప్పు వగైరాలున్న భజంత్రీ (బ్యాండుమేళం)ల మధ్య దూరిపోయి, వింతగా చూస్తున్నాడు. ఇద్దరు, ముగ్గురు కుఱ్ఱవాళ్ళు డప్పు ఎంతో

ఆనంద ఉత్సాహాలతో వాయిస్తున్నారు. సన్నాయి వాద్యగాడు మాత్రం వూరికే నిల్చున్నాడు. డోలు వాయించవలసినవాడు కూడా ఎవరితోనో కబుర్లు చెబుతున్నాడు. మధ్యనే సన్నాయి వాద్యగాడు, దానిని ఎత్తి 'పీ', 'పీ' అని రెండుసార్లు వూదాడు. ఇంకా అసలు 'మజా' తెలిసే సమయం రాలేదని అతడికి తెలిసింది.

ఇంతలో ఎవరో ఒక ప్రకటన చేశారు.

"పొడవ వచ్చిందర్రా?"

-పడవ అప్పుడే వచ్చింది! అది యింకా రాలేదనే ఉద్దేశ్యంతో బాకా, బజంత్రీవాళ్ళు ఉబుసుపోక కబుర్లు చెప్పుకుంటున్నారు.

'రామచంద్ర' ఆ బోర్లించిన 'దోనె'లు (చిన్న పడవలు) నెత్తిమీద పెట్టుకువస్తున్న 'కుణ్‌బీ'లని చూసి హఠాత్తుగా నిరాశ కలిగి, నీరసం వచ్చింది. కారణం ఒక 'దోనె' నెత్తిమీద పెట్టుకుని వస్తున్నవాడు స్వయానా తన తండ్రే!

తన తండ్రి కంటకనిపించకుండా 'రామచంద్ర' దాక్కున్నాడు జనం మధ్య. అతడికీ తండ్రికీ ఎప్పుడూ పడదు. తండ్రి అంటే 'రామచంద్ర' దృష్టిలో ఒక పీడ, ఒక సంకటం, ఒక అపశకునం. అతడికి తండ్రి అంటే భయంలేదు. కేవలం అసహ్యం, జుగుప్స మాత్రమే.

ఆఖరికి బ్యాండుమేళం రంజు అందుకుంది. డప్పుని వాయించడానికి ఒక వృద్ధుడు ముందుకి వచ్చాడు. చక్కగా తాళబద్ధంగా వాయించసాగాడు. అలాగే డోలు కూడా మరెవరో తీసుకు బాగా వాయిస్తున్నారు. సన్నాయి మొదలయింది. జనం - ఉత్సవంలో పాలుపంచుకోమని ఆహ్వానించింది.

సూర్యుడు నెత్తిమీద కొచ్చాడు. మిట్టమధ్యాహ్నం అయింది. ఎండ మండిపోతోంది. కాళ్ళక్రింద రోడ్డు మంటల్లో నడిచినట్టుంది. ఏనుగుమీద యిద్దరు కుర్రాళ్ళు ఒకర్నొకరు గట్టిగా పట్టుకుని కూర్చున్నారు. రోడ్డుమీద ఏనుగులకి ఎదురుగా బోర్లా వుంచిన పడవలతో (దోనెలు', 'రామచంద్ర' తండ్రీ, మరొక 'కుణ్‌బీ' కూర్చునున్నారు.

ఇప్పుడు డప్పుల చప్పుడికి అనుగుణంగా జనం నాట్యం చేస్తూ, ఆనందిస్తున్నారు. డప్పులు కొట్టి కొట్టి చేతులమీద పుండ్లు లేచాయని ఆ వృద్ధుడు మరొకరికి ఆ పని అప్పగించాడు. జనం వంతులవారిగా డప్పులూ, డోళ్ళూ, సన్నాయిలూ, బాకాలతో వివిధ ప్రకారాల సంగీతం సృష్టిస్తున్నారు. ఎక్కువమంది

నృత్యం చేస్తున్నారు రోడ్డుమీదే. వాళ్ళు అలసిపోతే, చూస్తున్న పక్క జనంలో మరొకరు వారి చోటులో నృత్యం చేస్తున్నారు.

పరాకాష్ట నందుకొంటున్న వేడుకలని చూస్తూ వేలాది జనం, దగ్గర, దూరపు వూళ్ళనుంచి ప్రత్యేకంగా వచ్చిన జనం, రాస్తాకి రెండువైపులా నిల్చొని చూస్తున్నారు. అక్కడ ప్రత్యేకంగా వెలసిన తిరునాళ్ళ దుకాణాలూ, ఇళ్ళపైకప్పులూ (టెర్రేస్‌లు) పిల్లలతో, స్త్రీలతో నిండి కిటకిటలాడుతున్నాయి.

  

చుట్టూరా అన్నివైపులా చమట వాసనా, మద్యం వాసనా వ్యాపించింది. సన్నాయి వాద్యగాడు ఒక పాట పూరదం అయి కాస్త మంచినీళ్ళు త్రాగుతుండగా, ఎవరో గెంతుతూ నృత్యం చేస్తూ ఒక జానపద గీతం ఆరంభించారు:

ఎందరికి చేసావే జంబక్కా
అందరికీ చేసావ జంబక్కా
ఎవరి సుఖం కోసమే జంబక్కా
ఎవరి స్వర్గం కోసమే జంబక్కా
జంబక్క, జంబక్క దేవదాసీ
జంబక్క సుఖ, దుఃఖాల రాసీ
ఎందరికి చేసావే జంబక్కా
అందరికీ చేసావ జంబక్కా.

-ఈ వేళాకోళపు శృంగార జానపదం విని అందరూ బిగ్గరగా నవ్వారు. జనం చాలామంది వుండడంవల్ల నవ్వులు నలుదిక్కులా మార్మోగాయి.

'రామచంద్ర' భుజంమీద తండ్రి చెయ్యి వేసాడు. ఇలా అన్నాడు.

"ఒరేయ్, ఇలారా ... ఆ దోనె దగ్గర నిల్చునుండు. నేను కాస్త నీళ్ళు త్రాగి వస్తాను". 'రామచంద్ర'కి తన భుజంమీద కాకి ఏరిగినట్లూ, ఆ మాటల్తో చెవుల్లో దబ్బనంతో గ్రుచ్చినట్లూ అయింది. తండ్రి దాహం ఎటువంటిదో, అతను త్రాగబోయే నీళ్ళు ఎటువంటివో అతడికి బాగా తెలుసు. అందువల్ల 'రామచంద్ర'కి తండ్రి మీద అసహ్యం కలిగింది. కరిచిన చీమని దులిపినట్లు భుజంమీది తండ్రి చేతిని వదిలించుకున్నాడు. కానీ తండ్రి మళ్ళీ చెయ్యివేసి, కాస్త కఠిన స్వరంతో అన్నాడు.

"వెళ్ళరా, అక్కడ నిల్చో."

అది ఆజ్ఞ. అందులో కోపం కూడా వుంది. 'రామచంద్ర'కి కూడా కోపం వచ్చింది. తండ్రి అంటే తన కెప్పుడూ యిబ్బంది కలిగించే మనిషి అనే భావం పోయి, తండ్రి అంటే పెద్ద ఉపద్రవం అనే నమ్మకం కలిగింది. ఈ పీడనుంచి బయటపడాలంటే ఒకటే ఉపాయం. ఇక్కణ్ణుంచి పారిపోవాలి. కాళ్ళకి వీలైనంత త్వరగా పారిపోవాలి. కానీ పరిగెత్తడం అంటే అర్థం యిక్కణ్ణుంచి దూరంగా వెళ్ళడం. ఈ తిరునాళ్ళ మజా వదులుకోవడం. ఏడాది కొకసారి వస్తుంది. అది వీలవదు - తప్పదు - ఇక్కడే వుండాల్సి వుంటుంది. ఇక్కడే!

'రామచంద్ర' ఆ చిన్న పడవ దగ్గర కెళ్ళి, తండ్రి యిచ్చిన ఆజ్ఞ ప్రకారం నుంచున్నాడు. అతని తండ్రి జనంలో కలిసి దోవ వెతుక్కుంటూ బయటకి వెళ్లాడు. 'రామచంద్ర' ప్రపంచంలో తండ్రికి ఏ విధమైన విలువా లేదు. తండ్రిమీద అతడికి అపేక్ష ఏమాత్రం లేదు. అందువల్ల తండ్రి - ఏ దిక్కుగా, ఎలా వెళ్ళాడో అతడు పట్టించుకోలేదు. వాడి మనస్సు ఆ తిరునాళ్ళలో సంగీతం, నృత్యం చేస్తున్న కళాకారులమీదే లగ్నమైవుంది. అందుకే అతడి దృష్టి ఆవైపు మళ్ళింది.

  

సన్నాయి వాయించే వాద్యగాడు, ఒక పాట బాణీ వాయించిన తరువాత, వెంటనే యింకొక పాట అందుకోడు. కాస్త విశ్రాంతీ, విరామం తీసుకుంటాడు. ఈలోగా ప్రేక్షకులలో ఎవరో ఫలానా హిందీ సినిమా పాటగానీ, తమిళం సినిమా పాటగానీ పాడమని అభ్యర్థన తెలుపుతారు. ఆ ప్రకారం ఆ సన్నాయి వాద్యగాడు ఆ బాణీలో సన్నాయిని వాయిస్తున్నాడు.

ఇలా వొక పాట పూర్తవగానే, ఎవరో మరో పాట పాడమని కోరారు. కానీ పాట ప్రారంభించేలోగా ముందుకు నడవమని ఆ కళాకారులకు నిర్వాహకులు ఆదేశం యిచ్చారు. వాళ్ళ ఆజ్ఞ ప్రకారం ముందుకు నడిచారు. రామచంద్ర కూడా ముందుకు నడిచాడు.

వెనకనుంచి ఎవరో అడిగారు. చూస్తే ఆ రెండవ 'దోనె' మోస్తున్న 'కుణ్‌బీ' పిలుస్తున్నాడు.

"రామచంద్రా, మీ నాన్న ఏడీ?"

తండ్రి సారా త్రాగడానికి వెళ్ళాడని చెప్పనా? 'రామచంద్ర' క్షణం ఆలోచించాడు. వద్దు.

"నాకు తెలియదు?"

"నాకు తెలియదంటావేమిట్రా? నీతో చెప్పే వెళ్ళాడు కదురా? తెలియదా?"

"అవును తెలియదు. సరే. సారా తాగడానికెళ్ళాడు - చాలా?"

'రామచంద్ర' అప్రయత్నంగా, దాచకుండా యిచ్చిన జవాబు విని ఆ 'కుణ్‌బీ'కి మతిపోయింది 'రామచంద్ర' దగ్గరకొచ్చాడు.

"రామచంద్రా!"

అతడు ఆగకుండా నడుస్తూనే వున్నాడు.

"అరే, ఆగరా..."

అతడు వెనక్కి తిరిగి చూశాడు.

"అరే, మీ నాన్న 'దోనె'ని ఎవరు తెస్తార్రా?"

"నాకు తెలియదు. నేనేం చేయను?"

ఆ 'కుణ్‌బీ' అన్నాడు — "నువ్వు మొయ్యకూడదా?"

"నేనా?" 'రామచంద్ర'కి మాటలు పెగల్లేదు. ఆ 'దోనె'లో సగం ముక్క కూడా తను నెత్తిమీద పెట్టుకొని మొయ్యజాలడు. ఈ ఆసామి తనని మొత్తం 'దోనె' నెత్తిమీద వేసుకుని అంతదూరం ఆ పుష్కరిణి (తటాకం) దాకా చేరవెయ్యమంటాడు! భలే!

"ఏమిట్రా ఆలోచిస్తున్నావ్?" ఆ 'కుణ్‌బీ' అడిగాడు విసుగ్గా.

"నావల్లకాదు."

"మరి ఎవరు తెస్తారూ?"

"నాకు తెలియదు."

"నీకు తెలియదూ?" ఆ 'కుణ్‌బీ' కోపంతోనూ, నిరాశతోనూ అన్నాడు.

"ఒరేయ్, వూరేగింపు ముందుకి పోతోంది. నువ్వు ఆ 'దోనె' తియ్యకపోతే, ఆ వెనకనున్న రెండు ఏనుగులూ ముందుకెలా వెళ్ళడం?"

అది నిజమే. ఊరేగింపు ముందుకి సాగినా, ఆ చిన్నపడవలూ, ఆ పెద్ద ఏనుగులూ వెనకుండిపోయాయి. కానీ ఏంచేయడం? ఆ దోనె నెత్తడం, నెత్తిమీద బోర్లించి మోయడం 'రామచంద్ర'కి తగని పని. ఆరు అడుగుల పొడవున్న పడవ అది. అదెంత బరువుందో ఎవరికి తెలుసు?

'కుణ్‌బీ'కి ఈ సమస్య తెలిసింది. అతను మరో వ్యక్తిని అడిగాడు. అతడు

పీలవదన్నాడు. కొంత వ్యవధి తరువాత 'రామచంద్ర' తన స్నేహితుడొకడు కనిపిస్తే సహాయం అడిగాడు. ఇద్దరు కలిసి చెరో చివరా నెత్తిమీద ఆ బోర్లించిన 'దోనె'ని మోస్తూ ముందుకి నడిచారు.

దోనె నెత్తిమీద పెట్టుకున్నాక, దాని బరువు 'రామచంద్ర' భయపడినంత లేదని తెలిసింది. అలాగని ఆ బరువేం తక్కువ బరువు కాదు. ఆ బరువుతో అతడి మోకాళ్ళు నొప్పిపెట్టాయి; కాళ్ళు తడబడ్డాయి; మెడ వొంకరగా తిరిగింది.

  

ఊరేగింపు ముందున్న బాజా భజంత్రీలు ఆగాయి. చుట్టూ వున్న జనం కూడా ఆగారు. 'రామచంద్ర'కి ఈ క్షణమే మహత్వమైనదీ, అతడు ఎదురుచూస్తున్నదీను. ఎందుకంటే యిక్కడే అతడి నెత్తిమీద బరువు క్రిందకి దింపవచ్చు. తల నొప్పి భరించరానంత పెరిగింది. మెడ మెలికలు తిరిగినట్టనిపించింది. క్రింద చెప్పులు లేనందున కాళ్ళు మండేరోడ్డుకు తగిలి మాడి బొగ్గులవుతున్నాయి.

జనం దేవాలయం చేరువలోకి వచ్చారు. చాలా దూరంలో అక్కడి పుష్కరిణి (తటాకం) వెలుపలి గోడలు కనిపిస్తున్నాయి. ఈ 'దోనెలు' అక్కడికి చేరవేసి నీళ్ళల్లో వదలవలసి వుంది. కానీ అక్కడికి చేరడం అసంభవం. అక్కడికి చేరేలోగానే తను చచ్చిపోతాడు. అది ఖాయం. మళ్ళీ మరోసారి తను నెత్తిమీద ఆ 'దోనె'ని పెట్టుకుంటే తల రెండు చెక్కలవుతుంది. మెడ నిలువునా చీలిపోతుంది. మరింక ఆ 'దోనె'తో ఒక్క అడుగు కూడా వేయను. చాలు, చాలు...

ఇదంతా ఆ రాక్షసుడు నాకిచ్చిన పీడ. ఏడీ ఎక్కడ చచ్చాడు ఆ రాక్షసుడూ? 'రామచంద్ర' తండ్రికోసం చుట్టూ వెతకసాగాడు. నాన్నా ఎక్కడ తాగి పడిపోయావురా - లంజకొడకా!

'రామచంద్ర' వొట్టుపెట్టుకున్నాడు. ఆరు నూరైనా తను మళ్ళీ ఆ 'దోనె'ని ఎత్తనని. ఎత్తనంటే ఎత్తను. అందరూ కలిసి తనని కొట్టినాసరే, చంపినాసరే. కానీ ఈ పడవ...

ఇంతలో ముందున్న జనం మధ్య ఏదో రభస జరుగుతోంది. ఎవరో ఆ జనం మధ్య నుంచి విసిరిగొట్టినట్టు బయటకొచ్చాడు. వాడి తరువాత మరొకడు. వాళ్ళిద్దరూ ఒకర్నొకరు కొట్టుకుంటున్నారు; గుద్దుకుంటున్నారు. నానా బూతులూ తిట్టుకుంటున్నారు. కొందరు అడ్డంవచ్చి వాళ్ళిద్దరినీ విడిపించి దూరంకి తప్పించారు.

మామూలుగా అయితే 'రామచంద్ర' తక్షణం అక్కడికి పరుగెత్తి వెళ్ళి ఎవరెలా కొట్టారో చూసేవాడే; ఎవరు ఎవర్ని ఎలా తిట్టారో వినవాడే. కానీ యిప్పుడు అతడి మనఃస్థితి వేరు. ఇప్పుడా కోరిక అతనిలో లేదు. నిర్లిప్తంగా నిలుచుండిపోయాడు. తన గొడవలో, తన బాధలో మరొకరి గోడు, మరొకరి జగడం అతనికేం పట్టలేదు. తనలో తను అనుకొన్నాడు - "కొట్టుకోండి. తన్నుకోండి. చావండి..."

ఆ క్షణంలో అతడి అవస్థ అంధకార బంధురమయింది. అతడి ఆశలన్నీ వమ్మయ్యాయి. మనస్సు తిమ్మిరెక్కిపోయింది.

  

ఎలాగైతేనేం చివరికి 'దోనె' తటాకంలోకి తోశారు. 'రామచంద్ర' నెత్తిమీది భారం వదిలింది. మధ్యాహ్నం గడిచింది. అయినా ఎండ యింకా వుంది. అతడి తండ్రి పత్తాలేదు. ఇంతవరకూ రాలేదు!

'రామచంద్ర'కి తన తండ్రి గురించి ముందులాగ ఏమీ పట్టలేదు. ఒక పెద్ద కష్టమైన పని, తన వయస్సుకి మించిన కార్యం విజయవంతంగా పూర్తిచేసిన తృప్తితో, ఆనందంతో ఒక విధమైన గర్వంతో దేవాలయంవైపు దారితీశాడు. దేవాలయం ముందు తిరునాళ్ళ వాతావరణం వుంది. ఎన్నో రకాల వస్తువుల దుకాణాలు తెరిచారు. లోకులు యిటూ, అటూ పచార్లు చేస్తున్నారు. వ్యాపారులు పిల్లల్ని తమ దుకాణాలవైపు ఆకర్షించడానికి గంటలు వాయిస్తున్నారు.

'రామచంద్ర' దూరంగా ఉన్న ఒక దుకాణం దగ్గరకెళ్ళి అక్కడ అమ్మకానికి ఉంచిన వస్తువులూ వాటి విషయంలో కొట్టువాడు చేసే లావాదేవీలూ చూస్తూ నిలబడ్డాడు. ఆడపిల్లలు వచ్చి గాజులూ, జడపిన్నులూ, కుంకుమ, కాటుక డబ్బీలు, పూసల మాలలూ వగైరా వస్తువులు తీసుకుంటున్నారు. చిన్నపిల్లలకి లక్కపిడతలూ, బొమ్మలూ కావలసినన్ని రకాలలో అమ్ముతున్నారు. రామచంద్ర వూరికే చూస్తూ నిలుచున్నాడు. చూసి, చూసి విసిగెత్తి దేవుడిగుడిలోకి ప్రవేశించాడు. దేవాలయంలో పెద్ద గంట సావకాశంగా మ్రోగిస్తున్నారు. ప్రదక్షిణలు చేసే ప్రాంగణంలో ఒకమూల బాజా భజంత్రీలవాళ్ళు కూర్చుని సంగీతం వినిపిస్తున్నారు.

రామచంద్ర కాసేపు వాళ్ళ సంగీతం వింటూ నిలబడ్డాడు. ఆ సంగీతం వూరేగింపులో సంగీతంలా లేదు. మరో పద్ధతిలో వుంది. అతడికి విని విని వెగటు పుట్టింది. ఈ విసుగుతో, ఆ 'దోనె' మోసుకుని చాలా దూరం నడవడం వలన

వచ్చిన అలసటతో అతడి తల నొప్పి పెట్టసాగింది.

అతడు అక్కణ్ణించి తప్పుకొని దేవాలయంలో ప్రదక్షణలు చేసి, వేరేచోటికి వెళ్ళాడు. దేవాలయం బయట స్థలంలో ఆ తీర్థపు ఏనుగులు నిలుచుని వున్నాయి. అవి తొండాలతో కొబ్బరి చెట్ల మట్టల ఆకుల్ని ఈనెలు విడదీసి చాతుర్యంగా తింటూ వుండడం అతడికి ఎంతో ముచ్చటగా వుంది.

తరువాత దేవాలయం వెనకనున్న వంటశాల దగ్గరకి వెళ్ళాడు. అక్కడ పెద్ద పెద్ద పాత్రల్లో, బిందెల్లో అన్నం, కూరలూ, పులుసులూ చేయడం చూశాడు. మాసి, మరకలు పడ్డ బట్టలతో, చమటలు క్రక్కుతున్న శరీరాలతో వంటవాళ్ళు యిటూ అటూ హడావిడిగా పరుగెత్తుతున్నారు. అన్నిచోట్లా నీళ్ళు చల్లడంవలన, నేలంతా తడితడిగా వుంది. చేమ, కొంత మట్టికలిసి కాళ్ళకి తగుల్తోంది. చాలాచోట్ల కూరగాయల తొక్కలూ, ముచికలూ, పీచూ వగైరాలు పడివున్నాయి.

రామచంద్రాకి మళ్ళీ మళ్ళీ ఆ వంటలూ, పిండివంటలూ చేస్తున్న గిన్నెలూ, పాత్రలూ అబ్బురమనిపించాయి. ఆ పెద్ద పెద్ద బిందెలలో మనిషి నిల్చున్నా తలకూడా బయటకి కనిపించకపోవచ్చని అనిపించింది.

దేవాలయపు దేవుడి ఉత్సవ విగ్రహాన్ని ఆచారయుతంగా తీసుకుని గుడిపూజారి 'పుష్కరిణి' (తటాకం)లోకి దిగాడు. ఆ మూర్తిని తటాకంలో ముంచి స్నానం చేయించాడు. గుడిగంటలు ఖంగున మ్రోగాయి ఆ శుభముహూర్తంలో. ఆ పుష్కరిణి పావనమయింది. తెప్ప ఉత్సవంలో ఒక ముఖ్య ఘట్టం పూర్తయింది.

తరువాత సమారాధన. జనం పూజానంతరం భగవంతుడికి మంగళహారతులిచ్చే ఘట్టం. ఈ తిరునాళ్ళకి పరాకాష్ట జనం అంతా దేవాలయంలోకి పరుగులెత్తారు భక్తిశ్రద్ధలతో. రామచంద్ర అడుగులు అప్రయత్నంగా అటువైపే వెళ్ళాయి. అందరితోబాటూ అతడూ సమారాధనలో కూర్చున్నాడు.

సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఎండ వేడి అంతరించింది. విశాలమైన ఆ దేవాలయపు ప్రాంగణంలో సమారాధనకి వచ్చిన భక్తుల కంఠాలు నిశ్శబ్దమయ్యాయి. డప్పులూ, డోళ్ళ చప్పుడూ, సన్నాయీ, బాకా, తప్పట్లా, తాళాల ధ్వనులూ సుమారు నాలుగు గంటలు మ్రోగి, మ్రోగి శాంతించాయి. వాతావరణం చల్లగా అయింది. జనం అంతా అన్ని సంగతులూ పక్కనపెట్టి ఒక్క సంగతికోసమే ఎదురు చూస్తున్నారు. అదే సంతర్పణ.

'రామచంద్ర' రెండువైపులా పరిచయంలేని క్రొత్త వ్యక్తులే కూర్చున్నారు. దగ్గర తన వరసలో కూర్చున్నవాళ్ళందరూ వయస్సులో బాగా పెద్దవాళ్ళు. అంతా వాళ్ళల్లో వాళ్ళు మాటల్లో పడ్డారు. 'రామచంద్ర'కి కూడా వాళ్ళతో మాట్లాడడం యిష్టంలేదు. అందుకని ఉబుసుపోక కోసరం, క్రింద యిసుకలో వేలుతో ఏవో బొమ్మలు గీస్తున్నాడు.

కొంతసేపటికి ఒక్కసారే చాలామంది మనుష్యులు వంటశాలనుంచి వచ్చారు. వాళ్ళ చేతుల్లో అరటి ఆకులు (విస్తళ్ళు) అక్కడ సమారాధనకి కూర్చున్నవాళ్ళకోసం తీసుకువచ్చారు. మళ్ళీ అంతటా నిశ్శబ్దం.

కొంతసేపైన తర్వాత, వంటశాల దగ్గర మళ్ళీ ఏదో అలజడి వినిపించింది. అన్నం వడ్డించడానికి పాత్రలతో ఎంతోమంది పెద్దవాళ్ళూ, పిన్నలూ పరుగెత్తుతూ వచ్చారు. కూర్చున్నవాళ్ళకి వరస ప్రకారం వడ్డిస్తున్నారు. సమారాధనకి కూర్చున్నవాళ్ళందరికీ వడ్డించడం పూర్తయేసరికి చాలాసేపు పట్టింది. వడ్డన ఆఖరి వ్యక్తివరకూ చేరాక భోజనం యిక ప్రారంభించవచ్చునని సంజ్ఞ చేశారు.

అలా సూచించడమే తడవుగా అంతా తినడం - ఆరంభించారు, అన్నం, కూరలూ, పప్పు పులుసూ కలుపుకుని లొట్టలేస్తూ, జుర్రుకుంటూ ... మింగుతూ ... ప్రొద్దున్న అన్నంతిన్న తరువాత, రామచంద్ర మళ్ళీ భోజనం చేయలేదు. ఏమీ తినలేదు. చాలాసేపు మండుటెండలో తిరగడంవలనా, వేళకి భోజనం చేయనందున అతడి ఆకలి పోయింది. భోజనం కంటే తిరునాళ్ళు చూడడం ముఖ్యంగా భావించి యింట్లోంచి బయటపడ్డాడు. డప్పులవాళ్ళ వాయిద్యాలూ, నృత్య సంగీతాలూ, ఏనుగులూ, వూరేగింపులూ యివే వాడి ధ్యాసని ఆక్రమించి ఆకలీ, దప్పికలూ మరచిపోయాడు. ఆ తరువాత నెత్తిమీద దోనె పెట్టుకు వూరేగడంవల్ల, కదలడానికే వీలవలేదు - యింటికి వెళ్దామంటే! అతడి ఆకలి అడుగుంటింది.

కానీ యిప్పుడు అందరూ తింటుంటే, తనూ నాలుగు వుండలు కడుపులో తోసెయ్యాలనుకున్నాడు. అందరితోబాటూ తనూ అన్నం కలుపుకుని జుర్రుతూ తినసాగాడు.

"నీళ్ళు, నీళ్ళు" అంటూ నుంచి నీళ్ళు అందించే మనిషి వచ్చాడు. అడిగిన వాళ్ళకి నీళ్ళు గ్లాసుల్లో పోసి అతను ముందుకి వెళ్ళాడు. 'రామచంద్ర' భోజనం చేస్తున్నాడు.

దూరంనుంచి సంగీతపు ధ్వనులు వినిపించాయి. సమారాధనకి కూర్చున్న భక్తులకి భక్తిగీతాలూ, భజనలూ వినిపించడానికీ, కొందరు తాటాకు విసనకఱ్ఱలతో విలాసంగా విసురుకుంటూ యిటువైపే వస్తున్నారు. 'రామచంద్ర' కూర్చున్న పంక్తికి దగ్గర నుంచే ఆ భజనమండలి వెళ్ళింది.

వాళ్ళు విసనకఱ్ఱతో విసురుకుంటూ పోతూంటే ఆ గాలి 'రామచంద్ర'ని స్పర్శించింది, కొద్దిగా. అప్పుడు అకస్మాత్తుగా ఒక సంఘటన జరిగింది. భజనమండలి సభ్యులతోబాటు నడుస్తున్న ఒక కుర్రవాడు 'రామచంద్ర'కేసి వేలు చూపిస్తూ, అన్నాడు.

"ఇక్కడ చూడండి. ఒక 'కుణ్‌బీ' కులం కుర్రవాడు సమారాధనలో కూర్చున్నాడు."

'రామచంద్ర' హడిలిపోయాడు. అతడు భోజనం చేయడం మఱచిపోయాడు. తల ఎత్తి వాళ్ళనే చూస్తూవుండి పోయాడు.

ఆ అబ్బాయి 'రామచంద్ర' చదువుతున్న బడిలోనే, అతని తరగతిలోనే చదువుతున్నాడు. ఇద్దరికీ ఒకరికొకరు బాగా తెలుసు.

ఆ కుర్రవాడి ముందు నడుస్తున్న పెద్దమనిషి 'రామచంద్ర'ని తేరపార చూస్తున్నాడు. అతడికి యిరువైపులా కూర్చుని పంక్తిభోజనం చేస్తున్న వృద్ధులు కూడా అతడినే చూస్తున్నారు.

'రామచంద్ర' తల వొంచుకున్నాడు. కళ్ళు విస్తరిమీదే కేంద్రీకరించాడు. చుట్టూ ఏం జరుగుతోందో తనకి తెలియనట్లుగా కూర్చున్నాడు. కానీ అతని గుండె దడదడమంటుంది.

తరువాత ఏం జరగనుందో అతడి కళ్ళముందు సినిమా తెరమీదలా, కనిపించింది.

"అప్పుడు ఆ భజనమండలి సభ్యుడు ఒక్కొక్కడే ముందరా, వెనకా, రెండుపక్కలా నిలబడి చుట్టుప్రక్కల భోజనాలు చేస్తున్నవాళ్ళ దగ్గర వొంగుని చిన్న గొంతుకతో కూపీతీస్తారు. ఆ అబ్బాయి ఆరోపణలో ఎంత నిజం వుందో. చివరికి నన్నే అడుగుతారు "నిజమా? నువ్వు 'కుణ్‌బీ' కులంవాడివా?" కాకపోతే, అలా అడక్కుండానే తిన్నగా నా చెవిదగ్గరకి చెయ్యిచాపి దానిని మెలేస్తారు - నాకు బాగా నొప్పిపుట్టేలా. అలా చెవి మెలేసి నన్ను నుంచోమంటారు వేలాది

జనం చూస్తూవుండగా, నన్ను బయట, గుడికి దూరంగా తీసుకెళ్ళి తోసేస్తారు - నానా బూతులూ తిడుతూ.''

కానీ భజనమండలి సదస్యులు ఎవ్వరూ, ఆ కుఱ్ఱాడు అన్నమాటలు లెఖ్ఖచేయలేదు. అందులో ఒకడు ఆ మాటల్ని దులిపేసుకున్నట్లు ''ఓ వాడా? ఆ కుఱ్ఱవాడా? ఎవడైతేనేం, తిననియ్యండి'' అంటూ ముందుకి వెళ్ళిపోయాడు మిగిలిన భజనమండలి సభ్యులతో కలిసి.

'రామచంద్ర'కి ఏమీ అవలేదు. అసలేమీ అవలేదు. అతడి నోట్లో అన్నంముద్ద, నోట్లోనే వుండి, మింగలేదు. 'రామచంద్ర'కి ఏమీ అవలేదు. విస్తరిలో వడ్డించిన అన్నంలో ముంచిన చేతులవ్రేళ్ళు కదలలేదు. అలాగే వుండిపోయాయి.

'రామచంద్ర'కి ఏమీ అవలేదు. విస్తర్లో వడ్డించిన ఆ కూరమీద అతడి చూపులు మారలేదు. ఇప్పుడు నోట్లో వున్నది అన్నంముద్ద కాదు - బండరాయి. ఇప్పుడు విస్తరిలో వ్రేళ్ళు దానిమీదున్న రొచ్చులో యిరుక్కున్నాయి. 'రామచంద్ర'కి ఏమీ అవలేదు. అతడి గుండెల్లో డప్పుల చప్పుడు - డం - డ - డం ...

'రామచంద్ర'కి ఏమీ అవలేదు.



19

# గుప్పెడు మట్టి

**- జస్ ఫెర్నాండీస్**

మొన్న సాయంత్రం జరిగిన విషయం. నా చిన్ననాటి ప్రాణమిత్రుడు నన్ను కలవడానికి వచ్చాడు. 'సిరిల్'! చాలా సంవత్సరాల క్రితం అతడు 'గోవా' వదిలి వేరే దేశంలో వూళ్ళో వుంటున్నాడు. అక్కడే అతని సమస్త కుటుంబం కూడా వుంటోంది. అంటారు కదూ పొట్ట ఎక్కడ గడుస్తుందో అక్కడే ప్రపంచం అని!

అతను మంచి విద్యావంతుడు. అతనికి తన మాతృదేశంలో, తన స్వయంకృషితో ఏదైనా చేసి చూపించాలనే తపన వుండేది. అయితే అవకాశం లభించలేదు. అతని విద్యకీ, ప్రజ్ఞకీ తెలివితేటలకీ ఎవరూ గుర్తింపునీ, గౌరవాన్నీ యివ్వలేదు. ఎంత ప్రయత్నించినా, విస్తరిమీద వ్రాలిన ఈగని తరిమికొట్టినట్లు వెళ్ళగొట్టారు. అతనికి సరైన గుర్తింపు, చదువుకు సరైన ఉద్యోగం విదేశాలలో లభించింది. అతని జీవితం సార్థకమయింది.

అతను విదేశాలకని ప్రయాణమయినప్పుడు అతని తల్లిదండ్రులు ఎంతో రోదించారు. అతను వారి ఏకైక పుత్రుడు. ప్రేమానురాగాలతో పెంచిన కొడుకు ఎల్లప్పుడూ తమ కళ్ళముందు వుండి, తమకి శాంతి సుఖాలూ అందించాలని వారి కాంక్ష.

'సిరిల్' విదేశాలకి వెళ్ళిన తరువాత అతని తండ్రి ఆరోగ్యం చెడిపోయింది. తన ఏకైక పుత్రుడిని ఎంత ప్రేమా, వాత్సల్యం గుప్పించి అల్లారుముద్దుగా పెంచాడో, కష్టపడి పెద్ద పెద్ద చదువులు చదివించాడో, పెద్దయ్యాక వాడు తన వృద్ధ తల్లిదండ్రులని వూరివాళ్ళ దయాదాక్షిణ్యాలకి వదిలి కీర్తి సంపదల ఆశతో వెళ్ళిపోయాడోనని దుఃఖించి, దుఃఖించి ఆ బెంగతో ఆరోగ్యం మరింత క్షీణించి తనువు చాలించాడు. అతని అంతిమ సంస్కారాలు తన దత్తపుత్రుడిగా భావించిన

నాకు - అంటే 'జోసఫ్'కి - చేయవలసొచ్చింది.

'సిరిల్' తండ్రి పోయాడని తెలిసిన కొన్ని ఏళ్ళకి విదేశాలనుంచి స్వదేశానికి తిరిగి వచ్చాడు. అప్పుడు అతని తల్లి హృదయం ఆనందంతో వుప్పొంగింది. 'సిరిల్' వస్తూ, వస్తూ ఎన్నో విదేశీ వస్తువులూ, దండీగా డబ్బూ దస్కం తీసుకొచ్చాడు.

'సిరిల్' తండ్రి ఒక చిన్న, సన్నకారు రైతు. భూకామందు - అతని భూములు చిన్న చిన్న రైతులకి కౌలుకిచ్చాడు. అతని యిల్లు - పూర్వీకులనుండీ నివసిస్తూ వస్తున్న స్వగృహం చుట్టూరా యితరుల స్థలాలున్నాయి. ఆ బహిరంగ స్థలాలు కొని యింటి చుట్టూ ఒక ప్రహరీ గోడ కట్టాలని తండ్రి కలలు కన్నాడు. ఆయన బతికుండగా చేయలేని పని కొడుకు తన కష్టార్జితంతో చేయగలిగాడు. తన పాత యింటిని బాగా మరమ్మతు చేయించి కొత్తరూపం యిచ్చాడు. తన తల్లి, తండ్రి పోయింతరువాత భూకామందు వద్ద కౌలుకి తీసుకున్న భూమిని కూడా కొనేసాడు. అలాగే కామందు దగ్గర వున్న ఒక మధ్యమ పరిమాణంలోని తటాకం (నీళ్ళతొట్టి - Tank) కొన్నాడు. ఆ రెండు వేల అయిదు వందల చదరపు మీటర్ల స్థలంలోనే మా బాల్య స్మృతులు భద్రపరిచి వున్నాయి. మా కలలు పండించడానికి ఈ భూతలంలో మరో దీటైన జాగా లేదు. అందుకే 'సిరిల్' ఎంత ఖర్చుకైనా వెనుదీయలేదు.

ఆ స్థలంలో మా బాల్య జ్ఞాపకాలు కోకొల్లలు. అక్కడే మేం ఆడుకొనేవాళ్ళం. సీతాకోక చిలకలూ, తుమ్మెదలూ పట్టుకు దారాలలో బంధించేవాళ్ళం. దగ్గరలో ప్రవహిస్తున్న పిల్ల ఏఱులో ఎరవేసి చాపలు పట్టేవాళ్ళం. మా చిన్నా, పెద్దా ముచ్చట్లూ, రహస్య మంతనాలూ అక్కడే సాగించేవాళ్ళం. ఆ తటాకం దగ్గర పెద్ద ఫలవృక్షాలేమీ లేవు. కేవలం ఒక ఆరు మామిడి చెట్లు, పెద్దవీ చిన్నవీ వున్నాయి. వాటి గురించి కామందు పట్టించుకునేవాడు కాదు. ఆ పళ్ళు వచ్చే పోయే జనం రాళ్ళు రువ్వి తీసుకు తినేవారు. అక్కడే 'సిరల్' కొన్న తటాకం వుంది. దానినే 'జనతా తటాకం' అని పిలిచేవారు.

నిజానికి ఆ 'ట్యాంకు' (తటాకం) నేనే కొనవలసింది. నా కళ్ళు ఆ తటాకం మీద వున్నాయని 'సిరిల్' గ్రహించాడు. అందుకే కొనడానికి కామందుతో మాట్లాడే ముందు నన్ను అనుమతి అడిగాడు. నాకు 'సరే' అనక గత్యంతరం లేకపోయింది. కారణం నా ఈ బెత్తెడు జీతంతో మండిపోతున్న ధరలలో మామూలుగా బ్రతకడమే కష్టమవుతోంది. అది కొనడానికి అప్పు ఎలా చేయడం? నేను చేసేది గుమస్తా

ఉద్యోగం. మా నాన్న 'గోవా'లో పోర్చుగీసు ప్రభుత్వంలో క్లర్కు ఉద్యోగం చేయడంవలన ఆయన మరణానంతరం నాకీ ఉద్యోగం యిచ్చారు. మా వూరి 'రెజిడోర్' (కరణం) మా నాన్నకి మంచి మిత్రుడు. అతడి సిఫారసు వల్లనే యిది సాధ్యమయింది.

ఒకప్పుడు చిన్న రైతు భార్యగా బీదగా బ్రతికిన 'సిరిల్' తల్లి, కొడుకు ప్రయోజకుడవడం వలన, తను కౌలుకు తీసుకున్న భూమిని స్వంతం చేసుకోగలిగింది. అలాగే యిల్లు ఆధునికంగా, అందంగా పునర్ నిర్మించగలిగింది. స్వంతంగా నీళ్ళ కొరత లేకుండా 'తటాకం' కూడా ఏర్పాటయింది. అయితే శ్రీమంతురాలుగా ఆ వూళ్ళో ఎక్కువకాలం ఆమె జీవించలేదు. ఒకరోజు హఠాత్తుగా, ఏ రోగ సూచనలూ లేకుండానే, 'సిరిల్'ని ఒంటరివాణ్ణి చేసి, భర్తని స్వర్గంలో కలుసుకోవడానికి వెళ్ళిపోయింది.

'సిరిల్' తల్లి మరణానంతరం, మా వూళ్ళో వున్నన్నాళ్ళూ, మా ఇంట్లోనే వున్నాడు. మా తల్లి, అతని తల్లి స్థానం తీసుకుని అతని యోగక్షేమాలు చూసుకుంది. 'గోవా' వదిలి మళ్ళీ విదేశాలకి వెళ్తూ, నా తల్లిని కౌగలించుకుని కన్నీళ్ళతో అన్నాడు "అమ్మా, నువ్వు నాకు చేసిన ఈ ఉపకారంకి ఎలా ఋణం తీర్చుకోగలను? 'జోసెఫ్'కి ఒక చెల్లెలే వుండివుంటే పెళ్ళిచేసుకునేవాడినేమో! 'జోసెఫ్'కి బావమరదిని అయ్యే భాగ్యం నాకు లేదు."

మా అమ్మకి ఉద్వేగం ఆగలేదు. ఆమె కళ్ళల్లో నుండి కూడా బొట బొటా నీళ్ళు కారాయి. ఆమె 'సిరిల్' కళ్ళనీళ్ళు తుడుస్తూ అంది "నువ్వు వాడి బావమరది అయ్యే ప్రసక్తే లేదు. నువ్వు వాడి తమ్ముడివి. నా రెండవ కొడుకువి. అవును కదూ నా బంగారు బాబూ?"

చాలాసేపటి వరకూ యిలా మేం ముగ్గురం ఒకరి నొకరు చూసుకుంటూ, కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ వీడ్కోలు యిచ్చుకున్నాం.

విదేశాలకి వెళ్ళేముందు 'సిరిల్' తన భూమిని తన పొరుగునే వుండే ఒక ఆసామికి కౌలుకిచ్చాడు. అలాగే ఆ పునర్ నిర్మించిన సుందరమైన గృహాన్ని తన దూరపు బంధువు ఒకడికి అప్పచెప్పి ఎవరైనా మంచివాళ్ళకి అద్దెకిచ్చి, ఆ సొమ్ము తనకి పంపమని పురమాయించాడు. 'సిరిల్' నిజానికి ఈ రెండు పనులూ (పొలం, ఇల్లూ) మాకే అప్పగించాలనుకున్నాడు. కానీ మా ఇల్లు చాలా దూరంగా

వుండడంవలన (ఒక అరగంట ప్రయాణం), మాకూ స్వయంగా చూసుకోవలసిన తొటలున్నందువలన యిది సాధ్యం కాలేదు. ఇంట్లో పనులూ, తోట పనులూ వీటితోనే మా అమ్మ సమయం ఖర్చయిపోతుంది.

'సిరిల్' గోవా విడిచి వెళ్ళింతరువాత కొన్ని రోజులకి అతడి దూరపు బంధువు తన భార్యా పిల్లలతో ఆ యింటికి మకాం మార్చాడు. ఈ సంగతి నేను ఒక ఉత్తరం వ్రాసి 'సిరిల్'కి తెలిపాను. అతడి బంధువు కూడా అతనికి తెలియజేసాడుట. తన చుట్టమే స్వయంగా తన యింట్లో నివసించి, ఇంటి బాగోగులు చూసుకుంటున్నాడని 'సిరిల్' సంతోషించాడు. కారణం అతను సుమారు ఎనభై వేల రూపాయల కష్టార్జితంతో ఆ యింటికి క్రొత్త రూపాన్ని యిచ్చాడు.

ఈ సంగతి పదిహేను సంవత్సరాల క్రితంది. ఈ మధ్యన ఒకసారి 'సిరిల్' గోవాకి వచ్చాడు. వచ్చి ఒక్క కానీ కట్నం తీసుకోకుండా మా అత్తయ్య కూతుర్ని పెళ్ళిచేసుకున్నాడు. ఒకరోజు మా అమ్మతో వేళాకోళంగా అన్నాడు "అమ్మా! చూడు. నేనే గెలిచాను! నేను నీ కొడుకుని మాత్రమే కాదు, నీ చెల్లెలుకి అల్లుడినీ అయ్యాను, అంటే నీ అల్లుణ్ణే అయ్యాను. అంటే కొడుకూ - అల్లుడూను."

ఆ ఆనందోత్సాహాలు, రంగుల పండగ దినాలూ యిట్టే గడిచిపోయాయి. 'సిరిల్' తన రెండు నెలల సెలవు ఖర్చుపెట్టి మళ్ళీ విదేశాలకి వెళ్ళిపోయాడు.

మరికొన్ని సంవత్సరాలు గడిచాయి. 'సిరిల్'కి విదేశాలలోనే ఒక అబ్బాయీ, అమ్మాయీ పుట్టారు. అతని సంసారం ప్రేమానురాగాలతో సిరి సంపదలతో ఆనందంగా సాగుతోంది.

అది 1961 సంవత్సరం డిసెంబరు నెల. గోవాకు స్వాతంత్ర్యం లభించిన తరువాత మొట్టమొదటి క్రిస్మస్ వేడుకలు జరుపుకుంటున్నారు అందరూ. ఆ శుభసమయం పురస్కరించుకుని పరదేశంలో వున్న 'సిరిల్' అక్కడ వున్న గోవన్లందరికీ (అంటే గోవాకి చెందిన భారతీయులు) ఒక పెద్ద పార్టీ యిచ్చాడు.

ఇకపై 'గోవా' స్వాతంత్ర్యం యిచ్చిన నవశక్తితో, క్రొత్త రక్తాన్ని, క్రొత్త ఉత్సాహాన్నీ బడిసి ప్రగతి మార్గాన్న వాయువేగంతో పురోగమిస్తుందని అందరూ కాంక్షించారు. ప్రార్థనలు చేసారు.

'గోవా' విశేషాలు అతనికి నేను ఉత్తరాల ద్వారా తెలుపుతున్నాను. ప్రతీ రెండు వారాలకీ, అతను వ్రాస్తూ వుండేవాడు. 'గోవా'లో అతనికి యిల్లు, తోట,

పొలం, నేనూ మినహా వ్రాయడానికి మరేం విషయాలు వుండేవికావు.

ఒకరోజు ఒక ముఖ్యమైన విషయం దొరికింది. క్రొత్త 'గోవా' ప్రభుత్వం భూసంస్కరణల చట్టం అమలులోకి తెచ్చింది. ఆ చట్టం ప్రకారం అప్పటి భూస్వామ్య వ్యవస్థలో ఒక చిన్న విప్లవం వచ్చినట్టయింది. ఆ చట్టం వలన గ్రామీణ జీవితంలో భూస్వామ్యానికీ (కామందులు) చిన్న పొలాలు కౌలుకి తీసుకుని సాగుబడి చేస్తున్న పేద రైతులకీ మధ్య ఎన్నో వివాదాలు ఉత్పన్నమయ్యాయి. ఒక్క దెబ్బతో సాధారణ, మధ్యతరగతి కామందు భూములు పోయి రోడ్డుమీద పడ్డాడు, బికారీ అయి. 'అతను ఎవరిమీద జాలి కలిగి, ఆశ్రయం యిచ్చి తన తోట పనులూ, పొలం పనులూ అప్పచెప్పాడో వాడు ఆ భూమికి యజమాని అయి, తన స్థానాన్ని ఆక్రమించాడు. అయితే చట్టం కొంత మంచి కూడా చేసింది. తరతరాలుగా తాత, ముత్తాతల నాటినుండీ సంక్రమించిన అపారభూమిని (అది వాళ్ళ పూర్వీకులకి ఎలా లభించిందో దేవుడికే తెలుసు) చిన్న చిన్న రైతులకి కౌలుకిచ్చి, వాటి బాగోగులు పట్టించుకోక దూరంగా వుండి కేవలం శిస్తు మాత్రం వసూలుచేసే కామందులకి తగిన శిక్ష వేసింది. అయితే కొందరు పెద్ద భూస్వాములు చేసిన అన్యాయాన్ని సరిదిద్దుతూ, తమ కష్టార్జితంతో భూములు కొనుక్కొన్న మధ్యతరగతి కామందుల పొట్టమీద దెబ్బకొట్టడం తప్పు.

ఆ చట్టం అమలులోకి వచ్చిన మొదటి రోజే జరిగిన ఒక సంఘటన గురించి చెబుతాను. నా దగ్గర పనిచేస్తున్న యిద్దరు చిన్న రైతులు హఠాత్తుగా, వుత్సాహంతో, ఆవేశంతో నా తోటలోకి కొబ్బరి చెట్లు ఎక్కి, కాయలన్నీ కోసి, కొన్ని తిని, కొన్ని బజారుకెళ్ళి అతి చౌకలో త్వరగా అమ్ముకున్నారు. లేత బొండాలని, నీళ్ళుతాగి, గుజ్జుని సుష్టుగా తిన్నారు. విచారించడానికి వెడితే, వాళ్ళు పత్రికల్లో అచ్చయిన కొత్త చట్టాన్ని చూపిస్తూ, వాళ్ళకి సంక్రమించిన కొత్త హక్కులగురించి ఛాతీ (రొమ్ము) విరుచుకు, గొప్పలు చెప్పారు. ఆ తరువాత తప్పనిసరై, నేను పోలీసులకి ఫిర్యాదు చేసాను. వాళ్ళకి బేడీలుపడి, జైలుశిక్ష అనుభవించారు. వాళ్ళని పోలీసులు నాలుగు రోజులు బంధించే, వాళ్ళ వొంటి దుమ్ము దులిపారు. వాళ్ళకీ పడిన శ్రమకి తగ్గ విశ్రాంతి లభించింది. అది వేరే సంగతి.

క్రొత్త చట్టం గురించి తెలవకముందే 'సిరిల్ గోవాకి వచ్చాడు! కానీ పొలం దున్నేరైతులూ, యింట్లో తోటపని చూసే కూలీజనం అతనికేదో కల్లబొల్లి కబుర్లు

చెప్పి, అతన్ని మోసగించి, తిరిగి పంపించేసారు.

ఒకరోజు నేను 'సిరిల్' యింట్లో కాపురముంటున్న బంధువు ఉద్యోగం చేస్తున్న ఆఫీసుకు వెళ్ళాను. అప్పుడు నాకు అతని గూడుపుఠాణీ గురించి తెలిసింది. అతను ఆఫీసులో లేడు. ఆ ఆఫీసులోనే పనిచేస్తున్న నా మిత్రుడు అన్ని విషయాలు రహస్యంగా చెప్పాడు. ఈ విషయాలన్నీ పూసగుచ్చినట్లు వివరంగా 'సిరిల్'కి ఉత్తరం వ్రాసి తెలియజేసాను. అతని రాకకోసం ఎదురుచూస్తున్నాను.

నేను ఈ మధ్యనే ఆఫీసు పనిమీద 'ఢిల్లీ'కి వెళ్ళవలసివచ్చింది. అక్కడ శిక్షణ కోసరం సుమారు నెలన్నర రోజులు మకాం వేసాను. ఆ సమయంలోనే 'సిరిల్' బంధువు యింటిని మరమ్మత్తు చేయించాడనీ, రంగులు వేయించాడనీ తెలిసింది. నేను 'ఢిల్లీ' నుంచి తిరిగి వచ్చాక, ఆ ఇంటిని చూడడానికి వెళ్ళాను. ఆ యిల్లు ఆసాంతం ఎన్నో మార్పులూ, చేర్పులూ చేసి అధునికంగా వుండేలా రంగులతో తీర్చిదిద్దాడు. డబ్బు వేలలో ఖర్చుపెట్టి వుంటాడని స్పష్టంగా తెలుస్తోంది. నేను అతని దగ్గర దర్యాప్తు చేసాను. తను 'సిరిల్'కి ఎప్పుడూ అద్దె పంపలేదట. అందువల్ల ఆ డబ్బే అతని యింటికోసం ఖర్చుచేసానని 'సిరిల్' బంధువు చెప్పాడు.

అతనలా సులభంగా చెప్పి, మాట తప్పించినా, నా మనస్సులో ఏదో అనుమానం పీకుతోంది. నేను ఈ విశేషాలన్నీ 'సిరిల్'కి వివరంగా వ్రాసి, వీలున్నంత త్వరగా 'గోవా'కి రమ్మన్నాను.

నా శిశువు పుట్టినరోజుకని నేను నా భార్య వెంబడి మొన్న 'మ్హాస్సా' (గోవాలో ఒక చిన్న పట్టణం)కి వెళ్ళాను. మా వెనకనే 'సిరిల్' వచ్చాడు. చేతిలో ఏవో బట్టలు చిన్నసంచీలో వున్నాయి. "పంజిం (గోవా రాజధాని) వెళ్ళి రేపు నిన్ను కలవడానికి వస్తాను" అని హడావిడిగా చెప్పి వెళ్ళిపోయాడు. మేము సాయంత్రం ఇంటికి తిరిగొచ్చిన తరువాత 'సిరిల్' వచ్చి వెళ్ళినట్లు తెలిసింది. అతను మళ్ళీ సాయంత్రం వస్తాడేమోనని రాత్రి పదిగంటల వరకూ ఎదురు చూసాను. రాలేదు. నిన్న నేను కచేరీకి వెళ్ళలేదు. మా ఆవిడ కూడా అకస్మాత్తుగా తన ఆఫీసుకి సెలవు పెట్టింది.

నిన్న సాయంత్రం సుమారు ఐదుగంటల ప్రాంతంలో 'సిరిల్' మా యింటికి వచ్చాడు. అతని వేషం, ముఖకవళికలు చూడడంతోనే నాకు తెలిసింది - ఏదో విపత్తు జరిగిందని. కారణం అతని కళ్ళల్లో నీళ్ళు! నన్ను చూడగానే బోరున ఏడవసాగాడు. మౌనంగా, నన్ను గట్టిగా కౌగలించుకున్నాడు. ఇద్దరం ఏడవసాగాం.

నాకు అతను విషయాన్ని మాటల్తో చెప్పవలసిన అవసరంలేకపోయింది!

చాలాసేపైన తరువాత మాటలు దొర్లాయి. అతను అతి కష్టంమీద తన హృదయంలో రేగిన తుఫానుకి శబ్దరూపం యిచ్చాడు. తన పొలం కౌలుకి తీసుకుని దున్నే రైతు దానికి యజమాని అయ్యాడని కొత్త చట్టం ప్రకటించింది. ప్రభుత్వం నిర్ణయం ప్రకారం నిశ్చయమైన ముష్టి ధర, అతనికి నష్టపరిహారంగా లభిస్తుంది. పొలం ధరకంటే తోట ధర మరీ అన్యాయం! ఒక్కసారే మొత్తం డబ్బు చెల్లిస్తే చదరపు మీటర్‌కి 35 పైసలు; వాయిదాలలో చెల్లిస్తే 60 పైసలుట! మన వూళ్ళో 35 పైసలకీ, 60 పైసలకీ ఒక్కొక్కప్పుడు దొరకవు, కానీ 'ముండ్‌కార్' (భూమి కౌలుకి తీసుకున్న రైతు)కి భూస్వామి నుంచి భూమి లభిస్తుంది. ఆ డబ్బూ లేకపోతే హాయిగా వాయిదాల మీద యిచ్చుకోవచ్చు!

చాలా సంవత్సరాల క్రిందట, అదే భూమిని చదరపు మీటర్ రూపాయ ధరకి కొన్నాడు. ఇన్నేళ్ళకి (పదిహేను సంవత్సరాలకి పైగా) ఆ భూమినే చట్టం ప్రకారం అమ్మితే, వచ్చే ధర ఏమిటీ? కనీసం పెట్టుబడి పోయిందనుకున్నా దానిమీది వడ్డీ కూడా ముట్టడంలేదే? నిన్నటివరకూ తన పొలం, తోటా కౌలుకు తీసుకు పనిచేసిన రైతులు యిప్పుడు వాటికి యజమానులయ్యారు.

క్రొత్త చట్టం అమలుకి రాకముందు ఒక్కొక్క భూస్వామికి ఏడు, ఎనిమిది ఎకరాల భుములుండేవి. ఈ క్రొత్త చట్టం వీరికి వర్తించినట్లే ఒకే ఎకరం మాత్రం వుండి, ఆ ఎకరం పొలాన్నీ కారణాంతరాలవల్ల (విదేశాలకి వృత్తినిమిత్తం వెళ్ళడం వగైరా) కౌలుకివ్వడంవలన 'సిరిల్' వంటి చిన్న భూస్వాములకి కూడా వర్తించి ('దున్నేవాడిదే భూమి' అన్న సూత్రం ప్రకారం) నష్టపోయాడు.

వాడు, 'సిరిల్' బంధువు ఒక్కసారే సుడితిరిగి, అతని యింటికీ, తోటకీ (తటాకం సంగతి సరేసరి) యజమానిగా మారిపోయాడు. భూమి సర్వే రికార్డులు సహితం తన పేరిట వ్రాయించుకొన్నాడు. 'సిరిల్'కి తను పుట్టి పెరిగిన స్వగృహంలోకి, తన స్వంత యింట్లోకి అడుగుపెట్టడమే నిషిద్ధమయింది. అతను (సిరిల్) 'గోవా'కి వచ్చాడని తెలిసి, ముందుగానే ఏర్పాటుచేసుకున్న యిద్దరు గూండాలని యింటికి పహారాగా వుంచాడు. ఆ 'తటాకం'ని అతని బంధువూ, ఒక రౌడీ నాయకుడూ తమ యిద్దరి పేరిటా 'సర్వే' కాగితాలు వ్రాయించుకున్నారు. ఆ ఆస్తికి యజమానిగా అతని బంధువు పేరును పేర్కొంటూ ప్రభుత్వ సర్వే

గెజెట్‌లో స్పష్టంగా ప్రచురింపబడింది. అతని బంధువు 'సిరిల్'ని మభ్యపెట్టడానికి పూర్వపు సర్వే కాగితాలు పంపించాడు. అవి కూడా నకిలీవని యిప్పుడు తెలిసింది. ఇక చేసేదేముంది? ఒక్కటే దారి - కోర్టుకెళ్ళడం. కోర్టు మెట్లు అరగదీయడానికి, విదేశాలలో వుంటున్న తనకెలా వీలవుతుంది? అయినా న్యాయం - అంత దగ్గిర వస్తువా - చెయ్యి చాపితే అందడానికి? సప్త సముద్రాలూ దాటాక ... అవతలి వొడ్డున ...

ఆఖరికి 'గోవా' ముద్దుల కొడుకు స్వతంత్ర భారతదేశపు పౌరుడు, చట్టానికి బలై, ఒక్క ఉదుటున 'పరదేశీ'యుడైపోయాడు...

ఈవేళ మధ్యాహ్నం అతను తన పొలంకి ఆఖరి దర్శనం నిమిత్తం వెళ్ళాడు. ఉద్వేగంలో ఆ భూమిమీద వొంగి గుప్పెడు మట్టి వ్రేళ్ళతో త్రవ్వి తీసుకుని ఒక ప్లాస్టిక్ సంచీలో వేసుకున్నాడు. అశ్రువులు నిండిన కళ్ళతో, బరువైన గుండెలతో ఒకసారి క్రిందికి చూసి, ఠక్కున మళ్ళీ వొంగి భూమిని చుంబించాడు. మా అందరి సెలవు తీసుకుని, కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ అతను విమానంవైపు వెళ్తూ వుంటే, నా మనస్సు కదిలిపోయింది!

విమానం భూమి వదిలి ఎగరడంతోనే, అతనికి ఈ దేశంతో ఋణం, బంధుత్వం వదిలిపోయాయి.

ఇదంతా చట్టం మహాత్మ్యం!



## 20

# వైరాగ్యం

**- మహాబళేశ్వర్ సైల్**

'పావలీన్' మంత్రసాని, తన అనుభవం, సేవాతత్పరత మిళితమైన చేతిని 'తులసీ' మృదువైన, నాజూకైన కడుపుమీద వేసి నిమిరింది. నిండు గర్భిణి 'తులసి' వుబ్బిన కడుపు వురుటి నొప్పులతో బాధపడుతోంది. నొప్పులు ఎలా తగ్గేలా తమాయించుకోవచ్చో 'పావలీన్' సూచిస్తోంది. 'తులసి' వొంటిమీదుగా పురిటి వేదన తరంగాలుగా వచ్చిపోతోంది. ఆమె మళ్ళీ మళ్ళీ నొప్పితో అరుస్తోంది. 'తులసి'కి యిది మూడవ కాన్పు. అయినా ప్రతీసారీ ఆమెకి విపరీతమైన బాధ కలుగుతోంది. ఓర్చుకోలేనంత నొప్పి కలుగుతోంది. ఆమె లజ్జా, బిడియం వదిలి యథేచ్ఛగా అరుస్తోంది. కేకలేస్తోంది. ఏడుస్తోంది.

'పావలీన్' 'తులసీ' తొమ్మిది గజాల చీరని తీసి పూర్తిగా విప్పేసి వుండలా చుట్టి పక్కకి పెట్టింది. ఒక చిన్న పరిశుభ్రమైన వస్త్రాన్ని ఆమెమీద కప్పింది. ఆమె శరీరాన్ని వెచ్చని నీళ్ళతో తడిపిన బట్టతో మర్దనా చేసింది. చందనపురాయి మీద ఏవో మందులు నూరి 'తులసి'కి త్రాగడానికి యిచ్చింది. జీలకర్ర, వాములు నమలటానికి యిచ్చింది. గూటంతో పొడిచేసి ఏవో వోషధులు ముద్దగా చేసి నడుంక్రింద, వెన్నెముకకీ, నుదుటికీ రాసి మర్దనా చేసింది.

'తులసి' ఆక్రందన సాగుతూనేవుంది.

'పావలీన్' తన అనుభవంతో సరిసమానంగా చేతులతో వొత్తుతూ, కడుపు నరాలని సడలించడానికి ప్రయత్నిస్తోంది.

'పావలీన్' మంచి సమర్థమైన మంత్రసాని. ఈ వూళ్ళో డాక్టరు లేదు. లేదా అంటే ఒక వైద్యుడు వున్నాడు. ముందు అతడు ఏవో నాటువైద్యంతో ఓషధులు - మూలికలు వగైరా యిచ్చేవాడు. ప్రస్తుతం ఇంగ్లీషు మందులు - మాత్రలూ,

ఇంజెక్షన్లూ యిస్తున్నాడు. కానీ ఎందువల్లో అతని వైద్యంమీద జనానికి నమ్మకం కుదరలేదు. అతని మందులు కేవలం మామూలు జ్వరం, జలుబు, విరోచనాలూ, అజీర్తి వగైరాలు నయం చేయడంవరకేనని ప్రజల భావన, సుస్థిర విశ్వాసం కూడా. నెలలు నిండిన చూలాలు, ఆ వూళ్ళో అటు భగవంతుడి మీదా, ఇటు అపార అనుభవంతో రాటుదేరిన మంత్రసాని 'పావలీన్'మీదా పూర్తి విశ్వాసం, బాధ్యతా నిలిపి నిశ్చింతగా రోజులు దొర్లిస్తుంది.

'పావలీన్'ది చక్కటి రూపం. అందమైన కళ్ళూ, ముక్కూ, గులాబీ రంగు ఛాయ. సుమారు నలభై సంవత్సరాలు చేరుకుంటున్న వయస్సు. కానీ ఒంటరి పెళ్ళికాని స్త్రీ. ఆమె మతంలో ఎవరైనా దగ్గర బంధువులు మరణిస్తే వారి మరణానికి దుఃఖ చిహ్నంగా ఒక ఏడాది వరకూ పూర్తి నల్లబట్టలు ధరించడం రివాజు. అయితే యిప్పటికి ఎన్నో సంవత్సరాలు గడిచినా, ఎప్పుడూ 'పావలీన్' నల్లబట్టలే ధరిస్తుంది. ఎందువలన? ఈ క్లిష్ట సమస్యకి ఎవరి దగ్గరా జవాబులేదు. ఆమె కూడా అంతగా పట్టించుకోదు. ఈ అందమైన మహిళ చక్కటి రంగుల ఫ్రాకు (గౌను) గానీ, ఖరీదైన రంగుల చీరగానీ వేసుకొంటే ఎంత బాగుంటుందోనన్న ఆలోచన చూసేవాళ్ళకి కలగక మానదు. అదీగాక ఆమె పొడుగ్గా, తగిన పుష్టిగా హుందాగా కనుపిస్తుంది. మితభాషి. నవ్వడమే అరుదు. కానీ ఒక్కసారి పురిటి గదిలోకి వెడితే చాలు పువ్వు విచ్చుకున్నట్లు మారిపోతుంది. హఠాత్తుగా గొంతుక వచ్చినట్లు మాటల్తో ముంచేస్తుంది. గర్భిణీ స్త్రీలకి ఎంతో ధైర్యం, ఆధారం యిస్తుంది.

ఆమె తోబుట్టువులు (అన్న, తమ్ముళ్ళూ, అక్క చెల్లెళ్ళు) రెక్కలు వచ్చాక యిక్కడా, అక్కడా చెదురు మదురుగా వెళ్ళిపోయారు. తల్లి నుండి వంశపారంపర్యంగా వస్తున్న ఈ మంత్రసాని వృత్తి చేపట్టింది. ఇప్పటికి పదిహేను సంవత్సరాలు గడిచింది. ఆమె ఒంటరిగా ఆ యింట్లో వుంటోంది. ఊళ్ళో ఏ స్త్రీకైనా పురుటినొప్పులు వస్తున్నాయని తెలిస్తే చాలు, గోడ అల్మారాలోని తన వైద్యపు నల్లబ్యాగు తీసుకుని వెంటనే గబగబా బయటకి వెళ్తుంది.

'పావలీన్' 'తులసి'ని పరీక్షగా, సందేహంగా చూసింది. బిడ్డ అడ్డంగా (తల్లక్రిందులుగా) రావడంలేదు కదా? లేదు. తల ద్వారం (యోని) దగ్గర్నే వుంది. గర్భాశయం కూడా బాగానే వుబ్బింది. ఇప్పుడు మహా అయితే ఒక గంటలో కాన్పు అయిపోతుంది.

'తులసి' నొప్పితో తన్నుకుంటోంది. పళ్ళు బిగించి పెదవులు కొరుకుతూ, బాధతో అరుస్తోంది.

ఊళ్ళోని ముగ్గురు, నలుగురు మహిళలు వచ్చి పురిటిగదిలో కూర్చున్నారు. ఊరికే ఏమేమిటో మాట్లాడుతున్నారు. అన్నీ తెలిసిన వాళ్ళలా 'పావలీన్'కి ఏవేవో పురమాయిస్తున్నారు. 'ఇలా చెయ్యి, అలా చెయ్యి' అని. వీళ్ళు బయటికి పోతే చాలనిపించింది 'పావలీన్'కి.

'తులసి' అరుపులూ, కేకలూ విని ఒకావిడ అంది "నోట్లో ఒక కేశం (జుత్తు) పీలిక పెట్టు. శబ్దం తనంతట తనే తగ్గిపోతుంది."

'పావలీన్' వినీవిననట్లు, తన పనిలో మునిగిపోయింది.

"నా కొడుకు పుట్టినప్పుడు నేను కూడా యిలాగే సిగ్గూ, లజ్జా విడిచి అరిచాను. మా పుట్టింట్లో మా అత్తయ్య, నా నోట్లో కేశం వుంచింది. మంత్రించినట్లు నోరు మూసుకుపోయింది."

'పావలీన్' మళ్ళీ ఉపేక్ష్యం చేసింది.

మరో స్త్రీ గొడ్లపాకలోకి వెళ్ళి ఆవు ముక్కుకి వేసే తాడు తీసుకొచ్చి గోడ కొయ్యానికి తగిలించి, ఒక చివర 'తులసి' చేతిలో పెట్టి అంటుంది "ఈ తాడు కొన పట్టుకు నీ సత్తువ, బలం చూపించు. ఇది నీ చేతిలో వుంటే గోమాత ఆశీర్వాదం వున్నట్లే - ఏం భయం వుండదు."

'పావలీన్'కి యిది ఏదో వేలంవెర్రిలా అనిపిస్తోంది.

"'తారా' ఇది నిజంకాదు. ఆ తాడు పట్టుకు శక్తిచూపిస్తే బలమంతా పైభాగానికి వెళ్తుంది. బలం కావలసింది కింది (శరీరం) భాగానికి" ఆమె ఆ తాటిని చుట్టేసి గోడమీద గూట్లోకి పడేసింది.

'పావలీన్' తులసి పురిటినొప్పులు, బాధ తగ్గించడానికి వివిధ ప్రయత్నాలు చేసింది. 'తులసి' నొప్పి భరించలేక 'పావలీన్' చేతినే కోపంతో కరిచింది; ఆమెనే శాపనార్థాలు పెట్టింది; గిల్లింది.

'పావలీన్' యివేవీ పట్టించుకోదు. ఈ విధంగా కరుపులూ, గిల్లుడూ, గిట్లూ తినడం ఆమెకి మామూలే.

'తులసి' మొగుడు 'విశ్రామ్' బైట కాలుమీద కాలేసుకుని గోడకానుకుని నిల్చున్నాడు. మాటిమాటికీ గెడ్డం నిమురుకుంటూ, బీడీ తరవాత బీడీ ముట్టించి

తాగుతున్నాడు. మధ్య మధ్యన బీడీ పీలిక నోట్లో పెట్టుకుని పళ్ళతో దాని రుచి నములుతున్నాడు. అతని పెద్ద కూతురు బెదిరిన పక్షిలా మళ్ళీ మళ్ళీ గదిలోకి వెళ్ళి, బయటకి వస్తోంది.

ఇంతలో హఠాత్తుగా 'తులసి'కి ఒక పెద్ద లోతైన నొప్పి వచ్చింది. ఆమె బాధ భరించలేకపోయింది. ఆమె శరీరం ఆసాంతం కంపిస్తుంది. ఆమెనే పట్టుక్కూర్చున్న 'పావలీన్'కి తెలియకుండానే ప్రక్కకి తిరుగుతుంది. శిశువు క్రిందకి జారుతున్నప్పుడు యిలా ప్రక్కలకి తిరగడం క్షేమం కాదని 'పావలీన్'కి తెలుసు.

"అరే తులసీ, ఏం పిచ్చిపని చేస్తున్నావే? ఒక్కసారే తిరిగావు పక్కకి? ఆగమ్మా ఓపికపట్టు. కాస్త ఓపికపట్టు! కాస్త నిభాళించుకో."

ఇంతలో తులసికి మరో పెద్ద నొప్పి వచ్చింది. ఈ నొప్పి మరీ భరించలేనంతది! ఎవర్నయినా పట్టుకు, కొరికెయ్యాలనిపించింది. ఆమె 'పావలీన్'నే కరవబోయి తిడుతూ అంది. "ఓపికపట్టుట! ఓపిక! నీకు తెలుసా నా బాధ? ఎప్పుడైనా పండిందా నీ పొట్ట? ఈ బాధ నీకేం తెలియదు. నువ్వు నోరుమూసుకో."

. మూలకూర్చున్న ఒక స్త్రీ ఫక్కున నవ్వి, నవ్వాపుకుంటూ, నోట్లో చీర కొంగు దోపుకుంది.

ఈ మాటల దెబ్బ 'పావలీన్' గుండెలకి బలంగా తగిలింది. ఏ నిజం తను సూటిగా ఎదుర్కోజాలదో, ఆ నిజాన్నే 'తులసి' కుండబ్రద్దలుగొట్టినట్లు చెప్పింది.

ఆమె సడలి, నీరసించిపోయింది. విరిగిన నాజూకు తీగలాగ మనస్సు విలవిలలాడింది. తనమీదే తను కించబడి, కొంతసేపు వూరకనే వుండిపోయింది. ఆమెకి మళ్ళీ మళ్ళీ అనిపించింది. ఈ మంత్రసాని వృత్తి తనకి ఒప్పదు. ఈ వృత్తికి స్వస్తిచెప్పాలి. ఇదే ఆఖరిసారి. కానీ మళ్ళీ కొంతసేపటికి తనకి తాను నచ్చచెప్పుకుంది. సమాధాన పడుతుంది.

పట్టపగలు ప్రారంభమయిన నొప్పులు ఫలించి మధ్యాహ్నం దాటాక సుమారు నాలుగ్గంటలకి 'తులసి'కి పురుడు వచ్చింది. శిశువు రోదన చెవులకి సోకగానే బయటనున్నవారంతా లోపలికి పరుగెత్తారు. వాటీ మ్రోగించే చప్పుడొస్తుందని అంతా ఆదుర్దాతో ఎదురుచూస్తున్నారు. (వాటీ మ్రోగిస్తే కొడుకు పుట్టాడని సంకేతం) కానీ ఎంతసేపటికీ వాటీ చప్పుడు కాలేదు.

'విశ్రామ్'కి సహనం పోయింది. "పావలీన్, వాటీ మ్రోగించలేదెందుకూ,

ఇంకా?"

బొడ్డుకోస్తున్న 'పావలీన్' హడావిడిగా అంది "విశ్రాం బాబూ, వాటీ ఎందుకు వాయిస్తానూ? ఆడపిల్ల పుట్టింది కదూ?"

ఇది 'తులసి'కి మూడవ కాన్పు. మూడవ కూతురు! దామూ (విశ్రాం) రుసరుసలాడాడు. కోపంగా గెడ్డం నిమురుకుంటూ పెళ్ళాన్ని అంటాడు "...ముండ. ఎప్పుడూ ఆడపిల్లల్నే కంటోంది. దరిద్రపుముండ."

'పావలీన్'కి ఈ మాటలు విని వొళ్ళు మండింది. ఆమె మనసులో అనుకుంది. ఆడపిల్ల పుట్టిందంటే ఏదో ఆకాశంలోంచి పిడుగులా తన వొళ్ళో పడిందనా? అలా అయితే ఎందుకని ఈ మొగుడు పెళ్ళాం దగ్గరకి వెళ్ళి పాట్లు పడాలి? పాపం. ఆ పెళ్ళాం అవస్థ అర్థమవడంలేదా? ఇంత బాధ భరిస్తూ పిల్లని కన్నదన్న జాలిలేదా? లేదు సరికదా ఆమెనే అంటాడా?

గదిలో కూర్చున్న స్త్రీలు ఒక్కొక్కరే వెళ్ళిపోతున్నారు. మగశిశువు పుట్టాడనే సంబరాలు చేసుకొందామనే ఆశతో వచ్చారు. నిరాశతో వెళ్ళిపోయారు - ఆడపిల్ల పుట్టిందంటే అదో చావు వార్తలా.

'తులసి' పుట్టిన శిశువువైపు వీపు తిప్పి మౌనంగా పడుకుంది. బహుశా లోలోపలే దుఃఖిస్తోంది కాబోలు. 'తులసి'ని చూసి 'పావలీన్'కి చాలా జాలేసింది. పాపం పిచ్చితల్లి, ఎంత అవస్థపడిందో! ఇప్పటికైనా తన స్వ-ఆరోగ్యం చూసుకుంటే మంచిది - బుద్ధితెచ్చుకుని

ఆ తరువాత భరించలేని నిశ్శబ్దం. 'పావలీన్'ని నిరాశ చుట్టుకుంది. ఉత్సాహం చల్లారిపోయింది. కానీ తప్పనిసరి పనులు కొన్ని మిగిలాయి. వాటిని పూర్తిచేసి, సరిదిద్దాలి.

ఆమె పనికి ఉపక్రమించింది. సావిట్లో గొయ్యి త్రవ్వి ప్రసూతి అనంతంర మిగిలిన గర్భకోశపు నాళికని పూడ్చాలి. కాస్త గొయ్యి తవ్వమని చెబితే నిద్రపోతున్న 'విశ్రామ్' వినిపించుకోలేదు. ఆ గొయ్యి తవ్వడం కూడా తనే చేసింది. తరువాత శిశువుని శుభ్రంగా కడిగి, తుడుస్తుంది. ఆ తరువాత స్వచ్ఛమైన పక్కమీద నిద్రపుచ్చుతుంది. పాప వెంటనే నిద్రపోతుంది. అందరిమీదా కోపం, అసహ్యంతో మనస్సు పాడైన 'పావలీన్'కి, ఆ శిశువు అలా చక్కగా పుస్తకంలా పడుకోవడం అబ్బురమనిపించింది. అది చూసి మనస్సు కుదుటపడింది.

తరువాత 'తులసి' నడుంమీద చుట్టూ ఒక పట్టీ (బెల్టు) కట్టింది. ఆ తరువాత వివిధ రకాల ఓషధులూ, మూలికలూ అరగదీసి కలిపి త్రాగడానికి యిస్తుంది. 'తులసి' వొద్దంటున్నా, బలవంతాన త్రాగిస్తుంది.

తన బ్యాగ్ (సంచీ) తీసుకుని బయటకి వెళ్తూ, వెళ్తూ ఆమె 'తులసి'కి కొన్ని సూచనలిస్తుంది. ఇలా చెయ్యి, అలా వొద్దు అని. 'తులసి' ఏం జవాబివ్వదు. కేవలం 'వూఁ' అంటుంది.

బయట సగం సగం కాలిన మంటల్లో కర్రలాగ 'విశ్రాం' పడుకొన్నాడు. పెద్దపిల్ల చిన్నపిల్లని సంకలో వేసుకు ఎక్కడికో మాయమయింది. 'పావలీన్'కి అనిపించింది - పాపం 'తులసి' లోపల పడి చచ్చిపోయినా ఈ ఇంట్లో ఎవ్వరూ పట్టించుకోరు కాబోలని.

'పావలీన్' ఇంటి బయటకొచ్చి గబగబా అడుగులేస్తూ నడుస్తోంది. కానీ ఈవేళ ఆ అడుగులు చాలా బరువుగా పడుతున్నాయి. ఉత్సాహం లోపించింది.

సూర్యుడు దూరపు కొండల్లో అస్తమిస్తున్నాడు. సంధ్యాసమయం. నల్లని చారలు మెల్లి మెల్లిగా క్రమ్ముకొంటున్నాయి. ఇప్పుడే వరదలూ, తుపానూ వచ్చి వెళ్ళినట్లు అంతా ప్రశాంతంగా వుంది. ఏదో తెలియని ఉదాసీనత, ఏదో లోతు, ఏదో చల్లదనం. ప్రకృతి చలిలో నగ్నంగా నిలబడి వొణుకుతున్న పిల్లవాడిలాగుంది.

దూరంగా నదికి అవతల వున్న చర్చిలో గంటలు వినిపిస్తున్నాయి.

'పావలీన్'కి తెలుసు. ఇవి ఎవరో మరణించినప్పుడు ఆ వార్తని వ్యక్తం చేసే గంటలు. ఆమెకి మరణశయ్యమీదున్న "ఫ్రాన్సిస్" గుర్తుకొచ్చాడు. పాపం పోయాడన్నమాట! గట్టిగా, దృఢంగా ఎదిగిన నలుగురు కొడుకులుండి కూడా అనాథలాగ ఎవరో పరిచయస్తుల యింట్లో తీసుకు, తీసుకు చచ్చాడు. కుళ్ళి కుళ్ళి మరణించాడు.

ముందుకు మరికొంత నడిచాక ఆమెకి 'పాయ్‌కాల్' కొడుకు 'సదూ' కనిపించాడు. సుమారు తొమ్మిది, పది సంవత్సరాలున్న ఈ కుఱ్ఱాడు చింతచెట్టు చాటున కూర్చుని బీడీ తాగుతున్నాడు. 'పావలీన్'కి కోపం వచ్చి అనిపించింది. 'వీడు పుట్టగానే ఎందుకని చావలేదు' అని. వీడి పురుడు తనే పోసింది. తల్లి 'ఉమ'కి వీడు గర్భంలో వుండగా ఎంత కష్టమయిందో తనకి బాగా తెలుసు. పురుట్లో ఆమె రాళ్ళతో చితక్కొట్టిన పాములా విలవిలా తన్నుకుంది. నరకబాధ

అనుభవించింది. నా భుజంమీద గట్టిగా కొరికింది కూడా! మరి వీడు - సుపుత్రుడు - వర్థి దరిద్రుడు!

దోవలో ఒకచోట కుక్కల గుంపు మరోచోట కొందరు యువకులూ, పిల్లలూ కనిపించారు గుంపులుగా. వాళ్ళు 'పావలీన్'ని చూసి మదం ఎక్కినట్లు గోలచేయసాగారు.

"భయపడకండి, డాక్టరమ్మ వచ్చింది."

'పావలీన్'కి సిగ్గు ముంచుకొచ్చింది. కోపం కూడా వచ్చింది. చటుక్కున ఒక విశేషం గుర్తుకొచ్చింది. వీళ్ళల్లో చాలామంది పిల్లల కాన్పులు తన చేతులమీదుగానే అయ్యాయి.

ఆమె మలుపు తిరిగి మరో దోవ పట్టింది. ఆమె దుఃఖపూరితమైన మనస్సుకి ఒక నిజం తేటతెల్లంగా కనిపించింది. ఈ మంత్రసాని పనికంటే హీనమైనదీ, నికృష్టమైనదీ, కఠినమైనదీ, నీచమైనదీ మరోపని లేదు. కేవలం రొచ్చుతో, బురదతో, కుళ్ళుతోనే నా ఈ వ్యవసాయం. చాలు. తెరదించేస్తాను. ఇకనుంచి ఈ కంపు వృత్తి వదిలేస్తాను. నాది ఒంటరి బ్రతుకు. ఎవ్వరింట్లోనేనా పనిచేస్తే పొట్టగడుస్తుంది. రేపు 'పావలీన్' చచ్చిపోయినంత మాత్రాన ఆడవాళ్ళు గర్భిణులవడం, కనడం మానేస్తారా?

ఆమె ఆలోచనల్లో మునిగి నడుస్తూ యిల్లు చేరుకుంది. మెల్లిగా చీకటి పెరుగుతోంది. 'తెరేజా' కొడుకు వచ్చి కోడిపుంజుని పంజరంలోకి తోసి తలుపేసాడు. 'పావలీన్' అలికిడి వినగానే అది "కో(" అని లేస్తుంది. దాని పిల్లలు పికొపిక్ శబ్దం చేస్తూ మేమూ వున్నాం సుమా అన్నట్లు లేచాయి.

తలుపు తెరిచిన చప్పుడు విని పొరుగున వుంటున్న 'అనారితా' బయటకి వచ్చింది. ఆమె ఆతృతగా అడిగింది.

"వచ్చావమ్మా పావ్‌లీనా? 'తులసి'కి మొగపిల్లాడా? ఆడపిల్లా?"

ఆమె 'ఆడపిల్ల' అని క్లుప్తంగా జవాబు చెప్పి యింట్లోకి వెళ్ళి తలుపేసుకుంది. 'అనారిత్' ఆశ్చర్యంతో "ఈసారీ అమ్మాయేనా?" అని కొంతసేపు గుమ్మందగ్గరే నిలబడిపోయింది.

'పావలీన్' యింట్లోకి రాగానే ఆమె పెంపుడు పిల్లి 'మ్యావ్ మ్యావ్' అని స్వాగతం పలికింది. ఆమె కాళ్ళని గోళ్ళతో, మెడకాయతో నిమిరింది. ఆ పిల్లి

ఈమధ్యనే ఈనింది. పిల్లిని 'పావలీన్' కాళ్ళతోనే మూలకి తోసేసింది. అది వుండలా ముడుచుకుని, ఆశ్చర్యంతో గప్పున కూర్చుండిపోయింది. మూలనే యింకా కళ్ళు విప్పుకోని పిల్లికూనలమీద కూడా 'పావలీన్'కి కోపం ముంచుకొచ్చింది.

అదే కోపంతో గోడ గూటిలో వున్న అగ్గిపెట్టె తీసి నూనె దీపం వెలిగించింది. ఆ దీపపు ఎఱ్ఱ, పసుపు కలిసిన కాంతి గదంతా వెలుగునిచ్చింది.

ఆమెకి దేనిమీదా ధ్యానం లేదు. చుట్టూ ఆక్రమిస్తున్న చీకటి నపుంసకుడిలా నిరుత్సాహాన్నీ, నీరసాన్నీ పంచుతోంది. ఆమె గోడ దగ్గరకి వచ్చి, దానిమీద అమర్చిన భగవంతుడి మూర్తికి ఎదురుగా భక్తితో నిలబడింది. శిలువమీద శిక్ష పొందిన ఏసుక్రీస్తు తరతరాలుగా పడ్డ మౌన వ్యధంతా ఈవేళ గట్లుతెగి 'పావలీన్' అంతఃకరణంలో ప్రవేశించి, ప్రవహించింది. ఆమె పూర్తిగా నిస్సహాయురాలై 'రోజార్' (ప్రార్థన) చేస్తుంది :

మారియా తల్లీ -
ఒంటరి కన్యవి
నీ కివే నా నమస్సు
నీ చల్లని వొళ్ళో
ఏసూని సాకావు.
నీ కన్నెరికం దేవుడికి
సమర్పించి గడించావు
దేవుడి పుత్రరత్నాన్ని -
కరుణామయుణ్ణి
నీ కొడుకే దేవదూత
అఖిల జగానికి శాంతిదూత
అష్టకష్టాలూ భరించావు నువ్వు
శిలువమీద శిక్ష సహించాడు
- నీ కొడుకు
ఏసుక్రీస్తు రక్తం,
నీ కన్నీళ్ళ దుఃఖం
మానవాళికి యిచ్చాయి

ప్రేమ, భక్తి సందేశాలు

ముత్యాలూ, మాణిక్యాలూ.

ప్రార్థన చేస్తూ, చేస్తూ ఆమె గుండెలు ఉద్వేగంతో నిండాయి. కన్నీళ్ళు జలపాతంలా కురిసి, గొంతుకలో వెక్కిళ్ళొచ్చాయి. అది బొంగురుపోతుంది. ఏసుక్రీస్తు శరీరం మీద కొట్టిన ప్రతీ మేకు నుంచీ రక్తం కారి, తన రక్తంలో కలసి చుక్క, చుక్కలుగా క్రిందికి పారుతుంది. మూల, మోకాళ్ళమీద వొంగొని కూర్చున్న 'మేరీ'మాత - జేజూ ప్రభువు తల్లి - కళ్ళల్లో నీళ్ళు నిండి వెక్కిళ్ళు వచ్చి ఆమెకి వినిపిస్తాయి. చాలా లోతుల్లోంచి ఆమె మనస్సు చలించింది. శిలువమీదున్న క్రైస్తు మూర్తిని భక్తితో నిమురుతూ, నిమురుతూ ఆమె ఏకధారగా ఏడుస్తుంది. అక్కడే ఆ మూర్తి నుంచిన బల్లక్రింద నున్న సొరుగులో దాచిన ఒక డిబ్బీలోంచి ఉంగరం తీస్తుంది. ఆ ఉంగరం తన వేలుకి తొడుక్కొని, అలాగే వచ్చి మంచంమీద పడిపోతుంది.

ఆ ఉంగరం వెనక ఒక ఇతిహాసం వుంది. 'డామనిక్' అనే యువకుణ్ణి ఆమె ప్రేమించింది. చాలా చాలా సంవత్సరాల క్రితం సంగతి ఇది. ఈ సంగతి దాదాపు ఇరవైయేళ్ళ క్రితంది. 'డామనిక్' ఒక నావికుడు. పెద్ద పెద్ద ఓడల్లో పనిచేస్తాడు. ఒకసారి ఒడ్డుకి వచ్చాడు. ఆ వూళ్ళో వున్న నవయువతి, సౌందర్యరాసి, సుగుణాలభరిణి 'పావలీన్' ప్రేమలో పడ్డాడు. పైన పువ్వులా సుకుమారంగా, లోపల వజ్రంలా దృఢంగా వుండే ఆమె గాఢప్రేమ అతన్ని కదిలించేసింది. మాఘమాసంలో మేఘాలలా ఆమె రహస్యంగా వచ్చి, పోయేది. పెదాలమీద పెదాలు కలిపి చుంబించినప్పుడు అగ్గిమీద గుగ్గిలంలా ఆమె ప్రేమ జ్వలించేది. అజరామరమైనది ఆమె ప్రణయం.

లోకులు ఆమెని ఏ పురుషుడి ప్రేమానుబంధంలోనూ పడని పవిత్ర, విశుద్ధ స్త్రీరత్నంగా గౌరవిస్తారు. అభిమానం చూపిస్తారు. అయితే ఆమె, తనని తనే మోసగించుకోదు. 'డామనిక్'తో తను గడిపిన ఆ రాత్రి, ఆమె ఏనాడూ పశ్చాత్తాపపడని నిజం.

బోటులో (నావ) వెళ్ళేముందు రోజు రాత్రి అతనితోనే గడిపింది. నిజానికి ఒకరి నొకరు కౌగలించుకుని, ఒకరి పెదవులని మరొకరు చుంబించి, రాత్రంతా సరస సంగీత, నృత్యాలలో వోలలాడాలని ఆమె భావించింది. అలాగే జరిగింది.

అయితే మధ్య మధ్య 'డామ్నిక్' ఆమెతో చిలిపి చేష్టలు చేసాడు. మళ్ళీ మళ్ళీ ఆమె వస్త్రాలు పట్టుకుని కెలకసాగాడు. 'పావలీన్' చిరుకోపంతో అతనికి దూరంగా, మూలకి జరిగింది.

'డామనిక్' దగ్గరికి జరిగి ఆమెని మళ్ళీ ప్రేమతో కౌగలించుకుని కళ్ళల్లో కళ్ళుపెట్టి అడిగాడు "కోపం వచ్చిందా? నన్ను విశ్వసించవా? రా! ఇలారా!" అంటూ ఆ గదిలోని ఏసుప్రభువు విగ్రహం ముందుకు ఆమెతో కలిసి వెళ్ళాడు. అతడు ఏసుక్రీస్తు పాదకమలాలని తాకి, నమస్కరించి తన చేతిలోని ఉంగరాన్ని తీసి 'పావలీన్' చేతికి తొడిగాడు.

"నీకు తెలుసు. మన మతంలో ఉంగరాన్నికున్న ప్రాధాన్యత. పెళ్ళికంటే ముఖ్యం." 'పావలీన్' అంతరాళంలో మెరుపులూ, నక్షత్రాలూ కనిపించాయి. 'డామనిక్'ని గాఢంగా హత్తుకొని, తన సర్వస్వం అతనికే అర్పితమని బాసలు చేసింది. దైవసాక్షిగా అతనినే తన భర్తగా స్వీకరించింది.

ఆ రాత్రి, చిరస్మరణీయమైన రాత్రి తన యౌవనాన్నీ, ప్రణయ రాగానురాగాల్ని సమర్పించింది. పెళ్ళి ముహూర్తం అతని మరుసటి సెలవులకని నిర్ధారించాడు. 'డామనిక్' మర్నాడే ఓడమీద వెళ్ళిపోయాడు. ఒకరోజు ఆ ఓడ సముద్రంలో ప్రయాణం చేస్తూన్నప్పుడు, తీవ్రమయిన తుపానులో చిక్కుకుని తల్లడిల్లింది. పెద్ద పెద్ద కొబ్బరి చెట్లకి మించిన ఎత్తైన కెరటాలు ఓడని చిన్నాభిన్నం చేసాయి. ఎడతెగని ఆ తుపాను ధాటికి ఓడ తట్టుకోలేకపోయింది. చివరికి సముద్రగర్భంలో కలిసిపోయిన ఆ ఓడలో 'డామనిక్'తో సహా అరవైమంది నావికులు మరణించారు. ఇప్పటికీ ఆ పెద్ద ఓడకి చెందిన తునకలు (బల్ల చెక్కలూ, దూలాలూ) సముద్రంలో తేలుతూ తిరుగు తున్నాయనీ, దాని యినుప నిర్మాణం 'కళేబరం'లా సముద్రపు లోతుల్లోకి జారి పోయిందనీ జనం అంటారు. ఓడ సముద్రపు గర్భంలో పోయి అదృశ్యమైనట్లే, 'డామనిక్' యిచ్చిన ఉంగరం 'పావలీన్' చేతివ్రేలు నుంచి దేవుడి మూర్తికి క్రిందన వున్న సొరుగులోని నగలపెట్టెలో మిగిలిపోయింది శాశ్వతంగా.

ఆ రాత్రి లభించిన ప్రణయసుఖం ఒక శక్తిగా ఆమె జీవితంలో ప్రవేశిస్తే, ఆమె మహాప్రసాదంలా స్వీకరించి వుండేది. 'మారియా' మాతలా ఒంటరి తల్లిగా నిశ్చింతగా జీవించేది. కానీ దురదృష్టవశాత్తూ, ఏ ఫలితం కలగలేదు. ప్రేమకి గుర్తుగా

ఏమీ మిగలలేదు. ఈ ఉంగరం వుంది కానీ ఏం లాభం? శవాన్ని చూసి కన్నీళ్ళు తెచ్చుకోవడమే, దీనిని చూడడం అంటె!

ఆమెకి తన వ్యర్థ జీవితం, నిరర్థక జీవితం తేటతెల్లగా తెలిసి వచ్చింది. బ్రతుకుమీదే ఏహ్యాభావం, అసహ్యం కలిగింది. ఆ రోత మ్రళ్ళీ, తన వృత్తిమీదకి పడింది. నా యీ మంత్రసాని వృత్తి, పడుపువృత్తికంటే కనిష్టం, నికృష్టం. ఏ పురుటి బాధ తనెప్పుడూ అనుభవించలేదో, ఏ ప్రసూతి వేదన తను జీవితంలో ఎదుర్కోలేదో ఆ బాధనీ, వేదననీ సహించమని తోటి మహిళలకి ఉపదేశించే హక్కు తనకెవరు యిచ్చారు? 'తులసి' చెప్పింది నగ్నసత్యం!

చాలా సందర్భాలలో గమనించాను. దాదాపు అందరూ మగపిల్లవాడు పుట్టాలని ఆశిస్తారు. కోరుకుంటారు. అదేం పాపమో ఆడపిల్ల కావాలనేవారు కనబడరు. పుట్టిన శిశువు ఆడపిల్ల అని తెలియగానే యింట్లో అదో నిశ్శబ్దం! అదో నిరుత్సాహం! అదో నిస్పృహ! పిడుగుపడ్డట్టు!

అప్పుడు తల్లి గురించి ఎవ్వరూ అంతగా పట్టించుకోరు. ఆమె సహించిన ప్రసూతి వేదనా, తొమ్మిది నెలలూ బిడ్డని కడుపులో మోసి పడ్డపాట్లూ ఎవ్వరికీ పట్టదు. వైద్యురాలి (మంత్రసాని) సేవలకి విలువనివ్వరు. ఆడదాని దురదృష్టపు జీవితంలోని అవస్థలూ, కష్టాలూ నేను చూసినంత మరో స్త్రీ చూసి వుండదు.

ఈ జగమంతా స్వార్థమయం! పని అయ్యేంతవరకూ కాళ్ళూ, పనయ్యాక జుట్టూ పట్టుకొంటారు. అవసరం తీరేవరకూ వైద్యురాలని మర్యాద చేస్తారు, అవసరం లేనప్పుడు ఆ పిల్లల్లా అవహేళన చేస్తారు. ఇకనుంచీ ఈ వృత్తికి తిలోదకాలిస్తాను. ఇకమీదట 'మంత్రసాని'గా ఏ గడపా త్రొక్కను. వెళ్ళనంటే వెళ్ళను. 'పావలీన్' నిశ్చయించింది.

ఆమెకి మళ్ళీ దుఃఖం క్రమ్ముకొచ్చింది. చేతిలో ఉంగరం సవరిస్తూ, ఏడుస్తుంది. తరువాత స్పృహపోయినదానిలా నిద్రపోతుంది. అదీ సగంనిద్ర. కొంత మెలకువా, కొంత నిద్రా!

చాలా రాత్రి గడిచింది. నూనెదీపం నూనె ఖర్చయిపోయి, వెలగడం మానేసింది. హఠాత్తుగా తలుపు చప్పుడు. సగం నిద్రలో వున్న 'పావలీన్'కి చూచాయగా తెలిసింది ఎవ్వరో తలుపు తడుతున్నారని.

కానీ మళ్ళీ ఆమె కనిపిస్తుంది. అది వొట్టి భ్రాంతి అని. ఆ శబ్దం తన

తలుపుది కాదని, ఎవ్వరూ రాలేదని!

క్షణక్షణానికీ ఆ చప్పుడు పెరిగిపోతోంది. ఆ శబ్దంతోబాటూ "పావలీనా బాయ్, పావలీనా బాయ్" అని గొంతుక వినబడుతోంది. ఎవరో ఎంతో ఆతృతగా, హడావిడిగా అరుస్తున్నారు. లోతుబావిలోనుంచి అరుస్తున్నట్లు ధ్వని మళ్ళీ మళ్ళీ చెవులకి తగులుతోంది. 'పావలీన్' మెల్లిగా తెలివితెచ్చుకుని నిద్రలోంచి లేస్తుంది. "ఆ( ఆ(" అంటూ చీకట్లో తడుముకుంటూ తలుపు దగ్గరకి వస్తుంది.

"ఎవర్రా? ఎవరు తలుపు కొడుతున్నారూ?"

"నేనూ, వాడలో వుంటున్న గణపతిగారి విఠల్ని. 'పావలీనా బాయ్' తొరగా తలుపు తియ్యి. మా ఆవిడకి పురుటినొప్పులు వస్తున్నాయి. కాస్త త్వరగా తలుపుతెరు."

"కాదు విఠల్, నేను రాను. నా వొంట్లో ఏం బాగులేదు. నిజంగానే చెబుతున్నా. నేను రాను."

"అలా అనకమ్మా, పావలీనా బాయ్. నీ కాళ్ళకి దండం పెడతా. పెద్ద ఉపకారం చేసిందానవవుతావు. తప్పకుండా రావాలమ్మా."

"నేను చెప్పాను కదూ, రానని."

"కానీ పావలీనా బాయ్, నువ్వే మాకు దిక్కు. నువ్వు రాకపోతే నా పెళ్ళాం ప్రాణాలు దక్కవు. నా పిల్లలు అనాధలైపోతారు."

"-కానీ విఠల్...?"

"పావలీనా బాయ్ .. పావలీనా బాయ్..."

'పావలీన్' దృఢనిశ్చయం మెల్లిమెల్లిగా వదులై నీళ్ళుకారిపోయింది. క్షణంసేపు ఆలోచిస్తూ నిలుచుంది. ఆమెకనిపిస్తుంది. ఆమెలోని వైద్యవృత్తి యిప్పుడు ఆమె ఆధీనంలో లేదు. ఆ వృత్తికి తను యజమానురాలు కాదు; కేవలం బానిస అని.

ఆమె అలాగే చీకట్లో తడుముకుంటూ తడుముకుంటూ అగ్గిపెట్టె వెతికి దీపం వెలిగిస్తుంది. వెళ్ళి తలుపు తెరుస్తుంది. గుమ్మం దగ్గర విఠల్ నిలుచునున్నాడు. బయట ఎంతో చలిగా, మంచుగా వున్నా అతను చమట్లు కక్కుతున్నాడు. 'పావలీన్'ని తనతోబాటు రమ్మనమని మళ్ళీ మళ్ళీ అర్థిస్తాడు. ప్రాధేయపడ్తాడు. కాళ్ళకి మ్రొక్కుతాడు.

'పావలీన్' చల్లటి మనస్సుతో, శాంతచిత్తంతో వెనక్కి తిరుగుతుంది. గూట్లోని

అల్మరాలో వుంచిన తన వైద్యపు బ్యాగు (తోలుసంచీ) తీసి, అందులో మందులన్నీ పరీక్షిస్తుంది. ఒకచేతిలో లాంతరు, మరోచేతిలో ఆ సంచీ తీసుకుని యింటి బయటకి అడుగు వేస్తుంది.

'పావలీన్' త్వరత్వరగా నడుస్తూ, చకచకా అడుగులు వేస్తోంది. 'విఠల్'కి ఆమె వేగం అందుకోవడానికి మధ్య మధ్య పరుగులెత్తవలసి వస్తోంది.

ఆమె చేతిలోని లాంతరు గాలి తాకిడికి చెదురు బెదురుగా వెలిగినా, వెంటనే తమాయించుకుని సరయిన జ్యోతిలా వెలిగి ఆమెకి దారి చూపిస్తోంది. ఆమె తన గమ్యానికి తిన్నగా నడుస్తోంది.



## 21

# దేవుడా కాపాడు!

**- శశాంక్ సీతారాం**

స్కూలు ముందునుంచి రోజూ ఈ సమయంలో బజారుకి వెళ్ళే 'సదూమాం', క్లాసులో కూర్చున్న 'మహేష్'కి కనిపించాడు. అతన్ని చూడగానే 'మహేష్' అంచనా వేసాడు, కొద్దిసేపట్లో స్కూలు అయిపోతుందని. ఇంతలోనే టీచరమ్మ ఆ రోజుకి పాఠాలు ముగించి కుర్చీమీద కూర్చుంది. కళ్ళజోడు తీసి మేజాబల్లమీద పెట్టి కళ్లు నలుపుతూ కూర్చుంది. 'మహేష్'కి మొదటి సంకేతం దొరికింది. ఇప్పుడు ఈ దృశ్యంతో ఖరారయింది. ఇంకాసేపట్లో గంట కొట్టాలి. అతను తన పలకా, పుస్తకాలూ బ్యాగులో సర్దుకున్నాడు. ఆ బ్యాగు (సంచీ) భుజానికి వేసుకుని ఒక్కొక్క బల్లమీదా అడుగులేస్తూ, గెంతుతూ కిటికీ తలుపులు మూయడానికి వెళ్ళాడు. తలుపులపై గొళ్ళం వేసాడు. మధ్య గొళ్ళం వేసాడు. తలుపులన్నీ ఒక్కొక్కటే మూసాడు.

"మహేష్, నువ్వు నీ బెంచీమీద కూర్చోముందు" వెనకనుంచి టీచరమ్మ కేకేసింది.

"టైమవలేదా టీచర్?"

"లేదు. ఇంకాస్త సమయముంది."

"'సదూమాం' బజారుకి వెళ్తూ అగుపించాడు."

"వెళ్ళనియ్యి. నువ్వు ముందువచ్చి నీ జాగాలో కూర్చో చూద్దాం."

తను చెప్పినంతమాత్రాన వాడు వచ్చి కూర్చోడు. ఈ సంగతి టీచరమ్మకి తెలుసు. వాడు తనకి తోచిందే చేస్తాడు. తను కొట్టడానికని వెళ్తే తనకి అందకుండా పరుగెత్తుతాడూ, అని ఆమె అనుభవంతో తెలుసుకుంది. అందువల్ల టీచరమ్మ 'మహేష్' కుప్పిగంతులు చూస్తూ వూరికే కూర్చుంది. బెంచీలమీద గెంతుతూ, గెంతుతూ వెళ్ళి క్లాసురూము నాలుగు ప్రక్కలా వున్న తలుపులూ 'మహేష్'

మూసేసాడు. మూలనుంచిన స్కూలుగంట, మీద శబ్దం రావడానికి కొట్టే చిన్న గూటం చేతిలో పట్టుకుని టీచరమ్మ దగ్గరకి వచ్చి నిలబడ్డాడు. ఆమె చేతిలోని గడియారాన్ని దగ్గరగా వెళ్ళి పరిశీలించాడు.

"గంట కొట్టనా టీచర్?"

"ఇంకా అయిదు నిమిషాలు వుంది."

వాడు పరుగు పరుగున బయట గంట వ్రేళ్ళాడుతున్నచోటుకి వెళ్ళాడు. గంట కొట్టడానికి తయారుగా, చేతిలో గూటంతో నిలబడ్డాడు.

"టైమవగానే చెప్పండి టీచర్."

"నువ్వు లోపలికి రా. నాకు నోటీసు చదివే పని వుంది. ఆ తరువాతే గంట."

"ఏం నోటీసు టీచర్?"

మర్నాడు ఉగాది పండుగ. స్కూలుకి శెలవు. ఆ విషయం నోటీసు.

టీచరమ్మ గబగబా నోటీసు చదివింది.

"నడు. వెళ్ళి గంటకొట్టు" అని మహేష్‌కి పురమాయించింది.

వాడు వెళ్ళి గంటకొట్టాడు. కానీ ఆ గంటలో రోజూలాగ గాలివాటంలో ఉషారుగా గెంతుతూ పోయే ఆవుపిల్ల చిలిపిదనం లేదు. చప్పగా, బోసిగా వుంది.

దొలచిన వుట్టలోంచి చీమలు బయటకొచ్చినట్లు పిల్లలందరూ స్కూలులోంచి పరుగు పరుగున బైటపడ్డారు. 'మహేష్' మాత్రం వెనకనుండి పోయాడు - నిరుత్సాహంగా.

"టీచర్! రేపు మనకే సెలవా? అందరికీనా?"

"అందరికీ సెలవు. ఎందుకురా?"

"మానాన్నకి కూడా సెలవుంటుందా?"

'మహేష్' ఉద్వేగంతో, దుఃఖం దిగమింగుతూ అడిగాడు.

'మహేష్' తండ్రి 'మడ్‌గావ్' ('గోవా'లో ఒక ముఖ్య పట్టణం)లో ఒక స్కూలులో చౌకీదారుగా ఉద్యోగం చేస్తున్నాడు. ప్రతి సెలవురోజూ మాత్రం (దూరంకావడంవల్ల) యింటికి వస్తాడు. టీచరమ్మకి ఈ సంగతి తెలుసు.

తన తండ్రికి కూడా మర్నాడు సెలవనీ, ఈరోజు రాత్రి యింటికి వస్తాడనీ తెలిసిన 'మహేష్' గుండెల్లో రాయిపడింది. కడుపులో ఐసు (మంచు) గడ్డలు

వేసినట్లు వొణుకుడు ప్రారంభమయింది. 'మహేష్' బరువుగా అడుగులువేస్తూ స్కూలు మెట్లు దిగసాగాడు.

రోజూ బడి మూసివేసే సమయంలో, ఎంతో ఉషారుగా, ఉత్సాహంతో తలుపులు మూసి, ముఖద్వారానికి తాళంవేసేవరకూ ఎలాగో ఓపికపట్టి, గెంతులేస్తూ స్కూలు బయటకి పరిగెత్తే 'మహేష్' ఈవేళ యిలా నిర్జీవంగా, నిరుత్సాహంగా ఎందుకున్నాడు? తలుపులకి తాళం వేస్తూ టీచరమ్మ వెనక్కి చూసింది. ఈ విచిత్ర ప్రవర్తన యివాల్టిదేనని కాదు. బడికి సెలవిచ్చే ముందురోజు, ఎప్పుడూ ఇలాగే నిర్జీవంగా నీళ్ళుకారిపోతాడు. ఎప్పుడూ టీచరమ్మ యిది గమనించినా దానిగురించి ఆలోచించలేదు. ఈ రోజు మాత్రం ఈ విడ్డూరం ఆమె మనస్సులో నాటుకుంది.

ఇప్పుడేం చేయాలో 'మహేష్'కి అగమ్యగోచరం అయింది. ఇంటికి తిరిగివెళ్ళడానికి మనస్సు వొప్పుకోవడంలేదు.

'ప్రతాప్ మావయ్య' అప్పుడప్పుడు బస్సులో కలుస్తాడు. ఈవేళ అగుపిస్తే బాగుంటుంది. 'మావ' కనిపిస్తే ఎంచక్కా వాళ్ళ యింటికి వెళ్తాను. అలా అనుకుంటూ బజారుదోవన నడిచాడు.

ఆ వూరు బజారు కూడా ఊరిలాగే చాలా చిన్నది. మొత్తం ఏడెనిమిది దుకాణాలున్నాయి. అవసర వస్తువులు మాత్రం అమ్మేవి. అక్కడే ఒక దేవుడి గుడి.

'మహేష్' దేవుడి గుడికి వచ్చి అరుగుమీద చతికిలబడ్డాడు. ఆ గుడికి ఆనుకునే బస్సులు ఆగే స్టాపు.

ఎంతసేపు ఎదురుచూసినా బస్సు రాలేదు.

వాడు లేచాడు. దుకాణాలముందు పడేసున్న కాగితాలూ, సిగరెట్ల ఖాళీప్యాకట్లు ఏరాడు. సిగరెట్ ప్యాకెట్ల లోపల సిగరెట్లు చుట్టివుండే వెండి, బంగారు రంగుల రేకు (ఫాయిల్) కాగితాలు జాగ్రత్తగా తీసి పుస్తకాల మధ్య పెట్టుకొని బ్యాగులో దాచుకున్నాడు. అందులో ముందే అలాంటివి ఏడున్నాయి. ఈ నాలుగూ కలిపితే మొత్తం పదకొండవుతాయని వ్రేళ్ళలెక్కపెట్టి తెలుసుకున్నాడు.

వాడు తిరిగి వచ్చి గుడి అరుగుమీద కూర్చున్నాడు. ఒక్కొక్క బస్సు రాగానే ముందు ద్వారంనించి ఎక్కి, వెనక ద్వారంనించి దిగేవాడు. బస్సులోని ప్రయాణీకులలో తన 'ప్రతాప్ మావయ్య' కనబడతాడేమోనని వాడి ఆశ! అలా ఐదారు బస్సులు వచ్చి వెళ్ళిపోయాయి. 'మహేష్' చాలా నిరాశచెందాడు.

ఇప్పుడేం చేయను?

ఇడి విడిచిపెట్టి గంట దాటింది. వాడు యింటిదారి పట్టాడు. కాలినడకన.

రాక్షసులకి కొమ్ములుంటాయని అంటారు. మరి నాన్నకి లేవెందుకని? త్రాగితే నాన్న మనిషి రూపంపోయి రాక్షసరూపం వస్తుందని అంతా అంటారు. అప్పుడు నాన్న కళ్ళు ఎఱ్ఱగా, రాక్షసుడి కళ్ళల్లా కనిపిస్తాయి. ఇది నిజం.

నాన్న ఈవేళ ఇంటికి రాకపోతే బాగుంటుంది. దేవుడా కాపాడు. నాన్నకి రేపు సెలవు వుండకూడదు!

కానీ నాన్న వస్తాడని వాడి గుండెలు గాబరాగా కొట్టుకుంటున్నాయి. వాడి కళ్ళముందు మళ్ళీ మళ్ళీ నాన్న ఉగ్రరూపం కనిపిస్తోంది. ఇదే సమస్య ప్రతీ సెలవురోజూ.

రాక్షసుడు చాలా పెద్దవాడంటారు. సారాత్రాగినప్పుడు నాన్న కూడా అంత పెద్దవాడా? నాన్న నిజంగా రాక్షసుడా?

నాన్న! హఠాత్తుగా పోయిన శనివారంనాటి నాన్న ఉగ్రరూపం వాడి కళ్ళముందు ఆడింది. 'మహేష్' నిద్రపోయాడు. తలుపుమీద గట్టిగా చప్పుడు. ఎవరో దడ్‌దడ్ అని చేతుల్తో, కాళ్ళతోనూ తన్నుతున్నట్లు. ఆ శబ్దానికి 'మహేష్'కి మెలకువ వచ్చింది. తల్లి గబగబా లేచి నూనె దీపం వెలిగించింది. ఆ దీపం వెలుగులో తలుపు తెరిచింది. నాన్న కోపంతో ఆ చిమ్నీదీపం చేత్తో కొట్టాడు. అది 'మహేష్'మీదనే పడవలసింది. కొద్దిలో తప్పింది. ఆ దీపపు చిమ్నీ పడినచోట నూనె వొలికి భగభగమని మండుతోంది. నిద్రలోంచి లేచిన 'మహేష్' నిల్చున్నచోటనే వొణుకుతున్నాడు భయంతో.

''నీకు తలుపు తీయడానికి యింతసేపెందుకే?'

వాడి బాబు (నాన్న) తల్లి జడ జుత్తు చేతుల్తో పట్టుకు ఆడించాడు. తల్లి విలవిలా తన్నుకుంది, నొప్పితో. అలాగే అమ్మని నేలమీద పడేసి, ఆమె పొట్టమీద గ్రుద్దసాగాడు.

''అయ్యోదేవుడా! చచ్చాన్రా దేవుడా'' తల్లి దీనంగా ఏడుస్తోంది. అరుస్తోంది. 'మహేష్' చూడలేకపోయాడు. తండ్రి (నాన్న) గ్రుద్దులు మానలేదు.

''ఎవర్ని వుంచుకుని పక్కలో పడుకుని కులుకుతున్నావే లంజా, చెప్పు''.

నేనే అమ్మ పక్కలో పడుకున్నాను. నన్ను ప్రేమతో కౌగలించుకుని

పడుకున్నందుకా అమ్మని కొడుతున్నాడు నాన్న? నాదే తప్పు. నేను అమ్మ దగ్గర పడుకోకుండా వుండవలసింది. వాడు భయంతో వొణుకుతూ తల్లి కాళ్ళని చుట్టుకుని గట్టిగా ఏడుస్తున్నాడు. నాన్న 'మహేష్'ని కూడా తన్నాడు. మూలకి తోసేసాడు. తల్లీ, కొడుకులు బిగ్గరగా ఏడవసాగారు.

పక్కింటివాళ్ళు కేకలూ, అరుపులూ విని పరిగెత్తుకొచ్చారు.

నాన్నని వాళ్ళు బలవంతాన పట్టుకుపోయారు. నాన్న కళ్ళు రాక్షసుడి కళ్ళల్లా వుండి, రాక్షసిబొగ్గులా కాలుతున్నాయి.

అమ్మ చీర రక్తంతో ముద్దయింది. ఎక్కడ దెబ్బలు తగిలి రక్తం వస్తోందో తెలియడంలేదు.

మరో రాత్రి యిలా జరిగింది.

నాన్న చేతిలో చాపలు కోసే పెద్ద కత్తి వుంది. నాన్న చేతిలో కత్తి తీసుకోగానే అమ్మ భయంతో బయటకి పరిగెత్తింది. నాన్న 'మహేష్'ని ఒక చేత్తో గట్టిగా పట్టుకున్నాడు. 'మహేష్' చెప్పలేని భయంతో వొణుకుతున్నాడు.

"ఇంట్లోకి రాముందు; లేకపోతే వీడి గొంతుక కోసేస్తాను తెలిసిందా?"

నాన్న చేతిలోని కత్తిని యిటూ, అటూ త్రిప్పుతూ అరిచాడు.

అమ్మ చికట్లో దాక్కొని వుంది.

"రా తల్లీ రా!"

నాన్న 'మహేష్' మెడకి దగ్గరగా కత్తి వుంచి బెదిరించాడు.

"పిలు, అమ్మని పిలు. లేకపోతే మెడని కోసేస్తాను."

'మహేష్' కళ్ళు భయంతో, విభ్రాంతితో వాటీలంత అయి చక్రాల్లా తిరుగుతున్నాయి.

తల్లి తప్పనిసరై యింట్లోకి ప్రవేశించింది.

ఆమె లోపలికి రావడం గమనిస్తూనే నాన్న చేతిలోని కత్తి ఆమె మీద విసిరాడు. అమ్మ భుజంమీద పడింది. భుజం రక్తమయం అయింది. 'మహేష్' గట్టిగా కేకవేసి ఏడవసాగాడు.

నాన్న మళ్ళీ కత్తిపట్టుకుని అమ్మమీదకి వెళ్తున్నాడు, త్వరత్వరగా.

'మహేష్' తండ్రి చెయ్యికి అడ్డంవచ్చి ఆ చెయ్యిని గట్టిగా కొరికాడు.

అప్పుడే ఇరుగు, పొరుగువాళ్ళు కలగజేసుకోవడం వలన 'మహేష్', అతని

తల్లీ బతికిపోయారు. లేకపోతే ఏం జరిగేదో దేవుడికే తెలుసు.

ఇలా ఒక్కొక్క సంఘటనా గుర్తుకొచ్చి కడుపులో దేవుతోంది. గుండెలు పిండుతోంది. బుఱ్ఱ బ్రద్దలుకొడుతోంది.

ఎంత ప్రయత్నించినా మరచిపోలేని సంఘటనలు యివి.

తనవీ, అమ్మవీ పండగకి కొన్న క్రొత్త బట్టలు మంటచేసి కాల్చేసిన ఘట్టం! మావ తెచ్చిచ్చిన కొత్త రేడియో నేలకేసి కొట్టి ముక్కలుచేసిన అకార్యం!

జ్ఞాపకాలే జ్ఞాపకాలు.

అతి శీతలమైన భయం! పొట్టకోసేసి, ఎముకలు నమిలే భయం!

'మహేష్' తన ఆలోచనల్లో తను మునిగి, అడుగులు నెమ్మదిగా వేస్తూ నడుస్తున్నాడు.

మూల ఒక కొండ దగ్గర అతగాడి క్లాసులోని స్కూలు పిల్లలు యిద్దరు ముగ్గురు మావిడిచెట్టుమీద దండిగా పండిన పళ్ళు రాలగొట్టడానికి రాళ్ళు విసురుతున్నారు. చెట్టుమీద మావిడికాయలు గుత్తులు గుత్తులుగా కనిపిస్తున్నాయి. వెనక్కి నడుంవంచి గురిచూసి వాళ్ళు రాళ్ళు విసురుతున్నారు. రాళ్ళు పళ్ళకి తగులుతున్నా అవి క్రిందకి రాలడంలేదు. ఊరికే అటూ యిటూ కదులుతున్నాయి. భుజాలు నొప్పిపెడుతున్నాయి. పళ్ళగుత్తులు పకపకా నవ్వుతున్నట్లు వూగుతూ వెక్కిరిస్తున్నాయి. సరే వదిలేద్దామా అంటే వాళ్ళ మనస్సు వొప్పుకోవడంలేదు. ఇంతలో వాళ్ళకి 'మహేష్' అగుపించాడు.

"మ...హే...ష్..." గట్టిగా,

"మ...హే...ష్..." మరీ గట్టిగా అరిచారు.

"చెవిటిమాలోకంరా వీడు."

"ఒరేయ్ చెవిటోడా! మ...హే...ష్"

'మహేష్' వాళ్ళని చూసాడు.

"ఇలా పైకిరా. మామిడిపళ్ళు బాగా పండాయి."

వాడు పరుగు పరుగున కొండ ఎక్కాడు. ఆ మావిడిపళ్ళు దండిగా వున్న చెట్లుని చూసి ఉప్పొంగాడు. చెట్లు ఎక్కాలన్నా, క్రిందినుండి చెట్లమీదికి పళ్ళకోసం రాళ్ళు రువ్వాలన్నా 'మహేష్'కి చాలా సరదా. 'మహేష్' గబగబా రాళ్ళు ఏరి తెచ్చి చెట్టుమీదికి ఒకటి తరువాత మరొకటీ, దారగా విసిరాడు గురిచూసి. ఐదారు పళ్ళు

కిందపడ్డాయి.

ఆ పళ్ళు సంతోషంగా తింటూ వాళ్ళు కొండ దిగసాగారు.

ఆ ప్రక్కనే వున్న మరోగుట్టమీద మంటతోకూడిన పెద్ద పొగ పైకి ఆకాశంలో కలిసిపోవడం చూసాడు.

"ఎంత దట్టంగా వుందో ఆ పొగ చూసారా?"

"ఆఁ అదా? అశోక్ నాయనమ్మని దహనం చేస్తున్నారు.

"దహనం ఎందుకు చేస్తారూ?"

"నిన్న చనిపోయింది. ఈవేళ అశోక్ స్కూలుకి రాలేదు చూడు."

"అవును. చచ్చినవాళ్ళని నిప్పుల్లో కాలుస్తారు. పెద్ద మంట వేస్తారు. మా బాబయ్యని అలాగే కాల్చారు."

"వాళ్ళకి నొప్పి వేయదా కాలిస్తే?"

"చచ్చినవాళ్ళకి నొప్పేమిటీ?"

"నిప్పుల్లో ఎందుకు కాలుస్తారు?"

"వాళ్ళు దేవుడిదగ్గరకి వెళ్ళవద్దూ? కాల్చడం వలన వాళ్ళు దేవుడి దగ్గరకి వెళ్తారు."

"పొగ ఆకాశం మీదికి పోతుంది చూడు, ఆ పొగతోనే వాళ్ళూ ఆకాశం మీదికి దేవుడి దగ్గరకి వెళ్తారు."

"అంటే ఈ పొగలోంచే అశోక్ నాయనమ్మ ఆకాశం మీదికి పోతుందా?"

"అవును. అదిగదిగో చూడు. వెళ్తోంది."

"ఓ... బలేవాడివిరా! ఆకాశం మీదకి వెళ్తూ కనిపిస్తోందా? వీడికి పిచ్చెక్కింది కాబోలు."

"అశోక్ నాయనమ్మ ఎలా చనిపోయిందీ?"

"ఆమెని దేవుడు పిలిచాడు."

"మరి ఆమె ఎప్పుడు వస్తుందీ?"

"ఇప్పుడింక తిరిగి రాదు."

"ఎప్పుడూ రాదా."

"రాదు."

వాళ్ళు కొండ దిగి రోడ్డుమీదకి వచ్చారు.

చచ్చినవాళ్ళు మళ్ళీ యింటికి తిరగిరారు. మా తాత పోయాక మళ్ళీ వచ్చారా? ఎంతోకాలం అయింది.

నాన్న కూడా పోతే? నాన్న మళ్ళీ యింటి ఛాయలకి రాలేడు. దేవుడా కాపాడు. నాన్నని నీ దగ్గరకి పిలిచి తీసుకెళ్ళు ... అప్పుడు నాన్న మళ్ళీ తిరిగి రాడు. నాకూ, అమ్మకీ దెబ్బలు, తిట్లూ తప్పుతాయి.

'మహేష్' నడుస్తూ, నడుస్తూ దేవుణ్ణి ప్రార్థిస్తున్నాడు. 'దేవుడా కాపాడు దేవుడా కాపాడు' అని జపం చేస్తున్నాడు.

అమ్మ రోజూ దేవుడికి పూజ చేస్తుంది. బహుసా అందుకే కాబోలు. రేపు నేను కూడా దేవుడికి పూజ చేస్తాను. ఎన్నో పూలు ఏరి తెస్తాను పూజ చేయడానికి.

"ఓ దేవీ శిశర్మా ... ఓ దేవీ శిశర్మా భృ ... భృ ... భృ ... దారిలో.

"జ్వరం, జలుబూ తగ్గించి నయం చెయ్యి. ఊళ్ళో రోగాలు నయంచెయ్యి. అందరూ ఆరోగ్యంగా హాయిగా బ్రతికేలా చెయ్యి."

ఆ దేవుడమ్మ మొగుడు నల్లని పాషాణంలా వున్నాడు. వొళ్ళంతా కుంకుమరేఖలు. కళ్ళు ఎఱ్ఱ చింతనిప్పులు. చేతిలో పెద్ద కొరడా బెత్తం (హంటర్). ఆ తోలు బెత్తాన్ని గర్ర్ గర్ర్‌మని గాలిలో తిప్పి జఫ్ మని తన వీపుమీద కొట్టుకుంటున్నాడు.

ఫటక్ ... ఫటక్ ... ఫట్!

'మహేష్' గుండెలు అదిరాయి.

నాన్న అమ్మని బెల్టుతో కొడుతున్నప్పుడు యిలాగే చప్పుడవుతుంది.

"ఓ దేవీ రోగాలన్నీ నయంచెయ్యి. జ్వరం, జలుబూ నయంచెయ్యి..." ఆలూ, మగలూ ఏకకంఠంతో అలా ఏదో ఏదో అంటున్నారు. పాటలా రాగాలు తీస్తూ. వాళ్ళు చెబుతున్నది 'మహేష్'కి అంతగా అర్థమవడంలేదు.

ఇక పెద్ద యిత్తడి పెట్టెలో దేవుడి తల మాత్రం వున్న పళ్ళెంలో చుట్టూ కుంకుం, పసుపూ, విభూదీ, పువ్వులూ వున్నాయి. జనం పెద్దలూ, చిన్నపిల్లలూ, స్త్రీలూ జమ అయ్యారు. చాటలలో మిరపకాయలూ, కొబ్బరికాయలూ, వొక్కలూ, ఉప్పు, బియ్యం, మసాలా దినుసులూ వగైరా దేవుడికి అర్పిస్తున్నారు. కొందరు చిల్లర డబ్బులు సమర్పిస్తున్నారు.

'మహేష్' చూస్తూ నిలుచున్నాడు.

'మహేష్' వొంగి, కుతూహలంగా దేవుడి పెట్టెలోకి చూసాడు. లోపల ఏవేవో కనిపించాయి. వెండి తొడుగుతో వున్న చెయ్యి, కత్తి, కత్తెర, ఒక చిన్న ఉయ్యాల, మధ్యన కుంకుమతో గంధంతో అలంకరించిన దేవుడి రూపం పెద్ద పెద్ద కళ్ళతో వున్నది అగుపించింది.

'మహేష్' దేవుడికి నమస్కరించాడు.

"దేవుడా నువ్వే నాకు దిక్కు. నన్ను కరుణించి కాపాడు. ఏదైనా చెయ్యి. నాన్న యింటికి రాకుండా చూడు. కావాలంటే నీ దగ్గరకే పిలిపించుకో. ఎప్పుడూ రాకుండా చూడు. నీకు నేను మామిడిపండు యిస్తాను."

'మహేష్' తన పుస్తకాల సంచీలో జాగ్రత్తగా దాచి వుంచిన మామిడిపండు తీసాడు.

దేవుడికి నేను ఆ పండు యివ్వవచ్చునా? జనం ఏవేవో వేరే వస్తువులు యిస్తున్నారు. కొందరు డబ్బు లిస్తున్నారు. నేనూ అవే యివ్వాలి కాబోలు. ఆ పండు యిచ్చాక కూడా దేవుడు నా పని చెయ్యకపోతేనో?

"నువ్వు రేపు మా యింటికి రా."

దేవుడమ్మ వాడి మాటలు వినినట్టు తోచదు. 'మహేష్' వొంగి, మరోసారి ఆమెతో అన్నాడు. ఆమె సరేనని తలూపింది.

దేవుడమ్మ పిల్లవాడు 'మహేష్' చేతిలో వున్న మామిడిపండుని ఆశతో చూస్తున్నాడు. 'మహేష్'కి కోపం వచ్చింది. ఆ పండు దేవుడి కోసం. అయితే వెంటనే అమ్మ మాటలు గుర్తుకొచ్చాయి. "దేవుడు ఏ రూపంలోనైనా అడుగుతాడు."

దేవుడు ఈ రూపంలో నన్ను అడుగుతున్నాడేమో!

తన చేతిలో వున్న పండుని ఆ పిల్లాడికి యిచ్చాడు.

'మహేష్'కి యిప్పుడు రూఢీ అయింది. దేవుడు తనని తప్పక కరుణిస్తాడని - తన కోరిక నెరవేరుస్తాడని.

నాన్నని తనదగ్గరకి రప్పిస్తాడని.

'మహేష్' గెంతులేస్తూ, హుషారుగా యింటిదారి పట్టాడు. సమీపంలో యింటిని చూసి ఆశ్చర్యంతో నిర్ఘాంతపోయాడు.

తన యింటిముందు అంతమంది జనం ఎందుకు పోగయ్యారు? ఏమయి వుంటుందీ? రోడ్డుమీద జనం. ఇంటిదగ్గర జనం. ఎన్నో మోటార్ సైకిళ్ళు కూడా

ఆగాయి.

ఏవో ఏడుపులు వినబడ్డాయి. అమ్మకేమీ అవలేదుకదూ? నాన్న యింటికి వచ్చాడు కాబోలు. అమ్మని కొట్టాడా? ఎంతమంది జనం!

"అమ్మా!"

గట్టిగా అరుస్తూ ఆవేశంతో 'మహేష్' యింట్లోకి తోసుకెళ్ళాడు.

ఇంటా, బయటా జనం. అమ్మ ఏదీ?

"అమ్మా!"

బెదిరిపోయి, గాభరాగా మళ్ళీ అరిచాడు. చుట్టూ తల్లికోసం కళ్ళతో వెతుకుతున్నాడు.

"అమ్మా! ... అ...మ్మా..."

అమ్మ జవాబులేదు. ఎక్కడా కనబడలేదు.

తెల్లబట్ట కప్పి నేలమీద ఏదో చుట్టబెట్టి వుంది.

ఇదేమిటీ? అతనెవరూ? అమ్మ ఏదీ?

ప్రశ్నలు. ప్రశ్నలు.

"అ...మ్మా..."

ఇంతలో 'మహేష్'కి అమ్మ కనిపించింది. అతడి తల్లి చుట్టూ ఎంతోమంది స్త్రీలు గుంపుగా కూర్చుని వున్నారు. 'మహేష్' వాళ్ళ గుంపులోకి వెళ్ళి ఒక స్త్రీ వొళ్ళో కూర్చుని తల్లిని స్పృశించాడు. తల్లి వాడిని చూసి మరింత ఏడవసాగింది. మళ్ళీ మళ్ళీ గట్టిగా ఏడుస్తోంది. అమ్మ కళ్ళు బాగా ఎఱ్ఱబడ్డాయి.

నాన్న అంత కొట్టాడా అమ్మనీ?

'మహేష్' తల్లి గడ్డాన్ని మళ్ళీ మళ్ళీ తనవైపు త్రిప్పుకుంటున్నాడు. ఆమె వాడిని చూసి మరింత దుఃఖంతో కృంగిపోతోంది. అమ్మ ఏడుపుచూసి 'మహేష్'కు కూడా దుఃఖం వచ్చింది. వాడూ ఏడవసాగాడు తల్లిని కౌగలించుకుని వెక్కివెక్కి ఏడ్చాడు.

"అమ్మా నాన్న వచ్చాడా?"

ఏడుస్తూనే 'మహేష్' తల్లినడిగాడు.

ఆమె ఏడుపు వేగం మరింత పెరిగింది. ఆమె వెక్కిళ్ళు జలపాతంలా దుఃఖంతో మిళితమై వస్తున్నాయి. 'మహేష్' తను అలా అడగడం పెద్ద తప్పయినట్లు

తెలిసింది. వాడు భయపడ్డాడు. బెదిరిపోయాడు.

అమ్మ పక్కనే వోదారుస్తూ కూర్చున్న ఒక పెద్దావిడ వాణ్ణి దగ్గరికి తీసుకుని కౌగలించుకొంది.

"బాబూ, ఏడవకమ్మా! నాన్న యింకలేరు. మనని విడిచి వెళ్ళిపోయాడు. దేవుడు తీసుకుపోయాడు త్వరగా. కళ్ళు తుడుచుకో."

'మహేష్' నిజంగానే కళ్ళు తుడుచుకున్నాడు. ఆనందపు ఝల్లు వాడి శరీరంమీద నుంచి ప్రాకింది.

నాన్నని దేవుడు పిలిపించి తీసుకెళ్ళాడా? ఇంత త్వరగా దేవుడు కరుణించాడా? నాన్న మరి ఎక్కడున్నాడు?

వాడికి జ్ఞాపకం వచ్చింది. తన తాతని దేవుడు యిలాగే పిలిపించినప్పుడు, తాత శరీరంమీద తెల్లబట్ట కప్పి, అతనిని పడుకోబెట్టారు. తల పక్క దీపంబుడ్డి వెలిగించి వుంచారు. ఇప్పుడు ఆ తెల్లబట్ట క్రింద పడుకోబెట్టింది నాన్ననేనా?

'మహేష్' కళ్ళు ఆ నేలమీద పరచిన తెల్లబట్ట మీద పడ్డాయి. మొహం కొద్దిగా కనిపిస్తోంది. 'మహేష్' కళ్ళు మిటకరించి, సూక్ష్మంగా చూస్తున్నాడు.

"పాపం ఎలా చూస్తున్నాడో చూడు. ఎంతైనా తండ్రికదా!"

"పాపం! పసివాడు. ఎలా అర్థం చేసుకొంటాడనీ? వద్దు తల్లీ ఈ బాధ, పాపం జాలేస్తోంది."

"దగ్గరకి తీసుకెళ్ళి చూపించండి. బాగా చూడనివ్వండి. మళ్ళీ చూడ్డానికి వీలుంటుందా?"

ఒక స్త్రీ 'మహేష్'ని ఎత్తుకుని, శవం దగ్గరకి తీసుకెళ్ళింది.

చుట్టూ జనం ఘొల్లుమని ఏడవసాగారు. వాళ్ళ ఎక్కిళ్ళతో, దుఃఖంతో భూమి దద్దరిల్లింది.

'మహేష్' కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యంగా, విడ్డూరంగా చూస్తున్నాడు.

నాన్నే! నిజంగా నాన్నే!

అంటే నాన్న నిజంగానే దేవుడి దగ్గరకి పోయాడా?

'మహేష్'కి నమ్మకం కలగలేదు. తండ్రి పడుకున్నట్లు వున్నాడు. హఠాత్తుగా కళ్ళు తెరుస్తాడేమోనని భయం కూడా వేసింది.

తాత దేవుడి దగ్గరకి పోయినప్పుడు మా(వ, పెత్తండ్రి, బాబయ్య, అత్తయ్య,

అమ్మమ్మ, నాయనమ్మా అందరూ యింటికి వచ్చారు. మరిప్పుడు ఒక్క పెత్తండ్రి మాత్రమే వచ్చాడు. దీనికి కారణం?

పెత్తండ్రి 'మహేష్'ని దగ్గరికి తీసుకున్నాడు. ప్రేమతో వొళ్ళో కూర్చోబెట్టుకుని జుత్తు నిమిరాడు.

చుట్టూ మూగిన జనం గొణుగుతున్నారు.

"మత్తుగా తాగి పడ్డాడుట."

"మోటార్ సైకిల్ ఏక్సిడెంటుట."

"ఎప్పుడూ రఫ్‌గా నడుపుతాడు. అందులో బాగా తా షు."

"ఎక్కడయిందిట?"

"మడ్‌గావ్' 'అక్యో' దగ్గర." (గోవాలో వూర్లపేర్లు) అన్న పోలీసు డిపార్టుమెంటువాడే కాబట్టి శవం యింత త్వరగా యింటికి తేగలిగారు."

"ఇంకా దగ్గర బంధువులకి కబురు వెళ్ళలేదు కదూ?"

అందరూ ఏడుపు మొహాల్తో నించున్నారు. దీపం వెలిగించి శవం తలదగ్గర పెట్టారు. తాత పోయినప్పుడు కూడా యిలాగే చేసారు. అంటే నాన్న నిజంగానే చనిపోయాడు. అంటే దేవుడు నన్నూ, అమ్మనీ కటాక్షించాడన్నమాట! ఇప్పుడు నాన్న యింటికి వచ్చే ప్రసక్తి లేదు. ఇప్పుడు నాన్న తననీ, అమ్మనీ కొడతాడనే భయం లేదు. స్కూలుకి సెలవు యిస్తే యింటికే తిన్నగా వచ్చేయవచ్చు. ప్రతాప్ మావయ్య కోసం బస్సులో వెతకనవసరం వుండదు.

'మహేష్' పెత్తండ్రి వొళ్ళోంచి విడిపించుకుని అమ్మ దగ్గరకి పరిగెత్తాడు - ఉత్సాహంతో క్రొత్త శక్తితో.

అమ్మ మొహం చీర కొంగులో దాచుకుని, నిర్విరామంగా ఏడుస్తోంది. ఏకధారగా ఏడుస్తోంది.

వాడు తల్లి మొహం మీది చెయ్యి తొలగించాడు.

"అమ్మా! అ...మ్మా!"

తన ఉత్సాహం, ఆనందం అమ్మకి కూడా యిచ్చి పంచుకోవాలని ఉవ్విళ్ళూరాడు. అమ్మకి చెప్పాలనుకొన్నాడు.

కానీ అమ్మ వాణ్ణి దగ్గరకి, వొళ్ళోకి తీసుకుని, మళ్ళీ గట్టిగా, బిగ్గరగా వెక్కివెక్కి ఏడవసాగింది.

అమ్మని చూస్తూ, చూస్తూ 'మహేష్'కి కూడా ఏడుపొచ్చింది. 

22

# సిండ్రెల్లా ప్రేమకథ

**- జయంతీ నాయక్**

అప్పుడే పగటి క్లాసులు అయిపోయాయి. పిల్లలు గుంపులు గుంపులుగా స్కూలు రెండు తలుపుల్లోంచీ అల్లరిగా అరుస్తూ బయటకొస్తున్నారు. కొందరు అరుస్తున్నారు. కొందరు ఈలలు వేస్తున్నారు. కొందరు మొగ్గలేస్తున్నారు. కొందరు తమకే బస్సులో సీటు దొరకాలని, జతగాళ్ళని చేతుల్తో పట్టుకొని ఈడ్చుకొస్తున్నారు. మధ్యాహ్నపు క్లాసులు ఆరంభం కావడానికి ఎదురు చూస్తున్న విద్యార్థులు లైను హఠాత్తుగా వదిలేసి చేతిలోని 'వాటర్ బ్యాగ్' (మంచినీటి సీసా), పుస్తకాల సంచీ జాగ్రత్తగా చూసుకుంటూ బుద్ధిగా క్లాసు రూంలోకి వెడుతున్నారు. ఇంటికి తిరిగి వెళ్ళడం పెద్ద శిక్షగా భావించే పెద్ద విద్యార్థులు ఎంతగా విసుక్కున్నారో, తిట్టుకుని రుసరుసలాడారో లెక్కలేదు. కొందరు గట్టిగా కేకలేస్తున్నారు; కొందరు నవ్వుతున్నారు; కొందరు ఏడుస్తున్నారు. అన్నిచోట్లా కోలాహలం నిండింది.

స్కూలు వెనకపక్క గేటు (ద్వారం) దగ్గర నిల్చుని 'ఎల్సా' ఈ గుంపులు తగ్గడానికి ఎదురు చూస్తోంది. ఎండలో నిల్చున్న 'ఎల్సా'కి వేడి వలన చమటపట్టి దారలై కారుతోంది. పిల్లలు వెళ్తూ, వస్తూ చేస్తున్న అభివాదాలకి, జవాబివ్వలేకపోతోంది.

''ఖర్మకాలా! కాస్త ఆలశ్యం అయితే కొంప మునుగుతుందా? ఈ దొమ్ములాటలో పడి వెళ్ళకపోతే మనుష్యులు కారా?''

'ఎల్సా' టీచర్ల ప్రత్యేక గది (స్టాఫ్ రూం)లోకి వెళ్ళింది. అక్కడ వారి వారి తరగతులకి వెళ్ళడానికి సిద్ధంగా పన్నెండుగురు టీచర్లూ, డస్టర్లు (నల్లబల్లమీద అక్షరాలు చెరిపే ఉపక్రమణం), సుద్దలు తీసుకుని వున్నారు.

హెడ్‌మాస్టర్ నావల్‌కార్ సమయపాలన (పంక్చువాలిటీ) విషయంలో

చండశాసనుడు. క్లాసులు ప్రారంభం కావడానికి గంట మ్రోగగానే, అందరు టీచర్లూ తమ తమ క్లాసుల్లో హాజరు అవ్వాలని అతని ఆదేశం.

త్వరత్వరగా భుజంమీది పర్సు వున్న బ్యాగు తీసింది. అందులోని తాళంచెవి తీసి తన 'లాకరు' (సొరుగు) తీయసాగింది.

"ఎల్సా."

లాకర్‌లో చెయ్యిపెట్టి దస్తరు తీయబోతున్న ఎల్సా ఆగి వెనక్కి చూసింది. పగటి స్కూలులో చదువుచెప్పే, మధ్య వయస్కురాలైన టీచరు శ్రీమతి 'అజవేడో' పిలుస్తోంది.

"ఎల్సా ... 'ఫిలిప్' చాలా సీరియస్‌గా వున్నాడుట. ఆరోగ్యం పూర్తిగా చెడిపోయిందట. మరణశయ్యమీద వున్నాడు."

ఎల్సా చేతిలోని దస్టర్ క్రిందపడింది.

"...అవును. ఈవేళ ప్రొద్దున్న మా ఆయన అతన్ని చూసి వచ్చారు. ఆయనే చెప్పారు. బహుశా ఈ రాత్రితో అతడు పోవచ్చని."

"పాపం ... 'ఫిలిప్' ... నువ్వు వెళ్ళి అతన్ని ఆఖరిసారి ఎందుకు చూడవు ఎల్సా?"

మౌనంగా తెల్లబోయి చూస్తున్న ఎల్సాని 'అజవేడో' అడిగింది. ఎల్సా తడబడుతూ "నేనా? ... నేనా? ... వెళ్ళను."

"ఇంకేం మిగిలిందని వెళ్ళమంటారు 'అజవేడో'గారూ? అంతా ముగిసింది. వెళ్ళవలసిన సమయంలో వెళ్ళలేదు. ఇప్పుడు ఈ ఆఖరి క్షణంలో మూసేసిన పుస్తకం ఎందుకు తెరవమంటారు?"

ఎల్సా ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది. గుండెలోతుల్లోంచి పెద్ద బాధ కలిగింది. ఊపిరి సలపలేదు. పెద్ద రావిచెట్టుని వూడలతో పెకిలించినట్లయింది. ఆమె అలాగే దగ్గర్లో వున్న కుర్చీలో కూలబడింది.

మొదటి పీరియడ్ బెల్లు మ్రోగడంతో ఎల్సాని విడిచి మిగిలిన టీచర్లందరూ 'స్టాఫ్‌రూం' వదిలి వారి వారి క్లాసులకి వెళ్ళారు.

"నువ్వు, మరీ బాధపడి బుఱ్ఱపాడుచేసుకోకమ్మా ఎల్సా. ఆ భగవంతుడు ఎలా రాసాడో అలాగే అవుతుంది. మనం నిమిత్తమాత్రులం. బంగారం లాంటి కుఱ్ఱాడు. అతనికి యిటువంటి మృత్యువు రాకూడదు. అయినా చావడానికి ఎంత

పెద్ద వయస్సు మీరిందనీ? నలభై ఏళ్ళు నిండలేదు."

శ్రీమతి అజవేడో కళ్ళనీళ్ళు పెట్టుకుంది. అలాగే చెమ్మగిలిన కళ్ళతో ఆమె 'స్టాఫ్‌రూం' వదిలి యింటికి వెళ్ళిపోయింది.

ఫిలిప్ ఆమెవద్ద చదువుకున్న విద్యార్థులలో ముఖ్యుడు. ఆమె అభిమానాన్ని చూరగున్న తెలివైన విద్యార్థి.

ఎల్సా కళ్ళల్లో మాత్రం ఒక కంటినీటిబొట్టూ రాలేదు. నీళ్ళు లోపల్లోపలే ఇంకిపోయాయి.

ఎజవేడో వెళ్ళిన కొద్దిసేపటికి ఎల్సా లేచింది. నేలమీద పడిన డస్టర్ వంగి తీసుకుంది. నెమ్మది, నెమ్మదిగా కాళ్ళు ఈడ్చుకుంటూ 'థర్డ్-ఎ' (మూడవ తరగతి 'అ' విభాగం) క్లాసులోకి ప్రవేశించింది.

"గుడ్ ఆఫ్టర్‌నూన్ టీచర్. గుడ్ ఆఫ్టర్‌నూన్" అంటూ క్లాసు పిల్లలు ఆమెకి వందనాలు పలికారు; ఆమె అలాగే జవాబిచ్చింది. ఇది రోజూ జరిగే తతంగమే అయినా, ఈవేళ ఆమె గొంతుకలో శక్తిలోపించింది. మాటలు గళం విడిచి బయటకి రాలేదు.

నిల్చున్న పిల్లలందరినీ చేతితోనే సంజ్ఞచేసి కూర్చోమని చెబుతూ, ఎల్సా తన కుర్చీమీద కూర్చుంది.

ఎల్సా తల వేడెక్కింది. విపరీతమైన తలనొప్పి కూడా వచ్చింది. పాత జ్ఞాపకాలు గుర్తుకొస్తున్నాయి. ఫిలిప్ మరణావస్థ గురించీ, అతనితో అల్లుకున్న తన గతజీవిత స్మృతులూ ఆమెని సతమతం చేస్తున్నాయి.

టీచర్ మౌనంగా కూర్చునుండడం పిల్లలకి అనుకూలించింది. బాగా అల్లరిచేయసాగారు.

ఎల్సా హఠాత్తుగా తెలివిలోకి వచ్చి అల్లరి చేస్తున్న పిల్లలని గట్టిగా కేకేసి కోప్పడింది.

ఈవేళ ఎల్సా వాళ్ళకి ఇంగ్లీషులో ఒక కొత్త పాఠం నేర్పవలసింది. అయితే ఆమె ఈవేళ వాళ్ళ కేపాఠం చెప్పే స్థితిలో లేదు. తను ముందే సిద్ధంచేసుకుని వచ్చిన పాఠం ఆ సంబంధమైన ప్రణాళికా, రెండూ యిప్పుడు గుర్తురావడంలేదు. దాదాపు మఱచి పోయిందనే చెప్పాలి.

పిల్లలని 'కాపీరైటింగ్' చేయమని చెప్పి, కుర్చీమీద కూర్చుని కళ్ళు

మూసుకుంది. అలా 'నకలు వ్రాత' చేస్తూ, చేస్తూ, ఎవరో పోట్లాటకి దిగారు; కొందరు క్లాసులోనే యిటూ అటూ పరిగెత్తసాగారు. అయితే యింత గొడవ జరుగుతున్నా, ఎల్సా చెవులకి వినబడ్డంలేదు. ఆమె కళ్ళు మూసుకుని మరో ప్రపంచంలో వుంది.

"టీచర్, టీచర్ - మీరు బాగాలేరా టీచర్ - జ్వరంగా వుందా?" బుగ్గలమీద పడిన చల్లటి స్పర్శకి, ఎల్సా ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది. ఎదురుగా 'సర్జూ' చేతిలో నోటుబుక్కుతో నిలబడ్డాడు.

'సూరజ్' మూడవ తరగతి 'ఎ' విభాగంలో అందరికంటే అధికంగా అల్లరిచేసే విద్యార్థి. అయితే అల్లరితో సమంగా తెలివితేటలు గలవాడు. చదువులోకూడా ఫస్టే! అల్లరిపిల్లవాడే అయినా ఆ మద్రాసీ (దక్షిణ భారతం) పిల్లవాడు ఎల్సాకి చాలా యిష్టం. కానీ నిన్న మాత్రం ఎల్సా వాడికి శిక్ష విధించింది. క్లాసు పీరియడ్ పూర్తయేవరకూ గోడకుర్చీ వేసి సగం నిల్చోనేలా చేసింది.

"వాట్ ఫీలింగ్ వెల్ టీచర్?" (టీచర్, వొంట్లో బాగులేదా?) అని జాలిగా, ఆప్యాయంగా అడుగుతున్న 'సర్జూ'ని చూసి ఎల్సా గుండె కదిలింది.

సర్జూకి శిక్ష యివ్వడానికి బలమైన కారణం వుంది. నిన్న మొదటి పీరియడ్‌లో పిల్లలొక్కొక్కరినే పిలిచి ఎల్సా వాళ్ళకిచ్చిన 'హోంవర్క్' (గృహక్రియ) పరిశీలిస్తోంది. ఎప్పుడులాగే సర్జూ ఆమె చుట్టుపక్కల తచ్చాడుతున్నాడు. హఠాత్తుగా ఆమె వెనకనించి దగ్గరకొచ్చి, చేతులు బల్లమీద ఉంచి మెల్లిగా అన్నాడు.

"టీచర్."

నల్లబల్ల (Black Board) మీద వ్రాస్తున్న ఎల్సా వెనక్కి తిరిగింది.

"టీచర్ కొంకణీ భాషలో 'బియాంతూల్' అంటే అర్థమేమిటి?"

"బియాంతూల్?" ఎల్సా గొంతుక వణికింది.

"నీకెందుకూ దాని అర్థం?"

"నాకు కావాలి టీచర్. మా ఇంటిపక్క నున్నవాళ్ళు ఎవరో కనుక్కోమన్నారు."

"నాకు ... నాకు ... తెలియదు."

"నాకు తెలుసు టీచర్!"సర్జూ గట్టిగా, చిలిపిగా నవ్వాడు. నవ్వి "బియాంతూల్ అంటే పెళ్ళి అవని ఆడది - అంటే మీలాగ అన్నమాట."

సర్జూ మాటలు చెవికి సోకగానే ఎల్సా మొహం కోపంతో ఎఱ్ఱబడింది.

"టీచర్‌తో వేళాకోళమాడతావా? ... ఎన్ని గుండెలు నీకు? ... నీ తిక్క

అణుస్తాను చూడు ... వెయ్యి గోడకుర్చీ ... వెయ్యి'' (అంటూ అరుగుమీద మోకాళ్ళు మడిచి కుర్చీలో కూర్చున్నట్లు గాలిలో కూర్చోబెట్టింది - ఏ ఆధారం లేకుండా) మొత్తం పీరియడ్ అయ్యేంతవరకూ సర్జూ మోకాళ్ళు మడిచి గోడకుర్చీ వేశాడు.

★ ★ ★

''టీచర్, మీకెలాగుందీ? వొంట్లో బాగోలేదా?'' ఎల్సా మళ్ళీ ఆలోచనల్లో మునిగినట్లుండడం చూసి, సర్జూ భుజంతట్టి అడిగాడు.

'''ఏమిటీ! ఏమీ అవలేదు నాకు'' ఎల్సా నసిగింది. ఆమె యింకా ఆలోచనా తరంగాలలో లీనమైయ్యేవుంది.

''టీచర్, మీరు నిన్న చెప్పిన పాఠం వ్రాసి తీసుకొచ్చాను. సరిదిద్దరా?''

''అవును ... ఔను ... ఇక్కడకి తీసుకురా సరిచేస్తాను.''

సర్జూ చేతిలోని పుస్తకం ఎల్సా చేతిలోకి తీసుకుని, తెరిచి చదివింది.

చెమ్మగిల్లిన కళ్ళనీళ్ళు తగిలిన కళ్ళద్దాలు తేమ తగిలి, అక్షరాలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి.

"Once upon a time, there lived one beautiful giral called Cindrella..."

(అనగనగా ఒకప్పుడు ఒక అందమైన అమ్మాయి 'సింద్రెల్లా' అనే పేరుతో వుండేది.)

కథ చదువుతూ, చదువుతూ ఎల్సా మొహంమీద కవళికలు మారుతున్నాయి. వివిధ భావాలు వచ్చి, పోతున్నాయి.

కథ పూర్తిగా చదివి, పుస్తకం మూస్తూ హఠాత్తుగా అరిచింది.

''కాదు. కాదు. ఈ కథ యిలా కాదు. తప్పువ్రాశావు.''

సర్జూతోబాటు క్లాసులో పిల్లలందరూ ఆశ్చర్యచకితులయ్యారు. క్లాసంతా హఠాత్తుగా నిశ్శబ్దం అయింది. ఎక్కడా చలనం లేదు. చప్పుడు లేదు.

''తప్పు వ్రాశానా టీచర్.''

''అవునవును. పూర్తిగా తప్పు వ్రాశావు.''

''కాదు టీచర్, మీరు నిన్న చెప్పినట్లే రాశాను టీచర్. కదురా విశాల్?''

''షట్ యువర్ మౌత్! నోరు మూసుకో! నువ్వు కథ మొదట్లో సరిగ్గానే వ్రాశావు. కానీ చివర్లో నువ్వు పెద్ద తప్పుచేశావు. 'సింద్రెల్లా' అందాలుచిందే అమ్మాయి.

ఆమెకి ఒక సవతి తల్లి, యిద్దరు సవతి చెల్లెళ్ళు వున్నారు. ఇంతవరకూ నీ కథ సరిగ్గానే వుంది. ఆ తరువాత తప్పు వ్రాసావు. సిండ్రెల్లాకి ఏవిధమైన 'దేవదూత' తారసబడదు. అయితే నువ్వు వ్రాసిన ప్రకారమే అడవిలోకి వెళ్ళినప్పుడు మాత్రం రాజకుమారుడు కలుస్తాడు. అతనికి 'సిండ్రెల్లా' బాగా నచ్చుతుంది. ఆమెని పెళ్ళిచేసుకోవాలని కాంక్షిస్తాడు. నువ్వు చెప్పినట్లు ఆ రాజకుమారుడు శ్రీమంతుడు కాదు. నిజానికి చాలా సామాన్యుడు - బీదవాడు. అతనికి బర్త్‌డే (పుట్టినరోజు) వేడుక చేసుకునే ప్రసక్తే లేదు. తనతో డ్యాన్సు చేయడానికి 'సిండ్రెల్లా'ని ఆహ్వానించడు. అతను ఆమెని ఆహ్వానించింది అతని పూరి గుడిసెలోకి. అక్కడ 'సిండ్రెల్లా' చెప్పు పారేసుకోవడం, అది తీసుకుని సిపాయిలు ఊరూరా తిరగడం, ఆ చెప్పు సరిపోయే అమ్మాయికోసం వెతకడం అంతా అబద్ధం. 'సిండ్రెల్లా' సవతి తల్లి కూతుళ్ళు తమకి రాజకుమారుడితో పెళ్ళవుతుందనే ఆశతో ఆ చెప్పు తమ కాలిదేనని చెప్పడం జరగదు. అయితే తమకంటే చాలా అందంగా, ఆకర్షణీయంగా వుందనీ, తమకంటే ముందే పెళ్ళయ్యే అవకాశం వుందనే ఈర్ష్యతో మాత్రం 'సిండ్రెల్లా'ని వాళ్ళు సతాయిస్తారు అన్నది నిజం. వివిధ పద్ధతులలో 'సిండ్రెల్లా'ని సతాయిస్తూ, ససేమిరా రాజకుమారుడిని కలవకుండా చేస్తారు.

"నువ్వు వ్రాసినట్లు 'సిండ్రెల్లా'కీ, రాజకుమారుడికీ పెళ్ళి జరగదు. ఆమె సుఖంగా సంసారం చేసే ప్రసక్తే రాదు. 'సిండ్రెల్లా' కన్యగానే వుండిపోతుంది. ఒంటరి 'బియాంతూల్'గా. నలభై ఏళ్ళ వయస్సులోనే ముసలిదవుతుంది."

"ఇక ఆ రాజకుమారుడి సంగతి. 'సిండ్రెల్లా' కోసం తపిస్తూ. ఆరోగ్యం పాడై, వ్యసనాలకి బానిసవుతాడు. మద్యపానం అలవాటయి, విపరీతంగా తాగుతూ వుంటాడు. సారా ఒక్కొక్క గుటకా మింగుతూ, 'సిండ్రెల్లా', 'సిండ్రెల్లా' అని జపిస్తూ శేషజీవితం గడుపుతున్నాడు."

"కాదు టీచర్, అలాకాదు టీచర్ సిండ్రెల్లా కథ అంటే అలా కాదు టీచర్. నేను రాసిందే కరక్ట్ (సరైనది) టీచర్ - నాదగ్గర అచ్చయిన పుస్తకం కూడా వుంది. మా అమ్మ కూడా నాకు అలాగే చెప్పింది టీచర్."

"మీ అమ్మ అబద్ధం చెబుతోంది."

"తప్పు. మా అమ్మ ఎప్పుడూ అబద్ధం చెప్పదు."

"అయితే నేను అబద్ధం చెబుతున్నానా?"

'ఎల్సా'కి కట్టుతప్పింది. తనమీదే తనకి పట్టు తప్పింది. ఆమె ముక్కుపుటలు పొంగాయి. గొంతుక వొణుకుతోంది. కళ్ళు బైర్లుక్రమ్మాయి.

టీచరు ఈవేళ ఎందుకిలా విచిత్రంగా మాట్లాడుతున్నారో పిల్లలకి అగోచరంగా వుంది. అందరూ రాయడం కట్టిపెట్టి టీచర్‌కేసే వింతగా చూస్తున్నారు.

"నువ్వెవరికి చెబుతున్నావురా? నేను టీచర్నా, నువ్వా? అస్సలు కథ నాకు తెలుసా నీకా? నేను చెప్పిందే అసలు కథ. తెలిసిందా?"

"కాదు! కాదు!"

"అవును - అవునను. కథ యిలాగే అను! సింగ్రెల్లా 'బియాంతూల్'గా వుందని అను! సింగ్రెల్లా రాజకుమారుడి మృత్యుశయ్య దగ్గర వుందని అను."

"కాదు!"

"కాదా? నువ్వు అవునని అనవా?"

సర్జూ రెండు లెంపలమీదా రెండు దెబ్బలు - రెండు చెంపకాయలు 'ఠా' 'ఠా'మని బలంగా పడ్డాయి. ఆ తరువాత అలా పడుతూనే వున్నాయి దెబ్బలు.

సర్జూ ఖిన్నుడై చూస్తున్నాడు. ఏడవడం మఱచిపోయాడు. భయంతో, భీతితో అలా టీచర్ని చూస్తూ వుండిపోయాడు.

సరిగ్గా ఆ సమయంలోనే స్కూలుకి ఎదురుగా వున్న చర్చి గంటలు గణగణ మ్రోగసాగాయి.

"గణ...గణ...గణ."

సర్జూని అదేపనిగా లెంపలేస్తున్న ఎల్సా చేతులు ఆగాయి. చర్చి గంటలు చేస్తున్న 'గణగణ' ధ్వని ఆమె మెదడులో ప్రతిధ్వనించింది.

"ఇప్పటికైనా అవునను. విను ... అదిగో విను ... సింగ్రెల్లా ప్రియుడు ఆ రాజకుమారుడు మహాప్రస్థానం చేశాడు. అవిగో ఆ గంటలు అతని మరణసంకేతాలు ... విను ... విను."

ఎల్సా దబాలున క్రిందపడింది. క్లాసులో పిల్లలందరూ గల్లుమని అరిచారు.

"టీ...చ...ర్!"

గణ...గణ...గణ!

చర్చి గంటలు మ్రోగుతూనే వున్నాయి.



## 23

# కాకుల శాపం

**- తుకారాం శేట్**

పది సంవత్సరాల తరువాత అతను మొదటిసారి తన స్వంత వూరికి వచ్చాడు. ఇంటిదగ్గరకి చేరగానే సుమారు ఎనభై ఏళ్ళ ముసలివాడు (ఇంటి కాపలావాడు) అతని ఇంటి తలుపులు తాళం తీసి యిచ్చాడు. ఆ వృద్ధుడు ఆ యింటిని యిన్నాళ్ళూ చూసుకున్నాడు. ఆ ఇల్లు అతనికంటే పాతది - బహుశా అతని తండ్రి నాటిది కావచ్చు. ఆ వృద్ధుడి జుత్తు తెల్లగా దూదిపింజెల్లా నెరసిపోయింది. ఆ పాత ఇంటిని చూస్తూ, తన తండ్రి యింకా బతికివుంటే, ఎంత ముసలివాడయ్యేవాడోనని అతను ఊహించడానికి ప్రయత్నించాడు. కానీ అతని తండ్రి రూపం అస్పష్టంగా, ఆఖరిరోజులలో ఆయన అనారోగ్యం - ఒక పీడకలలా గుర్తుకొచ్చాయి. ఆ యింటి సిమెంటు సోఫామీద కూర్చున్నాక, అతనికి ఉపశమనం కలిగింది. విశ్రాంతి తీసుకున్నాడు. గట్టిగా శ్వాసపీల్చి, వదిలాడు. అప్పుడతనికి దొంతర్లుగా దగ్గు వచ్చింది. పది సంవత్సరాలు తను ఇక్కడా, అక్కడా తిరిగి తిరిగి ముసలివాడయ్యాడని అనిపించింది. ఈ కాలంలో తలకి మించిన శ్రమ వలన అతని ప్రాణం సగంపోయింది. నిజానికి అతని నలభై అయిదు సంవత్సరాల వయస్సు అంత పెద్ద వయస్సు కాదు. కానీ చూడడానికి అతను అంతకంటే ముసలివాడిగా కనిపిస్తున్నాడు. రెండు బుగ్గలూ కిందికి జారాయి. నుదుటిమీద గీతలు పడ్డాయి. జుత్తు తెలుపూ, నలుపూ, బూడిదరంగు మిశ్రమంలో వుంది. ఒకప్పుడు బలిష్టంగా కనిపించిన కాళ్ళూ చేతులూ ఎండి వాడిన కట్టెల్లా సన్నబడ్డాయి. రెండు కళ్ళూ మాత్రం మెరుస్తున్నాయి. సంచారం చేస్తూ, వివిధ ప్రదేశాలని దర్శించడంవలన కాబోలు, కళ్ళల్లో కాంతి వచ్చింది. సోఫాలో కూర్చుంటూనే, అతను నడుం అన్చి, శిరస్సు వెనక్కివొంచి విశ్రాంతి తసుకున్నాడు. చాలా రోజుల తరువాత మొదటిసారి

అతని చనిపోయిన తల్లి గుర్తుకొచ్చింది. ఆమె గర్భంలో తను వున్నంత హాయి, అనుభూతీ కలిగింది. ఇంటి ముందు సిమెంటు సోఫాలో కూర్చుని వున్న అతని రూపం మీద నిశ్చింత, నిర్భీతీ మిళితమై సురక్షితంగా వున్న భావం ప్రబలింది.

ఊరి పొలిమేరలు చేరి, గ్రామదేవత గుడిపక్కనుంచి కాలి బాటలో తన యింటికి నడిచి వస్తున్నప్పుడు అమితానందంతో హృదయం పులకించింది. ఏ వూళ్ళో తను పుట్టి, పెరిగాడో, బాల్యంలో ఆడుతూ, పాడుతూ గడిపాడో ఆ వూరి విలువ, ఆకర్షణ అతనికి యిప్పుడు తెలిసొచ్చింది. ఇంత తిరిగి, తిరిగి, ఎన్నో ప్రదేశాలు చూసినా, తనదైన వూరుకంటే ఆకర్షణ మరెక్కడా వుండదని తెలుసుకున్నాడు.ఈ నిజం ప్రత్యక్షంగా అనుభవించి ఆశ్చర్యపడ్డాడు. ఆ ఆలోచనల్లో మునిగి, కాలిబాట వెంబడి వెళ్తూ దారిలో మోకాలి లోతున్న నీళ్ళతో ప్రవహిస్తున్న పిల్లకాలవ దాటి యింటి దగ్గరకి చేరాడు. ఇల్లు పురాతన పద్ధతిలో కట్టబడింది. సిమెంటుకి బదులు, మట్టితో కట్టారు. ముందు వరండా రాళ్ళతో నిర్మించారు. గోడలు మట్టితో కట్టారు.

ఇప్పుడు ఇల్లు పాతదయింది. పూర్తిగా పాడుబడింది. ఇంటి బాగోగులు చూసేవారులేక పాడైపోయింది. అది ఎప్పుడూ మూసివుండడంవల్ల, తోటలో కొబ్బరికాయలు భద్రపరిచే గిడ్డంగిలా అనిపిస్తోంది. ఇంటి చుట్టూ తోటలో నాటిన కొబ్బరిచెట్లు కొన్ని కృశించిపోతే, కొన్ని నశించిపోయాయి. కొన్నిచోట్ల ఆకాశంలోంచి పిడుగులు పడి కొబ్బరిచెట్లు నిల్చున్నవి నిల్చున్నట్లే కాలి మసైపోయాయి. వాటి బోదెల అడుగు భాగాలు మాత్రం మిగిలాయి. పోగా తక్కిన కొబ్బరిచెట్లు ముసలివైపోయాయి. మొదటి కొబ్బరికాయలు వచ్చే చెట్టుకి కాయలు కొద్దిగా మాత్రం వస్తున్నాయి. ఊరుపీకావు, ఇంటిపీకావు అన్నట్టు జారి కిందికి పడుతున్నాయి. ఈ కల్పవృక్షాల ఫలాలు (కొబ్బరికాయలు) తింటూ హాయిగా జీవితం వెళ్ళబుచ్చవచ్చనే ఆలోచన అతనికి రాకపోలేదు. తన వ్యాసాంగం, తన చరిత్రకి సంబంధించిన సంశోధన, పరిశోధనాపి, వూరూరా, దేశ దేశాల పర్యటనల పిచ్చి పనులు కట్టిపెట్టి, శేషజీవితం ఏ చీకూచింతలూ లేకుండా స్వగ్రామంలో, స్వగృహంలో హాయిగా గడిపేయాలని అనిపించింది. అయితే ఆ ఆలోచన తాత్కాలికంగా మాత్రమే అతని మనస్సులో నిలిచింది.

అతను వరండాలోని సిమెంటు సోఫా మీద కూర్చుని వున్నాడు. సాయంత్రం

అయిపోయి చీకటిపడుతోంది. చీకటి తెరలు మెల్లిమెల్లిగా యింటి వెలుపలకి దూరుతున్నాయి. ఇంతవరకూ కాలం గడుస్తున్న ధ్యాస అతనికి లేకపోయింది. ఆ ముసలికాపలావాడు లాంతరు వెలిగించి, అతని ఇంట్లో పెట్టి వెళ్ళిపోయాడు. అప్పుడతనికి తెలిసింది - చీకటి పడిందని. అతను లేచి తను నడుంమీద వేళ్ళాడుతూ మోసుకొచ్చిన ఖాకీరంగు సంచీ విప్పాడు. అందులోని నీళ్ళ సీసా బయటకి తీసి, ఒక టార్చిలైటుని కూడా తీసి దాని సహాయంతో యింటికి దగ్గర్లోనే ప్రవహిస్తున్న పిల్లకాలువ దగ్గరికి వెళ్ళాడు. మునుపటిలాగే ఆ కాలవ రాళ్ళమధ్య ప్రవహిస్తోంది. అలా ముందుకు పోయి నదిలో కలుస్తోంది.

బండల మధ్య యిసుకలో నదినీళ్ళు యింకుతున్నాయి. ప్రవాహం మట్టిలో కలిసి పలచబడింది. ఆ కాలవ చల్లటి నీళ్ళు శుభ్రంగా వున్నాయి. వాటి మధ్య బండరాళ్ళు నిగనిగలాడుతున్నాయి. కాలప్రవాహంలో అన్నీ మారినా, నేను మాత్రం మారలేదని ఏఱు చెబుతోంది. ఆ ఏఱులో ప్రవహిస్తున్న చల్లటి నీళ్ళలో మొహం, కాళ్ళూ, చేతులూ కడుక్కొన్నాడు. శరీరం శుభ్రపడి, ఆ తాజాదనంలో మనస్సు హాయనిపించింది. తరువాత టార్చ్‌లైటు ఉజ్వల కాంతితో ఇంటిలోపలికి వెళ్ళాడు.

ఇంటి వరండా నుంచి సంచీ తీసుకుని లోపలి హాలు (చావడి)లోకి వెళ్తూవుంటే, బయట కొండమీదనుంచి గుడ్లగూబ ఏడుస్తున్న శబ్దం వినిపించింది. ఈ రాత్రి సమయంలో ఏడుస్తున్నట్లు అరిస్తే అది పెద్ద అపశకునం అని తన తల్లి చెప్పేది. అప్పుడు ఆ దుశ్శకునానికి విరుగుడుగా అమ్మ ''ఇదిగో తీసుకో'' అని ఆ గుడ్లగూబని నానాబూతులూ తిట్టేది. ఇది అతనికి జ్ఞాపకం వచ్చింది. అతను మనస్సులో ఆందోళన చెందాడు. గుడ్లగూబ ఏడుపు చాలాసేపు సాగింది. చివరికి ఆ పెద్ద పక్షి తన ఏడుపు ఆపింది. బహుశా మరోచోట తన ఏడుపు కచేరి చేయడానికి వెళ్ళిపోయివుంటుంది - అని అతను భావించాడు.

ఇంట్లో చీకటి ఆ లాంతరు కాంతితో తగ్గినట్టు లేదు. లాంతరులో వత్తిని పెద్దది చేశాడు. ఆ లాంతరులోని ఎఱ్ఱకాంతి మొహం మీదపడి ఆ మొహంమీద వివిధ భావాలు కనిపించసాగాయి. ఖాకీ సంచీలోంచి బ్రెడ్డు బయటకి తీశాడు. బ్రెడ్డు తిని, నీళ్ళు తాగాడు. తన పక్కచుట్ట గోడకి పక్కనే పరిచాడు. అతనికి మళ్ళీ వొంటరితనం అనిపించింది. నిద్రపోవడానికి ఎంత ప్రయత్నించినా కునుకుపట్టలేదు. అర్ధరాత్రి గడిచింది. నిద్ర పట్టడానికని లాంతరు ఆర్పేసాడు. వెలుగు లేకపోయినా,

అతని మనస్సులో ఆలోచనలు వేధించడం ఆగలేదు. చాలాసేపయింతరువాత కొద్దిగా కునుకు పట్టింది. కాస్త నిద్ర రాగానే పీడకలలు ప్రారంభమయ్యాయి. తను పడుకున్న ఇల్లు కూలిపోయినట్లు, గోడలూ, దూలాలూ, పెంకులూ, పెద్ద పెద్ద రాళ్ళు తన శరీరంమీద పడి తనని చిన్నాభిన్నం చేసినట్లు స్వప్నం వచ్చింది. భయంతో, ఆందోళనతో లేచికూర్చున్నాడు - కల్లోనే గట్టిగా అరిచినట్లు, బాధతో మెలికలు తిరిగినట్లూ అతనికి అనిపించింది.

అతని గొంతుకని ఎవరో నొక్కిపట్టినట్లు, మాటలు బయటకి రాక, వూపిరి సలపక బాధపడ్డాడు.

టార్చికోసం చీకట్లో తడిమి, అది దొరకగానే దానిని వేసి, తను కన్నది కలా లేక నిజమేనా అని తెలుసుకోవాలనుకున్నాడు. త్వరత్వరగా టార్చ్‌తీసి వేసి చూసాడు. టార్చ్ వెలుగుని ఇంటా, బయటా వేసాడు. ఇల్లు వున్నది వున్నట్లే వుంది. ఏమీ అవలేదు. అగ్గిపెట్టె వెలిగించి లాంతరు ముట్టించాడు. వత్తి పెద్దది చేసి మరింత కాంతి రాగానే తన తలకి దగ్గరగా వుంచాడు. చాలాసేపటివరకూ అతని గుండె దడదడలాడింది. ఇల్లు కూలిపోయినట్లు వచ్చిన పీడకల వలన అతని పాత జ్ఞాపకాలు గుర్తుకువచ్చి గొంతుక బొంగురుపోయింది. బిల్డింగు కూలి ఆ రాళ్ళల్లో చితికి, దుర్మరణం పొందిన తన భార్యా బిడ్డలు గుర్తుకువచ్చారు. గుండె పిండైపోయింది - వారా సమయంలో పడ్డ యమయాతన గుర్తుకివచ్చి. ఊహించలేని ఆ బాధ, ఆ నరకం తనకోసం కూడా ఎదురుచూస్తోందనీ, తనూ అతి త్వరలో మరణిస్తాడనీ అతనికి అనిపించింది. అతని కళ్ళముందు అతని భార్య, పిల్లలూ ఎలా హాహాకారాలు చేసారో, నిస్సహాయంగా ఆక్రందనలు చేస్తూ, రక్తం కక్కుకుంటూ, నరకయాతనతో కృశించి ప్రాణాలు విడిచారో కనిపించసాగింది.

అతను తన వూరు విడిచిపెట్టి పట్టణానికి వెళ్ళాడు. చరిత్ర లెక్చరర్‌గా చాలా సంవత్సరాలు ఒక పెద్ద కాలేజీ ఉద్యోగం చేసాడు. అతనూ, అతని భార్య, దరిమిలా వచ్చిన కొడుకూ, కూతురూ - ఈ విధంగా వారి చిన్న కుటుంబం చింతలేని కుటుంబంగా సుఖ, శాంతి సౌఖ్యాలతో వర్ధిల్లసాగింది. పట్టణంలోని పరుగుల వ్యవహారాలలో జోక్యం చేసుకోకుండా, తనూ తన ఉద్యోగం, తన సంసారం యివే ప్రపంచంగా భావించి గుట్టుగా కాలం నెట్టుకొచ్చాడు. సంసారపు తీపి సుఖంలో మునిగి, తేలుతూ తన పరిశోధన - ఇతిహాసపు చీకటి కోణాలలో అన్వేషణ -

పూర్తిగా త్యజించాడు. ప్రపంచంలోని చారిత్రక కట్టడాల అవశేషాల గురించిన అతని సంశోధన, 'ఫీల్డ్‌వర్క్' పూర్తి... మిగిలిపోయింది. అందుకు అవసరమయిన దేశ, విదేశ సంచారం చేసే వీలులేకపోయింది. క్రమేణా ఆ విషయం పట్టించుకోవడమే మానేశాడు. ఆ తరువాత ఆ పట్టణంలో కొత్తగా కట్టిన పెద్ద భవనంలో మూడవ అంతస్తులో ఒక ఫ్లాట్ (FLAT) యిల్లు తీసుకున్నాడు. టి.వి., ఫ్రిజ్ మొదలైన ఆధునిక జీవితపు సామగ్రులు, అమర్చుకొన్నాడు. ఆ సదుపాయాలతో మరింత సుఖాన్ని గడించాడు.

అంతటి ఆనందమయ జీవితానికి హఠాత్తుగా తెరపడింది. ఒక దురదృష్టపు సాయంకాలం కాలేజీలో పని పూర్తిచేసుకుని అలసి, సొలసి ఇంటికి వస్తున్నాడు, తన భార్య, పిల్లల ఆలోచనతో. ఇంటిని సమీపిస్తున్నాడు. హఠాత్తుగా పెద్ద చప్పుడయింది. అతని కళ్ళముందే అతని సర్వస్వం అయిన బిల్డింగు కూలిపోతోంది. మూడంతస్తుల భవనం మట్టికలిసింది. చావుకేకలు, రోదనలు, ఆక్రోశాలు దిక్కులుపిక్కటిల్లేలా వినిపించాయి. ఆ బిల్డింగులో నివసిస్తున్న ఎనిమిది కుటుంబాలు క్షణంలో అదృశ్యమైపోయాయి. సిమెంట్ కాంక్రిట్ దూలాలమధ్య, రాళ్ళ కుప్పల మధ్య, ఇటుక శ్రేణులమధ్య ఎన్నో టన్నుల బరువుకింద చితికి పచ్చడై విచ్చలవిడిగా మృత్యుముఖం చూసి తనువు చాలించాయి. అతని రాకకోసం ఎదురుచూస్తున్న భార్యా, బిడ్డలు ఆకస్మికమృత్యువాతకి బలి అయ్యారు. అతను పిచ్చివాడయిపోయాడు. కళ్ళముందే జరిగిన ఈ ఘోరం, అతన్ని మతిభ్రష్టుణ్ణి చేసింది.

ఆ విపత్తునించి కొందరు బ్రతికి బయటపడ్డారు. కానీ వాళ్ళు కాళ్ళూ, చేతులూ పోగొట్టుకున్నారు. సహాయ కార్యక్రమం రాత్రంతా సాగింది. రెండు రోజుల త్రవ్వకాల తరువాత అతని భార్యా, బిడ్డల మృతదేహాలు లభించాయి. కేవలం వాళ్ళు ధరించిన దుస్తులద్వారా గుర్తించాడు. వాళ్ళ శరీరాలు పచ్చడి పచ్చడైపోయాయి. ఎండిన రక్తసిక్త శరీరాలు నలుపు, నీలం రంగుల్లో వికృతం అయ్యాయి. ఆ కూలిన సౌధం అవశేషాలు చూసి అతను నిర్ఘాంతపోయి, గట్టిగా అరున్నా, ఏడున్నా, గుండెలు తొలిచే దుఃఖంతో స్పృహతప్పి కుప్పలా కూలిపోయాడు.

అతని పచ్చని సంసారం, అతని ప్రాణసమానమైన భార్యా, బిడ్డలూ ఈ

విధంగా అంతమవడంతో అతను దాదాపు పిచ్చివాడయిపోయాడు. ఎక్కడపడితే అక్కడికి పిచ్చిగా తిరగడం, తిండీ, ఆహారం, నిద్ర అన్నీ అవసరాలూ మరచిపోవడం, పరధ్యానంగా ఏదో ఆలోచనల్లో మునగడం - ఈ విధంగా కొన్ని రోజులు గడిచాయి. తన ఉద్యోగం సంగతే మరిచిపోయాడు. వాళ్ళు రమ్మనమని ఎన్ని ఉత్తరాలు వ్రాసినా, కబురు పంపినా అతని దగ్గరనుండి జవాబు రాలేదు. అతని స్నేహితులు అతనికి ఊళ్ళోనే ఒక చిన్న ఇల్లు అద్దెకి కుదిర్చారు. అందులో కొన్నాళ్ళు నివసించాడు. గదిలోనే వుండేవాడు. బయట అడుగుపెట్టేవాడు కాదు. సిగరెట్టుమీద సిగరెట్టు గొలుసులా తాగుతూ, ఆ పొగలతో మరో ప్రపంచపు కలలు కనేవాడు.

తన ప్రాణతుల్యమైన, అత్యంత ప్రియమైన భార్యా, బిడ్డల్ని ఏ ప్రమాదకరమైన సంఘటన పొట్ట బెట్టుకుందో ఆ సంఘటన గురించి ఆలోచనలు అతని గుండెలమీద ఎవరో పెద్ద బండరాయి వుంచినట్లు అతనిని బాధించాయి. సతతం వేధించాయి. బిల్డింగులోని పెద్ద పెద్ద రాళ్ళు తన సుకుమారమైన, పువ్వువంటి గుండెలమీద పడి, వాటికింద నలిగి, పచ్చడైన తన శరీరం రక్తపుముద్దగా మారిపోయింది. ఈ విధమైన ఆలోచనలతో మనస్సు పాడైపోయింది. పగలు కూడా ఆ దుర్ఘటన చిత్రం మళ్ళీ మళ్ళీ కళ్ళముందు వస్తోంది. రాత్రి నిద్ర కరువయింది. సతతం అదే చింత వేధిస్తోంది. కాస్త కునుకు పడితే చాలు, కల రావడం ఆ కలలో అవే దృశ్యాలు, అదే పీడ హాజరు - అంతే కల చెదిరిపోయి ఉలిక్కిపడి నిద్రలేచేవాడు! ఆ తరువాత నిద్ర అస్సలు పట్టేదికాదు. అందుకని ఈ పీడకలలకి విరుగుడుగా తను సగంలో వదిలిన ఇతిహాసపు పరిశోధన పునఃప్రారంభించాడు - ఆ పనిలో లీనమై ఈ విషయం మరచిపోవాలనే ఉద్దేశంతో. అతను ప్రణాళికవేసి, ఆ ప్రకారం పెట్టే బేడా సర్దుకుని ఒక ఉదయం ఆ చిన్నవూరు విడిచిపెట్టి భగ్న అవశేషాలని స్వయంగా దర్శించడానికి, తన చారిత్రక పరిశోధన పని పరిపూర్ణం చేయడానికి, దేశ విదేశీ పర్యటనలు ప్రారంభించాడు.

బోటు మహానగరం చేరుకుంటుండగా ఆ నగరం చిత్రం మంచు తెరల్లోనుంచి అస్పష్టంగా, చూచాయగా కనిపిస్తోంది. క్రమేణా దగ్గరకి చేరినకొద్దీ స్పష్టమవుతోంది. ప్రపంచ పర్యటనకి అనుకూలంగా, ఈ మహానగరం ద్వారానే ఆకాశంమీదా, సముద్రంమీదా, రైలుద్వారా, రోడ్డుద్వారా మజిలీలు చేయవచ్చు. ఈ మహానగరంలో తన పరిశోధనకి సంబంధించిన పుస్తకాలున్న పెద్ద పెద్ద

గ్రంథాలయాల్ని సందర్శించి, ఆ పుస్తకాలని కూలంకషంగా చదివి, ముఖ్య విషయాలని నోటుచేసుకుని (వ్రాసుకుని) ఆ తరువాత ఆ ఆ ప్రాంతాలని దర్శించాలని అతను ప్రణాళిక వేసుకున్నాడు. నౌకాశ్రయం (హార్బర్)లో ఓడ దిగిన తరువాత తిన్నగా, అక్కడి 'స్టడీ సెంటర్' (అభ్యాసాశ్రమం)కి వెళ్ళాడు. అక్కడ నివసించడానికి ఆ ఆశ్రమం అధికారిని తను పరిచయం చేసుకున్నాడు. తన పేరు, వచ్చిన పని వగైరా వివరాలు చెప్పాడు. అతని బస ఒక విశాలమైన సత్రంలాంటి గదిలో ఏర్పాటయింది. ఆ సత్రంలో చిన్నా పెద్దా ఎందరో వుంటున్నారు.

ఎన్నో నెలలు ఆ మహానగరంలోని వివిధ గ్రంథాలయాల్లో తనకి కావలసిన విషయాల గురించిన పుస్తకాలు అభ్యసించి, విశేషాలు సేకరించాడు. దరిమిలా అతనికి, ఆ పనిలో ఉత్సాహం సన్నగిల్లింది. ప్రపంచ దర్శనం చేసుకోవాలనే చిరకాల కాంక్ష మళ్ళీ తలెత్తింది. అయితే అతని అభ్యాసం యింకా పూర్తికాలేదు. మరికొన్ని చదవవలసిన పుస్తకాలు మిగిలిపోయాయి. అవి చదవడం అయినతరువాత, భూమిమీద ఒకప్పుడు వికసించి, అంతరించిన సంస్కృతుల (నాగరికతల) గురించి అభ్యసించాలని అతని ప్రణాళిక. అయితే అతనికి ఈ పని మధ్యలోనే విసిగెత్తి ఆపుచేసాడు. అలాగే ఆ మహానగరంలో జీవితం దుర్భరమయింది. ఆ మహానగరంలో ఆకాశమంత ఎత్తుండే ఇళ్ళు ఆకాశాన్ని చూడడమే అపురూపం చేసాయి. అక్కడి జనసమ్మర్దం, గడబిడ జీవితం అతన్ని వుక్కిరిబిక్కిరి చేసాయి. కానీ తన వ్యాసంగం సగంలోనే, అసంపూర్తిగా విడిచిపెట్టడం అతనికి ఇష్టంలేదు. అందువల్ల అతనికి అశాంతి చుట్టుకుంది. అతని జీవితం ఈ సతమతంలో ఎలాగో నెట్టుకొస్తున్నాడు. ఒకరోజు ఆ మహానగరానికి సమీపంలో ఆకాశం మీద శత్రు విమానాలు కనిపించినట్టూ, ఆ శత్రు విమానాలని, మన వాయుసేన తరిమిగొట్టినట్టూ వార్తలు వచ్చాయి. కానీ సాయంత్రం పెద్ద ఎత్తున గుంపుగా శత్రు విమానాలు ఆ నగరాన్ని చుట్టుముట్టి బాంబులవర్షం కురిపించాయి. అంతా భీషణ వాతావరణం, భయాందోళనలతో యుద్ధం ఆరంభమై వేగాన్ని పుంజుకుంది. పది అంతస్తుల ఒక పెద్ద బిల్డింగు కూలిపోయింది. మహానగరంలోని జనులందరి గుండెల్లో భయాందోళనలు వ్యాపించాయి.

అతని మనస్సు పూర్తిగా విచలితం అయింది. మహానగరానికి విపత్కాలం వచ్చిందని బాధపడ్డాడు. అతను తన సంచిలో తన వ్యాసాంగపు కాగితాలన్నీ

సర్దుకున్నాడు. తన బట్టలు, యితర చిల్లర వస్తువులూ కూడా భద్రంగా ఆ సంచీలో వుంచాడు. ఈ మహానగరానికి వీడ్కోలు యివ్వాలని నిశ్చయించాడు. అయితే ఖచ్చితంగా ఎక్కడికి వెళ్ళాలో నిర్ణయించలేకపోయాడు. దేశం విడిచి, విదేశాలకి వెళ్ళి సింధూ సంస్కృతీ, గ్రీకు నాగరికత, ప్రాచీన ఈజిప్ట్ దేశపు జీవన సరళి - అభ్యసించాలని అతని తపన. అయితే యుద్ధం ప్రారంభమవడం వలన విదేశ ప్రయాణం సాధ్యం కాలేదు. అతనికి మరీ ముఖ్యంగా ఈజిప్ట్ దేశం పర్యటించాలనీ, అక్కడి పిరమిడ్లు సందర్శించి, ఆ పిరమిడ్ల గర్భంలో భద్రపరిచిన ప్రాచీన, రాజుల, రాణుల శవపేటికలలో 'మమ్మీల' (MUMMY - వాసన ద్రవ్యములతో నింపి భద్రంచేసిన పీనుగలు)ని చూడాలనీ కలలుకన్నాడు. ఇది చిరకాల కోరికే అయినా ఈ మధ్య ఆ తలంపు వచ్చినప్పుడు ఆ శవపేటికలలో రాజులూ, రాణుల శవాలకి బదులు ఇల్లు కూలి దుర్మరణం పొందిన తన భార్య, బిడ్డలు కనిపించసాగారు. ఆ ఆలోచనతో వొళ్ళు ఝల్లుమనేది.

ఈ ఆలోచనలతో ప్రస్తుతం విదేశాలకి వెళ్ళడం సంగతి అటుంచి, ఈ మహానగరం విడిచిపెట్టాలని నిశ్చయించాడు. ఆ తలంపుతో, తన వస్తువులూ, కాగితాలూ సర్దుకొన్న సంచీతో రైలులో కూర్చున్నాక, రైలు కదులుతూవుంటే ఒక పెద్ద పీడ వదిలినట్లు స్వేచ్ఛగా వూపిరి పీల్చాడు. ఈ యుద్ధంలో మహానగరం మట్టి అవుతుంది. సర్వనాశనం అవుతుంది. నాగరికత అంతమవుతుంది. ఈ దుఃఖం, రైలులో కూర్చున్నప్పుడు ద్విగుణీకృతమయింది.

రైలులో రెండున్నర రోజుల ప్రయాణం తరువాత ఆఖరి స్టేషన్లో దిగాడు. చేరిన ప్రదేశం ఐదు వందల సంవత్సరాల ఇతిహాసం వున్న రాజధాని. ఈ రాజధానిలో చక్కగా తను పరిశీలించి చూడాలని, హాయిగా రోజులు దొర్లించాలనీ అతను ఆశించాడు. మనఃఫలకంలో ఈ రాజధానిని అల్లుకొని వున్న చారిత్రక గాధలు, వెండితెరమీది చిత్రాలలా కనిపించసాగాయి. ప్రణయకథలు, కుట్రలు, కుతంత్రాలు, యుద్ధాలు, కళా నిక్షేపాలు, మతోన్మాదాలు, ముషైరా (కవిసమ్మేళనాలు)లు వగైరా, వగైరా. అందులో ఆ రాణీ ప్రేమ పురాణం మరీ ఆకర్షణీయమైనది. ఈ రాజధాని తన కార్యసిద్ధికి అన్ని విధాలా సార్థక ప్రదేశమని అతనికి తోచింది. అన్నిచోట్లా గోరీలూ, జ్ఞాపకార్థమైన గుఱుతులు (స్మారక చిహ్నాలు) అక్కడ బ్రతికి నివాసంవున్న జనం యిళ్ళకంటే, చనిపోయిన మనుష్యుల గోరీలు ఎన్నో రెట్లు ఎక్కువ వున్నట్లు

అనిపించింది. ఈ ఆలోచనతో అతను ఖిన్నుడయ్యాడు. ఆ గోరీ కొన్ని రోజుల్లో కూలగొట్టనున్నారు. కొన్ని గోరీలు ఎప్పుడో అదృశ్యమయిపోయాయి. వాటి స్థానంలో ఆధునిక కట్టడాలు వెలిశాయి. బేగం (మహారాణీ) గోరీ అత్యంత ఆకర్షణీయంగా వుంది. అందులో నిలిపిన పాలరాయిమీద సంక్షిప్తంగా ఆమె జీవితం వివరించారు. దూర, దూర ప్రాంతాలనుంచి తెచ్చిన ఖరీదైన చలవరాళ్ళతో, చక్కటి నగిషీలు చెక్కి నిర్మించారు. ప్రపంచంలో అమరప్రేమకి అజరామరమైన జ్ఞాపక చిహ్నం అది. పైభాగం ఎఱ్ఱని రాళ్ళతో కట్టారు. ఆపైన సున్నపు బెల్లులు పోయిన బీటలు కనిపిస్తున్నాయి. ఆ గోరీ దగ్గర కాపలాగా ఎవరూ వున్నట్లులేదు. ఆ గోరీకి ముందు ఖాళీజాగాలో రాళ్ళు పేర్చివున్నాయి. ఒకచోట కుప్పగా రాళ్ళు పడివున్నాయి. అవి చూసి అతను అతలాకుతలం అయ్యాడు. ఒక పెద్ద యుద్ధంలో మరణించిన సైనికుల స్మారకార్థం ఆ రాళ్ళకుప్ప అని ఒక ఫలకంమీద వ్రాసారు. రాళ్ళకుప్పలమధ్య ఒక పెద్ద గొయ్యి. ఆ గోతిలో ఏదో అంటువ్యాధి ప్రబలి అసంఖ్యాక జనులు చనిపోతే, వారి కళేబరాలు అందులోకి తోసేసి పూడ్చేసారు. ఈ రాజధాని నిజానికి ఒక పెద్ద శ్మశానభూమి అని, అందులో వివిధ రకాల స్మారకచిహ్నాలు అవతరించాయని అతను తన డైరీలో వ్రాసుకున్నాడు. ఆ తరువాత ఇతిహాసపు పుటల్లో గొప్పగా వర్ణించబడిన చారిత్రాత్మక కట్టడాల అవశేషాలని స్వయంగా దర్శించడానికి ప్రయాణమయ్యాడు. ఆ శిథిలాలలో ఆనాటి వైభవం, ఆనాటి శిల్పకళ, చిత్రకళలూ, నృత్య, సంగీత ప్రజ్ఞలూ, అందాల భామల విలాస క్రీడలూ చూచాయగా ద్యోతకమయ్యాయి. ఆనాటి రాజుల వైభవ జీవితాలు, శౌర్యప్రతాపాలూ అన్నీ మట్టికలిసి మౌనశిలలుగా నిలిచి, క్రమేణా కృశించిపోసాగాయి. వంశపారంపర్యంగా వివిధ రాజులు, వారి అనుయాయులూ అనుభవించిన అష్ట ఐశ్వర్యాలు ఆ శిథిల భవనాలలో మౌనమృదంగాలుగా నిలిచిపోయాయి. ఇప్పుడా రాజసౌధాలు కేవలం నామమాత్రంగా మిగిలాయి. పడిపోయిన పైకప్పులూ - నానా పక్షులకీ, జీవాలకీ, వృక్షాలకీ నిలయంగా, కేవలం చరిత్రపుటల్లో కనిపించే వైభవానికి ప్రతీకగా సగం గోడలతో వుండిపోయాయి. గోడమీద చెక్కిన కళాఖండాలు మట్టిలో కలిసాయి. మిగిలిన గోడలు అవసానదశలో వున్నాయి. వాటిమీద అస్పష్టంగా కళాఖండాలు కొనవూపిరిలో వున్నాయి. ఆ రాజసౌధంలో ప్రవేశించిన తరువాత అతనికి ఒక విచిత్ర వాసన, దుర్వాసన కలిగింది.

గది గదిలో చీకట్లు క్రమ్మి చరిత్రపుటల్లో మిగిలిన ఆర్తనాదాలు నిశ్శబ్దభాషలో చెబుతున్నాయి. లోపల గబ్బిలాలు రెక్కలు రెపరెపకొడుతూ లేస్తున్న చప్పుడు వినిపిస్తోంది. కొన్ని గబ్బిలాలు చూరుకు తలక్రిందగా నిలబడి వేళ్ళాడుతున్నాయి. వాటి వికృత అరుపులు ఎంత గుండెదిటవు వున్న మనిషినైనా భయపెట్టగలవు. అతను క్షణంసేపు నిలకడగా నిలబడ్డాడు. శిథిలమైన ఆ రాజసౌధం అతనికి భూతాల నిలయంలా, పిశాచాల చావిడిలా కనిపించింది. ఈ చారిత్రాత్మక రాజధాని అడుగడుగునా సమాధులతో నిండి యిది భూతాలరాజ్యంగా విలసిల్లుతోందని అతనికి అనిపించింది. ఆ సందేహం రాగానే మరింక అతను వుండకూడదని నిశ్చయించాడు.

నడకతోనే నాలుగు దిక్కులా పర్యటించాలని నిశ్చయించి, అతను కాలినడకనే అన్నిచోట్లా తిరిగాడు. ఊరూరా నడిచాడు. ఇలా నడుస్తూ, ఒకరోజు ఒక కొండమీద ఒక కోట బురుజులు చూసాడు. నాలుగు దిక్కులా పెద్ద పెద్ద రాళ్ళు దొలిచి, బలిష్ఠంగా పకడ్బందీగా ఆ కోటని అభేద్యమైన కంచుకోటగా వేలాది కూలీలు అహోరాత్రాలూ శ్రమించి కట్టారు. ఆ కోట చాలా పురాతనమైనది. ఆ కోట బురుజులు ఏనుగుల కాళ్ళలాగ కనిపించి, అతని ఉత్సుకతని పెంచాయి. ఆ కొండని ఎక్కసాగాడు. కొండ ఎక్కుతూ, ఎక్కుతూ క్రింద చూసి గాభరాగా జారి కిందకి పడిపోవచ్చని భయపడ్డాడు. కొండ ఎక్కుతూ, ఎక్కుతూ ఆ శ్రమతో ఆయాసం కలిగింది. కొండమీది కోటని సమీపిస్తున్నప్పుడు ఆ కోట గోడలు అక్కడక్కడ విరిగి, పడిపోయిన గుర్తులు కనిపించాయి. ఎన్నో బురుజులు విరిగి పడిపోబోతున్న స్థితిలో వున్నాయి. దక్షిణ దిక్కున వున్న రెండు మూడు బురుజులు విరిగి పడిపోయాయి. ఒకప్పుడు ఎత్తుగా, బలిష్టంగా, గర్వంగా, గంభీరంగా నిలబడినవి, యిప్పుడు రాయిరాయిగా విడిపోయి, దొర్లి కొండక్రిందికి జారిపడిపోయాయి.

కొండ ఎక్కిన తరువాత ఏటవాలు ప్రదేశం వచ్చింది. ఒళ్ళంతా చమటలు పట్టి, తొందరగా వూపిరి తీయడం వలన కలిగిన ఆయాసంతో అలసిపోయాడు. ఆ తరువాత ఎక్కువ ఎత్తు ఎక్కనవసరంలేని ప్రదేశాలలో తిరిగాడు. కోటలోకి వెళ్తున్న కాలిబాట మీద నడిచాడు. కోట ప్రవేశద్వారం చాలా ఎత్తుగా వుంది. పెద్ద పెద్ద రాళ్ళు చెక్కి కట్టారు. కోట తలుపులు ఎప్పుడో విరిగిపోయాయి. అతను తెరిచివున్న ముఖద్వారం చేరుకున్నాడు. అతను పైన అర్ధచంద్రాకారంలో వున్న

కోట ఉపరితలంలోని ద్వారపు విశేషాలని పరిశీలించాడు. ఏవో చెట్లూ, తీగెలూ అల్లుకుని వున్నాయి. వాటి వేళ్ళు కోట కట్టిన రాళ్ళసందుల్లోకి చొచ్చుకుపోయాయి. కోట గుమ్మపు నల్లనిరాళ్ళు ఎప్పుడైనా జారిపడవచ్చని అనిపిస్తోంది. ఆ ప్రాచీన కాలపు కట్టడం ఏ క్షణమైనా కూలిపోవచ్చని అనుకొన్నాడు. ఆ ముఖద్వారంగుండా లోపలికి ప్రవేశించడం అతనికి కష్టంగా తోచింది. ద్వారం బయటే చాలాసేపు అతను తచ్చాడాడు. అయితే కోటలోపల ఎలా వుంటుందో అతనికి చూడక తప్పదు. అందుకని అతను తెగించి, పరుగు పరుగున ముఖద్వారంనుంచి లోపలికి చొచ్చుకుపోయాడు. రెండు గోడలమధ్య కనుపిస్తున్న కాలిబాట వెంబడే వెళ్ళాడు. అక్కడ రెండు మూడు పాడుబడిన యిళ్ళు కనిపించాయి. కోట మధ్యభాగంలో భూమిలోపల ఒక గుప్తగృహం వుంది. కానీ ఆ గుప్తగృహం తలుపుదగ్గరే రాళ్ళు తీసేసినందువల్ల లోపలికి పోవడం కష్టసాధ్యమయింది. మరికొంత ముందుకు వెళ్ళాక, ఒక దేవాలయం కనిపించింది. అతని మనస్సులో జ్ఞాపకాల పావురాళ్ళు గూళ్ళు విడిచి రెక్కలు రెపరెపలాడుతూ ఎగిరినట్లు అనుభూతి కలిగింది. ఆ గుడిలో ఎవరో కాపలాగా వున్నారు. గుడిలో అడుగు వేయగానే నంది కనబడడం, ఆ వెంబడే కైలాసపతి, శ్మశానవాసి అయిన మహాదేవుడు సాంబశివుడిదే ఈ గుడి అయివుంటుందన్న ఆలోచన రావడం ఒక్కసారిగా జరిగింది. ఆ దేవాలయం బయట గోపురంమీద రాళ్ళతో చెక్కిన అందమైన ప్రతిమలున్నాయి. ఆ శిల్పాలు అందంగా, ఆకర్షణీయంగా వుండి, ఆనాటి శిల్పుల చాతుర్యం, వాటిలోంచి జీవిస్తూ కనిపిస్తోంది. అయితే ఆ శిల్పాల మధ్య మధ్య చిన్నా, పెద్దా కన్నాలుపడి రూపురేఖలు చెరిగిపోయాయి. దేవాలయం ప్రాంగణంలో కొంతదూరం నడిచాక గర్భగుడికి చేరుకున్నాడు. గర్భగుడి తెరిచేవుంది. మహాదేవుడి విగ్రహంలోని రెండు నేత్రాలూ విప్పారిన మొగ్గలులా సగం తెరుచుకొని వున్నాయి. నల్లని నిగనిగలాడే బండమీద నడుం మధ్య నుంచి శిరస్సు వరకూ శివుడి రూపాన్ని చెక్కారు. ఆ మూర్తికి దగ్గరనే యోనిలింగాన్ని స్థాపించారు. అతను మహాదేవుడి రూపాన్ని సూక్ష్మదృష్టితో పరిశీలించాడు. శివుడి రెండు కళ్ళమధ్య లీలగా, అస్పష్టంగా మూడవ కన్ను దేవుడి కపాలంమీద చెక్కిన ఛాయలు కనిపించాయి. ఆ మూడవ కన్ను తెరిచి వుందో, మూసుకొనివుందో తెలియలేదు. అయితే అతను తదేకంగా, మళ్ళీ మళ్ళీ చూడడంతో ఆ మూడవ కన్ను అప్పుడప్పుడు తెరిచీ, తెరవనట్లు, తెరిచి మూసుకున్నట్లూ

అగుపించింది. ఆ కన్ను తెరిచినప్పుడు భూమి కంపించినట్లూ, దగ్గిర్లోని కట్టడాలు కూలిపోతున్నట్లూ భావన కలిగింది. అతను భయ, భక్తులతో దేవుణ్ణి ప్రార్థించాడు. రెండు చేతులూ జోడించి మనసారా ప్రార్థించాడు; అర్థించాడు "దేవుడా! యోనిలింగం రూపంలో మేము నిన్ను పూజిస్తాము. నువ్వే ఈ విశ్వాన్ని నిర్మించావని నా ఈ కొద్ది జ్ఞానం వలన నాకు తెలుస్తోంది. నీవే ఈ ప్రపంచాన్ని నాశనం చేయగల శక్తి కూడా కలవాడవు. కానీ దేవా, నువ్వు చేతులారా నిర్మించిన ఈ సుందర విశ్వాన్ని యిలాగే సుందరంగా, సుఖంగా వుండనియ్యి. వీలైతే మరింత శోభాయమానంగా చెయ్యి కానీ పొరబాటున కూడా వినాశం చేయవద్దు. నీ మూడవ కన్నుససేమిరా తెరవవద్దు." అలా ప్రార్థించి, అక్కడే ఆ దేవాలయం ప్రాంగణంలో కొంతసేపు గడిపాడు. సృష్టివైచిత్రి గురించి ఆలోచనలలో మునిగి తేలేడు. ఆ తరువాత లేచి, తిరుగు ప్రయాణం పట్టాడు. వచ్చినదారినే తిరిగి వెళ్తూ, ఆ అర్ధచంద్రాకారపు కోట ముఖద్వారం నించే బయటకొచ్చాడు. అప్పుడతని మనస్సులో ఈ జీవితం, ఈ విశ్వం ఎంత అశాశ్వతమైనదో, ఎంత బుద్బుదప్రాయమోనన్న నిజం లోతుగా, గాఢంగా తెలిసొచ్చింది. ఆ కంచుకోట పేకమేడలా పడిపోయి, ముక్కముక్కలుగా విరిగి మట్టిలో కలిసినట్లు కనబడే కాల్పనిక దృశ్యాలు అతని మనోఫలకంనిండా కనిపించసాగాయి. అతని ఈ పర్యటనలూ, ప్రయాణాలూ చాలాకాలం సాగాయి.

ఇలా దేశదిమ్మరిలా తిరుగుతూ తిరుగుతూ ఆరోగ్యం పాడుచేసుకున్నాడు. అడవిలా పెరిగిన జుత్తు తలమీదదీ, గెడ్డంమీదదీ పండి తెల్లబడింది. మునుపటి శరీర సౌష్టవం పోయింది. సన్నబడ్డాడు. తెల్లని సౌందర్యపు చాయ పోయి ఎండల్లో మాడిన రూపం వచ్చింది. మొహంమీద వృద్ధాప్యపు గీతలు పడ్డాయి. ఒకరోజు సంచారం చేస్తూవుంటే అతనికి ఒక కోయవాడు తారసబడ్డాడు. అతను ఆ ఆదివాసిని అడవి మధ్యలో ఎక్కడో వుందనుకునే అభేద్యగుహ గురించి వాకబుచేసాడు. తరువాత ఆ ఆదివాసి చెప్పిన గుర్తులననుసరించి, ఆ కీకారణ్యంలోకి, సూర్యరశ్మి చొరలేని, కాకులు దూరలేని ప్రదేశంలోకి సాహసం మాత్రమే కవచంగా ప్రవేశించాడు. అలా అడవిలో చొచ్చుకుపోయి వెళ్ళగా, వెళ్ళగా ఒక పెద్ద పాషాణపు రాళ్ళున్న కొండ అగుపించింది. ఆ కొండ మొదట్లో ఎవరో రాళ్ళూ, మట్టీ తొలగించి దొలచిన గుహ కనిపించింది. అదే బహుశా అభేద్యగుహ అని భావించి, అతనిలో పట్టలేని ఆనందం పెల్లుబికింది. ఇంత సంతోషం అతనికి కలిగి చాలాకాలం అయింది. ఈ

గుహ సుమారు రెండు వేల సంవత్సరాలనాటిదై ఉంటుంది, అని అంచనా వేసాడు. కొండ మొదట్లో సగం భాగం అర్ధచంద్రాకారంగా, వరసన గుహలు తొలిచారు, ఈ కళానిక్షేపాలని సృష్టించడానికి. అతను లోపల్నే వున్న మరిన్ని గుహలు కనుగొన్నాడు. ఆ కొండ మొదలులో అలా ఎన్నో గుహలున్నట్లు తెలిసింది. ఆ గుహల్లో ఎన్నో శిల్పాలు, కుడ్య చిత్రాలూ కనిపించాయి. మొదటి గుహ నెలవంక ఆకారంలో కట్టారు - లేదా కొండని దొలిచారు అనవచ్చు. అందులో ఎన్నో దేవుళ్ళ, దేవతల, అప్సరసల రూపాలు రాళ్ళమీద ఏళ్ళతరబడి శ్రమించి ఎవరో అజ్ఞాతశిల్పకారులు చెక్కారు. కొండ కడుపులోని పాషాణబండలని కలకాలం నిలిచే కళాఖండాలుగా మలిచారు. లోపల యిక్కడా, అక్కడా ఖాళీస్థలం కనిపించింది. మధ్య, మధ్య రాతిస్తంభాలున్నాయి. వాటిమీద కూడా చక్కటి నగిషీలు చెక్కారు - క్రిందనుంచి మీద వరకూ. లోపల ఎక్కడా, ఏ గోడమీదా, రాయిమీదా శిల్పకళ తాండవించని ఖాళీ జాగా లేదు. అన్ని గుహల్లోనూ కళామతల్లి ద్యోతకమవుతోంది. చిన్నవీ, పెద్దవీ వివిధ భంగిమలలో దేవతామూర్తులు సాక్షాత్కరిస్తున్నాయి. గుహల్లో చలిగా వుంది. అలాగే చీకటి తెరలు. ఇక్కడ కనీసం ఐదారు రోజులుండాలని అతను నిశ్చయించాడు. ముందు పైపైనే నాలుగు గుహలు సందర్శించాడు. తరువాత వరసమాని మధ్యలోవున్న ఒక పెద్ద గహలోకి వెళ్ళాడు. దగ్గరలో ప్రవహిస్తున్న నదినీళ్ళల్లో దాహం తీర్చుకుని ముందు కొంత విశ్రాంతి తీసుకున్నాడు. ఆ తరువాత ఆ పెద్ద గుహలోకి ప్రవేశించాడు. ఈ గుహలో వెలుపల అంత ఆకర్షణీయమైన అలంకరణ లేదు. అయితే లోపల చాలా విశాలంగా వుంది. ఎక్కడా స్తంభాలు లేవు. ఆ గుహ చివరిలో తెల్లని పాలరాయిమీద కూర్చుని పద్మాసనంలో వున్న బుద్ధభగవానుని విగ్రహం కనిపించింది. అది చూసి అతను సమ్మోహనుడయ్యాడు. ఆశ్చర్యానందాలతో గబగబా లోపలికి, ఆ విగ్రహం చూడడానికి పరిగెత్తాడు. ఆ గుహలో గోడల మీదా, పైకప్పు (సరంబి) మీదా కుడ్యచిత్రాలు కనిపించాయి. ఎంతో ఆకర్షణగా వున్న ఆ బొమ్మలు, మట్టి, వృక్షపు మూలికలతో చేసి రంగులతో (Pigments) అలంకరించారు. జీవం పుట్టిపడుతున్న ఆ వర్ణచిత్రాలు ఆ గోడలకి శాశ్వతమైన పవిత్రతని యిచ్చాయి. ఆ చిత్రాల్లో గీసిన మనుష్యుల మనస్సులలోని నాజూకు ఊహలకూ, భావాలకూ సైతం ఆ కళాఖండాలు అద్దంపట్టాయి. బుద్ధభగవానుడి పాలరాతి విగ్రహం ముందునుంచి వెడుతూ, ఆ విగ్రహ

సౌందర్యానికి తన్మయుడైపోయాడు. గుహ బైటనుంచి వస్తున్న వెలుగుకి ఆ బుద్ధమూర్తి విగ్రహం వివిధ సమయాలలో వివిధ రూపాలలో కనిపించి, స్పందిస్తోంది. శాంత, తమో, రాజస గుణాలు ద్యోతకమవుతున్నాయి. అయితే అన్ని భావనలకీ అధికంగా శాంతభావమే ఎక్కువగా ప్రస్ఫుటమవుతోంది. తనకిక్కడ భయం తొలగి సంపూర్ణ శాంతి లభిస్తుందని అతనికి నిశ్చయంగా తెలిసొచ్చింది. అతను మంత్రించినట్టు ఆ మూర్తినే చూస్తూ నిలబడ్డాడు. అలా చాలాసేపు వుండి, లోపలికి విహారాలు చూడడానికి వెళ్ళాడు. బౌద్ధభిక్షకులు నివసించే ఆ విహారాలు పాతకాలపు కట్టడాలవడం వలన శిథిలావస్థలో వున్నాయి. అక్కడ అలంకరణగా గీసిన రంగుల కుడ్యచిత్రాలు వెలవెలబోతున్నాయి. గోడలమీద రంగుల పెచ్చులు పోయి, చిత్రాలు అసంపూర్ణంగా మిగిలాయి. కొన్ని పూర్తిగా నష్టపోయాయి. అతను బుద్ధుడి విగ్రహం ముందుకు వెళ్ళి నించున్నాడు. పద్మాసనంలో వున్న బుద్ధుడి కాళ్ళని చేతులతో తాకాడు. ఆ బుద్ధుడి తలని తదేకంగా, సూక్ష్మదృష్టితో పరిశీలించాడు. బుద్ధుడి శిరస్సుమీదగా ఒక సన్నని చీలిక కనిపించింది. ఆ చీలిక సన్నదైనా, పొడుగ్గా భూమినుండి పైకప్పువరకూ పాకుతున్నట్లు అనిపించింది. ఆ చీలిక అతనికి పెద్ద అపశకునంగా తోచింది. పిడుగులుపడి, ఉపద్రవం వస్తుందని భయపడ్డాడు. ఆ భావనతోనే ఎంతో బాధపడి అవాక్కయిపోయాడు. భూకంపం రాబోతోందని భయపడి ఆపాదమస్తకం వొణుకుతూ బయటపడ్డాడు. పరుగు పరుగున గుహలోంచి అడవిలోకి వచ్చేసాడు. అతనికి దుఃఖం పెల్లుబికింది. అతను చాలాసేపు మతిపోయినవాడిలా నిలబడ్డాడు. అలా వుండి హఠాత్తుగా కాకులగుంపులు 'కావ్ కావ్' అని కర్ణకఠోరంగా చేస్తున్న శబ్దానికి చకితుడై స్పృహలోకి వచ్చాడు. ఒక నల్లని కాకి ఆ గుహపైన ద్వారంమీద కూర్చుని అదేపనిగా గట్టిగట్టిగా అరుస్తోంది. అది ఏడుస్తోందో, శాపనార్థాలు పెడుతోందో తెలియదు. మధ్యమధ్య తన నల్లని ముక్కుతో గుహని సూచిస్తున్నట్టు ద్వారపు అంచుల్ని పొడుస్తోంది. ఆ దృశ్యం చూసి అతని మనస్సు అకలావికలం అయి, ఆ కాకిని 'ఉష్' అని అరిచి తరమడానికి యత్నించాడు. కానీ ఆ కాకి అక్కణ్ణించి కదలలేదు. మళ్ళీ మళ్ళీ కర్కశంగా అరుస్తోంది. ఆ పిమ్మట అతను కాకిని తరిమే ప్రయత్నం విరమించుకున్నాడు. ఈ అభేద్యగుహ, సుందర కళాఖండాల పెన్నిధి కూడా కాలప్రవాహంలో కలిసిపోయి మాయమవుతుందని అతను దుఃఖించాడు. ఆ ఉపద్రవం, కాకుల శాపం ముందే

తెలిసి కూడా ఏమీ చేయలేకపోయాననే పశ్చాత్తాపం అతనిలో శూలంలా గుచ్చుకుంది.

అలా చాలా కాలం తిరిగి, తిరిగి ఈరోజు తన స్వంత ఊరు, స్వగృహం చేరుకున్నాడు. అతని మనస్సులో తిష్ఠవేసుకున్న భయాందోళనలు మాత్రం పోలేదు. ప్రకృతి భీకర క్రూరత్వానికి బలై భూకంపంలో చిక్కి పెద్ద పెద్ద బండలక్రింద పడి, రక్తం క్రక్కుకుంటూ పచ్చడై నామరూపాలు లేకుండా కాలగర్భంలో కలిసిపోతాడనే మృత్యుభీతి అతనిలో లోతుగా పాతుకుంది. ప్రకృతిమాత వికృత చేష్టలలో చిక్కి నీళ్ళలా జారిపోయి, చెట్లలా కూలిపోయి పెద్ద పెద్ద కట్టడాలలా విరిగిపోయి ఎవ్వరూ ఏడవడానికి మిగలని ధరిత్రిలో, ఎవ్వరూ సంశోధన చేయబూనని చరిత్రపుటల్లో నామమాత్రంగా కూడా మిగలక అదృశ్యమయిపోతాడని వాపోయాడు. అతని ప్రవాసంలోని బాధ, అలసట, దుర్బలత అతని శరీరాన్ని వదలలేదు. అతని బాల్యం గడిచిన వూళ్ళో, అతని పూర్వీకులు జరిపిన పుణ్య పురస్కారాలూ, పూజలూ, సత్కర్మలూ, ఫలించిన స్వగ్రామంలో శేషజీవితం గడిపి అవసానదశలోనైనా సుఖంగా బ్రతకాలని అతను ఆశించాడు. అయితే అతన్ని, అతని ప్రాణాంతక పీడకలలు, గుండెలు పిండే భయాందోళనలు వదలలేదు. వెళ్ళిన ప్రతీచోటా నీడలా వెంబడించాయి.

అతను తన స్వంత యింట్లో చాపమీద పడుకునే వున్నాడు. దగ్గర కిరసన్ నూనెలాంతరు వెలుగుతోంది. దీపం వత్తి తగ్గించి, చిన్నదిగా చేసాడు. మధ్యరాత్రి గడిచిపోయింది. అతను నిద్రరాక, పక్కమీదే కూర్చుని, ఏవో ఆలోచిస్తున్నాడు. ఇంతలో 'ఘస్ ఘస్'మని పక్కగదిలోంచి ఏదో శబ్దం వచ్చింది. ఆ శబ్దం గోడలు కూలుతున్నట్లు వుంది. అతని గుండెలు వడివడిగా కొట్టుకున్నాయి. బహుశా పందికొక్కు గొయ్యి తవ్వుతోంది కాబోలు ననుకొని టార్చిలైటు తీసాడు. పక్కనున్న విశాలగది (హాలు)లోకి వెళ్ళాడు. క్రిందా పైనా టార్చిలైట్ కాంతిలో చూసాడు. పైనుంచి మట్టి దారగా పడుతూ, క్రింద పెద్ద రాసిగా మారింది. అతను ఆ మట్టి కుప్పమీదుగా ఎదుటి గోడమీద టార్చ్‌తో చూసాడు. చూస్తే ఏముంది? క్రిందనుంచి పైకప్పువరకూ గోడ చీలి బొరియ పడింది. అతను అక్కడే నిశ్చేష్టుడై నిలబడిపోయాడు - శిలవ వేసిన క్రైస్తు ప్రభువులా! అతని ఆశలూ, ఆకాంక్షలు రంగుల భవితవ్యం కోసం వేసుకున్న ప్రణాళికలూ అన్నీ మట్టికలిసాయి. తన ఆఖరి మజిలీగా ప్రేమతో

ఆశ్రయంకోరి, అలసి సొలసి వచ్చిన అతనికి యిక్కడ కూడా చుక్కెదురయింది. తన అస్థిత్వానికే ముప్పు వచ్చిందని తెలిసింది. అతనికి ముచ్చెమటలు పడ్డాయి. భయంతో వొణుకుతున్నాడు. చాలాసేపటివరకూ అలా వుండి, ఆ తరువాత తిమ్మిరెక్కిన కాళ్ళని అతికష్టంతో ఈడ్చుకుంటూ ఇంటి బయటకి వచ్చే ప్రయత్నం చేసాడు. ఇంతలో యింటి దగ్గర్లోనే ఒక గుడ్లగూబ "హూ...హూ..." అని వికృతంగా ఏడుస్తోంది. భయంతో వొణుకుతూనే తన ఖాకీ సంచీ సర్దుకుని భుజంమీద వేసుకుని, ఇంటి తలుపులు తెరిచినవి తెరిచినట్లే వదిలి బయటపడ్డాడు. పెద్ద పెద్ద అడుగులు వేస్తూ, చీకట్లో కలిసిపోయాడు.



## 24

# నిక్కరు

**- వశంత్ భగవంత్ సావంత్**

రాత్రి అయినకొద్దీ, అతిథుల బెడద కూడా పెరుగుతోంది. బయట కొరికేసే చలి. జాతరకొచ్చిన జనం గుంపుల గుంపులుగా చట్టాపట్టాలేసుకు తిరుగుతున్నారు. చాలామంది మండపంలో గుమిగూడి జాతరలో దేవుడి వస్తువుల వేలం త్వరగా పూర్తవాలని హడావుడి చేస్తున్నారు. కాజాలూ - లడ్డూలూ అమ్మే బండారంలో కొనే జనం సన్నగిల్లారు. చనా, బటానీలమ్మేవాడు ఎఱ్ఱబొగ్గుల్లో మండుతున్న కుండల్లోని సెనగలూ, వేరుసెనక్కాయలూ విసుగ్గా, యాంత్రికంగా వేయించి, వాటిని రాసిలా యిదివరకూ వేయించినవాటిలో కలపడంలో పూర్తిగా నిమగ్నమై, బయట జాతరని విస్మరించారు. జాతరలో పువ్వులమ్మడానికి వచ్చిన స్త్రీలు చలితో వణుకుతూ కంబళీ దుప్పటీ కప్పుకుని 'పొట్లా'లలా ముడుచుకు కూర్చున్నారు. దూరంగా మాత్రం జూదగాళ్ళు డప్పులా డబ్బాలు వాయిస్తూ, పందెం కాయడానికి ప్రజల్ని పురికొల్పుతున్నారు.

కేశవ్ మామ టీకొట్టు ఎదురుగా వున్న స్తంభానికి ఆనుకుని నేను ఎవరైనా నా స్కూలు మిత్రులు కనిపిస్తారేమోనని ఎదురు చూస్తూ నిలుచున్నాను. జాతర ఆఖరి రోజవడం వలన వూళ్ళో వాళ్ళంతా ఒక్కుమ్మడిగా వచ్చారు. ఏడాదికొకసారి వచ్చే ఈ జాతర 'బేతాళు'డికి భక్తిపురస్సరంగా జరుగుతూ మా వూళ్ళో అందరినీ ఉత్సాహంతో, ఆనందంతో ముంచెత్తే నదిలాంటిది. కానీ ఈ ఏడాది మాత్రం నా ఉత్సాహం ఎండిపోయింది - మనస్సులోనే. కారణం ఈసారి అమ్మ నన్ను 'కేశవ్ మామ' జాతరలో పెట్టిన టీదుకాణంలో వుండి, ఆయనకి సహాయం చేయమని పురమాయించింది. నిజం చెప్పాలంటే ఈ 'కేశవ్ మామ'ని చూస్తేనే నాకు చిరాకేసేది. ఈ జాతర మూడు రాత్రులూ మమ్మల్ని (నన్నూ, చాయ్ పెట్టేపనివాడూ వగైరా)

గ్రద్దలా పొడిచి, పొడిచి చంపుకుతిన్నాడు! కాస్త ఆ జాతరలో జనం మధ్యకి ఒకసారి షికారెళ్ళి వస్తానంటే 'నీ చెవులు మెలిపెట్టి పిండేస్తాను' అని భయపెట్టాడు. చలికి వణుకుతున్న జనం, ఆ వణుకు తగ్గడానికని 'చాయ్' కోసం మా కొట్టులో జమ అవుతున్నారు. అందువల్ల మాకు బొత్తిగా విశ్రాంతి లోపించింది. 'కేశవ్ మామ' టీకొట్టులో పనిచేసే భట్టీవాడు, (అంటే టీ, టిఫిన్లూ చేసే వంటవాడు) టీయిచ్చే సర్వరూ యిద్దరూ 'మామ'ని చాటుగా నానాబూతులూ తిట్టేవారు. ఐతే ఆయన ముందుమాత్రం పల్లెత్తుమాట అనకుండా అర్థమైనచాకిరీ చేసేవారు. మూడు రాత్రులు నిద్రలేకుండా పనిచేయడం వలన నా కళ్ళు గుడ్లగూబ కళ్ళల్లా అయ్యాయి. రెండు కాళ్ళూ పీకుతున్నాయి. ఎప్పుడు కాస్త నడుంవాల్చి విశ్రాంతి తీసుకోగలుగుతానా అని ఎదురుచూస్తున్నాను.

"డిగూ ... ఒరేయ్ డిగూ."

"లోపల ఆ ఖాళీగ్లాసు లెవరు తీస్తార్రా? మీ నాన్న వస్తాడ్రా కడగడానికి? గొప్పగా షావుకార్లా నిల్చున్నావు ఆ కొయ్యపట్టుకుని. నడు ... తొరగా రా లోపలికి. ఆ గ్లాసులు కడుగు ... ముందు ఆ ప్లేటులు చూడు."

'మావ' నామీద యింకా శాపనార్థాలు కురిపించేలోగా, ఆయన రుసరుసలని లక్ష్యపెట్టక నేను వెనకదారిలో వచ్చి గ్లాసులు కడగసాగాను. చల్లటి, పాచిన నిన్నటి నీళ్ళు వుంచిన పెద్ద బిందెలో చేతులు పెడితే చన్నీళ్ళు అతి శీలంగా, మంచులా తగిలాయి. వేళ్ళు చలితో కొంకర్లు పోయాయి. మళ్ళీ మళ్ళీ మండుతున్న బొగ్గుల కుంపటి దగ్గరకి వెళ్ళి చేతులు కాచుకోవలసివస్తోంది. మూడు రాత్రులు రెండు గ్లాసులు బద్దలకొట్టానని, నేను అప్పటికే రెండు తన్నులుతిన్నాను. నాకు పూర్తిగా విసిగెత్తింది.

అన్ని గ్లాసులూ, ప్లేట్లూ, చెంచాలూ అక్కడే విసిరేసి హాయిగా జాతరలోకి పోయి మండపంలో యిష్టమిత్రులతో కూర్చుని పిచ్చాపాటి మాటల్తో, చక్కగా నాటకం చూడాలని మనస్సు వువ్విళ్ళూరింది. కానీ ఏం చేస్తాను? అమ్మ నన్ను కోప్పడుతుందని భయమేసి, ఆ ఆలోచన వదులుకొన్నాను.

ప్రతీ ఏడాదీ యిలాగే 'కేశవ్ మావ' జాతరలో టీకొట్టు పెడతాడు. కానీ నాకు ఈసారే తెలిసింది - అతను నాకు 'మావ' అని. అతని వ్యాపారమే అదిట. వివిధ జాతర్లలో తిరగడం. ఏ వూళ్ళో ఏ జాతర జరిగినా అక్కడ 'మావ' టీ హోటలు

- దేరా వెలుస్తుంది. ఈ హడావిడిలో, పనితొందర్లో ఎప్పుడూ ఆయనకి, తన చెల్లెలు అంటే మా అమ్మని చూడగానికి వీలవలేదుట; కానీ ఈసారి మాత్రం జాతర ప్రారంభం అవడానికి ముందురోజు మా ఇంటికి వచ్చాడు. ఆయన నా 'మాఁవ' అనీ, జాతరలో దుకాణం పెడ్తున్నాడనీ విని, ఆశ్చర్యం ఆనందాలతో ఈ విషయం నాతోటి మిత్రులకి చెప్పడానికి నేను వాడలోకి పరిగెత్తాను.

నేను తిరిగి, తిరిగి ఇంటికి చేరింతరువాత 'కేశవ్ మాఁవ' గుడికి వెళ్తానని చెప్పి బయటకి వస్తున్నాడు. మాఁవ తెచ్చియిచ్చిన 'పిప్పరమెంట్లు' (మిఠాయి) పొట్లం, అమ్మ నాకు యిస్తూ, యిలా అంది :

''డిగూ, మాఁవ నీకు పట్లం (లాగు) కుట్టించుకోడానికి కొత్త బట్ట యిస్తానన్నాడు.''

''నిజంగానా!'' అని నేను నా వెనక చిరిగిన లాగు తడుముకుంటూ అన్నాను.

''అవును నిజం. కానీ నువ్వు ఆయనకోపని చెయ్యాలిట.''

''ఎటువంటి పనీ?''

నేను ఉత్సాహంతో, ఊరటతో అడిగాను.

''మాఁవ చాయ్ కొట్టులో యిద్దరు పనివాళ్ళు ఆరోగ్యం బాగులేనందువల్ల రాలేదుట పనికి; అందుకని జాతర ఉన్న మూడు రోజులూ నువ్వు అతనికి సహాయంగా ఆ టీకొట్టులో పనిచేయాలి.'' అమ్మ నన్ను బుజ్జగిస్తూ చెప్పింది.

''ఒద్దు...ఒద్దు...నేను ఎంచక్కా జాతరలో తిరగాలి మిత్రులతో కలిసి!''

''ఇదిగో విను - నువ్వు తెలివైన నా బంగారు కొడుకువి కదూ, ఈ మధ్య నీకు నేను కొత్త బట్టలు కుట్టించలేకపోయాను. నీ ముష్టిదగ్గర చిరిగిన పట్లంతో జాతరలో తిరుగుతావా ముష్టివాడిలా? నీ మిత్రులు నవ్వరా నిన్ను చూసి? అయినా జాతరలో ఏముందిరా, ప్రతీ ఏడాదీ వస్తూనే వుంటుంది. ఇప్పుడు నువ్వు ఆ దుకాణంలో పనిచేస్తే, ఎంచక్కా నీకు కొత్త లాగు వస్తుంది.''

అమ్మకి ఎలా నచ్చజెప్పాలో నాకు తెలియలేదు. చివరికి ఒప్పుకున్నాను. నా జుత్తుని వేళ్ళతో ప్రేమగా నిమురుతూ అమ్మ అంది ''ఇదిగో చూడు. నువ్వు వెళ్ళు మాఁవ దుకాణానికి. నేను చెప్పాను మీ 'మావ'కి - నువ్వు వస్తావని. పని కాస్త వొళ్ళు దగ్గరపెట్టుకు చెయ్యి. నీ 'మాఁవ' కాస్త కోపిష్ఠి. అతనికి సహనం తక్కువ. నీమీద ఏ కారణంవల్లనైనా విరుచుకుపడితే, నిరాశపడకు. ఈ జాతర్లలో

రాత్రిళ్ళు ఎప్పుడూ జాగరణ చెయ్యడంవలన అతనిలో శక్తీ, సహనం పోయాయి.

నేను 'సరే'నని అన్నట్లు తల ఆడించాను.

అమ్మ మళ్ళీ అంది. "నీకు తెలియదురా. నీ 'మా(వ'కి ఎన్నో పనులు - అర్థమైన వ్యవహారాల్లోనూ తల దూర్చుతాడు. ఇక్కడి వస్తువులు అక్కడికీ, అక్కడివి యిక్కడికీ, వాణ్ణి వంచించడం, వీడి కాళ్ళు పట్టుకుని వేడుకొనడం - యిటువంటి తిమ్మిని బమ్మినిచేసే వక్రబుద్ధి వాడిది. డబ్బే వాడి దైవం. డబ్బుముందు మనవాళ్ళూ, పరాయివాళ్ళూ అని అంతరం చూపడు. ఎవర్నీ లెక్కచెయ్యడు. ఇన్నేళ్ళుగా జాతరలో దుకాణం పెడుతున్నాడు. అయినా ఒక్కసారీ, ఈ వూరికి వచ్చినప్పుడు వాడికి నన్ను (చెల్లెలు) చూడాలని తోచలేదు - మనింటికి రాలేదు. ఆ సారిమాత్రం వచ్చాడు - ఎందుకనీ? - పనివాళ్ళు తక్కువయినందువల్ల - నిన్ను - మేనల్లుడిని ఆ మురికిపనిలో దింపడానికి."

అమ్మ కళ్ళంబడి అశ్రువులు వచ్చాయి! అప్పుడామె చెప్పిన మాటలు నాకు సరిగ్గా అర్థమవలేదు. కానీ రెండు రాత్రులు 'కేశవ్‌మావ' టీకొట్టులో కొట్టుమిట్టాడాక ఆ త్రాస్టుడి కుటిల స్వభావం బాగా తెలిసింది. టీ ఒకసారి చేసాక, మళ్ళీ అదే పాడితో మళ్ళీ మళ్ళీ టీ చేయమని వంటవాడికి ముందే పురమాయించి వాడు మఱచినప్పుడు, మండిపడి కోప్పడేవాడు. శేరుపాలల్లో మరోశేరు నీళ్ళు కలిపేవాడు. ఆ 'టీ'లో రుచీ, పచీ లేదు. వొట్టి వేడినీళ్ళు. కొద్దిగా పంచదార ఎక్కువ పడితే ఆ వంటవాడి ముడ్డిమీద పడిందనుకో దెబ్బ! జనం గోలచేసేవారు. కానీ 'మా(వ' వాళ్ళేమన్నా పళ్ళు యికిలిస్తూ నవ్వేవాడు - ఏమాత్రం లజ్జ లేకుండా! జాతరలో మరెవ్వరి చాయ్ దుకాణం లేనందువల్ల 'మా(వ' కొట్టులోనే జనసమ్మర్దం వుండేది. 'మా(వ' మానవత్వం యినుమంతైనా చూపించకుండా తన వ్యాపారం కొనసాగించేవాడు. అతని కుటిల స్వభావం, కుచ్చిత బుద్ధి, పాడు పనులూ చూశాక అతనంటే నాకు ఏహ్యాభావం కలిగేది. అతన్ని చూడాలంటేనే అసహ్యం వేసేది. హోటల్లో గిరాకీదారులుండగా, అందరిముందూ 'మా(వ'ని తూర్పారబెట్టి, అవమానం చేసి ఆ పని విడిచిపెట్టి పారిపోవాలని నాకు క్షణక్షణం అనిపించేది. కానీ అమ్మ ప్రేమతో చెప్పిన మాటలు గుర్తుకువచ్చి, ఆ ఆలోచనకీ, నా కాళ్ళకీ బంధాలు తగిలేవి.

గ్లాసులూ, ప్లేట్లూ (సాసర్లు) కడుగుతూ వుండగా, నా చెవుల్లో బయట

'జాతర'లో 'లౌడ్‌స్పీకర్'మీద దేవుడి వస్తువుల వేలంపాట వినపడుతోంది. "ఆఖరి బేరం ... దేవుడి చరణాలమీది పూలదండ ... ఇరవై ఒక్క రూపాయలు ... మూడవసారి ..." వేలంపాట ముగియగానే, ఆ వేలంపాట పాడినవాడు ఉస్సూరుమని నిట్టూర్చాడు - పెద్ద కార్యం పూర్తయిందని. కానీ నాకూ ఆ వంటవాడికీ, టీనీళ్ళు గిరాకులకి యిచ్చే పనివాడికీ మాత్రం విశ్రాంతి లేదు. హఠాత్తుగా దుకాణంలో రద్దీ తగ్గింది. నాటకం ప్రారంభమవుతుందని తెలిసి జనం పరుగుపరుగున డబ్బులు 'గల్లా'మీద విసిరేసి వెళ్ళిపోయారు. గడియారంలో టైము చూసి 'మాఁవ'కి ఒళ్ళుమండింది. "ఈ కమిటీ మెంబర్లు లంజాకొడుకులు! డబ్బు గుంజడానికి చందాకోసం ఎంచక్కా వస్తారు! పన్నెండున్నర కాకుండానే నాటకం ఆరంభం చేస్తారు. ఇలా చేస్తే మాకు గిరాకులేం వస్తారు? మా గతి అధోగతే."

'మాఁవ' మండిపడ్డం చూసి నిజం చెప్పాలంటే నాకు బలె బలె అనిపించింది. ఈ మనిషి యిలాగే జీవితాంతం ఏడుస్తూ చావాలి అని మనసులోనే శాపనార్థాలు పెట్టాను. వంటవాడు చక్కటి, చిక్కటి టీ నాకోసమని చేసి 'మాఁవ చూడకుండా గ్లాసు నాచేతికిచ్చి తాగమని రహస్యంగా సంజ్ఞ చేసాడు.

'మాఁవ' గల్లాపెట్టెలో నోట్లు లెక్కపెడుతున్నాడు. నేను ఒక కుర్చీలో కూర్చుని నోట్లు లెక్కపెట్టడం చూస్తున్నాను. ఇరవై రూపాయల నోట్లూ, పదిరూపాయల నోట్లూ ఐదు, రెండు రూపాయల నోట్లు (ఇవే చాలా ఎక్కువ) తడిచేసిన నాలికని వేలుతో మధ్య మధ్య తాకుతూ, ఏకాగ్రదృష్టితో అతి జాగ్రత్తతో లెక్కపెడుతున్నాడు. అలా లెక్కపెడుతూ తలెత్తి నన్ను చూసి హఠాత్తుగా కోపంతో కేకలేసాడు.

"నువ్వేం చేస్తున్నావురా? నడు, త్వరగా ఆ ఎంగిలి గ్లాసులన్నీ కడుగు. సర్దిపెట్టు. లెక్కపెట్టు ఎన్ని విరిగాయో, ఎన్ని మిగిలాయో."

నేను అన్ని గ్లాసులూ, సాసర్లూ కడిగాను. వాటిని సర్దిపెట్టి, భట్టీ (పొయ్యి) దగ్గరకెళ్ళి చలితో కొంకర్లుపోయిన చేతుల్ని వెచ్చచేసుకోసాగాను. చేతుల్లో కరెన్సీనోట్లు మరోసారి లెక్కపెట్టి 'మాఁవ' నన్ను పిల్చాడు. నాకనిపించింది. ఇప్పుడు 'మాఁవ' నాకు 'ప్యాంటు' కుట్టించుకోడానికి బట్టకోసం డబ్బులు యిస్తాడని. నేను గల్లాపెట్టె దగ్గర చేరగానే 'మాఁవ' అన్నాడు "నువ్వు కాస్త ఈ 'గల్లాపెట్టె' దగ్గర కూర్చో కాసేపు" అని నన్ను అక్కడ కూర్చోపెట్టి, లోపల వుంచిన ట్రంకుపెట్టె తెరిచి డబ్బులు పెట్టసాగాడు. నేను గల్లాపెట్టె (కౌంటర్) దగ్గర కూర్చుంటే, నాకు ఏనుగెక్కినంత

ఆనందమయింది. నేను యిలా కూర్చునుండగా నా మిత్రులెవరైనా చూస్తే బాగుంటుందని సంబరపడ్డాను. కానీ కళ్ళకెవరూ కనపించలేదు!

'మా(వ' నోట్లన్నీ తీసికెళ్ళాక, 'గల్లా' పెట్టెలో చాలా చిల్లర మిగిలింది. ఎంత చిల్లరంటే, నేను ఎప్పుడూ దేవాలయంలో దేవుడిముందు పళ్ళెంలో కూడా చూడలేదు, అంత చిల్లర! నేనా చిల్లరలో నా చెయ్యిపెట్టి, కెలుకుతూ చప్పుడు చేసాను. ఆ చప్పుడు విని నా వొళ్ళు ఝల్లుమంది. నేను నా దోసిట్లో వచ్చినంత చిల్లర తీసుకుని పైకెత్తి గడగడ లాడించి, మళ్ళీ లోపల పడేసాను. మూడు రాత్రులు జాగరణ వుండి ఆ హోటల్లో చేసిన పని అలసట ఆ చప్పుడుతో అదృశ్యమైపోయినట్లు నాకనిపించింది.

నాటకం మొదటి అంకం పూర్తవగానే నలుగురైదుగురు వ్యక్తులు టీతాగడానికి దుకాణంలోకి వచ్చారు. వాళ్ళు టీ తాగాక, నేను హుందాగా బెల్లు వాయించి బిల్లు ఎంతైందని పనివాణ్ణి అడిగాను. వాళ్ళిచ్చిన నోటు తీసుకుని బాకీ చిల్లర తిరిగి యిచ్చాను.

లోపల్నించి 'మా(వ' అరిచాడు. "సరిగ్గా బిల్లు వసూలుచేసావుట్రా." అని.

"హా( అలాగే చేసాను" నేనూ గంభీరంగా జవాబిచ్చాను.

"సీతారామ్..." వంటవాడిని ఉద్దేశించి 'మా(వ' గట్టిగా అన్నాడు. "రేపు, ఎల్లుండీ 'కామర్‌ఖండ్' జాతరకి వెళ్తున్నాం. 'కాల్యా' (ఒక వూరు పేరు)కి - తెలుసుకదూ? (నాటకం మూడవ భాగం పూర్తవగానే సామాన్లు అన్నీ సర్దేసి, మూటలుకట్టి, ఆ తరువాతే పడుకున్నాం. తెల్లవారుఝామున 'పిక్-అప్' (వ్యాను) వస్తుంది. డేరా (గుడారం) ఎత్తేసి వెంటనే వెళ్ళిపోవాలి - వింటున్నావా?"

'సీతారాం' అవునూ అనలేదు, కాదూ అనలేదు.

"వినబడ్డంలేదురా?" నేను 'మా(వ' పక్షాన వకాల్తా పుచుకుని 'సీతారాం'ని గట్టిగా అడిగాను. 'సీతారాం' నాకేసి కోపంగా చూసాడు. నన్ను వాడెత్తేసి ఆ మండే కట్టెలూ, బొగ్గులూ వున్న భట్టీ (పొయ్యి)లో తోసేస్తాడేమోనని క్షణంసేపు భయంవేసింది.

'మా(వ' చిన్న మేజామీద లెక్కలు వ్రాసుకుంటున్నాడు; పూర్తిగా అందులోనే నిమగ్నమై. నేను పావలా కాసులూ, అర్ధరూపాయ బిళ్ళలూ ఏరి ఒకదానిమీద ఒకటి పేర్చి నిటారుగా అమర్చాను. నేను గల్లాపెట్టె దగ్గర కూర్చుని వుండడం

చూసిన నా క్లాసు మిత్రులు యిద్దరు ముందరికి వచ్చి నను పలకరించారు.

నేను వాళ్ళని చూసి హుందాగా అడిగాను "ఓ బిక్కూ, ఓ నారాయణా, ఏమిటీ విశేషాలు?"

"ఏంలేవు" వాళ్ళిద్దరూ అన్నారు.

"టీ తాగుతార్రా?" నేను అడిగాను.

వాళ్ళు 'తాగుతాం' అని తల వూపుతో సూచించారు.

"సీతారాం, ఇక్కడ రెండు చక్కటి, చిక్కటి 'టీ'లు తీసుకురా." అని నేను హుందాగా, దర్జాగా ఆర్డరు యిస్తూ, బల్లమీది 'బెల్లు' వాయించడానికి, చేయి చాపితే, ఆ చెయ్యి తగిలి నిలువుగా పేర్చిన నాణేలన్నీ ఖంగున నేలమీద పడిపోయాయి! ఇంతవరకూ నా చేతలు చూడని 'మాఁవ' వెంటనే లేచి పరుగున వచ్చి చిల్లరంతా ఏరి గల్లాపెట్టెలో వేసాడు. నన్ను ఓమూలకి తీసుకెళ్ళి నా జేబులన్నీ జాగ్రత్తగా వెతికి, నా చెవి మెలేసి అన్నాడు కోపంగా :

"మీ అబ్బ సొమ్మనుకున్నావురా యిది? డబ్బుల దగ్గర ఆటలాడుతావు? కాస్త గల్లాపెట్టెదగ్గర కూర్చోగానే డబ్బు నిషా ఎక్కింది నీకు, కదూ? చాలు...చాలు...పక్కకి తప్పుకో."

'మాఁవ' నన్ను తోసేసి, మూలకి గెంటాడు.

నా మిత్రులు 'నారాయణ', 'భీకూ' బెదిరిపోయి బయటకెళ్ళిపోయారు.

నా వొళ్ళు మండిపోయింది కోపంతో. ఒక కుర్చీ ఎత్తి 'మాఁవ' నెత్తిమీద గట్టిగా పడేసి, రక్తం కారేలా చూడాలని నాకు క్షణంసేపు అనిపించింది.

"నా 'లాగు' బట్టకోసం డబ్బులియ్యి" నేను కోపం పట్టలేక గట్టిగా అన్నాను.

"ఆఁ ... డబ్బులా? రేపుప్రొద్దున్న మీ అమ్మకి ఇస్తాను" 'మాఁవ' తాపీగా అన్నాడు.

"రేపు వద్దు...నాకు ఈవేళే, యిప్పుడే కావాలి."

"ఇప్పుడే కావాలా? సరే యిప్పుడే నీ చెవి మెలేసి ఓ చెంపకాయ యిస్తాను" అలా అంటూనే 'మాఁవ' నాకో లెంపకాయ యిచ్చాడు. జాగరణతో నిద్రలోపించిన నా కళ్ళల్లో హఠాత్తుగా చీకట్లు చిమ్మాయి. ఆ దెబ్బతో నేను పరిగెత్తి నాటకం అడుతున్న మండపంలోకి వచ్చిపడ్డాను. నాటకం చూస్తూ, చూస్తూనే నిద్రపోయాను. ఎప్పుడు నాటకం పూర్తయిందో ఎవరికి తెలుసు! అమ్మ నన్ను తట్టి లేపినప్పుడు

కళ్ళు తెరిచాను. మధ్యాహ్నం అయింది. నాలాగే నలుగురైదుగురు కుర్రవాళ్ళు మండపంలో పడుకొని వున్నారు.

"మా(వ నీకు నిక్కరు (లాగు) బట్టకోసం డబ్బులిచ్చాడ్రా?"

అమ్మ ప్రేమతో నిమురుతూ చెవిలో అడిగింది.

"లేదమ్మా ... నీదగ్గర యిస్తానన్నాడమ్మా నీకు యివ్వలేదన్నమాట!" నేనన్నాను.

అమ్మ యివ్వలేదని తల ఆడించింది.

నేను 'మా(వ' టీదుకాణంవైపు చూసాను. సామాన్లన్నీ తీసుకుని 'మా(వ' ఎప్పుడెల్లిపోయాడో ఎవరికి తెలుసు? డేరా - బురా ఏమీలేదక్కడ. పింకలతో, బొగ్గులతో నిండిన ఒక భట్టీ (కుంపటి వంటిది - రాళ్ళు పేర్చి చేసేది) మాత్రం వదిలేసివుందక్కడ - అక్కడ ఒక దుకాణం వుండేదన్న గుర్తుగా. మరే విధమైన గుర్తులేదు!

"మా(వ' పెద్ద మోసగాడు" నేను ఏడుపుగొంతుకతో అన్నాను.

"వాడిపని గొడవల్లో నీ సంగతి బహుశా మరిచిపోయి వుంటాడు." అమ్మ అంది. అని నడవసాగింది.

'మా(వ' చాయ్ దుకాణం పెట్టిన స్థలంవైపు కన్నెత్తి కూడా మళ్ళీ చూడకుండా, నా చిరిగిన లాగు (నిక్కరు) మీది చిరుగుని అరచేతితో కప్పుకుంటూ - నేనూ అమ్మవెంబడే యింటివైపు నడవసాగాను.



## 25

# నీడ

**- జ్యోతీ కుంకళీకార్**

అకస్మాత్తుగా వెనకనుంచి నా భుజం మీద ఎవరో చేతులేసారు. క్షణంసేపు నేను నిశ్చేష్టురాలయాను. ఆ చేతులు 'నిఖిల్'వి - నా కొడుకువి. ఎందుకో ఆ చేతుల స్పర్శతో నాకు మా ఆయన - 'నిఖిల్' తండ్రి - 'సుధీర్' జ్ఞాపకం వచ్చారు.

"అమ్మా, ఈవేళ వెళ్దాంకదూ?" 'నిఖిల్' మొహం నా మొహందగ్గరకి తెచ్చి అడిగాడు.

"ఎక్కడికిరా? ఎక్కడి వెళ్దాం?" నేను విసుగ్గా, పట్టించుకోనట్లు అడిగాను.

"అలా ఎందుకంటావమ్మా? ప్రతీ ఏడాదీ రిజల్ట్సు వచ్చిన మర్నాడు మనం కథల పుస్తకాలు కొనడానికి బజారుకి వెళ్తాంకదా? నిన్ననే నా రిజల్ట్సు వచ్చాయి కదా?"

"నిజమేరా 'నిఖిల్'. కానీ నాకు యింట్లో పనులింకా పూర్తవలేదు కదా!" నేనన్నాను.

వీడికి నేనెలా నచ్చచెప్పడం? ఈవేళ సోమవారం అనీ, అమెరికానుంచి రావలసిన 'సుధీర్' ఉత్తరం, ఇప్పటికే చాలా ఆలశ్యం అయింది - ఈవేళ రావచ్చనీ! బయటకి వెళ్ళాలంటే త్వరగా వెళ్ళి పోస్టుమాన్ వచ్చేలోగా హడావిడిగా తిరిగి రావలసివుంటుంది. లేకపోతే ఆ ఉత్తరం నేనే స్వయంగా అందుకోలేదని చిఱుకోపంతో కినుక వహించదూ?

"ఇలా ఎందుకు చేస్తున్నావు అమ్మా?" వాడు ఏడుపుమొహం పెట్టాడు.

"వెళ్లమ్మా కోడలా, వాడి మనస్సుని కష్టపెట్టవద్దు" మూలకూర్చున్న అత్తగారు దూదివత్తులు చేస్తూ అన్నారు.

"సరే రా, వెళ్దాం పద."

నేను 'నిఖిల్'తో అన్నాను. నా చేతులు గబగబా రొట్టెలు వత్తసాగాయి. కానీ మనస్సు మాత్రం కాస్త చిన్నబోయింది. ప్రతీ సంవత్సరం రిజల్ట్సు వచ్చింతరువాత మరుసటిరోజు కథల పుస్తకాలకోసం వెళ్ళడం మాకు ఆనవాయితీ. మరి ఈ సంవత్సరమే ఎందుకు మఱచిపోయానో? అని నాకు ఆశ్చర్యం వేసింది.

గతకాలంలోని చిన్న చిన్న విషయాలు నాకు జ్ఞాపకం వచ్చాయి.

రాజా-రాణీల కథల్లో నిమగ్నమైవుండే 'నిఖిల్' నా కళ్ళముందు వచ్చాడు. కాస్త బజారుకి షాపింగ్‌కు వెళ్తేచాలు, ఎప్పుడూ పుస్తకాలు కొనమని బెట్టు చేస్తాడు. పుస్తకాలు-పుస్తకాలు-పుస్తకాలు. తండ్రీ, కొడుకులిద్దరూ ఒకటే, ఒకే మాలలో మణులు. 'సుధీర్' పుస్తకాలు కొనడానికి వెళ్ళినప్పుడల్లా వాడు (నిఖిల్) ఏడుస్తాడు - తనకీ కావాలని.

"మీ నాన్న ముందు పుస్తక ప్రపంచంనుంచి బయటపడనియ్యి. తరువాత నీ సంగతి చూద్దాం."

ఇలా నేను అప్పుడప్పుడు దెప్పిపొడిచేదానిని.

"దివ్యా! తండ్రిమీద కోపం కొడుకుమీద ఎందుకు చూపిస్తావమ్మా?"

'సుధీర్' వ్యంగ్యంగా అన్నాడు.

ఆ తరువాత 'సుధీర్' ఒక ఉపాయం కలిగి, 'నిఖిల్'కి నచ్చచెప్పాడు.

"ఇదిగో చూడు 'నిఖిల్' ప్రతీ సంవత్సరం రిజల్ట్స్ తెలిసిన మర్నాడే మనం పుస్తకాల షాపుకి వెళ్ళి, నీకు కావలసినన్ని పుస్తకాలు కొందాం. ఇలా మధ్య మధ్య తీసుకోవడం వద్దు. ఈ పద్ధతి అనుసరిస్తే నీ తల్లి రుసరుసలు, కోపతాపాలూ నీమీదా, నామీదా పడవు. ఇద్దరం బతికిపోతాం."

'నిఖిల్' తండ్రి మాటలు విని "సరే అలాగే చేద్దాం" అంటూ తలాడిస్తూ, కోతిలా గెంతులేస్తూ బయటికి వెళ్ళిపోయాడు. నేను మాత్రం ఈ తండ్రీ కొడుకుల నాటకం కుతూహలంగా చూస్తూ వూరుకున్నాను. 'సుధీర్' ఎప్పుడు నా వెనకనించి వచ్చి నా మెడలో చెయ్యివేసాడో నాకు తెలియలేదు.

"దివ్యా, మనం ఈ పుస్తకాల వల్లనే దగ్గరికి వచ్చాంకదూ?" అతను తన చెంపని, నా చెంపకి చేర్చాడు.

నా మనస్సు గతంలోకి పోయింది. 'బరోడా యూనివర్శిటీ' రోజులు గుర్తుకొచ్చాయి. నేనూ, సుధీర్ ఫైనల్ ఇయర్ బి.ఏ. చదువుతున్నాం. నాకూ, సుధీర్‌కీ

పుస్తక పఠనం అంటే ప్రాణసమానం. అందువల్ల మా టైము చాలావరకూ 'లైబ్రరీ'లోనే గడిపేసేవాళ్ళం. అక్కడే మా పరిచయం మొదలయింది. ఇద్దరి అభిరుచులూ, మనస్సులూ కలిసాయి.

ఎలా ఎలా నేను 'సుధీర్'కి దగ్గరవుతున్నానో, అలా అలా అతని ఆర్థిక పరిస్థితీ, అసామాన్య బుద్ధికుశలత, అంతులేని మహత్వాకాంక్ష అర్థమవసాగాయి. ఆ ప్రకారమే అతనికి నచ్చే విధంగా నేను ప్రవర్తించసాగాను. బి.ఏ. పరీక్షలో 'సుధీర్'కి పచ్చినన్ని మార్కులు, గత పది సంవత్సరాలలో ఎవ్వరికీ రాలేదుట! కొత్త రికార్డు స్థాపించి గోల్డ్‌మెడల్ సంపాదించాడు - యూనివర్శిటీలో ప్రథముడిగా ఉత్తీర్ణుడయ్యాడు. అతను ఎమ్.ఏ. చదవడం మొదలెట్టాడు. నేను మాత్రం బి.ఏ. తరువాత బి.ఎడ్. కోర్సు పూర్తిచేసి టీచరు ఉద్యోగం సంపాదించాను. అతను ఎమ్.ఏ. కూడా మంచి ప్రతిష్టాకరమైన మార్కులతో పూర్తిచేసాడు. ఆ తరువాత మా వివాహం అయింది.

కానీ అతని చదివే అలవాటు ఏమాత్రం సడలలేదు. నిజానికి పెరిగింది. ఒక ప్రసిద్ధ కాలేజీలో లెక్చరర్‌గా జేరాడు. ఒక చురుకైన, తెలివైన అధ్యాపకుడుగా పేరు గడించాడు. నాకు అతని సామర్థ్యాన్ని చూసి ఎంతో గర్వం, అభిమానం వేసేది. నా టీచరు ఉద్యోగం, సంసారం బాధ్యతలూ రెండూ నడుస్తున్నాయి. ఆఖరికి ఎన్నో సంవత్సరాలుగా నిర్మించుకున్న 'సుధీర్' కలలు పండే రోజు ఆసన్నమయింది. అతనికి అమెరికాలోని నార్త్ ఈస్టర్న్ యూనివర్శిటీలో పెద్ద చదువులకి ప్రవేశం దొరికి, అతను 'స్టడీ లీవ్' (చదువుకోసం ప్రత్యేక సెలవు) తీసుకుని, అమెరికా వెళ్ళాడు.

బహుశా ఈవేళ రానున్న 'సుధీర్' ఉత్తరంలో అతని 'థీసిస్' (విద్యా విషయక సిద్ధాంత వ్యాసం) ఎప్పటికి పూర్తయేదీ, అతనెప్పుడు అమెరికానుంచి మన దేశం తిరిగి వచ్చేదీ, తెలుస్తుంది.

వేడి వేడి చపాతీలు నా చేతికి తగిలి, నేను వూహాలోకం వదిలి మేల్కొన్నాను. ఈమధ్యన నాకేదో చెప్పలేని బాధ పట్టుకుంది. ఈ బాధ ఎటువంటిదీ? శారీరకమైనదా, మానసికమైనదా? బహుశా రెండు విధాలా అనుకొంటాను.

'సుధీర్' ఉన్నత లక్ష్యాల పరుగులో అతనికి ఎలాగున్నా నాకు మాత్రం బాగా అలసట వచ్చి, విసిగిపోయాను. అతను ఆశయాలు సాధించి, సుఖాల

సోపానాలు ఎక్కడానికి వీలుగా, నేను అటు ఉద్యోగం, ఇటు సంసార బాధ్యతలూ ఒక్కడినే భరించి నడుపుకొస్తున్నాను. ఇకపోతే ఆర్థిక బాధ్యతలు (సంసారంలోవి) నామీదే నిర్భరం. సంసారంలోని చిన్నపెద్ద సమస్యలన్నీ నేనే వొంటరిగా చూసుకుని పరిష్కరించాలి; అలాగే 'నిఖిల్' ఆరోగ్యం, చదువు, ఆటపాటలూ పర్యవేక్షించాలి - కళ్ళల్లో వొత్తులేసుకుని సూక్ష్మంగా.

చాలాసేపు అలాగే కూర్చునుండిపోయాను. గత కొద్ది రోజులుగా నాకీ వొంటరితనం విసుగెత్తింది. ముఖ్యంగా మగదిక్కు లోపించడం కుటుంబంలో పెద్ద భారంగా తోస్తోంది. అన్ని నిర్ణయాలూ, పనులూ 'సుధీర్' చేయాలనీ, నేను కేవలం అతని నీడలా నిర్లిప్తంగా, నిమిత్తమాత్రంగా వుండిపోవాలని ఆకాంక్ష మొదలయింది. ఈవేళ అతని దగ్గర్నుంచి వచ్చే ఉత్తరంలో తెలుస్తుంది - అతనెప్పుడొచ్చేదీ, ఎప్పుడు నాకీ బాధ్యతా, బరువూ తొలిగేదీ.

ఈమధ్య నాకేమయిందో నాకే తెలియదు. ఇంట్లోని ఎన్నో పనులు 'సుధీర్' వచ్చి చూసుకుంటాడులే అని చేయకుండా అలాగే వుంచేస్తున్నాను - మరీ తప్పనిసరి అయినవి తప్పిస్తే! ఇంటికి రంగు వెయ్యడం; వి.సి.ఆర్. కొనే విషయం, వంటయింట్లో చెయ్యాల్సిన బాగులు, మార్పులు, యిలా వొకటా, రెండా - కొన్ని వందల పనులు. ఇంట్లో వుండేది నేనూ, మా అత్తగారూ, 'నిఖిల్' పిల్లవాడు. ఈ ఆడపెత్తనంతో ఎన్నాళ్ళు సంసారరథం నడుస్తుందీ? 'సుధీర్' వీటన్నిటికీ అలీప్తంగా, దూరంగా వున్నాడు. అదృష్టం!

''పోస్ట్‌మ్యాన్'' అనే శబ్దంతో నేను తెలివిలోకి వచ్చాను. మామూలుగా వచ్చే నీలంరంగు ఉత్తరం 'ఏరోగ్రాం' చూసి నేను కరిగిపోయాను. కొత్త పెళ్ళికూతురులా సిగ్గుబడుతూ ఆ ఉత్తరాన్ని చింపాను. త్వరత్వరగా చదవాలనే ఆతృత కళ్ళనిండా నిండింది. ఉత్తరం మీద ఉత్సుకతతో పరుగులెత్తుతున్న నా కళ్ళు హఠాత్తుగా ఆగాయి. 'సుధీర్' యిలా వ్రాసాడు:

''పి.హెచ్.డి. కోసం నాకు ఏర్పాటైన 'గైడ్' అకస్మాత్తుగా 'లండన్'కి ఏదో కాన్ఫరెన్స్‌కి వెళ్ళవలసివచ్చింది. అందువల్ల నా 'థీసెస్' పని కాస్త పొడిగించాల్సి వచ్చింది. అంటే మరో నాలుగు నెలలు ఆలస్యం అవుతుంది.''

''నాకు తెలుసు రాణీ! నేను నీ వోపిక పరీక్షిస్తున్నాను. ఇన్నాళ్ళూ నువ్వు భరించావు. మరో నాలుగు నెలలు నవ్వుతూ ఏమాత్రం బాధ కనిపించకుండా, నీ

అమూల్య అంగీకారం తెలియజెయ్యి.''

నా కళ్ళల్లో బొటబొటా నీళ్ళు. 'సుధీర్' వ్రాసిన నాలుగు నెలల ఆలశ్యం నా పాలిట నాలుగు యుగాలు!

''వెళ్దాం పద అమ్మా'' 'నిఖిల్' మాటలు నన్ను మేల్కొలిపాయి.

''అవును, వెళ్దాం. నన్ను తయారవనియ్యి.''

''సరే నువ్వు సిద్ధంగా వుండు. నేను బయటకెళ్ళి రిక్షా తీసుకువస్తా'' 'నిఖిల్' అలా అని బయటకి పరుగెత్తాడు.

నేను యాంత్రికంగా అన్ని పనులూ చేస్తున్నాను. 'సుధీర్' ఆగమనం మరో నాలుగు నెలలు వాయిదా పడింది. అంటే ఈ యింటి కార్యభారాలన్నీ నేనొక్కర్తినే మరో నాలుగు నెలలు నిర్వహించాలి!

నాకు వూరికే పెద్ద దెబ్బ తగిలినట్లనిపించింది. అత్తగారికి చెప్పి బయటపడ్డాను. ముందు చూస్తే 'నిఖిల్' రిక్షా తీసుకువస్తున్నాడు. వాడు రిక్షా కొద్దిదూరంలో ఆపి గబగబా నాదగ్గరకి పరిగెత్తుకు వచ్చాడు. నాకు ఎందుకో ఇరవై ఏళ్ళక్రిందట 'సుధీర్'తో జరిగిన ఒక విషయం జ్ఞప్తికి వచ్చింది. మేమిద్దరం రిక్షాలో కూర్చున్నాం.

నేను అనుకోకుండా వాడిని చూసాను. ఆశ్చర్యపోయాను. వీడి మొహం మీద లేతదనం, పసితనం పోయింది. పెదవులపైన నలుపు వచ్చింది. నాకు కొత్తగా గుర్తుకొచ్చినట్లనిపించింది. వచ్చే సంవత్సరమే వీడు పదకొండవ క్లాసు పరీక్షకి కూర్చుంటాడు. నాలోని తల్లి హృదయం సుఖంతో నిట్టూర్చింది. వాడు బట్టల విషయం అంతగా పట్టించుకోవడంలేదు. వాడు పొడుగు ప్యాంటూ, పొడుగు చేతుల షర్టూ వేసుకున్నాడు. చాలా పొడుగ్గా కూడా అయ్యాడు.

యథాలాపంగా ప్రతీ సంవత్సరం ఈ పుస్తకాలు కొనే ప్రక్రియ గుర్తుకొచ్చింది. పోయిన ఏడాది నేనే వెళ్ళి రిక్షా తెచ్చాను. వాడి చేతులు పట్టుకుని ముందు వాడిని రిక్షాలో కూరోచబెట్టి, ఆ తరువాత వాడి చేతుల ఆధారంగా నేను రిక్షాలో కూర్చున్నాను.

ఈ ఆలోచనల్లో మునిగివుండగా, రిక్షా పుస్తకాల షాపు ముందు ఆగింది. మేమిద్దరం రిక్షా దిగి, డబ్బులిచ్చి, షాపులోకి వెళ్ళాం. ఏం పుస్తకాలు తీసుకోవాలా అని నేను పరికిస్తున్నాను. ఇంతలోనే 'నిఖిల్' షాపు యజమానికి నాలుగైదు చక్కటి

పుస్తకాల పేర్లు చెప్పాడు - అవి కావాలని. 'నిఖిల్' ఫటాఫట్ పుస్తకాలు ఏరుతున్నాడు. ఇప్పుడు వాడికి యిదివరకటిలాగ భూత, ప్రేత, పిశాచాల కథలూ, రాజా-రాణీ కథలూ అక్ఖరలేదు. వాటిని ముట్టనయినా ముట్టలేదు. రెండు మూడు వైజ్ఞానిక కథలుండే పుస్తకాలు తీసి పక్కన పెట్టాడు. అవి వ్రాసింది వాడి అభిమాన రచయిత అట!

ఆ తరువాత వాడు మహిళలకోసం వ్రాసిన పుస్తకాలున్న 'ర్యాక్' దగ్గరికి వెళ్ళాడు. నేను వాణ్ణి పరీక్షగా చూస్తూ వెంబడించాను. ఎన్నో పుస్తకాలు వెతికి, చివరికి ఒక పుస్తకం తీసాడు. అది తీసి నా చేతిలో వుంచి "అమ్మా ఇది నీకోసం నా కానుక" అన్నాడు.

నేను పుస్తకం పేరు చదివి, పేజీలు తిరగేసాను. నలభై సంవత్సరాలు దాటిన మహిళల మానసిక సమస్యలూ - వాటి సమాధానాలూ శాస్త్రీయ దృక్పథంతో సులభశైలిలో సామాన్య స్త్రీలకోసం వ్రాసిన పుస్తకం, అట. నేను ప్రశంసాపూర్వకంగా ఆ పుస్తకం రెండు చేతుల్లోటీ తీసుకుని గుండెలకి హత్తుకొన్నాను. ఇంతలో వాడు మరో పుస్తకంతీసి నా చేతుల్లో వుంచి "ఇది నాన్నగారికోసం" అన్నాడు.

తీసిన పుస్తకాల ధరలు వాడు పరీక్షగా చూస్తున్నాడు. ఆ తరువాత పుస్తకాలన్నీ కౌంటర్‌దగ్గర దొంతరుగా పెట్టాడు. షాపువాడు బిల్లు తయారుచేయసాగాడు.

"మాకు డిస్కౌంట్ యివ్వాలి సుమా! ప్రతీ ఏడాదీ మేము పుస్తకాలు కొంటాం మీవద్ద."

దుకాణదారుడికి 'నిఖిల్' లౌక్యం చూసి ముచ్చటేసింది. ముసిముసి నవ్వులు నవ్వుతూ 'డిస్కౌంటు' (తగ్గింపు ధర) యిచ్చిన విషయం మౌనంగానే, సంజ్ఞలతో చెప్పాడు. బిల్లు డబ్బులు నిఖిలే యిచ్చాడు. నేను వూరికే నిల్చున్నాను.

మేమిద్దరం దుకాణం నుంచి బయటకొచ్చాం. ఎప్పుడూ వెళ్ళే హోటల్‌కి వెళ్ళాం. వాడికిష్టమైన 'ఐస్‌క్రీం' అడగాలని నేను అనుకొన్నాను. నేను నోరు విప్పేలాగానే, 'నిఖిల్' ఆర్డర్ ఇచ్చాడు "రెండు ప్లేట్ల బటాటా వడ" అని. తరువాత నన్ను చూసి నవ్వుతూ అన్నాడు :

"అమ్మా! నిన్ననే మిగిలిన 'స్కాలర్‌షిప్' డబ్బులు వచ్చాయి. అందుకనే ఈసారి పుస్తకాల డబ్బు నేనే ఇచ్చాను. మిగిలిన డబ్బుతో ఈ బిల్లు - బటాటా వడలకి - యిస్తాను. అమ్మా నాకు తెలుసు ఈ హోటల్లో బటాటా వడ చాలా

బాగుంటుంది. నీకు నచ్చుతుంది. నాకు తెలుసు. నువ్వెప్పుడూ ఏదీ నీకోసం తీసుకోవు. నాన్నగారిక్కడ వున్నప్పుడు తెప్పించుకొనేదానవు, కదూ? అదీ ఆయన మరీ మరీ 'ఏంకావాలని' అడిగితేనే."

నాకు కళ్ళనీళ్ళు ఉప్పెనలా వచ్చాయి. నేను చెప్పలేనంత ఆశ్చర్యంతో 'నిఖిల్'కేసి చూసాను - "ఎంత త్వరగా ఎంత పెద్దవాడయ్యాడూ?" అని!

"అరే! ఎంత పెద్దవాడవయ్యావురా నువ్వు. ఇన్ని రోజులూ నేను గమనించనేలేదెందుకనీ?" ఎందుకో ఈ మాటలు మనస్సులోనే వుండిపోయాయి. బయటపడలేదు. నేను తాపీగా బటాటా వడ తింటూ కూర్చున్నాను.

మేము 'బస్‌స్టాప్'కి వచ్చాము. అక్కడ చాలా రద్దీగా వుంది. జనంతో కిటకిటలాడుతూన్న బస్సు వచ్చింది. 'నిఖిల్' నన్ను ముందు ఎక్కించాడు. తరువాత తనూ ఎక్కాడు. నా చుట్టూ చేతుల్తో కోటకట్టినట్లు నిలబడ్డాడు. నాకే విధంగానూ ఇబ్బంది కలక్కుండా వుండేలా జాగ్రత్తపడ్డాడు. నేను నడుం తిన్నగా చేసాను. నాకు తెలిసింది - నా తల వాడి భుజంమీద వాలిందని.

అకస్మాత్తుగా నా మనస్సులో బరువు తగ్గినట్లనిపించింది. మా స్టాపు రాగానే దిగాము.

నడుస్తూ, నడుస్తూ 'నిఖిల్' అడిగాడు -

"అమ్మా! నాన్న ఎప్పుడు తిరిగివస్తాడూ?"

"ఆయన అమెరికాలో వుండవలసిన కాలం మరో నాలుగు నెలలు పెంచారుట."

"ఐతే అమ్మా యిలా చేద్దాం. మనమే నాయనమ్మని స్పెషలిస్టు (డాక్టరు) దగ్గరకి తీసికెళ్ళి చూపిద్దాం. నాన్న వచ్చేవరకూ ఆగవద్దు నేనివాళే డాక్టరుగారి 'ఎపాయింట్‌మెంట్' తీసుకుంటాను. నేనే నాయనమ్మని డాక్టరు దగ్గరకి తీసుకెళ్తాను. నాన్నగారి స్కూటర్ సరిగ్గా స్టార్ట్ అవడంలేదు. నిన్ననే చూసాను. దాన్ని గారేజ్‌కి యిస్తాను - బాగు చేయడానికి."

"అరే, నీకు స్కూటర్ నడపడం రాదుకదరా?" నేను చటుక్కున అడిగాను.

"ఏంటమ్మా అలా అంటావు? నేనే నడిపి మెకానిక్ దగ్గరకి వెళ్ళాలా? వాడికి చెప్పి యింటికి పిలవ్వొచ్చుకదా?"

"అలాగే ఇంటికి రంగు వేయడం విషయం చూద్దాం. నాన్న వచ్చేసరికి

అంతా కొత్తగా, ఎంచక్కా కనిపించాలి."

'నిఖిల్' నాలాగ నాన్చకుండా, తండ్రిలాగే తొరతొరగా నిర్ణయాలు తీసుకొంటున్నాడు. నా మనస్సు బెంగలన్నీ మాయమయి శాంతించింది. హమ్మయ్య! వీడు ఎదిగొచ్చాడు!

రాత్రి నిర్మల హృదయంతో 'సుధీర్'కి నీలం రంగు ఏరోగ్రాం ఉత్తరం వ్రాసాను.

"సుధీర్, సావకాశంగా నీ థీసెస్ పూర్తిచేసి సంపూర్ణ యశస్సుతో స్వదేశానికి లాభంగా తిరిగిరా. నాలుగు నెలలేం పెద్ద సమస్యకాదు. కాలం యిట్టే గడిచిపోతుంది..."



# రచయితల పరిచయం

**చంద్రకాంత్ శాంతారాం కెణీ (26-11-1934)** : ఆయన 'గోవా'లోని 'కా(సావళే' గ్రామంలో జన్మించారు. 'గోవా' స్వాతంత్ర్యానికి పూర్వం 'బొంబాయి'లోని ఆకాశవాణి కేంద్రంలో సంపాదక విభాగంలో ఉద్యోగం చేసారు. తరువాత 'ఢిల్లీ'లో ఆచార్య కాకాసాహెబ్ కాలేల్కర్ వద్ద వున్నారు. అక్కడ 'గోవా ఇన్‌ఫర్‌మేషన్ సెంటర్' (గోవా సమాచార కేంద్రం) నడిపి గోవా స్వాతంత్ర్యయోధులకి అండగా నిలిచారు. గోవా విముక్తి అయినాక 'గోవా' వచ్చి పాత్రికేయుడిగా స్థిరపడ్డాడు. 1963 నుండీ 'రాష్ట్రమత్' అనే మరాఠీ దినపత్రికకి సంపాదకుడిగానూ, 'సునాప్రాంత్' అనే కొంకణీ దినపత్రికకి ప్రప్రథమ సంపాదకుడుగానూ వ్యవహరించారు. కొంకణీతోబాటు మరాఠీ, ఇంగ్లీషు, హిందీ భాషల్లో రచనలు చేశారు. కొంకణీ భాషా ఉద్యమంలో ముఖ్యపాత్రధారి. దేశంలో ఎన్నో ప్రాంతాలు పర్యటించారు. విదేశాలు బంగ్లాదేశ్, పాకిస్తాన్, థాయిలాండ్, నేపాల్, కువైట్, సంయుక్త అరబ్ అమీరట్, వగైరా దేశాలు వెళ్ళివచ్చారు.

ఈయన ముఖ్యంగా కథా రచయిత. సుమారు రెండు వందలకి పైగా కథలు వ్రాసారు. 'కథికా' అనే కథాశిల్పం కొంకణీలో ప్రవేశపెట్టారు. ఈ రోజువరకూ 'ధర్తరీ అజూన్ జియోతాలి' (భూమి యింకా బ్రతికేవుంది!), 'ఆషాడ్ పావ్‌లీ' (ఆషాడమాసం వచ్చింది), 'వ్హకల్ పావ్‌ణీ' (వధువుతో వచ్చిన అతిథులు), 'కథికా' (కథాగుచ్ఛం), 'జయ్ వతా థయ్' (వెళ్ళినచోటల్లా నీడలా), 'మేఘ్ మల్హార్' అనే కథా సంగ్రహాలు వెలువడించారు. ఇవిగాక అయిదు నవలలు, ఒక మరాఠీ కథల సంగ్రహం, రెండు వ్యాస సంపుటాలూ, ఒక సమీక్షల పుస్తకం ప్రచురించారు. ఇవిగాక "భాఁయ్ చాఫీ" (భూమిలోంచి తిన్నగా దొలుచుకువచ్చే ఒక రకం పువ్వు - 'గోవా'లో లభిస్తుంది), "కొంకణీ కథ" అనే కొంకణీ కథలకి ప్రాతినిధ్యం వహించే కథా సంకలనానికి సంపాదక బాధ్యత వహించారు. కొన్ని నవలలని కొంకణీ భాషలోకి అనువదించారు. ఆయన వ్రాసిన "వ్హకల్ పావణీ" (వధువుతో వచ్చిన అతిథులు)

అనే కథా సంగ్రహానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం 1989లో లభించింది. ఇదిగాక గోవా కళా అకాడమి, డాక్టర్ టి.ఎం. పాయ్ ఫౌండేషన్ (మణిపాల్) వారు ఆయనని సత్కరించి, అవార్డులు యిచ్చారు.

**అ.న. మ్హాంబ్రె (4-10-1938)** : ఈయన 'రాయ్‌బందర్' అనే (పంజిం, గోవాకి సమీపంలోని) గ్రామంలో పుట్టారు. చదువు గోవాలోనూ, బొంబాయిలోనూ. ఉద్యోగ నిమిత్తం బొంబాయిలోనే నివాసం. కథలతోబాటు వ్యాసాలూ, నాటకాలూ వ్రాసారు. "పణ్‌జీ ఆతాఁ మ్హాతారీ జాల్యా" (పంజిం యిప్పుడు ముసల్దయింది) అనే కథల సంపుటికి సాహిత్య ఎకాడమీ పురస్కారం (1987) లభించింది. "ప్రసాదా ఫూల్" (ప్రసాదంతో పువ్వులు), "స్వతంత్ర గోయాఁత్లీ కొంకణీ కథ" (స్వతంత్ర గోవాలో కొంకణీ కథలు) అనే వివిధ రచయితల ప్రాతినిధ్యం వహించే కథా సంపుటికి సంపాదకత్వం వహించారు. ఒక వ్యాస సంపుటీ, ఒక నాటకం, బాలసాహిత్యం మీద ఒక పుస్తకం ప్రచురించారు. గోవా కళా ఎకాడమీచేత బాల సాహిత్యానికీ, కథకీ చేసిన సేవకి రాజ్య పురస్కారం పొందారు.

**అచ్యుత్ థారేశ్వర్ తోటెకార్ (30-10-1932)** : ఈయన జన్మ ఒక వైదిక కుటుంబంలో 'ప్రియోల్' అనే గ్రామంలో (పొండా తాలూకా, గోవా) జరిగింది. పూజారిగా వ్యవహరిస్తూ, తోటలూ, వ్యవసాయం కూడా చూసుకుంటారు.

1959లో బొంబాయి ఆకాశవాణికి రేడియో నాటిక వ్రాసి, వ్యాసాంగానికి శ్రీకారం చుట్టారు. ఆ తరువాత బొంబాయి, గోవా 'ఆకాశవాణి' స్టేషన్లకి నాటికలు, కథలు, ప్రసంగాలూ యిచ్చారు.

'గోవా' స్వాతంత్ర్యానంతరం కథలు వ్రాయడం మొదలుపెట్టారు. ఆయన వెలువరించిన "చైత్రపూర్ణ" అనే కొంకణీ కథల సంపుటి చాలా ప్రసిద్ధి గడించింది.

**శాంతారాం అనంత్ హెడో (11-4-1912 - 22-11-1992)** : ఈయన 'గోవా'లోని పొండా తాలూకా 'షిరోడా' గ్రామంలో పుట్టారు. చదువు మరాఠీ, పోర్చుగీసు భాషలలో. ముందు టీచరుగా, ఆ తరువాత శిక్షణ అధికారిగా పనిచేసారు.

ఈయన కొంకణీతోబాటు మరాఠీ, పోర్చుగీసు భాషల్లో వ్యాసాంగం సాగించారు. 'ఖలీల్ జిబ్రాన్' రచనలు పోర్చుగీసులో వ్రాసారు. విద్యకి సంబంధించిన సమస్యలు ఉల్లేఖిస్తూ మరాఠీలో ఒక పుస్తకం ప్రచురించారు. కొంకణీలో 'ఘర్‌పురుష్' (ఇంటిపెద్ద) అనే కథల సంపుటీ; కొంకణీ - కొంకణీ డిక్షనరీ, గాంధీ చరిత్ర; పోర్చుగీసు భాషలో నాటకాల కొంకణీ అనువాదాలు, బాల సాహిత్యం మీద పుస్తకం ప్రచురించారు. ఇవిగాక రెండు కథా సంపుటాలు ప్రచురణలో వున్నాయి. ఆయన సాహిత్యసేవని గుర్తించి గోవా కళా ఎకాడమీ సత్కరించి, సన్మానం చేసింది.

**దామోదర్ యశ్వంత్ మావ్‌జో (1-8-1944)** : ఈయన 'గోవా'లోని 'సాల్‌సెట్' తాలూకాలోని 'మజోర్డా' గ్రామంలో జన్మించారు. చదువు 'గోవా'లోనూ బొంబాయిలోనూ. 'కామర్స్' చదివి కుటుంబ వ్యాపారం (ఫామిలీ బిజినెస్) కిరాణాకొట్టు చూసుకొంటున్నారు. ఆయన ఐరోపా ఖండం, 'కువైట్' వగైరా విదేశాలకి వెళ్ళారు. కొంకణీ రాజ్య భాషా ఉద్యమం (1985)లో విలువైన పాత్ర ధరించారు. మంచిపని చేశారు.

'గాంధన్' (చాపల మాల), 'జాగరణ్' (జాగరణ), 'రుమడ్‌పూల్' (ఔదంబర వృక్షపు పుష్పాలు) అనే కథా సంకలనాలు వెలువడ్డాయి. ఒక చిన్న నవలిక, బాల సాహిత్యపు రెండు పుస్తకాలు ప్రచురించారు. ఆయన ప్రసిద్ధి పొందిన నవల 'కార్మెలిన్'కి కేంద్ర సాహిత్య ఎకాడమీ అవార్డు లభించింది (1983)లో. ఆయన కథ ఆధారంగా ఒక టెలీ-ఫిల్మ్' నిర్మించారు. అలాగే బుల్లితెర (టి.వి.)కోసం 'స్క్రీన్‌ప్లే, డైలాగులూ' వగైరా వ్రాసారు. గోవా కళా ఎకాడమీ ఎవార్డు పొందారు.

**శీలా తుకారాం కోళంబ్‌కార్ (1945)** : (పెళ్ళికిముందు పేరు 'శీలా మార్తో నాయక్') ఈమె 'గోవా' రాజధాని పంజిం (పణాజి)లో జన్మించారు. 'గోవా'లోనే విద్యాభ్యాసం, ఆ తరువాత కొన్నాళ్ళు టీచరు ఉద్యోగం చేసారు. వివాహానంతరం బొంబాయికి నివాసం మార్చారు.

ఆవిడ ''ఓలీసాంజ్'' (తడి సంజ) అనే కథా సంగ్రహం, ''భూయీ-చాఁఫీ'' (భూమి సంపెంగ) అనే వ్యక్తిత్వ చిత్రణ చేసే వ్యాస సంపుటీ, కొన్ని నాటికలూ

ప్రచురించారు. ఆవిడకి కేంద్ర సాహిత్య ఎకాడమీ అవార్డు లభించింది.

**మీనా సురేశ్ కాకోడ్కార్ (1944)** : (పెళ్ళికిముందు పేరు మీనాక్షీ దుర్గాగాయ్‌తోండె) ఈమె 'గోవా'లోని 'కాణ్‌కోణా' తాలూకా 'పాళోళె(" గ్రామంలో జన్మించారు. చదువు కొంత 'గోవా'లో, కొంత 'బొంబాయి'లో. ఉద్యోగం గోవా ప్రభుత్వంలో ఎకౌంట్స్ డిపార్టుమెంటులో డిప్యూటీ డైరెక్టరుగా. "డోంగర్ చ(వల్లా" (కొండ పిలిచింది), "సపన్ ఫూలా(" (స్వప్న పుష్పాలు) అనే రెండు కథా సంగ్రహాలు వెలువడ్డాయి. ఈమెకి 1991లో కేంద్ర సాహిత్య ఎకాడమీ అవార్డు ప్రాప్తించింది. ఇదిగాక డాక్టర్ టి.ఎం.ఎ. పాయ్ ఫౌండేషన్ పురస్కారం, ఫుళాగర్ పురస్కారం, గోవా కళా ఎకాడమీ పురస్కారం లభించాయి.

**దత్తా శ్రీపాద్ నాయక్ (1-2-1940)** : ఈయన జన్మ 'గోవా'లోని 'డివచల్' అనే వూళ్ళో. చదువు 'గోవా'లోనూ, 'పూనా'లోనూ, ఇంజనీరింగ్ చదివారు. 'కొంకణీ రాజ్యభాషా' ఉద్యమంలో ఆయన కీలక పాత్ర ధరించారు.

'కొంకణీ'తోబాటు 'మరాఠీ'లో కూడా కథలు వ్రాసారు. ఆయన కథలు కొన్ని 'ఏక్ ఆశిల్లో సో(సో' (ఒక కుందేలు కథ) అనే మకుటంతో ప్రచురించారు. ఒక నాటకం, ఒక ఏకాంకికల సంగ్రహం అచ్చయ్యాయి. ఆయన వ్రాసిన 'హు(వార్' (వరదలు) నవల మహారాష్ట్రంలో 'పాన్‌షే' అనే వూళ్ళో ఆనకట్ట హఠాత్తుగా తెగి, వూరంతా వరదల్లో మునిగిన వైనంపై ఆధారంగా వ్రాసినది. గొప్ప సంచలనం కలిగించి కొంకణీ సాహిత్య క్షేత్రంలో మైలురాయిగా నిలిచింది.

ఆయనకి గోవా కళా ఎకాడమీ సాహిత్య పురస్కారం లభించింది.

**డాక్టర్ ఆలివ్హిన్యూ గో(మిశ్ (1943)** : ఈయన జన్మ 'గోవా'లోని 'సాంత్ ఇస్త్రెవ్వావ్' అనే గ్రామంలో. చదువు గోవా, పూనా, కర్ణాటకలో. శివాజీ విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ లభించింది. 1969లో ఐ.ఎ.ఎస్. (I.A.S.) పాసయ్యారు. కేంద్ర ప్రభుత్వంలో 'అసిస్టెంట్ కలెక్టర్' మొదలు 'ఎడిషనల్ కమిషనర్' వరకూ సోలాపూర్, రత్నగిరీ, నాశిక్, ఢిల్లీ మరియూ 'గోవా'లోనూ

బాధ్యతలు నిర్వహించారు. ప్రస్తుతం 'గోవా విశ్వ విద్యాలయం'లో కొంకణీ భాషా విభాగపు (హెడ్) ముఖ్య అధికారి. ఆయన 'కెనడా', 'ఫ్రాన్స్', 'పోర్చుగల్' దేశాలు పర్యటించారు.

'కొంకణీ'తోబాటు ఇంగ్లీషులో రచనలు చేసారు. ఆయన కథల సంపుటి 'మన్ వోడ్టా, వోడ్నా' (లాగి వొదిలే మనసు) ఒక చరిత్ర, రెండు బాల సాహిత్యపు పుస్తకాలూ, ఒక కవితా సంపుటీ ప్రచురించబడ్డాయి. ఆయన అనువాదాలలో చాలా కృషి చేసారు. కాళీదాస్, జార్జ్ ఆర్వెల్, ఖలీల్ జిబ్రాన్, ఫెనార్డ్ పెసోఆ, హెన్రిక్ ఇబ్సన్, కాల్ దెర్సిన్, దెలా బార్కా, గర్రా జ్యూ(కెయర్ ఆది విఖ్యాత రచయితల ముఖ్య రచనలు కొంకణీ, ఇంగ్లీషు భాషలలో అనువదించి పుస్తక రూపాలలో ప్రకాశించారు.

ఆయన్ని 'గోవా కళా ఎకాడమీ', 'కేంద్ర సాహిత్య ఎకాడమీ' పురస్కారాలతో గౌరవించాయి.

**పుండలిక్ నారాయణ్ నాయక్ (21-4-1952)** : ఈయన 'గోవా'లోని 'పోండా' తాలూకా 'వాల్ వోయ్' గ్రామంలో జన్మించారు. విద్య ముగించాక కొన్నాళ్ళు గోవా ఆకాశవాణి కేంద్రంలో సంపాదక విభాగంలో పనిచేసారు. ఆ తరువాత ఉద్యోగానికి రాజీనామా చేసి పూర్తికాలం సాహిత్య వ్యాసాంగానికి అర్పితం చేసారు. గోవా రాజభాషా ఉద్యమం (1985)లో ముకుటాయమైన పాత్ర వహించారు.

'కొంకణీ'లోనేగాక 'మరాఠీ'లో కూడా రచనలు చేసారు. అచ్చయిన ఆయన కథా సంగ్రహాలు; 'ముఠయ్' (తొలిపంట), 'పిషాంతర్' (పిచ్చివైద్యం), 'అర్దాక్' (సగభాగం) మూడు సంకలనాలు, ఒక విఈన సంగ్రహం, మూడు నవలలూ, మూడు బాల సాహిత్యపు పుస్తకాలూ కూడా అచ్చయ్యాయి. నాటక రంగంలోనూ, ఏకాంకికల రచనలోనూ ఆయన కృషి చరితార్థమైనది. మూడు ఏకాంకిల సంగ్రహాలు, పధ్నాలుగు నాటకాలూ ప్రచురించబడ్డాయి.

కొంకణీ, మరాఠీ భాషలలో చిన్న 'టెలీ ఫిల్ము'లు తనే స్వయంగా కథ, సంభాషణలు, పాటలు, స్క్రీన్‌ప్లే వగైరాలు వ్రాసి నిర్మించి గోవా, ఢిల్లీ, బొంబాయి దూరదర్శన్‌లలో ప్రసారం చేయించారు.

ఆయన వ్రాసిన 'చౌరంగ్' (చదరంబల్ల) ఏకాంకిల సంగ్రహానికి కేంద్ర సాహిత్య ఎకాడమీ అవార్డు (1984) లభించింది. ఆయన వ్రాసిన నాటకానికి ఆకాశవాణి అవార్డు (మొదటి బహుమతి), అంతర్జాతీయ 'పెటర్స్ ఆస్ట్రేలియన్ అవార్డు' లభించాయి.

ఇటీవల 'వెంచిక్ పుండలిక్' (పుండలిక్ రచనామృతం) అనే వ్యాసాల మరియూ ఇతర సాహిత్య ప్రక్రియల (కథ, నవల, నాటిక, కవిత, ఏకాంకిక వగైరా) దొడ్డ గ్రంథం వెలువడింది. ఈ గ్రంథం యూనివర్శిటీలో ఎమ్.ఎ., పి.హెచ్‌డీ వగైరా చేసే పట్టభద్రులకి తోడ్పడే విధంగా రూపొందించబడింది.

**ఎస్. శివదాస్ (శివదాస్ సోనూ నాయక్) (17-3-1949)** : ఈయన 'గోవా'లోని 'పోండా' తాలూకాలోని 'నాగేషీ' గ్రామంలో జన్మించారు. టీచరు ఉద్యోగం. 'గోవా' దేవాలయాల్లో బడుగు వర్గాలపై చూపే హీనదృష్టికి విచక్షణకీ విరుద్ధంగా ఉద్యమ రూపంలో పోరాడి ఆక్షేపణ తెలియజేసారు. కొంకణీ, మరాఠీ దినపత్రికలలో తరుచూ వ్యాసాలూ వ్రాస్తారు - (వివిధ సాహిత్య, సాంఘిక విషయాలమీద). కొంకణీ రాజభాషా ఉద్యమంలో అమూల్య సేవ చేసారు.

"గళ్‌సరీ" (బంగారు గొలుసు) అనే కథా సంగ్రహం వెలువడింది. ఇదిగాక ఒక నవల, రెండు నాటికలూ పిల్లలకోసం ఒక చిన్న నవలా ప్రచురించారు.

ఆయన సాహిత్య సేవ గుర్తించి గోవా కళా ఎకాడమీ అవార్డు నిచ్చి సత్కరించింది.

**జయమాలా నారాయణ్ దణాయత్ (17-12-1947)** : (వివాహానికి పూర్వపు పేరు జయమాలా దామోదర్ ప్రభూ చోడ్నేకార్) ఈవిడ 'గోవా'లోని 'కెపే' తాలూకా, 'జాంబవళీ' గ్రామంలో జన్మించారు. చదువు పూర్తయిన తరువాత గోవాలోనే బ్యాంక్ ఉద్యోగం కొన్నాళ్ళు చేసి, వివాహానంతరం నౌకరీ మాని, భర్తతో బొంబాయిలో స్థిరపడ్డారు. అక్కడ బొంబాయి ఆకాశవాణిలో కొన్నాళ్ళు పనిచేసారు. "కవాసో" (మొగలి పువ్వు) అనే కథా సంగ్రహం వెలువడింది. అమెకి గోవా కళా ఎకాడమీ ఎవార్డు లభించింది.

**హేమా పుండలిక్ నాయక్ (6-5-1952)** : (వివాహానికి పూర్వం 'హేమా అనంత్ ధుమట్‌కార్') ఆమె 'గోవా'లోని 'మడ్‌గావ్' పట్టణంలో జన్మించారు. ఇరవై సంవత్సరాలు బ్యాంక్‌లో ఉద్యోగం చేసి విరమించారు. కొంకణీ సాహిత్య క్షేత్రంలో కేవలం మహిళలకోసం, కేవలం స్త్రీ సమస్యలకి అంకితమైన "చిత్రాంగి" అనే పత్రికకి సంపాదకురాలు. మహిళాభ్యుదయానికీ, స్త్రీ సమస్యల చర్చలకీ సమావేశాలు నిర్వహించారు. స్త్రీ రచయితలని సాహిత్య క్షేత్రంలో ప్రోత్సహిస్తూ వారి రచనలు పత్రికలలోనూ, పుస్తకాల రూపంలోనూ ప్రచురించారు. కొంకణీ భాషలో ప్రచురణ సంస్థని నడుపుతున్న ఈవిడ, కొంకణీ టెలీ-ఫిల్మ్ నిర్మాత కూడా.

ఈవిడ వ్రాసిన కథల సంపుటి 'పసయ్' (నీరెండ) అనే పేరుతోనూ, ఒక నవల, ఒక ఏకాంకిక, ఒక వ్యాస సంపుటీ, ఒక నాటకమూ, రెండు (తన సంపాదకత్వాన్న) యితర రచయితల రచనల పుస్తకాలూ వెలువడ్డాయి.

**ఎడ్విన్ జోసెఫ్ ఫ్రాన్సిస్ డిసౌజా (14-6-1948)** : ఈయన జన్మ కర్ణాటక రాజ్యంలోని 'దక్షిణ కనరా' తాలూకాలోని 'మంగళూర్' పట్టణంలో. ప్రాథమిక విద్య, ఉన్నత విద్యా 'మంగళూరు'లోనే. పదహారు సంవత్సరాలు విదేశం "కువైట్"లో సాంకేతిక పరికరాల విక్రేతగా (సేల్స్‌మ్యాన్) పనిచేసారు.

స్వదేశానికి తిరిగి వచ్చి స్వంత వూళ్ళో స్థిరపడి, పూర్తి సమయం కొంకణీ వ్యాసాంగానికి, కాలేజీలలో కొంకణీ వ్యాఖ్యాతగానూ వ్యవహరిస్తున్నారు. ఆయన ఐరోపా ఖండం, మిడిల్ ఈస్ట్, ఫార్ ఈస్ట్ అనబడే ప్రాంతాలలోని అనేక దేశాలు పర్యటించారు.

చిన్నతనంలోనే 11 సంవత్సరాల వయస్సులోనే రచనా వ్యాసాంగం ప్రారంభించిన శ్రీ డిసౌజా 26 నవలా పుస్తకాలు ప్రచురించారు. వీటిలో చాలా నవలలు మూడవ ముద్రణ కూడా పొందాయి. వాటిలో కొన్ని నవలలు కన్నడ భాషలో అనువదించారు. గత 26 సంవత్సరాలలో ఆయన యాభైకి పైగా కథలు వ్రాసారు. "తరణీకిరణా" (తరుణ కిరణాలు) అనే కథల సంపుటి ప్రచురించబడింది.

ఆయన రచనలకి T.M.A.PAI AWARD లభించింది; అలాగే 'మంగళూర్'లోనూ, 'గోవా'లోనూ పలు సంస్థలు సత్కరించాయి.

**గజానన్ రఘునాథ్ జోగ్ (1-10-1952)** : ఈయన 'గోవా'లోని 'సాకోర్డె' (సాంగెం తాలూకా) అనే గ్రామంలో జన్మించారు. బి.ఎ. (ఆనర్స్) చదివి ఎల్.ఎల్.బి. చేసారు. బ్యాంక్‌లో ఉద్యోగం.

కథలతోబాటు కొన్ని హాస్య రచనలూ, కవితలూ ప్రాసారు. రెండు కథా సంగ్రహాలు 'రుద్ర' (రౌద్రము) 'సోద్' (సంశోధన) అవికాక బాల సాహిత్యం ఒక పుస్తకం వెలువడ్డాయి. మరాఠీ భాషలోనూ కథలు వ్రాసారు.

**ప్రొఫెసర్ కె.ఆర్. వసంతమణి (12-9-1941)** : ఈయన 'కేరళ' రాష్ట్రంలో 'తోర్‌బూర్' అనే వూళ్ళో జన్మించారు.

మళయాళం భాషలో కొన్ని పాఠ్యపుస్తకాలు వ్రాసారు. ఇంగ్లీషు భాషలోనూ వ్రాసారు.

కొంకణీ కథల సంగ్రహం "భాంగరా దాఁత్" (బంగారు పళ్ళు) వెలువడింది.

**తోమా జిన్యూ కోర్డేజ్ (24-4-1946)** : ఈయన 'గోవా'లో బార్డెజ్ తాలూకాలోని 'పొంబుర్పా' అనే వూళ్ళో పుట్టారు. పాఠశాలలో టీచరుగా, సూపర్‌వైజర్‌గానూ పనిచేసారు. 'గోవా'లోని 'బార్‌డేజ్' తాలూకాలో 'కాందోళి' గ్రామంలో 'సర్పంచ్'గా చాలా సంవత్సరాలు పనిచేసారు. గోవాలో పంచాయతీరాజ్ ఉద్యమంలో నాయకత్వం వహించి సఫలీకృతులయ్యారు. 1994 సం॥ గోవా ఎసెంబ్లీకి ఎమ్.ఎల్.ఎ.గా ఎన్నికయి, దరిమిలా సభాపతి (SPEAKER) అయ్యారు. 1985లోని గోవా రాజభాష కొంకణీ చేయాలనే ఉద్యమంలో ఆయన మహత్త్వపూర్వకమైన పాత్ర ధరించారు. 'గోవా'లో జనరంజకమైనన 'తియాత్ర' అనే నాటక కళని ఆధునికం చేసి, మరింత జనాదరణ గడించేలా రచనా, నటనా, తాంత్రిక సదుపాయాలూ అభివృద్ధి చేయడానికి తోడ్పడ్డారు. ఆధునిక భారతీయ రంగ భూమికి, కొంకణీ రంగ భూమి ఎదిగేలా కృషి చేసారు; చేస్తున్నారు. అలాగే 'మాండో', 'కాంతార్' అనే గోవా జానపద సాహిత్యానికి గుర్తింపు, ప్రతిష్ఠ లభించడానికి కారకులయ్యారు.

ఒక కవితా సంగ్రహం, ఒక 'జెలో' (గుత్తి) అనే కథల సంపుటీ, పదకొండు

నాటికల (తియాత్ర) మాల, ఒక ఏకాంకికల పుస్తకం వెలువడ్డాయి. అవిగాక 'మాండో' పాటలూ, 'కాంతార్' గీతికలూ మ... వ్యాలవంటివి సేకరించి ప్రచురించారు. వీరికి గోవా కళా ఎకాడమీ సాహిత్య పురస్కారం లభించింది.

**గోకుల్‌దాస్ ప్రభూ (18-12-1954)** : ఈయన కేరళ రాష్ట్రంలోని 'కొచ్చిన్' పట్టణంలో వెర్‌ళాయ్ మఠంలో జన్మించారు. ప్రాథమిక విద్య 'మళయాళ' భాషలో జరిగింది. 'తమిళ్‌నాడు' ఎమ్.ఏ. చదివారు. ప్రస్తుతం కర్ణాటక రాజ్యంలో ఒక బ్యాంక్‌లో ఉద్యోగం. కొంకణీ, మళయాళం, కన్నడ, తమిళ భాషలు (హిందీ, ఇంగ్లీషు కాక) వచ్చును. 'అంతర్యామీ', 'పృద్వేనమః' అనే రెండు కథా సంగ్రహాలు, నవల ప్రచురించబడ్డాయి. మరో కథా సంగ్రహం, ఒక ఏకాంకిక ముద్రణలో వున్నాయి. ఆయనకొన్ని 'మళయాళం' కథలు, ముఖ్యంగా 'ఎం.టి. వాసుదేవన్ నాయర్' రచనలు కొంకణీలోకి తర్జుమా చేసారు.

'అంతర్యామీ' కథా సంగ్రహానికి 1994లో కేంద్ర సాహిత్య ఎకాడమీ ఎవార్డు లభించింది. ఇదిగాక DR. T.M.A. PAI FOUNDATION AWARD ప్రాప్తించింది.

**జెస్ ఫర్నాండస్ (6-9-1941)** : ఈయన 'గోవా'లోని 'కణ్‌కోణా' తాలూకా 'పాళోళే' గ్రామంలో జన్మించారు. ప్రాథమిక విద్య పోర్చుగీసు భాషలోనూ, ఆ తరువాత డిగ్రీ చదువు ఇంగ్లీషులోనూ. ప్రభుత్వ ఆరోగ్య శాఖలో సానిటరీ ఇన్‌స్పెక్టర్‌గా ఉద్యోగం. కొంకణీలో కవిగా పేరుగాంచిన ఈయన ఒక కవితా సంగ్రహం, 'పునర్‌జీవన్' (పునర్జీవితం) అనే కథల సంపుటీ ప్రచురించారు. ఇవిగాక ఆయన 'తియత్ర్' (TIATR), ఏకాంకికలు, ఒక ఏకపాత్ర నాటికా రచించారు.

**మహాబళేశ్వర్ దత్తా సైల్ (14-4-1945)** : ఈయన కర్నాటక రాష్ట్రంలోని 'కార్‌వార్' జిల్లాలోని 'మాజాలీ' గ్రామంలో జన్మించారు. పదిహేడవ సంవత్సరంలో భారతీయ సైన్యంలో భర్తీ అయ్యారు. 1963వ సంవత్సరం ఐక్యరాజ్య సమితి శాంతి సైన్యంలో భారతదేశపు సైనికుల దళంలో సభ్యుడిగా 'ఈజిప్ట్' - 'ఇస్రాయిల్'ల మధ్య శాంతి సంరక్షణలో తోడ్పడ్డారు. అలాగే 1965లో భారత-పాకిస్తాన్ యుద్ధంలో

'హుసేనీవాలా' విభాగంలో పాల్గొన్నారు. ఆ తరువాత రిటైరయి కేంద్ర తంతీ-తపాలా శాఖలో జేరారు. ప్రస్తుతం 'గోవా'లో పోస్టమాస్టర్ ఉద్యోగం చేస్తున్నారు.

"పల్‌తడ్‌చే తారూ" (అవతలిగట్టు పడవ), 'తరంగ' అనే రెండు కథా సంగ్రహాలు వెలువడ్డాయి (కొంకణీలో). అలాగే మరాఠీలో నాలుగు నాటకాలు వ్రాసి ప్రచురించారు. ఈయనకి 1994 కేంద్ర సాహిత్య ఎకాడమీ ఎవార్డు లభించింది. ఇదిగాక గోవా ప్రభుత్వపు కళా ఎకాడమీ ఈయనని ఎవార్డుతో గౌరవించింది.

**శశాంక్ సీతారాం షిరోడ్‌కార్ (3-8-1953)** : ఈయన 'గోవా'లోని 'కణ్‌కోణా' తాలూకాలో 'మాషే(' అనే గ్రామంలో జన్మించారు. 'క్యాన్సర్' వ్యాధి వలన ఆయన అకాల మరణం చెందారు. ఆయన బి.ఎస్.సీ. వరకూ చదివి, టీచరుగా పనిచేసారు. కథలతోపాటు ఏకాంకికలు వ్రాసారు. నాటకరంగంలో అభినయం చేసారు. ఆయన వ్రాసిన 'నబత్' (దేవాలయాల్లో ముప్పూటలా వాయించే భజంత్రీలు) అనే కథాసంగ్రహం, 'పశ్న' అనే ఏకాంకికల సంగ్రహం ప్రచురించబడ్డాయి. 'పరీఘ' (శైవారం) అనే రెండవ కథాసంగ్రహం ముద్రణలో వుంది.

**జయంతీ నామ్‌దేవ్ నాయక్ (6-8-1962)** : ఈమె 'గోవా'లోని 'కేపె(' తాలూకాలోని 'అమోణే' అనే వూళ్ళో పుట్టారు. డిగ్రీ చదువుల తరువాత జానపద సాహిత్యం మీద పరిశోధన చేసి 'పోస్ట్-గ్రాడ్యుయేట్' డిప్లొమా సంపాదించారు. ప్రస్తుతం 'గోవా కొంకణీ ఎకాడమీ'లోని జానపద సాహిత్య విభాగంలో సహాయకులుగా పనిచేస్తున్నారు.

ఈమె జానపద సాహిత్యంమీద ఆరు పుస్తకాలు ప్రచురించారు. అందులో "అమోణే ఏక్‌లోక్ జీణ్" (అమోణా ప్రజల జానపద సంపద) అనే పుస్తకం గొప్ప ప్రశంసలు పొందింది. 'గర్జన్' (గర్జన) రెండవ కథా సంగ్రహం ప్రచురించబడింది.

**తుకారాం రామాశేర్ (31-7-1952)** : ఈయన 'గోవా'లో 'ఫోండా' తాలూకాలోని 'వళ్‌వయ్' గ్రామంలో జన్మించారు. కేంద్ర ప్రభుత్వపు టెలిఫోన్ శాఖలో ఉద్యోగం.

'బాలగీత్ నికేతన్' అనే సాంస్కృతిక సంస్థ తరపున బాలలకి జానపద

సాహిత్యంతో పరిచయం కలిగించే ఉద్యమంలో వున్నారు. ఆ సందర్భంగా ఆడియో క్యాసెట్లు తయారుచేసారు. ఇదిగాక 'కొంకణ్ టైమ్స్' అనే పత్రికకి సంపాదకులు. ఒక నవల, కొన్ని ఏకాంకికలూ ప్రచురించబడ్డాయి.

**వసంత్ భగవంత్ సావంత్ (23-3-1960)** : ఈయన జన్మ 'గోవా'లోని 'సాంగేం' తాలూకాలోని 'సావర్డె' అనే వూళ్ళో ప్రభుత్వ ఉద్యోగి. నవతరానికి చెందిన ఈ యువరచయిత 'నివల్‌కాణ్యో' (తాజా కథలు) అనే కథా సంగ్రహం, బాల సాహిత్యపు పుస్తకం వ్రాసి ప్రచురించారు.

కళా ఎకాడమీ (గోవా) సాహిత్య పురస్కారం లభించింది. కథ ఇతివృత్తం ప్రకారం చక్కని వాతావరణం చిత్రించడంలో సమర్థులు. 'పతితుల, భ్రష్టుల, బాధాసర్వద్రష్టుల' విషాద గాథలూ, సామాజిక స్పృహని కలిగించే రచనలూ వ్రాస్తారు.

**జ్యోతీ అవదూత్ కుంకళ్‌కార్ (14-11-1962)** : వివాహానికి పూర్వం పేరు 'జ్యోతీ సుభాప్రభూ'. ఈమె 'గోవా'లోని 'కణకోణా' తాలూకాలో జన్మించారు. ప్రభుత్వ వ్యవసాయ శాఖలో ఉద్యోగం. కొంకణీ, మరాఠీ నాటకరంగంలోనూ, చలనచిత్రరంగంలోనూ నటన, దర్శకత్వం, నిర్మాత వగైరా భూమికలు నిర్వహించారు. పంజిం దూరదర్శన్‌లో గుర్తింపు పొందిన కళాకారిణి.

కొంకణీ, మరాఠీ భాషల్లో రచనలు చేస్తున్నారు. "చిత్రాంతలే వాదళ్" (చిత్రాలలో పేచీలు) అనే కొంకణీ కథల సంపుటి, 'వోలా పదర్' (తడిసిన పమిట) అనే మరాఠీ కథల సంపుటీ పుస్తక రూపంలో ప్రచురించబడింది. ఇదిగాక ఒక పుస్తకం వెలువడింది.

మరాఠీలోని అభినేత్రుల (నాటక, సినిమా రంగాలలోని నటీమణులు)తో తీసుకున్న ఇంటర్వ్యూల (ముఖాముఖీ) ఆధారంగా రూపొందిన ఒక పుస్తకం ముద్రణలోవుంది.

కొన్ని స్థానిక సంస్థలు ఆమెకి సాహిత్యపరంగా చేసిన సేవని గుర్తించి సన్మానించాయి.

---

Lasertypeset at Visalaandhra, Vijayawada- 520 004
and printed at Beauty Print, New Delhi - 110 055